# తెలుగు గోష్ఠి ప్రచురణలు

1. తెలుగు మరుగులు - 1986; చీమకుర్తి శేషగిరిరావు
సంశోధిత ప్రచురణ - 1996
(తెలుగు గోష్ఠి వ్యాససంపుటి-1)

2. Forgotten Aspects of Telugu 1987 Ch. Seshagiri Rao

3. తెలుగులో పాళీ పదాలు - 1990, 1996 చీమకుర్తి శేషగిరిరావు

4. ప్రాకృత భాషోత్పత్తి - 1991 [illegible]

5. Satavahana Epoch A New Light: 1994 P.V. Parabrahma Sastry
Revised Edition 1996

6. ఉత్తర హరివంశము - 1994 వ్యాఖ్యాత. విద్వాన్ [illegible] జయరామశాస్త్రి
(ప్రథమాశ్వాసము)

7. ఉత్తర హరివంశము - 1995 వ్యాఖ్యాత. విద్వాన్ [illegible] జయరామశాస్త్రి
(ద్వితీయాశ్వాసము)

8. శ్రీ ఉత్పత్తి పిడుగు. చీమకుర్తి శేషగిరిరావు.
ఇతర వ్యాసములు - 1995 సహాయకులు:
డా॥ ఎ. విజయకుమార్‌బాబు

9. కతిపయ శబ్దార్థశబ్దస్వరూప విచారము - 1995 వేదం వేంకటాచలం

10. సాహితీ నీరాజనము - 1995 శ్రీ 'చీమకుర్తి' సంస్మరణ సమితి

# ఉత్తర హరివంశము

(తృతీయ చతుర్థాశ్వాసములు)

## నాచన సోమనాథ ప్రణీతము

వ్యాఖ్యాతలు

చదలువాడ జయరామశాస్త్రి

(చతుర్థాశ్వాసము)

వఝల వేంకట సుబ్రహ్మణ్య శర్మ

(తృతీయాశ్వాసము)

తెలుగు గోష్ఠి

రామనగర్, హైదరాబాదు - 500 048

# UTTARA HARIVAMSAMU

Third and Fourth Cantos with the Commentary of
Late Sri Chadaluvada Jayarama Sastri,(IV Canto), and
Sri V.V. Subramanya Sarma (III Canto)

First Edition : September, 1996

Copies : 1000

**Price :** Rs. **100/-**



**For Copies:**
V. V. Subramanya Sarma
8-13-75/2, Raghavendra Nagar,
Sivarampalli, Hyd - 52.

OR

Visalandhra Publishing House
Bank Street, Hyd - 1.

**Financial Assistance :**
1. The Telugu University Hyderabad (III Canto)
2. The Tirumala Tirupati Devasthanams, Tirupati (IV Canto)
   (Under their scheme 'Aid to Publish Religious Books.')

**Composed at :**
Fontline Graphics
Hyderabad - 44. Ph: 660000

**Printed at :**
Anupama Printers
Santhinagar, Hyderabad - 28.
Ph: 391364

# మున్నుడి

ఇదివఱకే, కీర్తి శేషులు, శ్రీ చదలువాడ జయరామ శాస్త్రుల వారి ముక్తాఫల వ్యాఖ్యానంతో ఉత్తర హరివంశ ప్రథమ ద్వితీయాశ్వాసాలు ప్రచురింప బడినాయి. ఇప్పుడు, తృతీయ చతుర్థాశ్వాసాలకు వ్యాఖ్యానం ప్రచురింపబడింది.

కీర్తి శేషులు, శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారు తెలుగు గోష్ఠి వ్యవస్థాపకాధ్యక్షులు, వారి ఆశీర్వాద బలం ఆత్మబలం కారణంగా, ఉత్తర హరివంశ ప్రచురణ కార్యం మొదలైంది. త్వరలో మిగిలిన ఆశ్వాసాలకు వ్యాఖ్యానం వెలువడుతుంది. నాచే ఈ సంవత్సరం ప్రచురింపబడ్డ ఉత్తర హరివంశ గ్రంథంలో సోమనాథుని గుఱించి కొన్ని కొత్త సూచనలు చేయబడినాయి. మరల ఆచర్చ ఇచ్చట చేయబడలేదు. ఈ ప్రకటనలో ముఖ్యంగా ద్యూత క్రీడా విధానం, సోమన సంస్కృతకవి, అనే అంశాలు ప్రాధాన్యం వహించాయి. సోమన కవితారీతుల్లో చాలా చమత్కారాలు ఉన్నాయి. వానిని వెలికి తీయడానికి "సోముని సాహితీ సీమ" అనే వ్యాస పరంపరలో మొదటి ఉపన్యాసం 14.6.1996, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో శ్రీ ముత్యవేంకట సత్యసూర్యనారాయణ గారిది జరిగింది. ఆనాటి శీర్షిక 'సోమన బహుముఖ ప్రజ్ఞాశాలి'. ఇట్లే ఇతర శీర్షికలతో, ఈ కార్య క్రమం సాగుతుంది.

శ్రీ వేదము వెంకటరామన్, బాణుని కాదంబరి దాని వైశిష్ట్యము అనే గ్రంథరచయిత, శబ్దోత్పత్తి దృష్టితో, తృతీయాశ్వాసానికి విపులమైన వ్యాఖ్యానం రచించారు. దానిని కూడ ప్రచురించగలం.

తృతీయాశ్వాసంలో ద్యూత పరిభాషను అర్థం చేసుకోవడం చాల కష్టమైంది. దానికి చిరంజీవి శ్రీ ఉన్నం జ్యోతివాసు (వేములపాడు పోస్టు, 533 273. ప్రకాశం జిల్లా,) సహకరించాడు. తెలుగు సాహిత్యంలో లోతులు చూచే మనస్తత్వం ఉన్న చిరంజీవి శ్రీ జ్యోతివాసు చేసిన సాయం నిత్యం నా మనస్సులో జ్యోతిగా ఉంటుంది.

ఈక్రింది వారు, ఈ ప్రచురణలో తోడ్పడ్డారు.

శ్రీ ఇందుకూరి సూర్యనారాయణ రాజుగారు (సుందరయ్య విజ్ఞాన కేంద్రం.)

చిరంజీవి హరిశంకర్, చిరంజీవి యార్లగడ్డ నిర్మల, సునీత, (ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్.)

శ్రీ రమణ మూర్తి, శ్రీ సుబ్బయ్యగారు, (అనుపమ ప్రింటర్స్.)

శ్రీ పి. రాజేశ్వరరావు గారు, మేనేజరు (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)

వీరికి ధన్యవాదాలు.

# కృతజ్ఞత

బ్రహ్మశ్రీ గడియారం రామకృష్ణ శర్మగారు (అలంపురం పోస్టు, కర్నూలు జిల్లా 509 152). బహుభాషాకోవిదులు పండితులు. శాసనలిపి పరిశోధకులు, ప్రజ్ఞాశాలి. వారు 'శ్రీ మాధవ విద్యారణ్యస్వామి చరిత్ర'ను (క్రీ.శ. 1296 - 1356) శాసన ప్రమాణాలతో సర్వంకషంగా రచించారు. ఆగ్రంథం, కేశవ నిలయం, బర్కత్‌పుర, హైద్రాబాద్‌లో లభిస్తుంది.

తెలుగు గోష్ఠి ప్రచురించిన ఉత్తరహరివంశద్వితీయాశ్వాసమందున్న ప్రకాశికలో (1994) కల ఒక ప్రమాదమును నా దృష్టికి తెచ్చారు. పెదవీరన, పినవీరన గురువులైన భారతీ తీర్థస్వామి వారు. శ్రీ విద్యారణ్యస్వామి వారి సమకాలికులైన భారతీ తీర్థ స్వామివారు పేర్లు ఒకటైనా, వేర్వేరు వ్యక్తులని, సూచించారు.

మఱియును, ఉత్తర హరివంశ గ్రంథమందున్న (1996) అభిప్రాయాలను గుఱించి క్రింది విధంగా లేఖ వ్రాసినారు.

"సోమన దేశకాలాదుల, అతని బిరుదములను గూర్చి చేసిన చర్చ బాగున్నది. తిక్కన సోమనలు, సమకాలికులని చెప్పుట కష్టము. ఆ వాదమును సమర్థించుటకు సోమనను శతాయుష్కుని చేయవలసియుండును. మీరు ఆపనే చేశారు. ఎఱ్ఱన, సోమనలు, విద్యారణ్యులు, సమకాలికులే. సోమన పూర్వ స్థానము, 'సోమరాజు పల్లె' అనుటను సమర్థించుటలో చాల చర్చ చేసితిరి. సోమనాథుని తాత, "సోమరాజు" అయినపుడే అది సార్థకము".

పూజ్యులైన శ్రీ గడియారం రామకృష్ణ శర్మ గారికి తిరుమలేశుడు, సంపూర్ణ ఆయువు, ఆరోగ్యము, ఐశ్వర్యము, సమృద్ధిగా సమకూర్చుగాక! వారు తమ శ్రీ మాధవ విద్యారణ్య చరిత్రను తమ గురువులైన బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి శ్రీ చరణులకు, భక్తితో సమర్పించారు. శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారు ఎఱ్ఱాప్రగడ రచించిన (వావిళ్ల వారి) హరివంశానికి పరిష్కర్త (1967). మఱియును ఉత్తర హరివంశ విమర్శన మనెడి సుమారు 168 పుటల వ్యాసాన్ని ప్రకటించారు. అట్టి గురువుల పేరును స్మరించు మహామనీషి మహనీయులు, శ్రీ గడియారం శర్మగారు. వారికి నా మనఃపూర్వక నమస్కృతులు.

**వ్యాఖ్యానరచన :**

ప్రథమ, ద్వితీయాశ్వాసములు, శ్రీ చదలువాడ జయరామశాస్త్రులవారి "ముక్తాఫల వ్యాఖ్యానముతో వెలువడినవి. తృతీయశ్వాసమునకు, చతుర్థాశ్వాసములో నుండి, 138వ పద్యము వఱకు వారి వ్యాఖ్యానము లభింపక పోవుటచే పూరింపఁ బడినది. ఈ కఠినమైన కృషిలో తప్పులు తప్పవు. దయతో వానిని తెలియఁజేయవలెనని ప్రార్థన. షష్ఠాశ్వాసమందు 1 నుండి 162 పద్యముల వఱకు కూడ 'ముక్తాఫలము' లభింపలేదు. దానిని పూరింపవలసియున్నది.

త్వరలో పంచమషష్ఠాశ్వాసములకు వ్యాఖ్యానము ప్రచురింపఁబడఁగలదు. పాఠకులు సూచనలు ఇచ్చినచో వానిని మన్నింపఁగలము. సుందరయ్య విజ్ఞాన భవనములో 14-6-1996 తేది, ద్వితీయాశ్వాస వ్యాఖ్యాన గ్రంథము ఆవిష్కరింపఁబడినపుడు, ఆచార్య శ్రీ రవ్వా శ్రీహరిగారు ప్రసగించి కొన్ని సూచనలు చేసినారు. వారికి వందనాలు ,

**బహుముఖ ప్రజ్ఞాశాలి :** శ్రీ. ఎమ్.వి.ఎస్. సూర్యనారాయణగారు.

శ్రీ ముత్య వేంకటసత్య సూర్యనారాయణగారిది ఆత్రేయపురము - 533235 తూర్పుగోదావరి జిల్లా. నాచనసోమనాథుని గుఱించి వారి ఉపన్యాస పాఠము సుందరయ్య విజ్ఞాన కేంద్రములో తెలుగు గోష్ఠి సమావేశములో, జూన్ 14 వ తేది పఠింపఁబడినది. అందుగల కొన్ని వాక్యాలు పాఠకుల కొఱకై ఇందు చేర్పఁబడినవి.

"తిక్కన ఆవాసము ఒక విద్యాపీఠము. పెక్కు యువకవులు అతని పాదాలను ఆశ్రయించి కవితా మర్మాలను, భాషా రహస్యాలను గ్రహించేవారు. ఎందరో కవులు తమ రచనలను వినిపించి ఆయన ఆమోద ముద్ర పొందేవారు. కొందఱు ఆయనకు సాక్షాత్తు శిష్యులయితే మరి కొందఱు ఏకలవ్య శిష్యులు. "వెంకన గురువంచు చెప్పికొనగా అది గొప్ప తెనుంగు నాడునన్" అని, చెళ్లపిళ్ల వేంకట శాస్త్రికి వచ్చిన ప్రసిద్ధి కంటె, పెక్కు రెట్లుగా, తిక్కనకు లభించినది. మార్కండేయ పురాణమును రచించిన మారన, ప్రతి ఆశ్వాసాంతములోనూ, తిక్కన గారిని ప్రశంసించిన శిష్యుఁడు. తిక్కన కాలం నాటికి యువ కవి అయిన ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కన పోకడలను, అరణ్య పర్వశేషములో లెస్సగా అనుసరించిన ఏకలవ్య శిష్యుఁడు. సాక్షాత్తు శిష్యుడయిన మూలఘటిక కేతన గురువుగారికి తన దశకుమార చరిత్రమును అంకితమిచ్చెను. ఆ తిక్కన శిష్యులలో అగ్రేసరుఁడు నాచన సోముఁడు. ఉత్తర హరివంశమును హరిహరనాథునికే అంకితము చేసెను. ఆశ్వాసారంభ ఆశ్వాసాంత పద్యములలో గురువుగారినే అనుసరించెను.

సోమనాథుఁడు శ్రౌత కర్మ పరిజ్ఞానము కలవాఁడు. తన గురువును బోలె ఈతఁడును యజ్ఞమును చేసియుండవచ్చును. నాచన సోమన సంస్కృతాంధ్ర భాషల్లోనేగాక, ఎనిమిది భాషల్లోను పండితుఁడని తెలియుచున్నది. ఆ భాషలను ఉత్తర హరివంశములో మనము గుర్తింపలేము. సంస్కృత భాషలో మహావిద్వాంసుఁడని, శాస్త్ర పాండిత్య మసాధారణ మైనదని, తెనుగులో తిక్కనకు దీటైన పలుకు దనము కలవాడని, ఏ భాషలో రచించినా మనోహరముగా శ్రవణానందముగా వ్రాయు ప్రతిభ కలవాడని చెప్పవచ్చును. అచ్చ తెనుగు పదాలతో కూర్చిన పద్య సౌందర్యము, ద్వితీయాశ్వాసములో శ్రీ కృష్ణునకు శివుఁడు సాక్షాత్కరించిన విధమందు చక్కగా ప్రకటితమైనది (తొలుకారు మెఱుఁగుల తోటలో, 2 ఆ - 171 వ, పద్యము).

## సోమనను అనుసరించిన కవులు :

తనకు గురువును, మార్గ దర్శియునైన నాచనసోముని యెడ తన భక్తిని చూపుటకు వీరశృంగార రసమును క్రమాలంకారముతో అత్యంతరమణీయముగా "పరు చూచున్ వరు జూచు నొంప నలయింపన్" అను పద్యమును, పోతన, సోముని 'అరి జూచున్ హరి జూచు" అనెడి పద్యమును అనుసరించి, అదే ఎత్తుగడలో, ఎవరి పద్యము ఎక్కువ రమణీయముగా నున్నదో నిర్ణయించుటకు శక్యముగానట్లు తీర్చెను. అనన్య సాధారణమైన రీతిలో అంత్యాను ప్రాసములను నిర్వహించుటకు పోతన గారికి, సోమనాథుడు గురువు.

శ్రీ నాథుడు, తన వక్రోక్తి వైభవమును, సరస సంస్కృత సమాస సంగ్రథనమును, నిండు చందురు నును సోగ వెన్నెలల వంటి తెనుగు నుడికారముల కూర్పును నాచన సోముని ఉత్తర హరివంశములో నుండియే చూఱగొనెను. రాయల యుగములో రామరాజ భూషణుఁడును, దక్షిణాంధ్రయుగములో చేమకూర వెంకటకవియు, సభంగశ్లేషలను యమకములను, 'ఆహా'అనునట్లు తీర్చినారు. పింగళి సూరన రామభారత కథలను జోడించి శ్లేషాదులతో 'ఓహో' అనిపించినాఁడు. వీరందఱికిని సోమనాథుడే, ఆచార్యుడు.

అలనాటి పల్లె జనులలో వ్యాప్తి చెందియున్న తెలుగు పలుకు బడులు జాతీయములు సామెతలు కావ్యమందు అడుగడుగున కానవచ్చును. ఈనాటి వారికి అవిక్రొత్తగా నున్నను. ఎంతో సందర్భోచితముగా వాడబడినవి. సోమన, మహాకవి. యుగకర్త హరిహర తత్త్వ సిద్ధాంతమునకు భాష్యకర్త. విశిష్ట పాండితీ సంపన్నుడై, తన కాలము వారికే గాక, తరువాతి కాలమువారికి, ఆనందము, విజ్ఞానము సమకూర్చిన బహుముఖ ప్రజ్ఞాధురీణుఁడు.

# శ్రీరస్తు
# సమాలోచనము

నాచన సోమనాథుఁడు విజయనగర రాజ్యమును పాలించిన హరిహర బుక్కరాయల కాలములో పదునాల్గవ శతాబ్దమందు, ప్రసిద్ధుడైన సంస్కృతాంధ్ర మహాకవి. అతఁడు ఎప్పటివాఁడు, ఎచ్చటివాఁడు, బిరుదములు, హరిహరనాథ తత్త్వము మొదలగు కొన్ని అంశములు ఉత్తర హరివంశ గ్రంథములో "ప్రవచనము" అనెడి శీర్షిక క్రింద ప్రచురింపఁ బడినవి. (ప్రచురణ జనవరి, 1996, హైద్రాబాదు). ఇతరాంశములు మఱికొన్ని ఇందు చర్చింపఁబడినవి.

**తృతీయాశ్వాస కథాసారము :**

ప్రథమాశ్వాసమందు నరకాసుర వధ, ద్వితీయాశ్వాసమందు బ్రాహ్మణపుత్ర రక్షణము, రుక్మిణి సంతానాపేక్ష, శ్రీకృష్ణుని కైలాస యాత్ర, ఘంటాకర్ణ కాలాంతకుల కథ, శివ సాక్షాత్కారము, శ్రీ కృష్ణుని స్తుతి ప్రధానాంశములు.

శ్రీ కృష్ణుఁడు బదరికా వనములో అచ్చటి మునులతో నవ వినోద గోష్ఠిలో నుండఁగా పౌండ్ర రాజు కడకు ఒక నాఁడు నారదుఁడు వచ్చెను. అతఁడు వాసుదేవుని వలె శంఖ చక్రాది ఆయుధములను ధరించి గర్వించి తనతో సాటి ఎవ్వరును లేరని మహర్షితో నివేదించి, శ్రీకృష్ణుని నిందించెను. మునీంద్రుఁడు అతని మాటలకు రోఁత చెంది బదరికాశ్రమమునకు ఏతెంచి, అతని మిడిసిపాటును శ్రీకృష్ణునకు చెప్పి కోపమును కలిగించెను.

ఇంతలో రాత్రిపూట పౌండ్రక వాసుదేవుఁడు, తన సైన్యముతో ద్వారకను ముట్టడించెను. ఏకలవ్యుఁడు, యాదవుల సేనను చెండాడి ద్వారకలోనికి ప్రవేశించెను. పౌండ్రుఁడు సాత్యకియును గదాయుద్ధము మల్లయుద్ధము కావించిరి. మఱునాఁడు వేకువన, శ్రీకృష్ణుఁడు ద్వారకను సమీపించుచు రణ సంరంభమును విని, కని పౌండ్రునితో పోరాడి అతని తలను తునిమెను. కొలువులో, శ్రీకృష్ణుఁడు, తన యాత్రను గుఱించి శివకేశవుల అభేద భావమును మునులు ఎఱుఁగుట, మొదలగు వృత్తాంతమును వర్ణించెను.

పిమ్మట ఆ కపట నాటక సూత్రధారుఁడు అంతఃపురములో రుక్మిణీ సత్యభామలతో జూదమాడెను. ద్వారకను దహించుటకు వచ్చిన 'కృత్య' విషయమును, చెప్పిన కావలి

వారితో, వీరవచనములను వచించి మంటలే రూపుగొన్న మగువ యైన కృత్యను, ఆమెను సృజించి పంపిన కాశీరాజును, ఇరువురిని బూడిద చేయించెను. అనంతరము నిశ్చింతుఁడై ద్వారకలో సుఖముతో నుండెను.

**చతుర్థాశ్వాస కథాసారము :**

హంస డిభకులు సాళ్వదేశ రాజకుమారులు. వారి మిత్రుఁడు జనార్దనుఁడు మంత్రి కుమారుఁడు. హంసడిభకులు శివుని గూర్చి తపస్సుచేసి, వరగర్వితులై ప్రవర్తించుచుండిరి. ఒక్కనాఁడు ముప్పురును వేఁటకు వెడలి అలసి పుష్కర తటాక తీరమందు విశ్రమించిరి. ఆ సమయమందు సవన ధ్వనులు వినఁబడినవి. 'ఆహా! ఆశ్రమ మొకటి సమీపమున ఉన్నది' అని సంతసముతో అచటికి పోయి కశ్యపాది మునులను చూచి తాము చేయఁబోవు రాజసూయ యాగమునకు వారిని ఆహ్వానించిరి. వారు అంగీకరించిరి.

పిమ్మట దుర్వాసో మునీంద్రుని ఆశ్రమమును చేరి, ఆతని వేషధారణమును పరిహసించి యత్యాశ్రమమును నిరసించి, దుర్వాసుని నొప్పించి, అతనిని, అచటి మునులను, అవమానించి అతనిలో క్రోధమును రగిల్చి, మరలిపోయిరి. ఆ మునివరుఁడు. తీవ్ర వ్యథతో, మునుల సమూహముతో శ్రీకృష్ణుని యొద్దకు పోయి, తమ భంగపాట్లను చెప్పఁగా, ఆ దేవుఁడు త్వరలో హంసడిభకులను తునుమాడెదనని మాట ఇచ్చెను.

అనంతరము, హంసడిభకులు రాజసూయ యాగమునకు కప్పముగా లవణమును కోరుటకు యాదవుల కడకు మిత్రుని జనార్దనుని పంపిరి. అతఁడు విష్ణుభక్తుఁడు. స్వామి దర్శనము, ప్రభుకార్యము రెండును సిద్ధించునని ద్వారకకు పోయెను. దౌత్యము విఫలమైనది. తనవెంట సాత్యకి రాఁగా, సాళ్వ నగరమునకు ఏతెంచెను. సాత్యకి, హంసడిభకులను యుద్ధమునకు పుష్కర ప్రదేశమునకు రమ్మని కోరి మరలెను. అచట జరిగిన యుద్ధములో హంస డిభకులు అంతమొందిరి.

**తెలుఁగు సాహిత్యములో సోముని స్థానము :**

ఉత్తర హరివంశ ఆశ్వాసాంత గద్యలో సోమన బిరుదములు, "శ్రీ మత్సకల భాషా భూషణ సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి, సంపూర్ణకీర్తి నవీన గుణసనాథ" అనునవి, స్పష్టముగా కానవచ్చుచున్నవి. అవి అన్నియు, సార్థకములని నిరూపింపవచ్చును.

ఇతని సంస్కృతాంధ్ర గద్యశైలి, యుద్ధవర్ణన లు, ప్రత్యేకించి సంస్కృతభాషా పాండితీ పాటవము, స్తుతింపఁదగినవి. కవి చౌడప్ప ఇతనిని సంస్కృత కవుల నడుమ చేర్చెను. కవయిత్రి మొల్ల తెలుఁగు కవులలో అగ్రేసరత్వము నిచ్చెను. శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ వేదము వేంకటరామన్

గారు (నెల్లూరు) ఆతని పాండితీ వైభవ మెట్టిదైనను, కవితా కమనీయతలో తిక్కనకు వెనుకటి వాఁడని విశ్వసించిరి. అనేకులు, తెలుఁగు సాహిత్యములో కాలక్రమమును అనుసరించి నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలకు వరుసగా తొలి మూడు స్థానములను అర్పించి, వారికి తరువాతి వాఁడైన సోమనకు నాల్గవస్థానమును ఇచ్చిరి. శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులు తమ శబ్ద రత్నాకర నిఘంటువులో ఈ పై నలువురినే ప్రథమ శ్రేణి కవులుగా ఎన్నెను. ఇతరులు, ద్వితీయాది శ్రేణులకు చెందిన వారని వర్గీకరించిరి.

ఇట్లు సోమనకు తెలుఁగున చతుర్థస్థానమును ఇచ్చుటకు విమర్శకు లందఱును ఆమోదించెదరు. సోమన గద్యశైలి, యుద్ధవర్ణనలు చమత్కారశబ్దార్థ పద ప్రయోగ చిత్రణము, లోకోక్తుల సంవిధానము మొదలైన వానిలో సోమన అద్వితీయుఁడు

**గద్యశైలి :**

సోముని రచనలో సంస్కృతాంధ్రముల గద్యశైలి ప్రాధాన్యము వహించును. సంస్కృతభాషలో గద్య శైలికి ఆద్యుఁడు సుబంధుఁడు. అతనిని అనుసరించిన వాఁడు బాణుఁడు. వీరిరువురి వక్రోక్తి మార్గమును సోమన నిపుణముగా సంస్కృతముననే కాదు తెలుగులోను అనుసరించెను. ఆ కారణము చేతనే శ్రీనాథుఁడు సోమనను 'సుబంధు విస్ఫురిత మహోన్నత స్తోము సోము' అని కీర్తించెను.

శ్రీ వేదము వేంకటరామన్ 'బాణుని కాదంబరి దాని వైశిష్ట్యము (1980) అనెడి గ్రంథములో బాణుఁడు కూడ, సోమనవలె పొడవైన సమాసములను వ్రాయలేదని ఉదాహరణములను చూపిరి. సోమనకు సంస్కృత శబ్ద ప్రయోగమందు పక్షపాతమున్నను తెలుఁగు నుడుల యెడల సమానమైన కూర్పు నేర్పును పాఠకులు అచ్చెరు వొందునట్లు చక్కగా చూపించెను.

**యుద్ధవర్ణనలు :**

తృతీయాశ్వాసమందు, సందడికయ్యము (27 వచ), సాత్యకి పౌండ్రుల గదాయుద్ధము (64 వచ), మల్ల యుద్ధము (70 వచ), హలధరుని హలవిహారము (80 వచ), విష్ణు చక్ర విహరణము (144 వచ), మొదలగువానిలో గద్యము, గేయము వలె, శ్రవణ సుభగముగ నున్నది. ఈ నైపుణి, కొంత ఈ ఆశ్వాసములో చిగిర్చినది. చతుర్థాశ్వాసములో హంసడిభకుల సమర సన్నాహము (213 వ), సంకుల సమరము (229), హంస హలధరుల గదాయుద్ధము (248), డిభక సాత్యకుల ఖడ్గయుద్ధము (256) ఉగ్రసేన వసుదేవ, హిడింబుల యుద్ధము (261), అను వానిలో ఆ నైపుణి వృద్ధి పొంది, మెఱుఁగైనది. అది షష్ఠాశ్వాసమందు, విపులమై, పరాకాష్ఠను అందుకొన్నది. పాఠకులు

విడిగా యుద్ధ వర్ణనలు, పఠించి ఆస్వాదించినచో అందలి సురుచి, అమృత పానమగును. అనుప్రాసల యెడ వివిధ అర్థాలంకారముల యెడ సోమనకు మక్కువ ఎక్కువ. కనుక సోమన "శబ్దార్థాలంకార సర్వేశ్వరుఁడు" అనెడి బిరుదమునకు యోగ్యుఁడు.

**ప్రౌఢకవి :**

సోముని కవిత కఠినమైనదని, అన్వయ క్లేశ. మున్నదని విమర్శకులు అభిప్రాయపడుచున్నారు. 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము' అనెడి లక్షణ గ్రంథమందు శ్రీ గణపవరపు వెంకటకవి "నాచనసోము భూరి కాఠిన్యంబు"ను (పద్యము 34), ప్రస్తావించెను. ఆ లక్షణ కర్త దృష్టిలో అది ప్రశంస. సోముని పాండితీ ప్రకర్షకు అతని ప్రౌఢిమ దర్పణము. సామాన్య పండితులు అర్థానిని మథింపఁజాలరు. సమర్థులే ఆ ప్రౌఢిమను నిశిత దృష్టితో కాంచఁగలరు.

ఇంతవఱకును, సోముని కవితా ప్రౌఢిమను ఎవరును పూర్తిగా విశ్లేషింప లేదనుట వాస్తవము. అది బహుపండితుల సమష్టి కృషి చేతనే సాధ్యము. ఈ వ్యాఖ్యానములో అయ్యది అత్యల్పముగా స్పృశింపఁబడినది.

**నాటకీయత :**

యుద్ధరంగమందు, పౌండ్రక సాత్యకుల సంభాషణలు, నెత్తమందు సత్యభామ సాసూయ వచనములు, సావాసులతో శ్రీకృష్ణుని వీరవాక్కులు, తృతీయాశ్వాసమందు నాటకీయతను చక్కగా పోషించుచున్నవి.

చతుర్థాశ్వాసమందు, నాటకీయతను గుఱించి, శ్రీ పి. ఎమ్. గోపాలాచారి, (విజ్ఞాన తరంగిణి, చతుర్థాశ్వాసము - నెల్లూరు - 3 - 1973) చెప్పిన మాటలు క్రింద ఉదాహరింపఁబడినవి. "రచనావిధానమున, తిక్కనను, అనుసరించిన ఈ కవి నాటకీయతను కూడ విడువలేదు. పురాణముల వలె కథను చెప్పుచు పోలేదు. ఈ ఆశ్వాసమును, ఒక నాటకముగ అంగీకరించిన దీనిని ఆఱు రంగములుగ చిత్రీకరింపవచ్చును.

1. దుర్వాస హంసడిభకుల సమాగమము 2. దుర్వాస శ్రీకృష్ణుల సమాగమము 3. రాజసూయ యాగ కరణ నిశ్చయము. 4. జనార్దనుని రాయబారము 5. సాత్యకి రాయబారము 6. యుద్ధరంగము.

మొదటి రంగమున దుర్వాసుని చూచిన వెంటనే హంస డిభకులు సంభాషణ మొదలిడిరి. వారిని నివారించుచు జనార్దనుని పలుకులు. ఇటులనే పరస్పర సంభాషణలు సాగినవి. సంబోధనలలో కూడ, "ఓరీ బ్రాహ్మణధూర్త! ఓరి యాదవ! ఓరి దురాత్మ!

వినురా సాత్యకి! ఏమిర హంస!'' ఇటులు నటులు రంగ స్థలముపై నిలుచుండి పలుకుచున్నట్లే ఉన్నది?'.

**సోమనాథుఁడు సంస్కృత కవి :**

"బాణుని కాదంబరి - దాని వైశిష్ట్యము'' అనెడి గ్రంథమును రచించినవారు శ్రీ వేదము వెంకటరామన్ - 1032, పొగతోట, నెల్లూరు -1. ఆ గ్రంథమునకు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ - ప్రథమ బహుమతిని 1977 సం. ఇచ్చినది. అందు వారు సోమనను గుఱించి చెప్పిన మాటలు పరిశీల నార్హములగుటచే ఇందు అవి ఉదాహరింపఁబడినవి.

"నాచనసోముడు అన్నింటి యందును, అందరిని మించెదనను కోరికతో శ్లేషను విజృంభించి ప్రయోగించినాడు. ఎటులైనను సంస్కృత గద్య శైలిని, ఎట్టిను మించి ప్రయోగించె ననుట నిర్వివాదము.

ఈ దీర్ఘ సమాసములను చూడుడు.

'నందికృత నాందీ సందానిత వందనమాలా సందోహ విహరద్ బృందారక సుందరీ ............ గమ్యంబై...

'కుందగిరి మల్లికా కుముద సముదయ దాయాద సదాతితేయ నదీ ............ వినిమయంబై (2, ఆ - 160 వచ)

బాణుఁడు కూడ ఇంత పొడవుగల సమాసములు వ్రాయలేదు. (పుట - 286).

శివరాత్రీ మాహాత్మ్యమున (12వ ప, 1 ఆ), 'బంధుర గాంభీర్య బంధు సుబంధు విస్ఫురిత మహోన్నతి స్తోము, సోము' అని పలువురు మరచిన సుబంధువును తెలుగున సుబంధ తుల్యుఁడగు సోముని చెప్పి, 'బాణు నద్భుతశాస్త్ర, కలాపారీణు(న్)' అని బాణుని స్మరించును. (పుట - 288).

సంస్కృత కవి స్తుతిలోని, శ్రీనాథుని పద్యమును వేదమువారు ఉదాహరించి, సోమన గద్య శైలిని ప్రస్తావించుటచే సోమనాథుడు, సంస్కృత కవి అగునను ఊహ బలపడినది.

**పూర్వ పక్షము :**

ఆచార్య కొర్లపాటి శ్రీరామ మూర్తి గారి అభిప్రాయము, ఈ క్రింది విధముగా నున్నది. చిత్తగింపుఁడు.

"మీరు నాచన సోమనాథుని గురించి వెలువడిన విమర్శలన్నీ వివేచించారు. ... శ్రీనాథుని శివరాత్రిమహాత్మ్యంలోని 12 వ పద్యం 1 ఆ, సంస్కృత కవి స్తుతిమాత్రమే. ఆంధ్రకవి స్తుతి 13 వ పద్యం. సంస్కృత కవి స్తుతిలోని, విస్ఫురిత మహోన్నతి స్తోముడైన

సోముడు సంస్కృతకవి. ఆంధ్రకవి నాచన సోముడు కాడు. కాజాలడు. ... ఆంధ్ర కవి స్తుతిలోని నన్నయ తిక్కన ఎఱ్ఱన కమలనాభుడు మాత్రమే ఆంధ్రకవులు . సంస్కృతకవి సోముని సమాచారం కూడా దుర్లభం. ఇవి మీ దృష్టికి తీసుకొని రావాలని మాత్రమే ఈ లేఖ" (తేది 13.2.96)

సాహిత్య చర్చ అగుటచే వారి అభిప్రాయమును పాఠకుల దృష్టికి తెచ్చుట సముచితమని భావించి ఇచ్చుట చేర్చినాను. భావి పరిశోధనకు వారి అభిప్రాయము ఉపకరించగలదు.

శ్రీనాథుఁడు, నాచనసోమన కవితారీతులను అందఱి కంటె అధికముగా అనుసరించిన వాడనుట అందఱు ఎఱిగినదే. సోమనను తన ఇతర రచనలలో స్మరింపలేదు. బహుశా తమ ప్రభువులైన రెడ్డిరాజులు ఆగ్రహింతురేమో అని మౌనము వహించి యుండును. ప్రౌఢ దేవరాయల ఆస్థానములో కర్ణాటకులు కనకాభిషేకము చేసిన తర్వాత, మౌనము వీడి సోమనాథుని ఎడ తనకు అపారమైన గౌరవాభిమానమును. తన చివరి రచన అయిన శివరాత్రి మాహాత్మ్యములో యథార్థమును వచించి సంస్కృతకవిగా ప్రస్తుతించెనని తోఁచుచున్నది. శ్రీనాథుని 'భీమేశ్వర పురాణము, శివరాత్రి మాహాత్మ్యము" అతని సంస్కృత గద్యశైలిని, ఆంధ్రములో చూపుచున్నవి (వే.వేం. పుట - 288). కనుక తన పూర్వుఁడైన సోముని అతడు ఆ శైలిలో అనుకరించెనన వచ్చును.

శ్రీ నాథుఁడేగాక, ఇతర కవులు పూర్వ కవిస్తుతిలో సోముని ప్రస్తావించిన విధము పరిశీలింపఁదగినది.

**కవిచౌడప్ప :** ఇతఁడు స్వాభిమాని, తిక్కన యెడ గాఢమైన భక్తి కలవాఁడు.

కం. వినుభారవి, బిల్హణు నా
చనసోముని మాఘకవిని చతురత శ్రీ నా
థు నుతింతు సుకవి వరుఁ డి
క్కన తలఁతును, కుందవరపు కవి చౌడప్పా.

(చౌడప్ప శతకము, 8వ, పద్యము)

ఈ పద్యమందు, సోమన సంస్కృత కవి అనుటకు ప్రబల సాక్ష్యమున్నది.! సోమన సంస్కృతములో కావించిన రచనలు లభింపక పోవుటచే అతఁడు, సంస్కృత కవి కాఁడనుట తగునా?

**కవియిత్రి మొల్ల :**

గీ. స్తుతగుణోద్దాము నాచనసోము భీము
నవ్యమంజుల వాగ్ధుర్యు నన్నపార్యు

రసికుఁడైనట్టి శ్రీనాథు, రంగనాథు
దిక్కకవిరాజును నుతించి................ (రామా. 9వ, పద్యము)

**వెంకటాచల కవి:**

'మయూరుని చోరుని నాచనసోము భీము' (కృష్ణలీలావిలాసము)

**కృష్ణకవి :**

సోము, నన్నప తిక్కనసోమయాజి భీము' (శకుంతలా పరిణయము)

వెంకటాచలకవి, కృష్ణ కవి పద్యములను నాదృష్టికి తెచ్చినవారు. శ్రీ ఉన్నం జ్యోతివాసు వేములపాడు ప్రకాశం జిల్లా - 523 273.

**వేంకటపార్వతీశ్వర కవులు :**

(శ్రీ బాలాంత్రపు వేంకటరావు 1881 - 1972 శ్రీ ఓలేటి పార్వతీశము 1889-1955.)

ఉ. నన్నయగారి త్రోవఁగొని నవ్యగుణంబులు కొంత చేర్చి తి
క్కన్న మహాకవి ప్రవరుఁడాంధ్ర కవిత్వము, వృద్ధి చేసె నె
ఱ్ఱన్నయు వీరి త్రోవఁగొని యర్హ్మత యింకొక కొంత యిచ్చె స
ర్వోన్నతి తెచ్చె సోముఁడు మహోదధి నాఁజను నాంధ్ర భాషకున్.

**వేంకటరామకృష్ణకవులు :**

(శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రి 1883-1933 శ్రీ వేదుల రామకృష్ణకవి.)

మ. ప్రగుణంబైన కవిత్వ పాటవము, సర్వజ్ఞత్వముం జెప్ప సో
యగమై యొప్పెడి వింత పోకడలఁ గావ్యశ్రీని బోషించి యె
న్నఁగ నొక్కొక్కెడ నా కవిత్రయము కన్నన్ మిన్న యౌ నాఁగ బె
ద్దగ వర్తించిన సోమనాథ కవిచంద్రా! నీకు సాష్టాంగముల్.

**శ్రీ చిన్నయసూరి - 1809-1862**

'అలికంబున నక్షిని డాచినట్టి సర్వజ్ఞుని నాచన సోమనాథు స్తుతి యొనరింతున్.'

**శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు - 1827-1891**

"పరికించి చూడఁగా నది మిక్కిలి ప్రౌఢముగాను భారతము కంటె నెల్ల విధముల విశేషించినదిగాను గానంబడుచున్నది. ఇతనిని సర్వజ్ఞుఁడందురు. అట్లనుటకు సందేహింపఁబని లేదు."

**శ్రీ కందుకూరి వీరేశలింగము - 1849 -1919**

"సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను, ఎఱ్ఱాప్రెగ్గడ కంటె మేలైనదిగాను

ఉన్నది. ఒక్క ఎఱ్ఱాప్రెగడ కవిత్వమేగాదు భారతమును రచించిన కవిత్రయములో అనేకుల కవిత్వము కొన్ని విషయములలో సోమన కవిత్వముతో సరిరాదు."

సకల సుకవికుల సోముఁడగు సోమన ప్రతిభచే ప్రేరితులైన వారి స్తుతి పరములైన వచనము లెన్నియో ఆస్వాదనీయములై ఉన్నవి. అన్నింటిని ఇచ్చట చేర్చుటకు సాధ్యపడ లేదని చింతించుచున్నాను.

చతుర్థాశ్వాసమందు ఉద్దేశపూర్వముగా సంస్కృత పద ప్రయోగములో సోమన వైవిధ్యమును నిబంధించెనని తోఁచుచున్నది. అనుబంధములోవానిని చూడుఁడు.

**పాచికల ఆట (తృతీయాశ్వాసము)**

వేదకాలమునుండియే పాచికల ఆట ఉన్నది. ఈ ఆటను అక్షఖేలన మనిరి. ఒక సారెపై నాలుగు ప్రక్కలలో ఒకటి, రెండు, మూడు, నాలుగు చుక్కలు ఉండును. వరుసగా, వానికి, కలి, ద్వాపర, త్రేత, కృత అని యుగముల పేర్లు పెట్టిరి. మహాభారతకాల మందును, ఈ పేర్లే ఉండినవని తెలియుచున్నది. వారు ఒక పాచికనే వాడి యుందురు.

**సోమన వర్ణించిన నెత్తము :**

ఉత్తర హరివంశమందు, తృతీయాశ్వాసములో శ్రీ కృష్ణుఁడు రుక్మిణీ సత్యభామలతో జూదమాడును. ఆ పాచికలాట 109 నుండి 130 వఱకును, మఱియు 139 నుండి 142 వఱకును ప్రస్తావింపఁబడినది. మొదట సొగటాలాటను దీర్ఘముగా వర్ణించినవాడు సోమనాథుఁడే! తరువాతి కవులకు సోమనయే దర్శకుఁడు.

హరివంశమందు, ఎఱ్ఱయ, ద్యూతమును ఒకే పద్యముతో ముగించెను (ఉ. భాగ 6 ఆ, 24 పద్య).

సోమన కాలమందు ఈ ఆటకు 'పచ్చీసు' అని పేరు. మొత్తము చదరములో, 25 గళ్లు ఉండుటచే, ముస్లిముల భాషలో అది 'పచ్చీసు' అని వ్యవహారములో రూఢి అయినది. రెండు పాచికలపై, వరుసగా, నాలుగు ప్రక్కలలో మొత్తము 1+1, 3+3, 4+4, 6+6 బొట్లు ఉండును. పాచికలను తాళించి వేసినపుడు, పాచికల పార్లిక భేదముచే తొమ్మిది సంఖ్యలే లభించును. జూదపు పరిభాషలో వానికి క్రింది పేర్లు కలిగినవి.

(1) 2 - రెండు, దుగ. (2) 4 - నాలుగు, ఇద్దుగ (2×2=4). తీవంచ (3+1=4). (3) 5 - అయిదు, చౌవంచ (4+1=5), (4) 6-ఆఱు, ఇత్తిగ (2×3=6) చక్కు, (5) 7 - ఏడు, సత్తా, సత (6) 8 - ఎనిమిది, దచ్చొక, దచ్చి (2×4=8), (7) 9- తొమ్మిది , చొపంచ (4+5=9), (8) 10- పది, ఈరైదు. (9) 12 - పన్నెండు, బారా, బద్ర

కం. అత్తీవంచ, తిగ, దుగయు
సత్తా దచ్చౌక వంచి (పాఠాం. దంట) చౌ వం చీ
రై దిత్తిగ యిద్దుగ బద్రలు
చిత్తంబునఁ దలచినట్లు చేతికిఁ దెచ్చున్ (3ఆ-121 పద్యము)

నెత్తములో పడు బొట్లను అన్నింటిని ఈపద్యము చక్కగా సూచించినది. చూడుఁడు.

ప్రతి : ఆ+తీవంచ, తిగ, దుగయున్= (1)ఆ, 4+3+2= తొమ్మిదియును; (2) సత్తా = ఏడు; (3) దచ్చౌక = ఎనిమిది; (4) (వంచిమాఱుగా) దంట = రెండు; (5) చౌవంచ = అయిదు; (6) ఈరైదు = పది; (7) ఇత్తిగ = ఆఱు, (8) ఇద్దుగ = నాలుగు; (9) బద్రలు = పన్నెండు మొదలగు పందెములను; చిత్తంబునన్ = మనసునందు; తలఁచినట్లు; చేతికిన్ తెచ్చున్. పార్లికకు పందెమనియు పేరున్నది.

శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు,' త్చౌకవంచి ఎనిమిదిన్నొకటి తొమ్మిది అని అర్థమేమో' అని తికమకపడి మొత్తము తొమ్మిది పందెములను అర్థములో ఇముడ్చలేకపోయిరి. 'వంచ' లిపికారుని ప్రమాదముచే పద్యమందు చేరినది. దానిని దంటగా గ్రహించినప్పుడే అర్థము కుదురును.

శబ్ద రత్నాకరు కారుఁడును తికమకపడెను. 'బద్ర'కు పంద్రెండు అని అర్థమును చెప్పి, పార్లిక భేదములన్నింటిని వివరించెను. 'సత్తా' అను పదమునకు అర్థము 'ఏడు' అని వచించి, 'బద్ర' కడ కుండలీ కరణములో వ్రాసి యుండు దానిని పరిహరింప వలయు ననిరి. ఈ తికమకకు కారణము, "వంచ" పదముండుటయే. పార్లికలలోవంచ= ఒకటి, అను సంఖ్య విడిగా లేనేలేదు కదా! "వంచ" పదము, శ్రీ సురవరంవారికి, శ్రీ బహుజనపల్లి వారికి, చాల తంటా తెచ్చి పెట్టింది.

**జూదపు పరిభాషను వాడిన కవులు :**

నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు, జూదము సారెలు, పలకలు అను పదాలను వాడినారేకాని, మిగిలిన వివరాలను చెప్పలేదు. సోమనయే నెత్తపుమాటలను విపులీకరించెను. పింగళి సూరన కళాపూర్ణోదయమందు (3-140), దచ్చౌక(8), చౌవంచ(5), ఇత్తిగ (ఆఱు), బారా (12), దుగ (2), అను పందెములను వాడెను. సంకుసాల రుద్రకవి, నిరంకుశో పాఖ్యానమందు (3–20), బారా (12), పది (10), దచ్చి (8), ఇత్తిగ (6), దుగా (2) చౌవంచ (5), తీవంచ (4), అను వానిని పేర్కొనెను. విష్ణు మాయానాటకములో చింతలపూడి ఎల్లనార్యుఁడును, కొన్ని పదాలను ఉపయోగించెను.

శ్రీ చెన్నమరాజు శార్దూల వృత్తమునందు, అన్ని పందెములను స్పష్టముగా సూచించెను. చూడుఁడు.

శా : పచారించిన గుబ్బ చన్నులు చలింపన్ గెంపు రా దిన్నెలన్
మించుం బోడుల గుంపు సొంపు మదిలో మించన్ దుగా బార తీ
వంచా యిత్తిగ దచ్చి చక్కు సత చౌవంచీ పదీ తొమ్మిదీ
యంచున్ బల్లవరాజితోడ సొగటా లాడున్ బురీ వీధులన్.

చారు చంద్రోదయము (1 ఆ, పద్య 115).

చెన్నమరాజు రచించిన ఈ పద్యమందు దుగా (2), బార (12), తీవంచ (4), ఇత్తిగ (6), దచ్చి (8), సత (7), చౌవంచీ (5), పదీ (10), తొమ్మిదీ (9) అనెడి పార్లిక భేదముచే ఏర్పడు తొమ్మిది సంఖ్యలున్నవి. రెండు సార్లు ఇత్తిగ (6), చక్కు (6) ఒకే సంఖ్య ఉన్నది. జూదములో "చక్కు" అను పదమును వాడిరనవచ్చును.

**'పచ్చీసు' ఆట.**

గళ్లు, ఇరువది అయిదు ఉండును.

గళ్లలో - 1, 5, 9, 13, 15 అనునవి అయిదును రక్షితస్థానములు. వీనిలో ఇరుపక్షముల కాయలు అందు కలిసి యుండవచ్చును. వేర్వేరు రంగులు కల కాయలను ఇరుపక్షముల వారు ఉపయోగింతురు. ఒక పక్షము వారు కుడి వైపునుండి మఱొక పక్షమువారు ఎడమవైపునుండి, ఆటలో కాయలను నడపుదురు. అరక్షితస్థానములో ఉన్న కాయను, ఎదిరి పక్షపు కాయచేరినప్పుడు ముందున్న కాయ గళ్ల నుండి తొలఁగును. మరల కాయలు గళ్లలో ప్రవేశింపవచ్చును. రెండు లేక అయిదు పందెములు (బొట్లు) పడినచో, అది ప్రవేశ సంఖ్య అగును. కాయ గళ్లలో చేరును. అట్టి సమయమందు రెండవసారి పాచికలను తాళించి వేయవచ్చును. మిగిలిన బొట్లు పడినప్పుడు, ఒక పందెముతోనే ఆటముగియును. 'గళ్లో' అమరిక ఎట్లుండెనో ఎఱుఁగవలెను. 'పచ్చీసు' అనెడి నామధేయ ముండుటచే ఇరువది అయిదు గళ్లు ఉండెనని తలంపవచ్చును.

**గళ్ల పటము**

గళ్లలో కాయలు, పటములో చూపినట్లు కుడివైపు నుండి మొదలై వరుసగా చివఱ 25 వ గడిని (కేంద్రమును) చేరును. కేంద్రమును చేరిన కాయ పండిన దని చెప్పుదురు. రెండు లేక నాలుగు కాయలతో ఆట ప్రారంభమగును. ఎవరి కాయలు ముందు పండునో వారిదే గెలుపు.

శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు 'ఆంధ్రులసాంఘిక చరిత్ర'లో (పుటలు 85 నుండి,

| | | | | |
|---|---|---|---|---|
| 11 | 10 | 9 | 8 | 7 |
| 12 | 19 | 20 | 21 | 6 |
| 13 | 18 | 25 | 22 | 5 |
| 14 | 17 | 24 | 23 | 4 |
| 15 | 16 | 1 | 2 | 3 |

**94** వఱకు) పాచికల ఆటను గుఱించి విలువైన విషయములను ప్రకటించిరి. వారు ప్రదర్శించిన పటములో కేంద్రమునకు నాలుగు ప్రక్కలలో దీర్ఘ చతుర స్రాకారముగా మూడువరుసలుగా, ఎనిమిది గళ్లు అనఁగా మొత్తము ఇరువది నాలుగు గళ్లు నలు వైపులనుండును. ఆ గళ్ల అమరిక ఆధునికముగ ఉన్నది.

**కృత్యాసంహారము :**

మంటల రూపుగల మగువ "కృత్య" ద్వారకను కాల్చుటకు వచ్చెను. కాని ద్వారకను దహింపలేక తన్ను సృజించి పంపిన కాశీరాజుతో కూడ తానును శ్రీ కృష్ణుని ప్రభావముచే బూడిద అయినది.

సోమన పాచికల ఆటను, కృత్యా సంహారముతో అభేదముగా జోడించి పాఠకులకు విస్మయము కలిగించెను. శౌరిని సత్యభామ పలుసార్లు గెలుచుట కృత్య యొక్క విజృంభణము. హృషీకేశుని మదిలో శోచిష్కేశ ద్యోతకమైనది. అతనిలో ఓటమి వలన ఆవేశము కలిగినది. కృత్య కృత్యమును చెప్పిన పురవాసులు శ్రీ కృష్ణుఁడు నెత్తపు తమకములో ఉన్నాడని తలంచిరి. అప్పుడు శ్రీ కృష్ణుని మాటలు ద్యూత పరముగను కృత్య పరముగను. అన్వయము కలవై ఉన్నవి (పద్య 141). "పొంది వచ్చిన వ్రాలకుఁ బోవుఁగాక" అను మాటలతో శ్రీ కృష్ణుఁడు విష్ణు చక్రమును కృత్యపై పంపి ఆమెను, కాశీరాజును, బూడిద చేయించెను. ఆటలో విష్ణు చక్ర పరిభ్రమణమే, శ్రీ కృష్ణుని గెలుపు, సత్య భామ ఓటమి. ఇట్లు నెత్తము, చమత్కార యుతముగ ఆహ్లాద కరమై ఉన్నది.

**వి.వి. సుబ్రహ్మణ్య శర్మ.**



కీ. శే. విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రి

# కృతి సమర్పణము

స్థిత ప్రజ్ఞులు, ఉదారులు, న్యాయవాది శ్రీ అల్లాడి కృష్ణస్వామి గారి ద్వితీయ
జామాత, సాహితీ రసజ్ఞులు, విద్వజ్జన విధేయులు

## శ్రీ పాటూరి రాఘవరామశాస్త్రి
## శ్రీమతి కల్పకాంబ

## పుణ్య దంపతులకు సమర్పితము.



## ని వా ళి

గీ. శాశ్వతం బగు తత్త్వంబు విశ్వసించి
వేద జ్ఞానము నెఱిగిన విజ్ఞుఁడతఁడు
కల్పవృక్షము నింటనే కల్గినాఁడు
మమ్ము విడువక యున్నాఁడు మనసులందు.

**మామిడిపూడి గోపాలకృష్ణన్**
ఐ.ఏ.ఎస్. (రిటైర్డు)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.



శ్రీమతి పాటూరి కల్పకాంబ, రాఘవ రామశాస్త్రి
దంపతులు



తెలుగు గోష్ఠి వ్యవస్థాపకాధ్యక్షులు

కీ.శే. చీమకుర్తి శేషగిరిరావు గారు

(1913 - 1994)

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# ఉత్తర హరివంశము

## నాచన సోమనాథ ప్రణీతము

## తృతీయాశ్వాసము

కం. శ్రీదుర్గాకుచదుర్గ
స్వేదాంభోహారయష్టివిభ్రమశాలీ
శ్రీదత్తాభయమదనా
హ్లాదవ్రీడావినోద హరిహరనాథా. 1

1

ప్రతి : శ్రీ = లక్ష్మీదేవి యొక్కయు; దుర్గా =పార్వతీదేవి యొక్కయు; కుచ దుర్గ = చనుకొండలపై నెలకొన్న; స్వేద+అంభస్ = చెమట నీటి బిందువులతో; హారయష్టి= ముత్తెపు దండల సరముల యొక్క; విభ్రమ = విశేషమైన విలాసముచే; శాలీ = ఒప్పు వాఁడా!

శ్రీ దత్త = ఆనందస్వరూపిణి, జ్ఞానరూపిణి అగు 'శ్రీ' నామధేయ, లలితా త్రిపురసుందరిచే; దత్త = పొందఁబడిన; అభయ = వెఱపులేమి కల; మదన+ఆహ్లాద క్రీడా వినోద =కామసంబంధమైన సంతోషము, సిగ్గు అనెడి చేష్టలతో క్రీడించువాఁడా! హరిహరనాథా!

తా : మహాలక్ష్మి, మంగళగౌరి అనెడి కాంతల చనుకొండలపై నెలకొన్న చెమట బిందువులతో వెలయు ముత్తెపు దండల విలాసములచే ఒప్పుచున్నవాఁడా!

"శ్రీ" అనెడి పేరు గల లలితాదేవిచే పొందఁబడిన అభయము కల మదన సంబంధమైన సంతోషముతోను లజ్జతోను, క్రీడించు వాఁడా! హరిహరనాథా!

జగత్తును సృష్టించు కార్యమును పరతత్త్వము ప్రారంభించునపుడు, శ్రీ దేవి (పరాశక్తి) ఆ తత్త్వములో లీనమై, సహకరించుచున్నది. ఆమె త్రిగుణాత్మక. అన్ని శక్తులకు మూలభూత, త్రిభువన సుందరి.

అవ్యక్తమైన ఆ శక్తి సముద్రమునుండి లక్ష్మియై, పరతత్త్వమునుండి గౌరియై వ్యక్త. ఇట్లు అవ్యక్తయు, వ్యక్తయు, కనుక వ్యక్తావ్యక్త. ఆమె ఇచ్చిన శక్తిచే హరిహరనాథుఁడు,

శృంగార మూర్తిగా, అనురాగమూర్తిగా భాసించుచున్నాఁడు. ఆ శక్తి కారణత్వమును, శ్రుతి స్మృతులు తెల్పుచున్నవి. సోమన, తిక్క యజ్వ మార్గమును అనుసరించియే శ్రీ శక్తిని ప్రార్థించుచున్నాఁడు.

2

తా : లక్ష్మీ దేవి యొక్కయు, పార్వతీదేవి యొక్కయు, పాలిండ్లు అనెడి దుర్గముల యందు, చెమట నీటితో కూడుకొనిన బెత్తమువంటి హారములయొక్క విశేషమైన కాంతి చేత ఒప్పు వాఁడా! (రెంటికి సమానము).

హరిపక్షము : లక్ష్మీదేవిచే ఒసఁగఁబడిన వెఱపు లేమిగల మన్మథునికి సంబంధించిన సంతోషముతో వినోదించు వాఁడా! శ్రీ= లక్ష్మి.

హరపక్షము : పార్వతీ దేవి చేత ఒసఁగఁబడిన అభయము గల మన్మథ సంబంధమైన సిగ్గుచేత వినోదించు వాఁడా! (శ్రీ =పార్వతి).

హరి, లక్ష్మిచే ఒసఁగఁబడిన అభయము గల మదన సంబంధియైన ఆహ్లాదముచే వినోదించెను. హరుఁడు, పార్వతిచే పునర్జన్మ పొంది, అభయమును పొందిన మన్మథుని విషయమై సిగ్గునుపొందెను.

కీ.శే. గౌరి పెద్ది రామ సుబ్బశర్మగారు, తిరుపతి

3.

ఈ పద్యమునకు సరియైన అర్థము కుదుర్చుటకై శ్రీ గురువర్యులు, వేటూరి ప్రభాకర శాస్త్రులుగారు రెండుచోట్ల చిన్న సవరణలను సూచించినారు.'శాలీ' అను చోట 'సాల' అనియు, 'వ్రీడా' అనుచోట 'క్రీడా' అనియు వారు సవరించిరి. పయి సవరణలు మూల పాఠమునకు మిక్కిలి దగ్గఱగానుండి సరసమైన అర్థమును సముపార్జించుచున్నవి.

తా : లక్ష్మీదేవియొక్కయు,పార్వతి యొక్కయు, కుచదుర్గములయందు, బెత్తముల వంటి హారములచే భ్రమ గలిగించుచున్న, (సాల) ప్రాకారము యొక్క, (శ్రీ) సంపదచేత,ఒసగఁబడిన అభయ మదన (ఆహ్లాద) సంతోష ప్రదములైన (క్రీడా) పనుల యందు సంతోషించువాఁడా!

ఈ సవరణలు సముచితములు, సరసార్థ సంపాదకములును, అని చెప్పుటకు సందియములేదు.

కే. శే. డా. తిమ్మారజ్జుల కోదండ రామయ్యగారు. మధుర.

4

తా : లక్ష్మీ పార్వతుల యొక్క దుర్గముల వంటి కుచముల యందలి రతి సంరంభముచే ఏర్పడిన ముత్తెముల వంటి స్వేద బిందువుల స్పర్శచే ఏర్పడిన ముత్తెముల హార భేదముచే కలిగిన (వి(భమ) ఒకానొక శృంగార చేష్టచే ఒప్పుచున్న వాఁడును,(శ్రీ) = లక్ష్మికొఱకు ఈయఁబడిన అభయముగల రతి యందలి లక్ష్మికి కలిగిన (మదనాహ్లాద(వ్రీడా) లజ్జయే వినోదముగాఁ గలవాఁడును (హరి).

(శ్రీ) = పార్వతిచే అను(గహింపఁబడిన (అభయ మదన ఆహ్లాద (వ్రీడా) తనలో తనకే నిగూఢముగా కలిగిన లజ్జయే (లజ్జా (ప్రకటనమే) వినోదముగా కలవాఁడు హరుఁడు.

శ్రీ వట్టిపల్లి మల్లి నాథశర్మగారు ఇందుకూరుపేట (గ్రామము, నెల్లూరు.

శ్రీ శర్మగారు, హరిహరనాథశబ్దము శివునకు ఏకశేష సంబోధనమని, స్వేదాంభోహార (యష్టి)ని, స్వేదాంభో 'హారి' లేదా 'బిందు' అని సవరణలు చేయవచ్చు ననరి.

5

తా : లక్ష్మీ దేవియొక్కయు, పార్వతి యొక్కయు, చను కొండల మీఁద చెమట యొక్క ముత్యాల హారముల యొక్క పేరులచే కలిగిన హావము లేక విలాసమును, సొంపును పొందినవాఁడా!

లక్ష్మీదేవి యొక్కయు, పార్వతీ దేవియొక్కయు అభయము (శివుని వలన)పొంది,మరల సరూపుఁడై ఎదుటనిలిచిన వానివలన కలిగిన (లక్ష్మీ పరముగ) కొడుకు (బ్రతికి నందులకు లక్ష్మి ఆహ్లాదమును, (పార్వతి పరముగా) తనలో కామేచ్ఛ కలిగించిన మన్మథుని చూచి పార్వతి ((వీడ) సిగ్గును (ఇట్లు ఈ రెండు అనుభూతులను విష్ణువుగను, శివుఁడుగను చూచి) వినోదమును పొందుచున్న హరిహరనాథా! వైష్ణవ శైవధర్మ సమాహార రూపి అగు వేలుపా!

చచ్చి (బ్రతికిన మన్మథుని చూడగానే తల్లి అగు లక్ష్మికి ఆనందమును పార్వతికి సిగ్గును కలిగి భావో(ద్రేకముచేత స్వేదము కలిగినది. ఆ స్వేదబిందువులు వారి స్తనముల మీఁద ముత్యముల వలె (ప్రకాశింపఁగా హరిహరుఁడు చూచి వినోదించెను. ఇది యొక అర్థము. అసలు అర్థము సోముని కెఱుక.

శ్రీ వేదము వేంకటరామన్ గారు, నెల్లూరు.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తా: సులభము

గీ. వాసుదేవుండు బదరికావనము సొచ్చి
ముందటి తెఱంగునన తాను మునులుఁ గూడి
నవవినోదకథాగోష్ఠి నడపె నంత
నంతరంగంబు ముద మంద నంతలోన. 3

తా: వాసుదేవుఁడు బదరి కాశ్రమము ప్రవేశించి, పూర్వము వలె, తాను మునులతో కూడి క్రొత్తవైన ఉల్లాసము నిచ్చు కథల ప్రసంగమును మనస్సునకు సంతసము కలుగునట్లు నిర్వహించుచుండెను. ఆసమయమందు(మీఁది పద్యముతో).

ఉ. ఇక్కడఁ బౌండ్రభూపతి విహీనవివేకతఁ జేవ యెక్కఁగా
నెక్కడి వాసుదేవుఁ డిల నే నొకరుండన వాసుదేవుఁడన్
దక్కినవాఁడు నందకసుదర్శనశార్ఙ్గగదాది హేతులన్
*స్రుక్కక పట్టినన్ దెసలఁ జుట్టిన నిర్మలకీర్తి పట్టునే. 4

ప్రతి : ఇక్కడన్=నగరమందు;పౌండ్ర భూపతి= పుండ్రరాజు తనయుఁడు అగు వాసుదేవుడు, విహీనవివేకతన్=మిక్కిలి నశించిన తెలివిచే; చేవ+ఎక్కగాన్=గర్వము ఎక్కువ అగుటచే;ఎక్కడి వాసుదేవుఁడు= ఏ ఊరివాఁడు ఈవాసుదేవుఁడు? ఇలన్ = ఈ నేలపై; నేను ఒకరుండను+అ = నేను ఒక్కడనే; వాసుదేవుఁడన్= వాసుదేవుఁడు అనెడి పేరును పొందుటకు యోగ్యుఁడను; తక్కిన వాఁడు = మఱొకఁడు; నందక, సుదర్శన శార్ఙ్గ గద+ఆది హేతులన్ = నందకము(కత్తి), సుదర్శనము (చక్రము) శార్ఙ్గము(విల్లు), గద (కౌమోదకి) మొదలైన ఆయుధములను; స్రుక్కక =సంకోచములేక; పట్టినన్ = చేత ధరించినప్పటికిని; దెసలన్ +చుట్టినన్ =నాలుగు దిక్కులయందు తిరిగినను; నిర్మలకీర్తి =మలినములేని మంచి పేరు; పట్టునే= కలుగునా ఏమి?

పాఠాం . స్రుక్కక పట్టునే = సంకోచములేక ఆయుధములను పట్టుకొనఁగలఁడా? దెసలన్ +చుట్టునె కీర్తి పట్టికల్= స్వచ్ఛములైన కీర్తి కాంతులు,నలుదిక్కులయందు వ్యాపించునా ఏమి?

తా: నగరమందు, పౌండ్రరాజు తెలివి లేనివాఁడై, గర్వ మతిశయించి, ఎచటివాఁడు ఆ వాసుదేవుఁడు? ఈ నేలపై వాసుదేవుఁడు అనెడి పేరునకు తగిన వాఁడను నేను

---

* స్రుక్కక పట్టునే దెసలు చుట్టునె నిర్మల కీర్తి పట్టికల్.

ఒక్కడినే! మఱొకఁడు సంకోచము లేక నందకాది ఆయుధములను ధరించి దేశ సంచారము చేసి నంతమాత్రమున మలినము లేని కీర్తి కలుగునా ఏమి?

వ్యు.వాసుదేవుఁడు 1. వసుదేవునికుమారుఁడు,శ్రీ కృష్ణుఁడు.

2. వసువు (బంగారు రత్నము ధనము) మొదలైన వానితో కూడి ప్రకాశించువాఁడు. 3. దివంబున వసనము కలవాఁడు.2 ఆ - పద్య -208.

చం. అని తనవంగడం బగు ధరాధిపమంత్రిపదాతివర్గముం
బనివడి కూడఁబెట్టి శతభారసువర్ణము దండ మెవ్వఁడై
నను ధర వాసుదేవుఁ డను నామ మున న్ననుఁ బిల్వకున్నఁ బా
యనిపగ వాసుదేవుఁడని యాదవుఁబిల్చినఁ జాటి చెప్పితిన్. 5

ప్రతి :అని,తన నంగడంబు + అగు = తనవంశము వారైన;ధరా+ అధిప = పుడమిఱేఁడులు; మంత్రి;పదాతి వర్గమున్ = సైన్యసమూహమును; పనివడి = ప్రయత్నించి; కూడన్ + పెట్టి= ఒకచోట చేర్చి; ధరన్ = భూమి యందు; ఎవ్వఁడు+ఐనను; ననున్ =నన్ను; వాసుదేవుఁడు +అను నామమునన్; పిల్వక +ఉన్నన్ = పిలువక పోయినచో; పాయని = తొలఁగని (శాశ్వతమైన); పగ = విరోధి (శ.ర) (అయిన); యాదవున్= గొల్లవానిని; వాసుదేవుఁడు + అని; పిల్చినన్ = పిల్చినట్లైన; శత భార సువర్ణము = నూఱుబారువ ల బంగారము; దండము=అపరాధముగా చెల్లింప వలసిన ధనము)(అని); చాటి చెప్పితిన్ = ప్రకటించితిని. బారువ సుమారు, 225 కిలో గ్రాములు.

తా: అని వచించి,తన వంశమునకు చెందినవారైన రాజులను,మంత్రులను, సైన్య సమూహమును ఒక్కచోట చేర్చి,"ఎవ్వఁడైనను నా రాజ్యములో నన్ను వాసుదేవుఁడు అని పిలువక, మనకు ఎల్లప్పుడును విరోధి అయిన గొల్లవానిని, వాసుదేవుఁడు అనుపేరుతో పిల్చిన యెడల వాఁడు శిక్షగా నూఱు బారువుల బంగారమును చెల్లింపవలెను" అని చాటించి ప్రకటించితిని.

కం. నా చేతిచక్ర మిందఱుఁ
జూచితిరో చూడరో విశుద్ధతరాయో
మేచకిత సహస్రారం
బాచక్రముఁ దోలఁ జాలు నతిభర మగుటన్. 6

ప్రతి : నా చేతి చక్రము = నేను ధరించు చక్రాయుధమును; ఇందఱున్ = ఇచ్చటనున్న అందఱును; చూచితిరో;చూడరో= చూడలేదో! విశుద్ధతర = మిక్కిలి స్వచ్ఛమైన; అయస్ + మేచకిత = ఇనుముతో చేయఁబడి నల్లనివన్నెకల ; సహస్ర + అరంబు = వేయికంటి ఆకులుకల; ఆ చక్రమున్ = ఆ (కృష్ణుని)చక్రాయుధమును; అతి భరము+అగుటన్ = (నా) చక్రము ఎక్కువ బరువు కలదగుటచే, తోలన్ చాలున్ = ( ఆకృష్ణుని చక్రమును) పాఱఁ ద్రోలఁగలదు.

తా: నా చక్రమును మీరు చూచినారో లేదో? ఇది శుద్ధమైన ఇనుముతో చేయఁబడినది. నల్లనైన వన్నెతో వేయి(కంటి) ఆకులు కలది. ఆ వాసుదేవుని చక్రమును, బరు వెక్కుటగుచే పాఱఁద్రోలఁగలదు.

గీ. నందకము గూల్చు యాదవునందకంబుఁ
బాంచజన్యంబుచేతఁ దత్పాంచజన్య
మడఁగు శార్ఙ్గంబుచేఁ జెడు నతనిశార్ఙ్గ
మిసుము సేయదె గద గోపుఁ డెత్తుగదను. 7

తా : నా నందకము (కత్తి), గొల్లవాని నందకమును అణఁచును. నా పాంచ జన్యముచే, అతని పాంచజన్యము (శంఖము) అడఁగును. నా శార్ఙ్గముచే (విల్లు) అతని శార్ఙ్గము పాడగును. నా గద, గోపుఁడు ఉపయోగించు కౌమోదకిని పొడిచేయదా?

పౌండ్రుఁడు తన గద పేరు కౌమోదకి అని చెప్పలేదు.

ఉ. నావుడు నేమియుం బలుక నాలుక యాడనిపాటి యై న ధా
త్రీవరకోటి యుండ నొకదిక్కున మంత్రులు గూడి యిస్సిరో
యా వసుదేవసూను సరియా యితఁ డంచుఁ దొలంగి రెల్లచో
లావున నీతఁ డెక్కు డని లజ్జలు మానిరి ధూర్త సేవకుల్. 8

అర్థ : నాలు కాడని పాటియై = మాట్లాడుటకు నోటిలో నాలుక కదలలేని కలఁతను పొందఁగా, (నోరాడక పోయినది); ధాత్రీవర కోటి = పుడమి ఱేఁడుల సమూహములు.

తా : అని పౌండ్రుఁడుగర్వముతో పలుకఁగా రాజుల సమూహములు మాట్లాడ లేని వారై మిన్నక యుండిరి. ఒక్క చోట మంత్రులు గుమిగూడి"అకటా, ఆ కృష్ణునితో ఇతఁడు సమానుఁడు అగునా?'' అనుచు దూరముగా వెడలిపోయిరి. వంచకులైన

సేవకులు బలముచే ఈ పౌండ్రుఁడే అధికుఁడని, అన్ని చోట్లలో చాటుచు, అది తప్పని తెలిసియు, తాము సిగ్గు చెందుటను వారందఱు వదలిపెట్టిరి. "లజ్జలు" అని బహువచన ప్రయోగముచే అందఱును భయము చెందిరని భావము. ఇచ్చట "మాని+అనిరి" అనియు విడదీయుటకు అవకాశమున్నది.'కోటి' శబ్ద ప్రయోగముచే, రాజులు అందఱును, భయముచే మిన్నకుండిరని భావము.

నానా. కోటి = నూఱులక్షలు, అంచు,అతిశయము, వింటికొప్పు, (దే) - వేగు.

శా. ప్రాలేయాంశు మరీచినిర్మల తనూభాగంబుఁ గృష్ణాజిన
వ్యాలోలామల యజ్ఞసూత్రములు నంసాసక్త వీణాలతా
లాలిత్యంబు లలాటికారుచులుఁ గ్రాల న్నారదుం డిచ్ఛలం
గైలాసంబుననుండి వచ్చెఁ గలహోత్కస్వాంతుఁ డచ్చోటికిన్. 9

ప్రతి : ప్రాలేయాంశు మరీచి = చంద్రుని కాంతులు ప్రసరింపఁజేయు;నిర్మల = మలినములేని; తనూభాగంబున్ = శరీరావయములును,(మేలిమి బంగారు చాయ గల మేనుకలవాఁడు); కృష్ణ+అజిన = నల్లని జింక చర్మపు ముక్కతో; వ్యాలోల = బాగుగా కదలాడు; అమల యజ్ఞసూత్రములున్ = శుద్ధమైన జందెపు పోగులును; అంస+ఆసక్త = ఎగు భుజములను కట్టఁబడి వ్రేలాడుచున్న; వీణా లతా లాలిత్యంబున్ = సుకుమార మైన వీణ యొక్క తీఁగెలును; లలాటికా రుచులున్ = నొసటి యొక్క తేజస్సును (బ్రహ్మవర్చస్సు); క్రాలన్=వికసించుచుండఁగా; కలహ+ ఉత్క స్వాంతుఁడు = కయ్యమన్న ఉవ్విళ్ళూరు మనసు కలవాఁడు; నారదుండు; ఇచ్ఛలన్ = తన కోరికలను అనుసరించువాఁడై; కైలాసంబున నుండి వచ్చెన్.

తా : చంద్రికలను వెదఁజల్లు మేలిమి బంగరు వన్నె కల మేనును, నల్లని జింక చర్మపుముక్కతో వ్రేలాడు శుద్ధమైన జందెపు పోగులును, ఎగు భుజములపై ఆని యున్న సుకుమారమైన తంత్రులుగల వీణెయును, నొసటి యందు బ్రహ్మతేజః ప్రసారమును, ప్రకాశమానమగు చుండఁగా, కలహ ప్రియుఁడు నారదమహాముని,తన అభీష్టమును అనుసరించి, కైలాసమున నుండి పౌండ్రనగరమునకు వచ్చెను.

వ్యు.ప్రాలేయ+అంశువు : హిమకిరణుఁడు, చల్లని కిరణములు కలవాఁడు, చంద్రుఁడు.

కం. వచ్చిన మునిపతి కర్ఘ్యము
మిచ్చిన పిదపన్ మహీశు లెల్లను వినఁగా

మచ్చరపు వాసుదేవుఁడు
*పెచ్చారితనంబు ౹మానుపిల నిట్లనియెన్. 10

౹పతి : వచ్చిన ముని పతికిన్ = అచ్చటికి ఏ తెంచిన మునుల యొక్క నాయకునకు; అర్ఘ్యణము + ఇచ్చిన పిదపన్ = చేయఁదగిన మర్యాదలు జరిపిన వెంటనే; మహీ + ఈశులు + ఎల్లన్ = రాజులు అందఱును; వినఁగాన్; మచ్చరము+వాసుదేవుఁడు = ఈసు గల పౌం౹డ్రుఁడు; వాసుదేవుఁడు; పెచ్చారితనంబు = మూర్ఖత్వము,తెలిసి తెలియని తనము; (శ.ర) ౹మాను పిలన్ = స్తంభించినట్లు (శ.ర); ఇట్లు+అనియెన్.

పాఠాం. పిచ్చాలి తనంబు మదిని బెనఁగొన ననియెన్ = వెఱ్ఱితనము,మనసులో నిండఁగా ఇట్లనెను.

తా : ౹బహ్మ వర్చస్సు, ముఖమందు ౹పకటముగా నుండగా, దివ్యతనూ విలాసముతో వచ్చిన సురమునియైన నారదునకు, తగిన మర్యాదలు కావించిన పిమ్మట,రాజులు అందఱును వినునట్లు ఈర్ష్యగల పౌం౹డ వాసుదేవుఁడు, తన తెలివి లేని తనము స్తంభించిన విధమున ౹కింది విధముగా పలికెను.

వ్యా. మచ్చరము+వాసుదేవుఁడు.పుంప్వాదేశసంధి. సంధి, బాల - 32.

**- : పౌం౹డకవాసుదేవుఁడు వాసుదేవుని నారదుని ముందఱ నిందించుట : -**

మ. "మునినాథా నిఖిలంబు నీకు హృదయాంభోజాత గంధంబు దోఁ
పనియర్థంబులు లేవు నాకు సరి చూపం జాలుదే యాదవుం
డనుమానింపక వాసుదేవుఁ డని మిథ్యాగర్వరథ్యావిడం
బనుఁ డైనన్ **వినిపింతుఁగా కతని కీపంతంబుఁ జెల్లింతునే. 11

౹పతి : ముని నాథా = మునులకు నాయకుఁడా! నీకు;నిఖిలంబు = సమస్తమును; హృదయ+అంభస్+జాతగంధంబు= హృదయము అనెడి పద్మము యొక్క పరిమళము, తామర తావిని తెలిసికొనునట్లు నీ మనస్సు సర్వమును తెలిసికొనును;తోఁపని అర్థంబులు లేవు = నీవు ౹గహింపలేని విషయములే, ఉండవు; నాకు సరి చూపన్ చాలుదె = నాకు సమానుఁడైన వానిని చూపఁగలవా? (ఎచ్చటనైనను ఉన్నాఁడా?); యాదవుండు+ అనుమానింపక=

---

* పిచ్చాలి తనంబు మదిని బెనఁగొన ననియెన్
** నడపిం

ఆ గొల్లవాఁడు(కృష్ణుఁడు) సందేహములేక; వాసుదేవుండు+ అని= తానే వాసుదేవుఁడు అనెడి పేరునకు తగిన వాఁడని; మిథ్యా గర్వ రథ్యావిడంబనుఁడు+ఐనన్ = నిజముగాని (అర్హతలేని) గర్వముతో కూడిన మార్గమును అనుసరించినచో; వినిపింతున్ +గాక అతనికిన్ = అతనికి తెలియఁజేయుదును; ఈ పంతంబున్ = ఈప్రతిజ్ఞను;చెల్లింతున్ +ఏ =నేను సాగనిత్తునా ఏమి?

పాఠాం. నడపింతున్ +కాక = నిర్వహించెదను. నిరూపించెదను.

తా : ఓ మునిపతీ! నీమనస్సునకు తెలియనివి, ఏమియును లేవు. నీవు అన్నింటిని ఎఱుఁగుదువు. నాతో సమానుని చూపఁగలవా? ఏ మాత్రము సంకోచములేక ఆ గొల్లవాఁడు, తానే వాసుదేవుఁడు అనెడి పేరుతో, తగని గర్వముతో కూడిన మార్గమును అనుసరించినచో, అతని ఈ పంతమును సాగనిత్తునా?

పాఠాం.ఈ పంతమును నేను నిర్వహించి, అతని వర్తనమును సాగనిత్తునా?

మ. "కలరే రాజులలో మదీయకరచక్రక్రీడ సైరింపఁ బె
ద్దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ దెత్తం జాల రీకైదు వో
రలు వో నాడకు గోపవీరు నొరుపేరం జీరవే విక్రమా
ఢ్యులలో నేనును వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుం డఁటే." 12

ప్రతి :రాజులలో;మదీయ కరచక్రక్రీడన్ = నాచేతియందున్న చక్రాయుధ విన్యాసమును; సైరింపన్ = ఓర్చుకొనఁజాలినట్టి; (వారెవరైనను) కలరే = ఉన్నారా? పెద్దలన్; భీష్మ+ఆదులన్; ధిక్కరింపన్ +తగదు = వయసులో వారు పెద్దవారగుటచే వారిని ఎదిరింపరాదు, తక్కువగా తలఁపరాదు; ఈ కైదువు =ఈచక్రమును; ఎత్తన్ +చాలరు = పైకి ఎత్తలేరు,మిక్కిలి బరువైనది; ఒరలు+పోన్ = హద్దులు మీఁఱిఆడకు =పలుకకుము; గోపవరున్ = ఆ వీరుఁడైన గొల్లవానిని;ఒరుపేరన్= మఱొక పేరుతో; చీరవు+ఏ = పిలువుమా! విక్రమ+ఆఢ్యులలోన్ = పరాక్రమవంతులైన వారిలో;నేనును = నేనే; వాసుదేవుఁడన్; అతండున్; వాసుదేవుండు + అటే=వాసుదేవుఁడను పేరు పొందుట ఆశ్చర్యముగా నున్నదే? అటే, ఆశ్చర్యమును ప్రకటించు అవ్యయము. (ఈఆశ్చర్యప్రకటనములో హేళనగర్భితమైయున్నది).

తా : నా చక్రాయుధ ప్రహారమును, సహించురాజులు ఎవరైనను ఉన్నారా? వయసు చెల్లిన భీష్ముఁడు ద్రోణుఁడు మొదలైన వారిని ఎదిరింప రాదు. వారు ఈ బరువైన చక్రమును ఎత్తలేరు. హద్దులు మీఁఱి మాట్లాడవద్దు. ఆ ఆల కాపరియైన వీరుని

ప్రత్యేకింపవద్దు. వానిని మఱొకపేరుతో పిలువుమా! పరాక్రమవంతులలో వాసుదేవుఁడు అనెడి నామమునకు యోగ్యుఁడు నేను. అతనిని వాసుదేవుఁడనుట ఆశ్చర్యముగా ఉన్నదే! (అఁటే = అనుట, తగునా?)

విశే శారీరకమైన బలము, వివిధములగు ఆయుధములతో ఆడంబరమైన ఉజ్జ్వలవేషము కల పౌండ్రుఁడు తాను సర్వ శక్తి సంపన్నుఁడని తలఁచి నారదునితో అధిక ప్రసంగము చేసెను.

వ. అనుటయు. 13

తా : సులభము.

చం. మనమున నోకిలించి మఱుమాటకుఁ గింకిరిపాటు తోడుగా
మునిపతి యల్ల నవ్వి విను మూర్ఖ మురాంతకుఁ బుండరీక లో
చనుఁ ద్రి జగన్నుతున్ సుగుణ సాగరుఁ జేరవు గాక శార్ఙ్గితోఁ
బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుటగాదె దుర్మతీ. 14

ప్రతి :మనమునన్; ఒకిలించి = అసహ్యించుకొని,ఈసడించి; మఱుమాటకున్ = ప్రతివచన మిచ్చుటకు; కింకిరిపాటు తోడుగాన్ = చిఱు కోపము కూడఁగా; ముని పతి; అల్ల నవ్వి=చిఱునవ్వుతో; మూర్ఖ, విను; ముర+అంతకున్ = మురుని వధించిన నట్టియును; పుండరీక లోచనున్ = తెల్లదామరల వంటి కన్నులు కలవాఁడై నట్టియును; త్రిజగత్+నుతున్=మూఁడు లోకముల వారిచే, పొగడఁబడు నట్టియును; సుగుణసాగరున్ = సుగుణములకు సముద్రుఁడైనట్టియును (హరితో); చేరవు=దరిదాపులకును పోలేవు,ఏ మాత్రము అతనితో సాటికాఁజాలవు! కాక = అంతియే కాదు; దుర్మతీ = చెడ్డ బుద్ధి కలవాఁడా! శార్ఙ్గితో = శార్ఙ్గము అనెడి వింటిని, ధరించిన, (ఆ హరితో); పెనఁగుట =పోరుట; మంటలో మిడుత; బీరము + చూపుట+ కాదె = పరాక్రమము చూపుట అగును కదా! (మిడుత మంటలో మాఁడినట్లు నశింతు వనుట).

తా : నారదుఁడు పౌండ్రుని మాటలను అసహ్యించుకొనెను. సమాధానమిచ్చుటకు కొంత కోపము తోడైనది.అతని మాటలకు రోఁత చెందిన వాఁడగుటచే చిఱునవ్వుతో, 'ఓ మూర్ఖుఁడా! (అవివేకి), అతనితో నీవు ఏ మాత్రమును సరికావు. అతనితో పోరాడుట మిడుత మంటలో తన బలమును చూపి నట్లగును.(నశించుట తప్పదు) •

అలం : ఉపమ

కం. "నీశంఖము నీచక్రము
నీశార్ఙ్గము నెఱుఁగమే యనిం గదిసినచోఁ
గేశవసాధనములు గళ
పాశంబులు నీకుఁ దొడరి బ్రతుకఁగ వశమే. 15

తా: నీ శంఖము, నీచక్రము, నీశార్ఙ్గమును,మేము ఎఱుఁగమా?(అనిన్) యుద్ధమందు, నీవు ప్రయత్నించినచో,ఆ కేశవునిసాధనములు (ఆయుధములు) నీ మెడకు ఉరిత్రాళ్లు అగును. హరిని ఎదిరించి నీవు బ్రతుకుటకు సాధ్యమగునా? (అతనిని ఎదిరించి తప్పక నశింతువు).

కం. "ఏనుంగులాగు పందికి
మానిసిచందంబు నీరుమానిసికి నగుం
గాని గుణంబులు గలుగవు
పూనకు చక్రంబు చక్రి పూనఁగ నెదురన్. 16

తా : ఏనుఁగు వలె పందికి రూపము ఒకటే! అట్లే నీటి మనిషికిని, మనిషి రూపము ఉన్నది. రూపములు ఒకే విధముగా ఉన్నను, పంది గుణములు, నీటి మనిషి గుణములు వేఱుకదా! అట్లే నీ ఆయుధములు ఒకే రూపములు కలిగి యున్నను, వానికి కృష్ణుని ఆయుధములలో గల గుణములు లేవు. కనుక, ఆ చక్రాయుధుఁడు తన చక్రమును ధరింపఁగా, నీవు అతనితో తలపడుటకు ప్రయత్నింపవలదు.

చతురంగ బలములో గజములు ఒక ముఖ్యమైన అంగము. పంది అట్టిదికాదు. కనుకనే పంది గజముకాదు బలిసినంత అనుట. నీరుమానిసి : ఆకారమంతయు మనిషివలెనే. కాని మాటలాడఁజాలదు. వికృతమైన రూపమును కలిగియుండును.

ఆ.వె. "త్రుళ్లుఁ [1]బోఁత నీవు తూలిపోఁ బలికిన
సార మేమి తెలుఁగుఁ జక్రమునకు
నినుము కూడఁ [2]బొదుగ నిది చక్ర మా యెత్తు
వచ్చుఁ గాక [3]నొరకు వచ్చునెట్లు." 17

1. గొంక; గోఁక 2. బోసిరిది 3. యొరకు

అర్థ : ఎత్తు = బరువు;ఒరకు= రాపిడికి, గుణపరీక్షకు,

తా: ఓ మిడిసి పాటుకల వాఁడా! (ఓ తుంటరీ! గర్వితుఁడా!) నీవు నిందించినంత మాత్రమున ఆ చక్రమునకు దాని ప్రభావము తగ్గునా? ఇనుమును బాగుగా రాశిగాపోసి చేసినను నీ చక్రము కృష్ణుని చక్రమగునా ఏమి? ఆ చక్రముతో సమానమైన ఆకారము, బరువును కలిగియుండ వచ్చును. అట్లుగాక (ఒరపిడిచే) గుణ పరీక్షకు నిలుచునా?

విశే. కాకయున్, కాకన్+ఒరకు-కాక నొరకు. > సముచ్చయ 'యువర్ణము' లోపించుటచే 'కాక'న్ అయినది.

సూ. శబ్ద, ప్రౌఢ -116. పాఠాం. కాక+ఒరకు > కాక యొరకు. ఇచ్చట 'కాక' కళ. ద్రుతము లేనిది.

మ. అనినం బౌండ్రుఁడు చిన్నవోయి హృదయం బల్లాడ నొం డేమియు
న్ననుకం బాఱక "నారదా కినుకకు న్మూలంబు నీ మాటలై
నను శాపాస్త్రుఁడ వైన నీకు నవమానం బేను సేయంగ నో
ల్ల నిజేచ్ఛం జనుమింక యాదవుల నెల్లం ద్రుంచి మెచ్చించెదన్." 18

అర్థ : మునుకు = మాఱు పలుకు; శాప+అస్త్రుఁడవు = శాపమే ఆయుధముగా కలవాఁడవు.

తా : అనఁగా, పౌండ్రుఁడు ఇంచుక చింత చెంది, హృదయము చలించుచుండఁగా, ఏమియును మాఱు పలుకలేక "ఓ నారదా! నీ మాటలు నా కోపమును రెచ్చఁగొట్టినవి. అయినను నీవు శపింతు వని నేను అవమానము చేయుటకు జడియుచున్నాను. నీకు ఇష్టము వచ్చినచోటికి పొమ్ము. (ఇంతటితో నిన్ను వదలిపెట్టుచున్నాను).ఇంక, నాశక్తి చూడు. యాదవులను అందఱిని, చంపి, నిన్ను మెప్పించెదను."

వ. అనుటయు నమ్మునీంద్రుండు నెమ్మనంబునం దనికిన యేవం బును
భావంబునం బొడమిన రోషంబును మేలంబునం దెలుపుచు వెలుపలికి
వెడలె నిత్తెఱంగున నతఁ డుత్తలపడి బదరి కాశ్రమంబునకు వచ్చి
వాసుదేవుం గని యతనితో నిట్లనియె. 19

అర్థ : తనికిన= ప్రకాశించిన(శ.ర. దీనినే ఉదాహరించెను),జ్వలించిన; పాఠాం. తొనఁకిన =తొలఁకిన; ఏవంబు = రోఁత.

తా : అని వచింపఁగా, ఆ నారద మునీంద్రుఁడు, తన నిండు మనంబునందు, తోఁచుచున్న రోఁతను, తన అభిప్రాయమందు కలిగిన కోపమును, తన హేళనతో తెలుపుచు అతనిని వీడి వెలుపలికి వచ్చెను. ఈ తెఱంగున, అతఁడు కలఁత చెంది, బదరికాశ్రమమునకు వచ్చి, వాసుదేవుని చూచి అతనితో ఇట్లు అనెను.

వ్యా. 1. అ + మునీంద్రుఁడు > అ మ్మునీంద్రుడు .

2. ఈ +తెఱంగున > ఇత్తెఱంగున. త్రిక సమాస సంధి.

శా. "దేవా దేవరపేరు పెట్టుకొని ధాత్రిన్ వాసుదేవుం డనన్
లావుం జేవయు మీఱి పౌండ్రుఁడు దురాలాపంబులన్ గ్రొవ్వి సి
గ్గేవం బేమియు లేక నీ సముఁడ నం చేమేని వాక్రువ్వ మ
ద్భావం బుద్గత రోషవహ్ని యగుడున్ ధట్టించితిం బల్కులన్. 20

అర్థ : దేవర = ప్రభువు; లావు = బలము; చేవ = ధైర్యము; ఏవంబు = రోఁత (శ.ర.దీనిని ఉదాహరించినది); రోషవహ్ని = కోపమనెడినిప్పు; ధట్టించితిన్ = అదలించితిని.

తా : దేవా! ప్రభువైన తమ పేరుతో ఈ భూమిలో తానే వాసుదేవుఁడని బలము ధైర్యము,అతిశయించి, పౌండ్ర రాజు చెడ్డ మాటలతో పొగరెక్కి, సిగ్గు రోఁత చెందక నీతో సమానుఁడని ఏమేమో ప్రేలఁగా (అధిక ప్రసంగము చేయఁగా) నాలో కోపాగ్ని చెలరేఁగినది.వాని మాటలను ఆక్షేపించి అదలించితిని.

అలం: రూపకము, రోషాగ్ని.

నానా: భావము =మనోవికారము, అభిప్రాయము, ఆత్మ,పుట్టుక, స్వభావము,(రత్యాది) భావము,తలంపు, హృదయము, ధ్యానము,అర్థము, జాతకములో గృహము. (అభినయమందు) భావము, ఉనికి మొదలగునవి.

గీ. "ప్రల్లదంబున నందకపాంచజన్య
శార్ఙ్గకౌమోదకీసుదర్శనము లనఁగ
నలినలోచన నీ సాధనముల సాటి
చేసె నతఁడు విశ్వామిత్రసృష్టి వోలె. 21

అర్థ : ప్రల్లదము=పారుష్యము, (పొగరుతో నిండిన మాట), విశ్వామిత్ర సృష్టి+పోలెన్ =

విశ్వామిత్రుఁడు అనెడి ఋషి త్రిశంకువు అనెడి రాజు కొఱకు, భూలోకమునకు స్వర్గలోకమునకు నడుమ ఒక లోకమును కలిగించినట్లు.

తా : నలినలోచన (కమలములవంటి కన్నులు కలవాఁడా), తనచెడ్డ మాటలతో, (పొగరుఁబోతు తనముతో) నందకమ్ము,పాంచజన్యమ్ము,శార్‌ఙ్గము,కౌమోదకి,సుదర్శనము అనెడి పేర్లను తన ఆయుధములకు పెట్టుకొని నీ (ఆపేర్లుగల) ఆయుధములతో అవి సమానమైనవని, విశ్వామిత్రుఁడు భూమియును స్వర్గమును,కానిలోకమును సృష్టించినట్లు పౌండ్రుఁడు ఆ సారము లేని వానిని గుఱించి గర్వించుచున్నాఁడు.

గాథ : విశ్వామిత్రసృష్టి : గాదిరాజు సుతుఁడు విశ్వామిత్రుఁడు. తన తపశ్శక్తిచే, త్రిశంకువను రాజును, అతని శరీరముతోనే స్వర్గమునకు పంపెను.ఇంద్రుఁడు, అతనిని తిరస్కరించి, ధరణికి గెంటి వేసెను. వెంటనే విశ్వామిత్రుఁడు మరొక స్వర్గమును సృష్టింపఁదలచెను. ఇంద్రుఁడు భయపడి ప్రార్థింపఁగా, విశ్వామిత్రుఁడు, త్రిశంకువును, భూద్యాకాశముల మధ్య నిలిపెను. ఆచోటు దివియు కాదు భువియు కాదు. అట్లే పౌండ్రుని ఆయుధములు, భ్రష్టములని భావము.

కం. అనుటయు నారాయణుఁ డను
"మునినాయక వేగపడకు మూఢునిఁ బౌండ్రా
వని విభుని నీవు చూడఁగఁ
దునుముదు *నేఁ డెల్లిలోనఁ దుత్తునియలుగాన్." 22

తా : అనఁగానే నారాయణుఁడు ఇట్లు పలికెను? ఓ మునిపతీ! త్వరపడవద్దు. ఆ [illegible] పౌండ్రరాజును, నీ ఎదుటనే నీవు చూచుచుండగా, నేఁడో లేదా రేపటి లోఁగా, ముక్కలు ముక్కలుగా నఱకెదను.

పాఠాం. నెల్లింటిలోనన్ = న్ + ఎల్లింటిలోనన్ = రేపటికి ఆవలిదినము లోఁగా.

## - : పౌండ్రుఁడు రాత్రి వేళవచ్చి ద్వారకను ముట్టడించుట : -

మ. అనిన న్నారదుఁ డుబ్బె నట్టియెడఁ బౌండ్రాధీశ్వరుం డేకల
వ్యనృపానేక సహస్రసంఖ్య రథకట్యాహాస్తికాశ్వీయ సై

* నెల్లింటి లోన

న్య నిరూఢిం జతురంగ సైన్యముల సాహాయ్యంబుతో నాత్మ వా
హిను లేతేర మురారిపట్టణముపై నేఁగె న్నిశీథంబునన్. 23

ప్రతి : అనివన్; నారదుఁడు; ఉబ్బెన్ = సంతోషించెను; అట్టి + ఎడన్;పౌండ్ర + అధీశ్వరుండు = పౌండ్రరాజు; ఏకలవ్య నృప +అనేక సహస్ర సంఖ్య = ఏకలవ్యుఁడను రాజు యొక్కపెక్కువేల, యుద్ధమునకు వలయు; రథ కడ్యా(కట్యా) = తేరుల సమూహము; కడ్యా వ్యస్తపద ప్రయోగము లేదు. పూర్వరూపము, కట్యా; హాస్తిక =ఏనుఁగుల సమూహము; ఆశ్వీయ = గుఱ్ఱముల గుంపు (ఆశ్వము); సైన్య = కాల్బంటులు; నిరూఢిన్ = ఏర్పాటు గల; చతురంగ సైన్యముల సాహాయ్యంబుతోన్= నాలుగు అంగములు కల సేనల తోడ్పాటుతో;ఆత్మ వాహినులు = తనయొక్క సేనలును, కూడి రాఁగా; నిశీథంబునన్ = నడురేయి; మురారి పట్టణముపైన్ = కృష్ణుని నగరమైన ద్వారకను; ఏ గెన్ = ముట్టడించెను.

తా : ఆ మాటలను విని నారదుఁడు సంతోషించెను. పౌండ్రరాజు, ఏకలవ్యుఁడు అనెడి బోయరాజు యొక్కవేలకొలది యుద్ధమునకు వలయుతేర్లు, ఏనుఁగులు, గుఱ్ఱాలు, బంటులు,తోడ్పడుచుండఁగా, తన సైన్యములును, కూడి వచ్చుచుండఁగా, నడురేయి, ద్వారకను ముట్టడించెను.

వ్యా. సంఖ్యా, ఇదిసంస్కృతము.ఆకారాంతము. (స్త్రీలింగము) = లెక్క; సంఖ్య=యుద్ధము, (ఇది అకారాంత నపుంసక లింగము). ఈ పద్యమందు,"సంఖ్య" అని ఉన్నది. కనుక 'యుద్ధము' అను అర్థము గ్రహింపఁబడినది.

సీ. గర్జితానేకపోత్కట దానధారలు
జలరాశి రాణివాసముల గెలువ
వల్గదాజానేయవదన ఫేనము లంటి
నేల చుక్కలతోడి నింగిఁ దెగడ
సన్నద్ధపాదాత శస్త్రప్రభాపంక్తి
కరదీపరాజిపైఁ గాలు ద్రవ్వ
రథ్యాప్రణీపోత్థరవముచే గిరికోటి
పిడుగులనెఱవిడిఁ బిఱుఁదుకొనఁగ
గీ. వంధతమసంబు శ్వేతపింఛాతపత్ర
దీధితులు మ్రింగ వైజయంతీవితాన

మెడములకు నెడమీక మీఁ దెడముకొనఁగఁ
బరఁగి నడతెంచెఁ బౌండ్రభూపాలుసేన. 24

ప్రతి : గర్జిత+అనేకప= ఘీంకారము చేయు మదపుటేనుఁగులయొక్క ఉత్కట దానజలధారలు = అధికముగా స్రవించు మదజల ప్రవాహములు;రాణి వాసములన్ = అంతఃపురములందు కల; జలరాశిన్= క్రీడా సరస్సులలోని నీటిమొత్తమును గెలువన్ (అందుఁగల పుష్పలతాదుల పరిమళమును మించెను); అర్థాంతరము; మదజలధారలు, నదులైనవి; జలరాశి రాణివాసములన్ = సముద్రునిభార్యలగు నదులను;గెలువన్; ఏనుఁగుల మద జలధారలు నదులై లోకములోని నదులన్నింటిని మించెనని అతిశయోక్తి; వలత్ = అశ్వగతివిశేషము, దుముకుచున్న; ఆజానేయ= మేలు జాతి గుఱ్ఱముల యొక్క; వదనఫేనములు+అంటి =నోటినుండు(శ్రమవలన) జాఱు నురుగులు అంటుకొని; నేల; చుక్కల తోడి నింగిన్ = నక్షత్రములు కల ఆ కాశమును; తెగడన్= నిందింపఁగా (నురుగులు నేలను అధికముగా అంటుకొన్నవి); సన్నద్ధ పాదాత= యుద్ధమునకు సిద్ధమై యున్న కాల్బంటుల యొక్క; శస్త్ర ప్రభాపంక్తి = ఆయుధముల నుండి వెలువడు మెఱుఁగుల వరుసలు; కరదీపరాజిపైన్ = (రాత్రిపూట భటులు ధరించు) చేతిదివ్వెల వెలుగుల వరుసలతో; కాలు+త్రవ్వన్= కారణము లేకయే కయ్యమునకు ముందంజవేయఁగా; రథ్యాప్రణీప (పాఠాం, ప్రతీక) = రథముల (భాగముల) మొత్తముచే చేయఁబడి; ఉద్ధరవముచే= వెల్వడిన శబ్దముచే(రథగమన వేగముచే); గిరికోటి = పర్వత సమూహము; పిడుగుల నెఱవిడిన్ = పిడుగులనిండు పరాక్రమమును; పిఱుఁదు కొనఁగన్ = వెంబడింపఁగా (శ.ర); కొండకొనల వఱకు వ్యాపించిన ధ్వనుల సాయముతో, కొండల సమూహము పిడుగుల సవ్వడిని తొలఁగించినది. అర్థాంతరము, పిడుగుల సవ్వడి అని (గిరికోటి) వెనుకకు మరలినది. అంధతమసంబున్ = కన్నులకు కానరాని చిమ్మచీఁకటిని; ఆతపత్ర దీధితులు = తెల్లని కుచ్చులు గల గొడుగుల వెలుఁగులు; మ్రింగన్ = అణఁచి వేయఁగా; వైజయంతీ వితానము = పతాకముల మొత్తము; ఎడములకున్ =ఖాళీ స్థలములకు; ఎడము+ఈక= అవకాశ మియ్యక; ఎడముకొనఁగన్ = కప్పి వేయఁగా; పౌండ్ర భూపాలు సేన; పరఁగి= పయనమై; నడతెంచెన్ = నడచెను.

పాఠాం. ప్రతీక = తేరుల భాగములు అనఁగా, చక్రములు, ఇరుసులు మొదలగునవి.

తా: ఘీంకరించుచున్న ఏనుఁగులు స్రవింపఁజేయు మదజల సువాసనలు రాణివాసములలో గల క్రీడా సరస్సులలోని పుష్పలతాదుల పరిమళమునకు పరాజయమును కల్గించినవి. వివిధ గమన రీతుల వలన గుఱ్ఱములనుండి వెల్వడిన నురుగులు నేలపై చుక్కలై విరివిగా పడినవి. అవి, ఆకాశమందలి నక్షత్రముల నిగనిగను తిరస్కరించినవి. కాల్బంటుల ఆయుధములనుండి వెల్వడు మెఱుఁగుల వెలుఁగులు

సేవకులచేతి దివ్వెల దీప్తితో కయ్యమాడినవి. రథములయొక్క వివిధ భాగముల నుండి, గమనవేగముచే కలిగిన శబ్దము పర్వత శిఖరములను చేరి, వానిపై పడుచున్న పిడుగుల సవ్వడిని పాఱద్రోలినది. (అచట చేరిన శబ్దమును పిడుగుల సవ్వడి అని గిరికోటి భయపడి వెనుకకు మరలినది). నలుగడల వ్యాపించిన చిమ్మచీఁకటిని, తెల్లనికుచ్చుల గొడుగుల తళతళలు. మాయముచేసినవి. పతాకముల మొత్తములు చోటియ్యక, దట్టముగా దట్టించు కొనుచుండఁగా, పౌండ్ర రాజ సైన్యము ముందునకు నడచెను.

నానా. రథ్యా = సం. ఆ.స్త్రీ. రథసమూహము, మార్గము, రాజమార్గము.రథ్య = అకారాంత పుంలింగము, రథమునులాగు గుఱ్ఱము మొదలగునవి.

అలం :అతిశయోక్తి.

చం. పరి గొనివచ్చి యాదవులపట్టణ మొక్కటఁ జుట్టుముట్టి యా
హరిపొడగానరాఁ డలహలాయుధుఁ డెక్కడవోయె సాత్యకిం.
బొరిగొనుఁ డంచు నార్పులును బొబ్బలు నింగిఁ జెలంగఁ బౌండ్ర భూ
వరభటకోటితూర్పుదెసవాకిట భేరులు మ్రోసిడాసినన్. 25

తా : పౌండ్రరాజుయొక్క సైన్య సమూహము, బారులు తీర్చి ఒక్కసారి, ద్వారకను నలువైపుల చుట్టుకొని "హరి కానరాఁడే? ఆ బలరాముఁడు ఎక్కడికి పోయెను? సాత్యకిని చంపుఁడు" అనుచు, అఱుపులు కేకలు, ఆకాశమును అంటుచుండఁగా తూర్పు దిక్కున నుండువాకిటిని భేరుల మ్రోఁతలతో సమీపింపఁగా (మీఁది పద్యముతో).

మ. కరదీపంబులతోడ సామజతురంగస్యంద నౌఘంబుతో
వరవీరావలితో బహు ప్రహరణవ్యాపారసన్నాహ సు
స్థిరతన్ సాత్యకియున్ హలాయుధుఁడు హార్దిక్యుండు లోనైన సం
గర రత్నాకరకర్ణధారులు గడంక న్వచ్చి రచ్చోటికిన్. 26

అర్థ : సంగరరత్నాకర కర్ణధారులు= సమరము అనెడి సముద్రమును దాఁటించు, (యోధవరులు) ఓడ నడపువారు.

తా: వెలుఁగుచున్న చేతి దివ్వెలతో, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు వాని సమూహముతో శ్రేష్ఠులైన వీరుల మొత్తముతో, వివిధములైన ఆయుధ ప్రయోగముల ప్రయత్నము యొక్క నిశ్చలత్వముతో, సాత్యకి బలరాముఁడు

హార్దిక్యుఁడు(కృతవర్మ) మున్నగు సమరము అనెడి సముద్రమును దాఁటించు, యోధులు అనెడి ఓడ నడపువారు. ఆ తూర్పు వాకిటివైపు ఉత్సాహముతో, శత్రువులను ఎదుర్కొనుటకు వచ్చిరి.

వ్యా. స్యందన + ఓఘము > స్యందనౌఘము, వృద్ధిసంధి.

అలం. రూపకము, సంగర రత్నాకర కర్ణధారులు.

వ. ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సందడికయ్యంబునం గదిసి కరులు గరులను దేరులు దేరులను దురంగంబులు దురంగంబులను బదాతులు పదాతులనుం దలపడి సందడి కయ్యం బయ్యె నయ్యెడఁ గత్తివాతియమ్ములం గత్తరించినం దుత్తుమురు లగు కత్తళంబులును ఘనగదాఘాతంబులం జిద్రుప లైన సీసకంబులును ముసలప్రహారంబులం బఱియ లైన భటకర్పరంబులును నిశితహేతివిదారణంబుల ఖండఖండంబు లైన శుండాల శుండాదండంబులును మొక్కలం బులం బరశుధారలం జెక్కిన నిక్కడక్కడం బడిన పక్కెరలును బ్రచండభిండివాలసంక్రీడనంబులం గలయం గ్రుమ్మెడు వడ్డ రథాంగంబులును దుర్దాంత కుంతసంతాడనంబుల నింతింతలు తునియ లైన కరిదంతంబులును నరవాయి గొనక సురియలం జెరివినం దొరుఁగు రక్తంబుల ను నెట్టుకొని సెలకట్టియల వైచిన నిట్టట్టు గదలక తెట్టెలు గొనం గూలిన కాలుబలంబులును గాలుబలంబులపైఁ బైకొనక యెక్కి పటవణివిప్పలేక తిరుగ వచ్చినం జొచ్చి చ క్కడఁచుటయుం జాఁపకట్టువడిన ఘోటకంబులక్రింద మిలమిల మెలంగెడు రావుతులును రావుతుల మోహరంబునకు నోహటించినం బోనీక కరిఘటలం బురికొల్పిన *రాగవాగల నై రావంబునం దురగఘట్టంబు నిల్పి తెల్పికొని మగుడంబడి యుడిదంబులు డుస్సి వ్రేసినం బూసినచందంబున నేలం

* రాగె వాగె

గూలినయేనుంగు పీనుంగులును, నేనుంగుల పీనుంగుల దిగ నుఱికి
పాఱు మావంతులును మావంతులవిన్నాణంబులం బొంగి మ్రొగ్గ
గజంబులగములపై యుగ్యంబుల పగ్గంబుల వదలించి పోయిన దియ
వీధిగాఁ దఱియ నుఱికిన యరదంబులకు ద్విరదంబు లెదుర్కొగ్గించి
కడనొగలు వట్టి కరంబులం ద్రిప్పి వ్రేయించిన సారథిరథ్యసహితంబు
గాఁ జదిసిన రథికులును రథికుల కరలాఘవంబునం బరపు
శరపరంపరచేతం దొరుఁగురుధిరంబులు కాలువలు గట్టం గట్టలు
గట్టి చూచుసైనికులును సైనికులం బేరుకొని వాసి కెక్కించి పురికొల్పు
కోలల వారి యెలుంగులును జెలంగు సింహనాదంబులును
బటుపటహభేరీ భాంకారంబులును బుంఖానుపుంఖశంఖనాదంబులును
బిరుద కాహళ కోలాహలంబులును బలంబులకుఁ జలంబులఁ బెనుప
నినుపపాడి రాల నొండొరుల యలుఁగు లలుఁగులఁ బడవ్రేసియు వీడం
బోక డాసియుఁ బోకు పో కని యదలించియుఁ బంతంబులు
ముదలించియుఁ జిలుపచిలుప నెత్తురుల జొత్తిలిన నేలం గాలూఁద
నేరక జీరువాఱియు మూర్ఛల మునింగి తేఱియుఁ గైదువుల
ఘటించియు నెడగొని చొరవచ్చిన దట్టించియు నంగంబుల హత్తియు
నెమ్ములనలియ నొత్తియు సుభటసందోహంబులు గీలుబొమ్మల
చందంబున మెలఁగాడు తెఱంగున *జొత్తు కడతలిలకైవడి సోమంబుల
పోలిక సంజీవన విధిజ్ఞులవిధంబున నసువులదెసకు శంకింపక పోరు
నవసరంబున. 27

ప్రతి : ఈ విధంబునన్ = ఈరీతిగా; ఉభయ బలంబులున్ = ఇరుపక్షముల సేనలును; తలపడి = ఎదుర్కొని; సందడికయ్యంబునన్= సంకుల సమరమందు; ఒకరినిమతొకరు కలిసి అందఱును దట్టముగచేరి చేయునట్టి పోరు; కదిసి = సమీపించి; కరులు .కరులను = ఏనుఁగులు ఏనుఁగులను; తేరులు, తేరులను; తురంగంబులు తురంగంబులను = గుఱ్ఱములు గుఱ్ఱములను, పదాతులు పదాతులనున్ = కాల్బంటులు కాల్బంటులను తలపడి = తాఁకి; కత్తి+ వాయి + అమ్ములన్ = వెడల్పైన అంచుగల అర్ధ చంద్ర బాణములచే;

---

* జొత్తు కడ లీఁతలకైవడి

కత్తరించినన్ = తెగఁగొట్టఁగా;తుమురు+తుమురులు +అగుచున్న = చిన్న చిన్న ముక్కలు అగుచున్న; కత్తళంబుంలును = మేని కవచములును; ఘన గదా ఘాతంబులన్ = పెద్దగదల దెబ్బలచే; చిద్రుపలు + ఐన = మిక్కిలి చిన్న ముక్కలైన; సీసకంబులును =కిరీటములును; ముసల ప్రహారంబులన్= రోకళ్లతాకుళ్లచే; పటియ లు+ఐన= బ్రద్దలైన; భట కర్పరంబులును = బంటుల తల పుఱ్ఱెలును; నిశిత హేతి విదారణంబులన్ = వాఁడియైన కత్తులచే చీల్చుట వలన; ఖండ ఖండంబులైన = పెక్కు తునుకలైన; శుండాల = ఏనుఁగుల; శుండా దండంబులును = దుడ్డుకఱ్ఱలవంటి తొండములును; మొక్కలంబులన్ = కఠినములైన వీరవచనములు పల్కుచ్చుపరశుధారలన్=గొడ్డళ్లఅంచులతో; చెక్కినన్; ఇక్కడ+అక్కడన్ పడిన; పక్కెరలును= అశ్వాదుల అంగీలు (అంగములను రక్షించునట్టివి); ప్రచండ భిండివాల సంక్రీడనంబులన్ = మిక్కిలివాఁడియైన విడిచివాటు గుదియల చక్కని నేర్పుతో కూడిన విలాసవంతములైన ప్రయోగములతో; కలయన్ = అంతటను; క్రుమ్మీడు + పడ్డ = పోట్లను పొందిన; రథాంగంబులును = తేరుల చక్రములు, ఇతర భాగములును; దుర్దాంత = ఎదిరించుటకు వీలు లేనట్టి; కుంత = ఈఁటెల యొక్క; సంతాడనంబులన్ = మంచిదెబ్బలచే; ఇంత+ఇంతలు=చాల చిన్నవైన; తునియలైన= ముక్కలైన; కరిదంతంబులును= ఏనుఁగులదంతంబులును; అరవాయి కొనకసురియల చెరివివన్= అధైర్య పడక, వెనుదీయక (సంకోచము చెందక) చురకత్తులతో గ్రుచ్చగా; తొరుఁగు రక్తంబులను = ప్రవించు నెత్తురును; నెట్టుకొని = ముందుకు ధైర్యముతో త్రోయుచు వెడలి; సెలకట్టియలన్= బాణములను; వైచినన్; ఇట్టు+అట్టు = ఈ వైపుగాని, ఆ వైపుగాని అనఁగా ఏ దిక్కునకున్, కదలక = కదలుటకు వీలుపడక; తెట్టెలు కొనన్+కూలిన = రాశులుగా ఏర్పడి నేలపై పడిన; కాలు బలంబులును; కాలుబలంబులపైన్;పై కొనక = దాఁటలేక ఎక్కి; పటవణిన్= ఆ (తెట్టెల) వ్యాపనములను; విప్పలేక =విడదీయలేక (వానిని తొలఁగించి దారిచేసికొన లేక); పాఠాం. పటవణింపలేక = వ్యాపింపలేక; తిరుగ వచ్చినన్ = మరలుటకు ప్రయత్నింపఁగా; చొచ్చి;చక్క+అడఁచుటయున్ = బాగుగా కొట్టుటచే;చాఁప కట్టు పడిన ఘోటకంబుల క్రిందన్ = చాఁపపఱచినట్లు నేలపై పడిన గుఱ్ఱముల క్రింద, మిలమిల మెలంగెడు = మిలమిల అనెడిశబ్దముతో కదలుచున్న (గిజగిజ లాడు); రావుతులును = గుఱ్ఱముల నెక్కిన వారును (రావుత్తు,రౌత్తు,రూపాం); రావుతుల; మోహరంబునకున్ = వ్యూహమునకు; ఓహటించినన్= వెనుదీయఁగా; పోనీక; కరిఘటలన్= ఏనుఁగుల మొత్తమును; పురికొల్పినన్= ప్రోత్సహింపఁగా; రాగవాగల = క్లేశమును కలిగించు నోటి కళ్లెమునకు అమర్చెడు పగ్గముల (ఇదివావిళ్ళ వారి పాఠము) రూపాం. వాగె, వాగియ;

పాఠాం. రాగె = స్వారి చేయు గుఱ్ఱమునకు ఇరువైపులపాదములు పెట్టుకొనుటకు ఏర్పఱచిన వలయము(వే.వేం.), నైరాస్యంబునన్ (నైరావంబునకు వే. వే. సవరణ) = నిరాసమనఁగా

పాఱవేయుట, వదలుట, చేతిలోని పగ్గములను, పాదములను పెట్టుకొను వలయములను (రికాబులను) వదలివేయుచు; తురగ దట్టంబు= గుఱ్ఱముల గుంపును; నిల్పి, తెల్పికొని =ఎచ్చరించి; మగుడన్ పడి; అడిదంబులు = కత్తులు; డుస్సి వ్రేసినన్ = దుయ్యు, రూపాం : డుయ్యు, డూయు, కొట్టఁగా; పూసిన చందంబునన్ = మెత్తినట్లు; నేలన్‌కూలిన ఏనుంగు పీనుంగులును; ఏనుంగు పీనుంగులన్; దిగన్+ఉఱికి = పైనుండి క్రిందికి దుమికి; పాఱు = పరుగిడిపోవు; మావంతులును = మావటీంద్రును;మావంతుల విన్నాణంబులన్ = ఏనుఁగుల నడపు వారి నేర్పరితనమునకు పొంగి; మ్రొగ్గు = మోకరిల్లు; గజంబుల గములపై; యుగ్యంబుల = గుఱ్ఱముల; పగ్గంబుల = నోటికి కళ్లెమునకు కట్టిన త్రాళ్లను; వదలించి= విడిచిపెట్టి, పోయినదియు = ఎటుపోయిన అది; వీధికాన్ =వీధిగా త్రోవగా; తడియన్ = దాఁటుటకై; ఉఱికిన అరదంబులకు = వేగముగా పోవు తేరులకు; ఎదురు+ఒగ్గించి = ఎదుట నిల్పి; కడ నాగలు= నాగటియొక్క చివఱిభాగమును; పట్టి = (చేతులతో) పట్టుకొని; కరంబులన్ = తొండంబులతో; త్రిప్పి వ్రేయించినన్ = తలక్రిందులగునట్లు కొట్టఁగా; సారథి రథ్య సహితంబుగాన్ = తేరునడపువారు గుఱ్ఱములతో కూడ; చదిసిన రథికులును= నలిఁగిపోయిన (రథముపైనుండి) యుద్ధము చేయువీరులును, రథికుల కరలాఘవంబునన్ =ఆ రథికుల చేతుల నేర్పుచే; పరపు = ప్రవహింపఁజేయఁబడు; శరపరంపరల చేతన్ = బాణములవరుసలచే; తొరుఁగు = ప్రవించు; రుధిరంబులు = నెత్తుటిధారలు, కాలువలు కట్టన్; కట్టలు కట్టి = గుమిగూడి; చూచు సైనికులును; సైనికులన్; పేరుకొని = పేర్లతో పిలిచి; వాసికి ఎక్కించి = వారి నేర్పును పొగడి; పురికొల్పు; కోలలవారి ఎలుంగులును= వేత్రదండములను ధరించు వారి కంఠస్వరములున్; చెలంగు=ప్రవర్తిల్లునట్టి;సింహనాదములు = వీరుల గొప్పధ్వనులును; పటు పటహ భేరీ భాంకాంబులును = వివిధములైన ధ్వని విశేషములను కలిగిన తప్పెటలు ఢంకా మొదలైన వాద్యముల యొక్క "భాం""భాం" అనెడి మ్రోఁతలును; పుంఖ+అనుపుంఖ శంఖనాదంబులును = ఒక దాని తర్వాత మఱొకటిగా ఎడతెగక వెల్వడు శంఖముల ధ్వనులున్; బిరుద కాహళ కోలాహలంబులును = ఆయా పేర్లు గల గొప్ప వాద్య విశేషములయొక్క మిక్కిలి పెద్దవైన శబ్దములును; బలంబులకున్ = సైనికులకు; చలంబులన్= స్పర్ధతో చేయు ద్వేషమును; పెనుపన్ = పెంచుటకై; ఇనుపపాడి రాలన్; ఒండొరుల అలుఁగులు = బాణములను; అలుఁగులన్ = బాణములతో, పడవ్రేసియున్ = పడఁగొట్టియు; వీడంబోక =తడబడక; డాసియున్= సమీపించియును, పోకు పోకు అని అదలించియున్ = బెదరించియును; పంతంబులు ముదలించియున్ = ప్రతినలు, అడిగియును; చిలుప చిలుప నెత్తురుల = కొంచెము కొంచెముగా వెల్వడి నిండిన నెత్తుటిచే; జొత్తిలిన = ఎఱ్ఱఁదనమును పొందిన; నేలన్; కాలు+ఊఁద నేరక = కాళ్లను మోపలేక; చీరు వాఱియున్ = చీల్చఁబడియును; పాఠాం. జేఱువాఱియు= తొలఁగియు; మూర్ఛలన్ మునింగి; తేఱి = తెలివిని పొంది; కైదువుల

ఘటించియున్ = కత్తులను పట్టుకొనియును; ఎడగొని= అవకాశమును చూచి; చొరవచ్చినన్ = ముందునకు పోవుటకు వీలగుచో; దట్టించియున్ = అదల్చియును; అంగంబుల హత్తియున్ = మేని భాగములతో ఒత్తియును; ఎమ్ములన్ నలియన్ = ఎముకలను నలఁగునట్లు; ఒత్తియున్= నొక్కియును; సుభట సందోహంబులు = యోధాగ్రేసరుల సమూహములు; కీలు బొమ్మల చందంబున = మరబొమ్మల వలె; మెలఁగాడు తెఱంగునన్ = తిరుగునట్లు, జొత్తు కడఁతుల కైవడి = ఎఱ్ఱని గంధర్వ మృగముల వలె పాఠాం. జొత్తు కడలి ఈఁతలకైవడి = ఎఱ్ఱని (నెత్తుటి) సముద్రములో ఈఁతలు కొట్టుటను వలె(వే.వేం.) సోమంబులపోలిక = సోమము అనెడిపేర్లు గల అగ్నుల వలె; సంజీవన విధిజ్ఞ విధంబునన్ = బ్రతికించు విధమును, తెలిసినవారి వలెను; అసువుల దెసకున్ = ప్రాణముల విషయమున; శంకింపక = (చావు కలుగునేమో అని) సందేహింపక, చచ్చుటకు సిద్ధపడి; పోరు అవసరంబునన్ = పోరాటము సాగించు సమయమందు.

తా : ఇరుపక్షముల సైన్యములు ఎదుర్కొనఁగా దొమ్మి యుద్ధము జరిగెను. ఏనుఁగులు, తేరులు, గుఱ్ఱములు, కాల్బంటులు పరస్పరము మార్కొనిరి. అర్ధచంద్రబాణముల ప్రయోగముచే మేని కవచములు ముక్కలైనవి. పెద్దగదల దెబ్బలచే కిరీటములు చిన్న తునుకలైనవి. రోకళ్ల తాకుళ్ళకు తలపుఱ్ఱెలు బ్రద్దలైనవి. కత్తులచే చీల్చుటచే కండలు కండలుగా ఏనుఁగుల తొండములు తుంటలైనవి. గొడ్డళ్ల పోట్లచే గుఱ్ఱములపై రక్షకములైన అంగీలు, చెల్లాచెదరైనవి. విడిచివాటు గుదియచే రథముల చక్రములు ఇతర భాగములు అన్నియు విడివడినవి. ఈఁటెల పొడుపులచే, ఏనుఁగుల దంతములు చిన్న తునుకలైనవి. చురకత్తులను గ్రుచ్చఁగా, నెత్తుటి ధారలు వెలువడు చున్నను పౌరుషముతో ముందునకు పోవుచుండఁగా, బాణములు తమపై పడినను, ఏ వైపునకు గాని కదలలేక, నేలపై గుంపులు గుంపులుగా పదాతులు కూలుచుండిరి. ఆ కాల్బంటుల దాఁటి పోవుటకు వీలులేక, వానిపై ఎక్కి దారిలేక వెనుతిరుగఁగా వారిపైకి దుమికి, వారిని వారి గుఱ్ఱముల క్రిందనే పడునట్లు చేయఁగా ఆ కలకలములో గిజగిజ లాడుచు రౌతులు మూలుగుచుండిరి. తప్పించుకొని పోవుటకు ప్రయత్నించిన రౌతులపై ఏనుఁగుల దండును పురి కొల్పఁగా, వారు గుఱ్ఱపు పగ్గములన్, కాళ్ళను పదిలపఱచుకొను ఇనుప వలయములనుండి కాళ్లను, వెలుపలికి తీసివేయుచు. గుఱ్ఱముల గుంపును గట్టిగా నిల్పి వానిని ఎచ్చరించి తిరుగఁబడఁజేసి, ఏనుఁగుల శరీరములలో కత్తులు నాటుకొనునట్లు వేయఁగా ఏనుఁగులు నేలపై మెత్తినట్లు పీనుఁగులై కూలినవి. వాని పై నుండి క్రిందికి దుమికి మావటీంద్రులు పరుగిడిపోవుచుండిరి. మావటివారల నేర్పునకు

పొంగి ఏనుఁగులు మోకరిల్లుచుండఁగా, తేరులకు కట్టిన గుఱ్ఱముల నోటి పగ్గములను సడలింపఁగా, అవి విచ్చలవిడిగా ఏనుఁగులను దాఁటుటకు ప్రయత్నించినవి. మావటీంద్రు అట్లు వేగముగా వచ్చు తేరులకు ఎదురుగా ఏనుఁగులను నిల్పి తేరు నొగళ్లను చేతులతో పట్టుకొని; ఏనుఁగు తొండములచే తేరులను తలక్రింద లగునట్లు చేసిరి. అప్పుడు తేరునడపువారు, గుఱ్ఱములు, రథికులు, తేరుల క్రింద పడి నలిఁగి పోయిరి. కొందఱు రథికులు తమనేర్పుతో బాణపరంపరలను వేయఁగా సైనికుల శరీరములనుండి రక్తము కాలువలై ప్రవహించుచుండఁగా కొందఱు సైనికులు గుమిగూడి ఆ కాలువలను చూచుచుండిరి. సైనికులను పేర్లతో పిలిచి పురికొల్పు వేత్రధారుల ధ్వనులు, వీరుల సింహనాదములు, వివిధ వాద్య విశేషముల మ్రోఁతలు ఎడతెగని శంఖారావములు. పెద్దవైన వాద్యముల భయంకరమగు ఆర్భటములు, సైనికులను పట్టుదలను, ద్వేషమును పెంచినవి. ఇనుపపాడి రాలునట్లు బాణములను బాణములతో పడఁగొట్టిరి. తడఁబడక సైనికులను "పాఱిపోవలదు" అని బెదరించి, పంతములు పలికి పోరాడిరి. అపుడు మందముగా స్రవించిన రక్తముతో, ఎఱ్ఱఁదనమును పొందిన నేలపై కాళ్లను గట్టిగా నిల్పలేక పోవుటచే సైనికులు చీల్పఁబడుచుండిరి. కొందఱు, యుద్ధమును మాని తొలఁగి పోయి మూర్ఛను పొంది పడిపోయిరి. తేఱుకొని కొందఱు కత్తులను పట్టుకొని అవకాశమును చూచి ముందునకు సాగుచుండిరి. అట్టి వారిని అడ్డగించి, వారి అంగములను నొక్కి, ఎముకలను నలిఁగి పోవునట్లు అదుముచుండిరి. గొప్ప వీరులు మరబొమ్మలవలె గిర గిర తిరుగుచు, (ఎఱ్ఱని గంధర్వమృగములవలె) నెత్తుటి నీటిలో ఈఁతలు కొట్టినట్లు, సోమాగ్నులవలె, పోయిన ప్రాణములను తెప్పించు జ్ఞానులవలె, తమ ప్రాణముల యెడ ఆశను వదలిన వారై యుద్ధము చేయు చుండఁగా.

విశే. సోమము : అగ్నులు ఇరువదేడు విధములు. అందులో సోమాగ్ని యొకటి.

"సోమలత"కు ఆంగ్లనామము (Moon plant) ఇది మహావిచిత్రమైనది. స్వర్ణ ఛ్ఛాయకలది. చంద్రుని వృద్ధి క్షయములకు సంబంధించి రోజునకు ఒక ఆకును పొందును. మరల రోజునకు ఒక ఆకును రాల్చును.

## - : ఏకలవ్యుఁడు యాదవసైన్యంబు దైన్యంబు నొందించుట : -

శా. వీరాగ్రేసరుఁ డేకలవ్యుఁడు ధనుర్విద్యానవద్యుండు దో
స్సారఖ్యాతి నరాతిరాజులరణోత్సాహంబు దూరంబు గాఁ

పారావారవిహార మందరగిరి ప్రారంభజృంభోద్ధతిన్
దే రొప్పారఁగఁ బేరువాడి కలఁచెన్ ధీరోద్ధతానీకమున్. 28

ప్రతి : వీర+అగ్రేసరుఁడు = యోధులలో మొదటి వాఁడు; ధనుస్ +విద్యా+అనవద్యుండు =విలువిద్యయందు గొప్పవాఁడు; ఏకలవ్యుఁడు; దోస్ +సారఖ్యాతిన్ = ప్రసిద్ధిపొందిన భుజబలముచే; అరాతిరాజుల శత్రురాజుల యొక్క; రణ+ఉత్సాహము = యుద్ధమందుఁగల ప్రయత్నమును; దూరంబుగాన్ = తొలఁగునట్లు; పారావార విహార =సముద్రమందు స్వేచ్ఛగా తిరుగుటకై; మందరగిరి ప్రారంభ జృంభ+ఉద్ధతిన్ =మందర పర్వతము ప్రారంభించు వేగిరపాటు యొక్క గర్వముతో (అతిశయముతో) తేరు+ఒప్పారఁగన్ = తేరు ప్రకాశించుచుండఁగా; ధీర+ఉద్ధత+అనీకమున్ = ధైర్యముతో, ఉద్రేకించుచున్న సైన్యమును; పేరువాడి = తన పేరును చాటుచు, (అతిశయముగా ప్రవర్తించుచు); కలఁచెను = కలఁత నొందించెను.

తా : యోధులలో మేటి, విలువిద్యలో ప్రవీణుఁడు, అయిన ఏకలవ్యుఁడు, పేరుపొందిన తన భుజబలముతో సముద్రమందు మందర పర్వతము ఎట్లు స్వేచ్ఛగా తిరుగుటకు మొదలిడునో అట్టి అతిశయముతో ధైర్యముతో ఎదుర్కొనుచున్న శత్రు రాజుల సేనను అధికోత్సాహముతో కలఁత నొందించెను.

అలం : ఉపమ. పారావారవిహారమందరగిరి ప్రారంభ జృంభోద్ధతిన్ కలఁచెన్.

సీ. అయిదు బాణంబులు హార్దిక్యునొడల మా
ర్గణదశకంబు సారణునిమేన
సాయకపంచవింశతి శుక్రప్రభు నిశి
తప్రదరంబుల దశక ముద్ధ
వాచార్యు గాత్రంబునందు సప్తశరంబు
లానకదుందుభి యంగకమున
నాశుగ పంచకం బక్రూరు కాయంబు
నం దెనుబదితొమ్మి దమ్ము లుగ్ర

గీ. సేను దేహంబునను గ్రుచ్చి చెలఁగి హస్త
లాఘవము వింతగా నేకలవ్యుఁ డెచట

నెచట నున్నాఁడు సాత్యకి యెందుఁబోయె
హలధరుం డని యదలించి యంతఁ బోక. 29

తా : హార్దిక్యుని (కృతవర్మ)శరీరముపై అయిదు సారణునిపై పది, శుకప్రభునిపై ఇరువది అయిదు, ఉద్ధవునిపై పది, వసుదేవుని పై డెబ్బది, అక్రూరునిపై అయిదు, ఉగ్రసేనునిపై ఎనుబదితొమ్మిది బాణములను ఏకలవ్యుఁడు ప్రయోగించి వారి శరీరములలో వానిని నాటునట్లు తనచేతి నేర్పును వింతగా ప్రదర్శించెను. పిమ్మట అతఁడు "సాత్యకి ఎక్కడ? ఎక్కడున్నాఁడు? ఎచ్చటికి బలరాముఁడు వెళ్లినాఁడు?" అని బెదరించుచు, విజృంభించుచుండెను. అంతటితో ఆఁగక (మీఁది పద్యముతో).

విశే : బాణములకు పర్యాయ పదాలు: మార్గణము, సాయకము, ప్రదరము, ఆశుగము, అమ్ము అట్లే శరీరమునకు పర్యాయ పదాలు: ఒడలు, మేను, గాత్రము, అంగకము, కాయము, దేహము.

హార్దిక్యుఁడు: యాదవరాజు, హృదికుని పుత్రుఁడు, కృతవర్మ.

సారణుఁడు : రోహిణీ వసుదేవుల కుమారుఁడు, ఇతని సోదరులు బలరాముఁడు, గదుఁడు.

ఉద్ధవాచార్యుఁడు : వృష్ణి వంశమువాఁడు. కృష్ణునకు మిత్రుఁడు. యాదవులు అందఱును హతులైనను, ఇతఁడు మాత్రము జీవించి బదరికావనమునకు ఏగెను. శ్రీ మద్భాగవతమున, నలుబది ఆఱవ అధ్యాయములో మొదటి శ్లోకమందు, ఉద్ధవుని వర్ణనమున్నది. బృహస్పతికి శిష్యుఁడు. బుద్ధిమంతుఁడు ఇతఁడే కృష్ణతత్త్వమును గోపికలకు బోధించెను.

ఆనకదుందుభి : వసుదేవుఁడు. ఇతని జననకాలమున దేవతలు ఆనకము దుందుభి అనెడి వాద్యముల ధ్వనులను చేసిరి. కనుక ఈ పేరు వచ్చినది. ఇతఁడు, కంసుని పిన తండ్రియైన దేవకుని తనయ, దేవకిని, మఱియు ఆమె తోబుట్టువులు ఆఱుగురిని పరిణయమాడెను. వారేగాక, రోహిణి, కౌసల్య పౌరవి అనువారును ఇతనికి భార్యలు.

అక్రూరుఁడు: కంసుని నగరమైన మధురలో నివసించెడివాఁడు. బలరామకృష్ణులను మధురకు కంసుని కోరిక మేరకు పిలుచుకొని వచ్చిన కృష్ణభక్తుఁడు.

ఉగ్రసేనుఁడు : ఇతని తండ్రి పేరు ఆహుకుఁడు. ఉగ్రసేనుని పుత్రుఁడే కంసుఁడు.

ద్రవిళుఁడను దానవుఁడు, ఉగ్రసేనరూపమును ధరించి, కంసుని తల్లితో రమించుటచే జన్మించిన వాఁడగుటచే రాక్షస లక్షణము లుండెను. ఉగ్రసేనుని బంధించి తానే రాజయ్యెను. కృష్ణుఁడు కంసుని వధించి ఉగ్రసేనుని చెఱనుండి విడిపించి అతనికి పట్టము కట్టెను.

మ. సమదానేకపచక్రవర్తి నవకాసారంబులో నాడు చం
దము చూపం గరదీపికానికరముం దట్టించి రాజన్య సై
న్యము చెల్లాచెదరయ్యె మూఁకలగుచో నవ్వీరుఁ డస్త్రంబులం
జమరం జొచ్చిన నొచ్చి విచ్చి పఱచెన్ జత్రూతిపై పోఁక లై. 30

ప్రతి : సమద+ అనేకప చక్రవర్తి = మదించిన ఏనుఁగుల రారాజు; నవ (వన) కాసారంబులోన్ = క్రొత్తదైన సరస్సులో;ఆడు చంధము చూపన్; కరదీపికా నికరమున్ = చేతి దివ్వెల సముదయమును; దట్టించి = అదలించి; రాజన్యసైన్యము = యాదవ రాజుల సేన;·చెల్లా చెదరు+ అయ్యెన్= బాగుగా చెదరిపోయెను; మూఁకలు +అగుచోన్ = మరల గుంపులు గుంపులుగా కూడినచో; ఆ+వీరుఁడు; అస్త్రంబులన్ = ఆయుధములతో;చమరన్+ చొచ్చినన్ = మోఁదు చుండఁగా; నొచ్చి =బాధను పొందిన వారై; విచ్చి = విడివడి; చత్రూతిపై = మెత్తని బండపై నుండి(జారునట్టి);పోకలై = గుండ్రని వక్కలై వక్కలు దొర్లినట్లని భావము. అర్ధబిందువున్నచో వక్క అని అర్థము. లేనిచో 'పోవు' కృదంతము; పోక = పోవుట (అర్థము).

తా : నూతన మై (అడవిలో అందముగా నుండు వికసించిన పద్మములు నిండుగా నుండు) కొలనులో ఏనుఁగుల చక్రవర్తి ఉత్సాహముతో విహరించిన విధమున ఏకలవ్యుఁడు యాదవ రాజుల యొక్క చేతి దివ్వెలు ధరించిన సైన్యమును బెదరించి చెదరఁగొట్టెను. అవి గుంపులు గుంపులుగా గుమిగూడి తలపడఁగా వారిని బాగుగా మోఁదెను. ఇట్లు బాధపడిన సైన్యము వేఱుపడి బండమీఁద నుండి దొర్లు వక్కల ముక్కలై కదన రంగము నుండి కదలి పోయినది.

అలం : ఉపమ. నొచ్చి విచ్చి పఱచెన్ జత్రూతిపై పోఁకలై.

(వి) పోఁక, (ప్ర) పూగము.

కం. సలి సప్పుడు లే కమ్మెయిఁ
దొలఁగిన సైన్యంబు లెల్లఁ దొడిఁ దొడి నూరం

గలయఁబడి కోటదిక్కులఁ
బలుకక గుజగుజలు వోయెఁ బౌరులు బెగడన్. 31

అర్థ : సలి = సందడి(శ.ర); చప్పుడు = ధ్వని; తొడిన్ +తొడిన్ = త్వర, త్వరగా; బెగడన్ = భయపడఁగా; గుజగుజలు +పోయెన్ =సంకటపడిరి, గుసగుసలాడిరి.

తా : ఎట్టి సందడియు, శబ్దమును చేయక, యాదవ సైన్యము మిక్కిలి వేగముతో ఊరిలో కలిసికొని, పౌరులు భయపడుచుండఁగా కోట వైపు మౌనముగా, సంకట పడుచు, గుసగుసలాడుచు, ముందునకు నడిచిరి.

వ్యా. లేక+అమ్మెయి లేకమ్మెయి, సూ. అత్తునకు సంధి బహుళంబుగానగు. సంధి, బాల -4. లేక అసమాపక వ్యతిరేకార్థక క్రియ.

ఆ+మెయి అమ్మెయి. త్రిక సమాస సంధి.

విశే సడి, సలి చడి, సద్దు - ఏకార్థకములు. ద్విరుక్తిచే అధికమని భావము.

శా. ఈచందంబున నేకలవ్యువిజయం బింతంత గా కున్న వీ
రాచారంబు నుతించి పౌండ్రక విభుండాత్మీయులం జూచి చే
వీచెం "ద్రోయుఁడు కోట మేడలు పడ ద్రవ్వేయుండు డాయుండు లెం
డే చూఁటెవ్వఁడు గొన్న నిత్తు" నని లా వెక్కించె సంరంభియై. 32

తా : ఈ విధముగా ఏకలవ్యుని విజయము (ఇంతంతగా) ఇంత అంత అని, పొగడఁ దగినది కాక పోయినను, వాని వీరత్వ ప్రదర్శనను (నడతను), పొగడి పౌండ్రక రాజు తనకు ముఖ్యులైన వారినిచూచి, కోటను తెగఁగొట్టుఁడు మేడలను పడఁద్రోయుఁడు కోటలోపలికి పొండు, సిద్ధపడండి. ఎవఁడు దేనిని కొల్లఁగొట్టునో దానిని వానికే ఇచ్చెదను" (తనకు భాగము వద్దనుట) అని వేగిరపాటుతో చేయి వీచుచు సైన్యమును పురికొల్పెను. బలమును అధికముగా చూపవలసి నదిగా కోరెను.

వ. అనుటయు నబ్బలంబునం గలవీరభటసంఘంబు లయ్యవసరంబున. 33

తా : అని రాజు సైన్యము యొక్క సామర్థ్యమును ప్రోత్సహింపఁగా ఆ సేనలో నున్న వీరులైన కాల్బంటుల మొత్తము, ఆ సమయమున.

సీ. వంకదారకుఁ జేరి వాకిటి [1]బద్దకం
బులు సేర్చి కొమ్మల మ్రోఁకు వైచి
ప్రాఁకి లోపలఁ జొచ్చి పలుగాఁడిఁ దెఱచిన
[2]పంత కార్లకు మున్న బ్రద్దపరుల
తోన నిచ్చెన లెక్కి లోని కొత్తళములోఁ
బురణించి చొచ్చిన పోటుమగల
వాఁడి మెచ్చక యాళువరిమీఁదఁ [3]బాళెల
వారిఁ దాఁకించిన వాసిబిరుదు
గీ. లచ్చెరువు నొంద మేడలు సొచ్చి యార్చు
[4]దొద్దకార్ల చేఁ బఱివోయెఁ దూర్పుదిక్కు
ఊల వాటుల నేటుల ఉంతు మిగులఁ
దఱిమి రచ్చటి బలముఁ గొందఱు గడంగి. 34

ప్రతి : వంకదారకున్ = వక్రద్వారమును సమీపించి,వాకిటన్ = వాకిటికి ముందు బద్దకంబులు = పెద్ద పెద్ద కొయ్యబద్దలను, పాఠాం దద్దడంబులు = కోటద్వారముపై నుండు తోరణములును; సెర్చి = చెఱచి; కొమ్మలన్ మ్రోఁకువైచి = కోటమీఁదనున్న బలమైన దిమ్మెలకు బలమైన పొడవైన త్రాళ్లను వ్రేలాడవేసి; ప్రాఁకి = పైకి మెల్లఁగా (బల్లివలె) గోడకు అంటుకొని సాగిపోయి; లోపలన్ + చొచ్చి = కోటలోపలి భాగమును, ప్రవేశించి; పలుగాఁడిన్ = పెక్కు కమ్ములతో నిర్మించిన ఉన్న చిన్న చిన్న తలుపులను; తెఱచినన్; పంతకార్లకుమున్న+అ =పట్టుదలతో పోటీపడు వారికి ముందే; బ్రద్దపరులతోన =పేములతో అల్లిన కేడెములు ధరించి ముందు పోవు వారితో కూడ; నిచ్చెనలు+ఎక్కి; లోని కొత్తళములలోన్ = లోపలనున్న కోట బురుజులలో; పురణించి = విజృంభించి, వేగిరపాటుతో అతిశయించి; చొచ్చిన పోటుమగల వాఁడిన్ = లోనికి వెళ్లిన శూరులైన యోధుల యొక్క శౌర్యమును (ప్రౌఢిని); మెచ్చక; ఆళువరి మీఁదన్ = కోటకు అమర్చియున్న (ఏటవాలుగానున్న కొఱడుల (బురుజుల) మీఁద; పాళెల వారిన్ = ప్రత్యేకముగు పాళెగాండ్రను, నిపుణమైన శిక్షణ పొందినబంటులను; తాఁకించినన్ = ముట్టడించునట్లు చేయఁగా; వాసి బిరుదులు = పేరుగల శూరులు; అచ్చెరువున్+ఒందన్; మేడలు+చొచ్చి; ఆర్చు = పెద్దగా అఱచుచున్న; దొద్దకార్లచేన్ = కొల్లగొట్టువారిచే; తూర్పుదిక్కు = (ఆ దిక్కున గల ద్వారము); (ప) బఱివోయెన్ = పగిలెను

1. దద్దడం 2. పంతగారలు మున్న 3. పల్లెల 4. దొద్ద కాఱుచేఁ బఱివోయె

(కొల్లఁగొట్టఁబడెను); కడంగి = ప్రయత్నించి; కొందఱు; అంతుమిగులన్ = కలకలము నిండునట్లు; అచ్చటి బలమున్ = అచటనున్న కొద్దిపాటి యాదవ సైన్యమును; ఱాలవాటులన్ + ఏటులన్ = ఱాలను విసరివేయుట చేతను, బాణ ప్రయోగములచేతను; తఱిమిరి. (తూర్పు దిక్కు బఱిపోయెన్(పగిలెను) = సూర్యోదయ మయ్యెను.

తా : సైన్యము, వక్రద్వారమును సమీపించి, వాకిటి ముందుండి,పెద్దపెద్ద బద్దలను అమర్చిరి. వానిపైకి ఎక్కి కోటపై నుండు దిమ్మెలకు బలమైన మోకులను కట్టి వ్రేలాడవేసి వానిసాయముతో కోట గోడకు అంటుకొని మెల్లఁగా ప్రాఁకుచుపోయి లోపలికి వెళ్ళి, చిన్నచిన్న కమ్ముల తలుపులను తెఱచివేసిరి. కొందఱు పోటీ పడి ముందునకు పోవుటకు ప్రయత్నింపఁగా, అంతకు ముందే కేడెము వారితో కలిసి నిచ్చెనల సాయముతో కొందఱు కోడమీఁదికి ఎక్కి, కోట బురుజాలను ప్రవేశించిరి, అట్టిశూరుల పటిమను మెచ్చక, ఇంకను కష్టమైనట్టి అపాయకరమైనట్టియు ఏటవాలుగా కోట గోడలకు అమర్చియున్న కొఱడుల (బురుజాల) మీఁద అతి నిపుణులైన రక్షకులను (పాళెగాండ్రను) పోవునట్లు చేయఁగా వారు, పరాక్రమవంతులైన వీరులు ఆశ్చర్యపడునట్లు, కోటలపైకి, నేర్పుతో ఎక్కి ఎత్తైన మేడలను ప్రవేశించి, పెద్దగా అఱచుచుండిరి. అట్లు పాళెగాండ్రచే తూర్పుదిక్కున నుండుద్వారము పగుల ఁ గొట్టఁబడినది. (సూర్యోదయ మయ్యెను). కొందఱు కలకలము కలుగునట్లు, రాళ్లను విసరిరి. మఱియును బాణములను ప్రయోగించిరి. ఱాళ్ల వేట్లచే, బాణముల దెబ్బలచేత యాదవ బలము ఎదుర్కొనఁజాలక, పరుగిడిపోయినది. ఇట్లు పౌండ్రుని సైన్యము యాదవ సేనను, పూర్తిగా తఱిమి వేసి లోపలికి ప్రవేశించినది.

విశే.ఈ పద్యము అమూలకము.ఆనాఁటి సైనికులు ఎట్లు శత్రువుల కోటలను వశపఱచుకొనుటకు ప్రయత్నించిరో తెలిసికొనవచ్చును. శ్రీ బహుజనపల్లి, శబ్దరత్నాకర నిఘంటుకర్తనిఘంటువులో , "ఇతనిని సర్వజ్ఞుఁడందురు. అట్లనుటకు సందేహింపఁ బనిలేదు. కనుగొనుండు" అని ఈ పద్యమును ఉదాహరించిరి.

బాలవ్యాకరణకర్త, శ్రీ పరవస్తు చిన్నయసూరి సోమనను, "అళికంబున అక్షిని డాచినట్టి సర్వజ్ఞుఁడు" అని మొదట ప్రశంసించెను.

ఉ. సామజవాజిముఖ్యబలసంతతి వీఁగిన వృష్ణివీరు లే
మే మనఁ జేవ లేక దమయిండులలోనఁ జొరంగ మందిర

స్తోమము గోపురంబుఁ బడఁద్రోవఁగఁ జప్పుడు మిన్ను ముట్టినన్
దామరపాకు నీరువలెఁ దల్లడ మందిరి పౌరు లందఱున్. 35

ప్రతి : సామవాజి ముఖ్యబలసంతతి =ఏనుఁగులు, గుఱ్ఱములు, ముఖ్యమైన సైనికులు మొత్తము; వీఁగిన= తొలఁగఁగా; వృష్ణివీరులు =వృష్ణి వంశమునకు చెందిన యోధులు, ఏమి ఏమి = ఏమియును; అనన్ =అనుటకు; చేవలేక = శక్తి చాలక; తమ ఇండులలోన్; చొరంగన్ = వెడలఁగా; మందిర స్తోమము = పెద్ద భవనముల మొత్తమును; గోపురంబున్ = దుర్గము యొక్క ముఖద్వారమును; పడన్ + త్రోఁవగన్ = నేలపై పడఁగొట్టుచుండఁగా; చప్పుడు; మిన్ను ముట్టినన్= ఆకసము వఱకు వ్యాపింపఁగా; పౌరులు + అందఱును తామరపాకు= తామరాకు పై నుండు; నీరువలె = నీటి బిందువుల వలె; తల్లడమందిరి = దిగులు చెందిరి.

తా : ఏనుఁగులు, గుఱ్ఱములు ముఖ్యసైన్యము యుద్ధమునుండి తొలఁగినవి. వీరులు ఏమియును చేయుటకు తోఁపక, నిశ్చలత్వము లేక; దీనులై ఇండ్లలోనికి వెళ్లి దాఁగిరి. శత్రువులు భవనములను, గోపురములను పడఁగొట్టు చప్పుడు ఆకసమును అంటినది. ఊరిలోని జనులు, తామరాకుపై నీటి బిందువుల వలె బాగుగా చలించి చింతతో క్రుంగిరి.

వ్యా. తామర +ఆకు = తామరపాకు, తామర 'ము' వర్ణాంతము కాదు. అయినను 'పు'గాగమము వచ్చినది. ఈ రూపమును, సంధి, ప్రౌఢ - 8, సమర్థించినది.

వ. ఇట్లు చటుల తరపరాక్రమంబునం బ్రతిభట బలంబులు దలంకం బౌండ్రభూపాలుండు యదువీరు నగరంబు కలుకోట వికటంబు గా వలుదటంకంబుల నఱకించియు దంచనపు గుం డ్లం బడ వైచియుఁ *గొంకి క్రుమ్ముడు దగరు మొదలు గాఁ గలసాధనంబులచేఁ జీకాకు పఱిచియు స్వస్తిక సర్వతో భద్ర నంద్యావర్త పిచ్ఛంద కాది హర్మ్య ప్రాసాద సౌధంబులు రూపు మాపించియు వెన్ను దన్ని చూచు నవసరంబున. 36

అర్థ: కలుకోటన్ = ఱాతి కోటను; వికటంబు + కాన్ = తాఱు మాఱగునట్లు; వలుదటంకంబులన్ = బలిష్ఠములైన గడ్డ పాఱలచే; దంచనము + గుండ్లన్ = పెద్ద ఫిరంగి గుండ్లచే; పడవేసి యును; కొంకి = వంపు చీలలుగల కోలలు; క్రుమ్ముడు తగరు = పొడుచుటకు ఉపయోగించు సాధనము; మొదలుకాన్+కల సాధనంబుల చేన్; చీకాకు పఱిచియున్

* గొంకుఁ గొమ్మ తగరు

=చిక్కులు (ఇక్కట్లు) పెట్టియును;స్వస్తిక = తూర్పువాకిలి గలవి యును; నంద్యావర్త = తూర్పు ఉత్తర దక్షణదిక్కులందు వాకిండ్లు కలవియును, పిచ్ఛందక + ఆది = ఈ పేరుగల రాజగృహములును, ఇంకను ఇతరములైన భవనిర్మాణ విశేషములు గల హర్మ్య ప్రాసాద సౌధంబులు =వేర్వేఱు రకములైన మిద్దెటిండ్లు రాజగృహములు, గొప్ప మేడలను; రూపు మాపించియు =వాని పాడుచేయించియును; వెన్నుతన్ని =వెనుకకు వచ్చి వెంబండించి; చూచు అవసరంబునన్ =వారు చేసిన నాశమును చూచుచు (తామసికమైన) ఉద్రేకమును పొందుచుండఁగా.

తా : ఈ విధముగా అత్యధికమైన పరాక్రమముతో తనసేనలు యాదవ సేనలతో సమరము చేయఁగా పౌండ్రుఁడు, ద్వారక యొక్క ఱాతి కోటను గడ్డపాఱలచే తెగఁగొట్టించెను. పెద్ద ఫిరంగి గుండ్లచే నేలపై పడఁజేసెను. వివిధములైన లోహ సాధనములచే అన్ని రకములైన భవనసముదాయముల రూపమును పూర్తిగా తొలఁగించెను. అట్లు ద్వారకను పెక్కు విధములుగా ధ్వంసము చేసి వెంబడించి ఆనాశమును ఉద్రేకముతో పౌండ్రరాజు చూచు సమయమున.

విశే. స్వస్తిక సర్వతో భద్ర మొదలైనవి రాజ గృహ విశేషములని శబ్ద రత్నాకరమున నున్నది. ఈ పేర్లు వాస్తు శాస్త్రమునకు సంబంధించి నవి. నిర్మాణ సమయమందు చెప్పవలసిన మంత్ర తంత్రములను నిర్దేశించునవి, అని శ్రీ వేదము వెంకటరామన్ తన వ్యాఖ్యానములో వచించిరి.

మ. హరి వాక్యంబుఁ దలంచి సాత్యకి పురం బాత్మీయరక్షాస్థితిం
జరగన్ వైరులు దొట్టికొన్న పిదపన్ జక్రాయుధుం డెన్ను నే
వరవీరావలిలోనఁ దమ్ముఁ డనునే వాక్రుచ్చి నన్నుంచు సం
గర సన్నాహము మీఱ నుద్ధత శతాంగ స్ఫార నానాస్త్రుఁ డై. 37

అర్థ: ఆత్మీయ రక్షాస్థితిన్ = తన్ను ద్వారకను రక్షించు బాధ్యతనుండి;తొట్టికొన్న = ముట్టడించిన పాఠాం.దొద్దకొన్న = కొల్లఁగొట్టిన;ఆవలిలోవన్ =సమూహములో; వాక్రుచ్చి = తన వాక్కుతో; సంగర సన్నాహము = యుద్ధ ప్రయత్నము; ఉద్ధత శతాంగ స్ఫార నానా + అస్త్రుఁడై = అతిశయించు యుద్ధమునకై నిర్మించిన పెద్ద తేరిలో, ప్రకాశించు వేర్వేఱు,ఆయుధములను సిద్ధము చేసికొన్న వాఁడై.

తా : సాత్యకి, ద్వారక రక్షణ విషయమున, అన్న కృష్ణుఁడు తనతో, చెప్పిన మాటలను తలఁచి శత్రువులు ద్వారకను ఆక్రమించు కొన్నచో, అన్న తన్ను ఆదరించునా?

మఱియు తన నోటి తియ్యందనముతో, తమ్ముఁడా అని పిలుచునా అని మనసులో వంతచెంది, యుద్ధ ప్రయత్నమును చక్కగా చేసికొని, యుద్ధమునకు నిర్మించిన పెద్ద తేరిలో పెక్కు ఆయుధములను సమకూర్చుకొని (మీఁదిపద్యముతో).

కం. దారుకుని సుతుఁడు దనకున్
సారథిగా నరద మెక్కి శైనేయుఁడు దు
ర్వారుఁడు దీప పరంపర
బో రనఁ జనుదేర యుద్ధమున కేతెంచెన్. 38

అర్థ : బోరనన్= శీఘ్రముగా; పోరు+అనన్= యుద్ధమా అనునట్లు

తా : అడ్డగించుటకు సాధ్యము కానట్టి వీరుఁడు, సాత్యకి (శిని మనుమఁడు, సత్యకుని సుతుఁడు), తన తేరునకు దారుకుని సుతుని దారుకి అనువానిని, సారథిగా నియమించుకొని అతనితో తేరు నెక్కి శీఘ్రముగా (దీపములు చేతపట్టుకొను) దివిటీ వాండ్రతో యుద్ధమునకు వచ్చెను. అర్థాంతరము : దీపపరంపర + పోరు+అనన్ =దీపముల వరుసల పోరా అనునట్లు, వచ్చెను. సాత్యకికి, యుయు ధానుఁడనియు పేరు.

గీ. రౌహిణేయుఁడు భుజబలోత్సాహ మెసఁగఁ
జటుల రథమున శస్త్రాస్త్ర సమితి నించి
మించి నడతెంచె నేనుఁగు మీఁద మెఱసి
యుద్ధవుఁడు వచ్చె నీతికి నుచిత మెఱిఁగి. 39

తా : రోహిణిసుతుఁడైన బలరాముఁడు, తన భుజబలము యొక్క ఉత్సాహము ఒప్పునట్లు, అందమైన అరదమందు,వివిధములైన ఆయుధములను బాణముల సమూహామును నింపుకొని,ఉప్పొంగుచు వచ్చెను. ఉద్ధవాచార్యుఁడు, రాజనీతికి అనుగుణముగా తానును పాల్గొనుట సరియైన నడవడిక అని ఏనుఁగు మీఁద కూర్చుండి వచ్చెను.

వ. ఇవ్విధంబున నడచుదొరలం గని యదు వృష్ణి భోజాంధక కుకుర సైన్యంబులు గూడుకొని కృతవర్మ ప్రభృతి మహావీరులం దలకడచి

నిజతూర్యంబులు సెలంగ సింహనాదంబులు నింగి ముట్ట నడిచి
మునుముట్ట నప్పట్టణంబు చొచ్చి కడంగు రిపు సేనలం దలపడియె
నట్టియెడ. 40

తా : ఈ విధముగా నడచుచున్న నాయకులను చూచి యదువులయు వృష్ణి భోజఅంధక, కుకుర వంశీయులయు సైన్యంబు లన్నియు కలసి, కృతవర్మ మొదలగు మహావీరులను అతిక్రమించుచు, తమ తమ వాద్యముల ధ్వనులు వీరుల గర్జలును, ఆకాశమును అంటుచుండఁగా, ముందుకు సాగి ఆ ద్వారకను ప్రవేశించిరి. ఎగయుచున్న పగవారి సేనలను యాదవులు ఎదుర్కొనిరి. ఆ సమయమందు (మీఁది పద్యముతో)

శా. మాయం బాయఁగఁ బెట్టు యోగిక్రియ సామం తావిజేయుండు శై
నేయుండత్తఱి వైరి వీరబలమున్ నిశ్శేషధూతంబుగా
వాయవ్యాస్త్రము నంబుదంబు గతిఁ బోవ న్వైచెఁ జొక్కాకుతో
రాయన్ రేణుకణంబుతోఁ జెనయఁ గార్పాసంబుతో సాటిగాన్. 41

ప్రతి : శైనేయుండు =సాత్యకి; సమ+అంత= సామంత+అవిజేయుండు =సమానమైన పొలిమేర గల పొరుగు రాజులచే, (ఇచ్చట ఒక రాజునకు విధేయులైనచిన్న రాజులు అనెడి అర్థము కుదురదు) జయింపఁబడని వాఁడు;మాయన్+పాయఁగన్ పెట్టు = అజ్ఞానమును తొలఁగించు (జీవుని ఆవరించియుండునది) పాఱఁద్రోలు;యోగిక్రియన్ = యోగసాధనములైన,యమ, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము ధారణ, ధ్యానము, సమాధి అనెడి ఎనిమిదింటిచే చిత్తవృత్తిని నిరోధించి స్థిరమైన చిత్తము కల వాఁడై ప్రవర్తించు సాధకుని వలె; ఆ + తఱి = ఆ సమయమందు; వైరి వీరబలమున్ = పగవాఱి బంటుల సామర్థ్యమును;చొక్కాకుతో రాయన్ = ఎండిన ఆకులవలెను;రేణు కణంబుతో చెనయన్ = నేలమీఁది దుమ్ముతో స్పర్ధ వహించునట్లు; కార్పాసంబుతో సాటి+కాన్ = తేలికయైన దూదిపింజతో, (నేసిన బట్టతో) సమానముగా; వాయవ్య + అస్త్రమున్ = వాయుదేవునికి చెందిన బాణముచే; అంబుదగతిన్, పోవన్ = మబ్బులన్నియుచెదరి పోవునట్లు;నిశ్శేషధూతంబు + కాన్ = మిగులక అంతయును తుడుచుకొని పోవు విధమున; వైచెన్= (వాయవ్యాస్త్రమును) ప్రయోగించెను.

తా :బహిరింద్రియములను అంతరింద్రియములను వశపఱచుకొని, సత్తును ఆవరించియుండు అసత్తుమ (అజ్ఞానమును) తొలఁగించు సాధకుని వలె సాత్యకి శత్రువీరుల శక్తిని ఎండిన ఆకులవలె, ధూళికణములవలె, దూదిపింజల వలె, వాయువుచే

మబ్బులను వలె, వాయు దేవతాస్త్రమును, శత్రుసేన అంతయును తుడిచిపెట్టుటకై ప్రయోగించెను.

విశే. సామంత = సమానమైన పొలిమేరగల రాజులు, పొరుగు రాజులు. ఇది మౌలికార్థము.

కం. పరబలముఁ దోలి వెనుకొని
పురివెడలెను సకల సైన్యమును దనుఁ బొగడన్
శరము కరంబునఁ ద్రిప్పుచు
బిరుదు మగలు వినఁగఁ బలికెఁ బెద్ద యెలుఁగునన్. 42

తా: సాత్యకి శత్రు సైన్యమును వెంబడించి తోలివేసి సకల సైన్యము తన్ను పొగడుచుండగా పురికి మరలెను. చేతిలో బాణమును త్రిప్పుచు, శూరులైన యోధులు, విను విధమున పెద్ద గొంతుతో ఇట్లు అఱచెను.

## - : పౌండ్రక సాత్యకు లొండొరుల నధిక్షేపించుచుఁ దాఁకుట : -

ఉ. "ఎవ్వఁడు రోరి తాను నొక యెక్కుడు వీరుఁడ పోలె రాత్రిమైఁ
జివ్వకు వచ్చి ముచ్చిమిగఁ జేరినవాఁడు దదీయ మస్తముం
గ్రొవ్విన మచ్ఛరంబునన కూల్చెద వాని శరీర మాంసముం
గ్రవ్వికొనంగ గృధ్రములఁ గంకములం బరితృప్తిఁ దేల్చెదన్. 43

అర్థ : రాత్రిమైన్ = రాత్రి సమయమందు;చివ్వకు=యుద్ధమునకు;ముచ్చిమిగన్ = దొంగతనముగా, (ముచ్చు=దొంగ);మత్+శరంబునన్= నా యొక్క బాణముచే;క్రవ్వికొనంగన్ (కవ్వురూపము నిఘంటువులలో నున్నది) చుట్టును ప్రోగై చేరునట్లు; గృధ్రములన్ = గ్రద్దలను;కంకములన్ = రాబందులన్ను,రాచ పులుగులను; పరితృప్తిన్ = మిక్కిలి తృప్తితో; తేల్చెదన్ = క్రీడింపఁ జేయుదును.

తా : "ఎవ్వఁడురా వాఁడు? తాను ఒక గొప్ప వీరుని వలె రాత్రి పూట, దొంగవలె, యుద్ధమునకు ఇటకు వచ్చినవాఁడు అతని తలను క్రొవ్వియున్న (బలిష్ఠమైన) నా బాణముచే తెగఁగొట్టెదను. వాని మేని కండలను తినుటకై గద్దలను రాబందులను ప్రోగై చేరునట్లు చేసి వానికి చక్కని తిండిని కూర్చి ఉల్లాసముతో ఎగురునట్లు చేయుదును.

విశే. "క్రొవ్విన" అను విశేషణము జడమైన బాణమునకు వర్తింపదు. జీవులకు

వర్తించు విశేషణ మిది. "మదించు" "పొగరెక్కిన" అని అర్థము. సందర్భమును బట్టి పొగరెక్కిన బాణము ఎదిరి పొగరును అడఁచివేయునని సూచన.

వ్యా. మత్ + శరము = మచ్ఛరము, శ్చుత్వ ఛత్వాదే సంధి.

ఉ. నావుడుఁ గోపవేగముల నవ్వు మొగంబున నివ్వటిల్లఁ జెం
గావి కనుంగవం బొడమఁగా వికట భ్రుకుటీ కుటీ లలా
టావిల ఘర్మవారి కణహార లలామ విలాసుఁ డై గుణా
రావము చేసి నిష్ఠుర శరం బరివోసి కడంగి డాసియున్. 44

అర్థ : నివ్వటిల్లన్ = తోఁపఁగా; చెన్ను + కావి = అందమైన ఎఱుపు; కను + కవన్ = రెండు కన్నులలో; వికటభ్రుకుటీ కుటీలలామ = వంకరయైన బొమముడితో వక్రమైన (ముడుత లేర్పడిన) నొసటియందు; ఆవిల ఘర్మవారికణ = కలఁతచే (వెల్వడిన) చెమటనీటి బిందువుల యొక్క; హార = సరముల; లలామ = సొబగుతో కూడినట్టి, విలాసుఁడై = ప్రకాశము కలవాఁడై; గుణ + ఆరావము = వింటినారి మ్రోఁత; నిష్ఠురశరంబు = కఠినమైన (క్రూరమైన) బాణమును; అరి = అల్లెత్రాడు.

తా :అటు పలుకఁగనే పౌండ్రునకు కోప వేగముతో నవ్వు మొలకెత్తినది. కన్నుల జంట ఎఱ్ఱఁదనమును పొందినది. కనుబొమలు వంకరయైనవి. ముడుతలతో నొసలు వక్రమైనది. కలఁతచే చెమట నీటి బిందువుల వరుసలు అలంకారముగా వెల్వడి ఒప్పారినవి. వింటిని ధరించి క్రూరమైన బాణమును అల్లెత్రాటిలో కూర్చి, దానిని మ్రోయించి, ప్రయత్నించి సాత్యకిని సమీపించి (మీఁది వచనముతో).

వ. ఏయ నొల్లక పౌండ్రుండు సాత్యకితో నిట్లనియె. 45

తా : సాత్యకిపై బాణమును ప్రయోగించుటకు ఇష్టములేక,పౌండ్రుఁడు ఆతనితో ఇట్లనెను.

కం. అయ్యాదవ గోపాలుం
డెయ్యెడ నున్నాడో పసుల నెం దడఁచెనొకో
యయ్యన్న తమ్ముఁడవు నీ
వియ్యాడెడు బిరుదుమాట లెచటఁ జదివితో. 46

తా : ఆ గొల్ల ఆలకాపరి (కృష్ణుఁడు) ఏ చోట ఉన్నాడో కదా! ఆతఁడు మేపు పశువులను ఎచ్చట దాఁచినాఁడో కదా! ఆ అన్నకు తగిన తమ్ముఁడవు నీవు ఇప్పుడు నీవు పలుకు నట్టి శూరుల మాటలు ఎక్కడ నేర్చుకొన్నావో?

వ్యా. చదివితివి+ఓ =భూతకాలిక క్రియలో వకార లోప సంధి. చదివితి +ఓ = చదివితో, ఇత్వసంధి.

చం. మిడికెడు వాసు దేవుఁడన మీఁదు దలంపక యాదవుం డొకం
*డుడుగఁడు వానిఁ ద్రుంతు సమరోర్వరలో నని వచ్చిపోరునే
పడుచులతోడఁ బౌండ్రుఁ డది పంతమె నావిశిఖంబు మ్రింగు నీ
తొడిగిన బాణము న్వెనుకతూణముసందున నున్న ప్రాణమున్. 47

ప్రతి :వాసుదేవుఁడు+అనన్ = వాసుదేవుఁడు అనెడి పేరుతో; యాదవుండు + ఒకండు = గొల్లవాఁడు ఒకఁడు; మీఁదు తలంపక = కలుగఁ బోవు కీడు ఊహింపక; మిడికెడున్ = త్రుళ్లుచున్నాఁడు; ఉడుగఁడు = ఆగడములను మానుటలేదు;వానిన్ సమర + ఉర్వరలోన్ = యుద్ధ భూమిలో; త్రుంతున్=చంపెదను+అని;పాఠాం. ఉడుగక = మానక;లవణ+ఉదకములో ముంతున్ +అని = ముంచెదను అని;వచ్చి;పడుచులతోడన్ =పిన్నవారితో; పౌండ్రుఁడు;పోరాడునా? అదిపంతమె = అట్లు వారితో పోరుట పౌరుష కార్యమా?; నా విశిఖంబు = నా బాణము;నీతొడిగిన బాణమున్;వెనుక= నీ వెనుక (వీపుమీఁద) నున్న;తూణమున్ = అమ్ముల పొదిని; సందున నున్న =నడుమనున్న; ప్రాణమున్ = నీ ప్రాణమును కూడ; (అందునకు మాఱుగా సవరణ, సందున.)

తా : ఒక గొల్లఁడు వాసుదేవుఁడను పేరుతో కలుగఁబోవు కీడును శంకింపక తన ఆగడములను మానక త్రుళ్లు చున్నాఁడు,వానిని నేనే యుద్ధభూమిలో చంపెదనని,ఉప్పు నీటిలో ముంచెదనని ప్రతిన పట్టి వచ్చినవాఁడను. కనుక నేను పిన్నవారితో పోరుదునా? అది పౌరుష క్రియయేనా? నా బాణము నీవు వేయఁబోవు బాణమునే కాదు. నీ వెనుక నున్న అమ్ముల పొదిలో నున్న బాణములను అన్నింటిని, మఱియును నడుమ నీ శరీరములో నున్న జీవమును హరించివేయును సుమా. (చూడుము నా పరాక్రమమనుట).

వ్యా. త్రుంచుదున్,ముంచుదున్,త్రుంతున్, ముంతున్ "చుఙ్" నకు తకారాదేశము.

గీ. చక్రి పొడుమంగఁ బార్థివస్థాన మయ్యె
నోరి మీవంశ మందుఁ దాఁ కోర్వఁ జాలు

* డుడుగకవార్ధిముం తులవణోదములో నని

వారిఁ జూపుము కుమ్మ రావమున రాగి
ముంత లేఱంగఁ గలవె నీ కింత యేల. 48

తా : ఓరీ! చక్రమును ధరించు వాఁడొకఁడు కన్పట్టగా, మీ గొల్లవారిలో 'రాజు' అనెడి పేరునకు అవకాశము కలిగినది. ఇంత ఎందుకు మీ వంశములో వీరుల శౌర్యమును సహించు వారెవరైనను ఉన్నారా చూపుము. కుమ్మరి కుండలను కాల్చుచోట (ఆవమందు) ఎంత వెదకినను, రాగి పాత్రలు లభించునా? ప్రయోజనములేని వీరత్వమెందులకు? నీవు శూరుఁడవుకావు నాతో పోరాడఁజాలవు. (ఆవమున మట్టి కుండలే లభించినట్లు గొల్లలలో, బలహీనులే ఉందు రనుట).

అలం. అర్థాంతరన్యాసము.

వ. అనుటయు సాత్యకి కోపించి. 49

తా : పౌండ్రుని మాటలకు సాత్యకి కోపము చెంది

కం. ప్రేలకు జీలుగు వెరిఁగిన
మాలెకుఁ గంబంబు గాదు మాటలు మిగులన్
నాలుక గఱచిన యంతనె
చాలునొ మగతనముఁ జూప సాత్యకియెదురన్. 50

అర్థ : జీలుగు = జీలుగు కొయ్య;మాలెకున్=ఇంటికై,ఇంటిని కట్టుటకు; మిగులన్ =ఎక్కువగా; నాలుక కఱచిన+అంతనె = నాలుకతో వెలువడ చేసిన మాత్రముననే, నాలుక కఱచుట, జాతీయము; మగతనము =పౌరుషము.

తా : జీలుగు కొయ్య ఎంత బొద్దుగా పెరిగి పెద్దదైనను, ఆ జీలుగు కొయ్య ఇంటిని కట్టుటకు కంబముగా ఉపయోగపడదు. (దళసరిదైనను సులభముగా విఱుగును). నీవు ఎంతగా నోటికి వచ్చినట్లు ఎక్కువగా మాట్లాడినను ఈసాత్యకి ఎదుట (నాఎదుట) అవి పౌరుషమును చూపఁగలవా? కనుక, ఇష్టము వచ్చినట్లు మాట్లాడవద్దు. నీవు నాతో పోరాడుటకు తగిన వాఁడవు కావు.

అలం : అర్థాంతరన్యాసము.

కం. గిరితోడన కరిపోతము
హరితో బుక్షంబుఁ జెనయు నట్టిద కాదే

హరితోడ నీవు లావునఁ
బురణించుట పౌంౘ్ర నీకుఁ బో టేమిటికిన్. 51

అర్థ : కరిపోతము = ఏనుఁగు పిల్ల, పాఠాం.ఉరభ్రకము=పొట్టేలు పిల్ల; ఋక్షంబు = ఎలుఁగుగొడ్డు; పాఠాం. భషకంబు = కుక్క పిల్ల; చెనయు+అట్టి+అ = ఎదిరించిన విధము కదా!పురణించుట = సాటి అనుకొనుట; పోటు = పోరు.

తా : ఓ పౌండ్ర రాజా! నీవు, నీ అల్పమైన బలముతో, హరితో సాటి అని తలంచుటేనుఁగు పిల్ల (పొట్టేలు పిల్ల) కొండను, ఎలుగుగొడ్డు (కుక్కపిల్ల) సింహమును ఎదిరించిన విధమగును కదా! హరితో నీకు పోరు ఎందులకు? పోటి ఎందులకు?

విశే. "ఉరభ్రక, భషక" పదములలో, అల్పార్థక 'క' ప్రత్యయము, సాభిప్రాయ సూచకము. అనుభవములేని పిల్లలు తెలియక ప్రవర్తింతురనుట (వే.వేం.)

అలం. ఉపమ.

ఉ. పన్నినవాఁడ వింకఁ జెడి పాఱకుమీ యని మూదలించి చే
నున్న నిశాతబాణము మహోద్ధతిమై నరిఁబోసి యేసినన్
గన్నుల నోరనెత్తు రొలుకంగ శతాంగము మీఁద వ్రాలె నా
సన్న పరేత రాజ ఘనసౌధతలంబునఁ బవ్వళించె నాన్. 52

అర్థ: పన్నిన వాఁడవు = (యుద్ధమునకు) సిద్ధమై వచ్చిన వాఁడవు; మూదలించి = హెచ్చరించి;చేనున్న =చేతనున్న; నిశాత = వాఁడియైన; అరిన్ + పోసి= వింటిలో కూర్చి; శతాంగము=పెద్ద తేరు;ఆసన్న పరేతరాజ = దాపైన యమ ధర్మరాజుయొక్క.

తా :'ఓ పౌండ్రా యుద్ధమునకు వచ్చినావు. భయపడి పాఱిపోవద్దు." అని హెచ్చరించి సాత్యకి వాఁడియైన బాణమును వింటిలో కూర్చి, అతనిపై వేసెను. అతఁడు కన్నులలోను, నోటిలోను, నెత్తురు చిందు చుండఁగా దాపున నున్న యముని ఇల్లున్న చోట పరుండి యున్నాడేమో అనునట్లు తన పెద్ద తేరిపై ఒఱగెను.

అలం : ఉత్ప్రేక్ష. 'పరేతరా .... నాన్'.

సీ. అంతలోనన తేఱి యాతండు బాణము
లొమ్మిదింటఁ బదింటఁ దొలుత నేసి

సాత్యకి నిటలంబు సాయకం బొకట భే
 దించి నెత్తురు వెల్లిఁ దేల్ప నతఁడుఁ
దేరిపైఁ జదికిలఁ ద్రెళ్ళి నిశ్చైతన్య
 గతి నున్న దశసాయకముల సూతు
నిరువదేనమ్ములఁ దురగ చతుష్కంబు
 మిడుకు మాలఁగ నేసి మిన్ను ముట్ట
గీ. నార్చినఁ దదారవంబున నతఁడు మూర్ఛ
దెలిసి యొకకోలఁ దెగనిండఁ దిగిచి యేసె
వాని వక్షంబు వగుల జీవంబు లేదు
కల దనఁగఁ దేరు పదిబాణముల నొగిల్చె. 53

అర్థ : నిటలము = నొసలు; నిశ్చైతన్య గతిన్ = తెలివి లేని విధమున; మిడుకు = జీవము (బ్రతుకు);మాలఁగన్ = నశించునట్లు, తెగ =వింటినారి.

తా : అంతలోనే పౌండ్రుఁడు, తేఱుకొని, సాత్యకిపై తొమ్మిది పదిబాణములను మొదట వేసెను. పిమ్మట అతని నుదుటిని ఒక బాణముతో చీల్చి నెత్తుటి వెల్లువలో మునుఁగఁజేసెను. సాత్యకి తేరి మీఁద చదరముగా పడి తెలివి లేనివాఁడై ఉండఁగా అతని సూతుని పదింటితో నాలుగు గుఱ్ఱాలను ఇరువది అమ్ములతో, కొట్టి వారి ప్రాణాలను తొలఁగించి ఆకాశము దద్దరిల్లు నట్లు అఱచెను. ఆ ధ్వనితో సాత్యకి మూర్ఛనుండి తెలివిని పొంది ఒక బాణముతో వింటినారిని బాగుగా లాగి పౌండ్రుఁడు జీవించి ఉన్నాడా లేఁడా అను సందేహము కలుగునట్లు అతని ఱొమ్ము పగులునట్లు వేసెను. పిమ్మట తేరును పది బాణములతో త్రుంచెను.

కం. భల్లముల రెంటఁ డెక్కెము
 ద్రెళ్ళను సూతు తల డొల్లఁ దెగఁ గొని శరముల్
 పెల్లు గురిసి చక్రంబునఁ
 బిల్లులుగా హరులు గూల బీరము నెఱపెన్. 54

తా : సాత్యకి రెండు బల్లెములతో పతాకము పడునట్లును, సూతుని తల దొర్లునట్లును, మఱియు, వింటినారిని ఎక్కుపెట్టి (తెగఁగొని)బాణములను పెక్కింటిని

కురిపించి గుంపులుగా గుఱ్ఱములు, పిల్లులవలె కూలునట్లు, పరాక్రమమును ప్రదర్శించెను.

అలం : ఉపమ : పిల్లులుగా,హరులు కూల బీరము నెఱపెన్,

గమనిక : ఇచ్చట చక్రాయుధ ప్రస్తావములేదు.

వ. వెండియు. 55

తా : సులభము

గీ. సింహ నాదంబు చేసిన సేద దేఱి
కనలి శరచాపములు గదా ఖడ్గములును
గొన్ని సందిటఁ దనలావు కొలఁదిఁ బట్టి
నెగులు మోచినఁ బౌండ్రుండు నేల కుఱికి. 56

అర్థ : కనలి = కోపించి; నెగులు = బాధ;మోచినన్ = తక్కువకాఁగా; మోచనము (విడుపు); సందిలి = మోఁజేతికిమీఁది భాగము.

తా : సాత్యకి సింహనాదము చేయఁగా పౌండ్రుఁడు అలసట నుండి తేఁటపడి, కోపించి,బాణములు విల్లు గద, కత్తి అన్నింటిని మోఁజేతికి మీఁది భాగమందు తనశక్తి కొలది పట్టుకొన్నవాఁడై తనకు కలిగిన బాధ కొంత తగ్గు చుండఁగ్గా నేలపైకి దుమికి (మీఁది పద్యముతో).

సీ. కొలఁది మీఱిన బాణకోటులు శైనేయు
పై నేసి పడవైచెఁ బడగ రథముఁ
బదిశరంబుల నేసి బాణచతుష్టయం
బున రథ్యములఁ గూల్చి భుజ బలంబు
నెఱయఁ జాపముతోడ నేలకు దాఁటి సా
త్యకి వానిగుణము బాణాసనంబుఁ
దునిమె నంతట వాఁడు దొడ్డ కోదండంబుఁ
గొని శరంబుల నొంచె శిని మనుమని

ఆ.వె. నతఁడు నైదు నైదు నాఱు నెన్మిదియును
శరము లేసి యేసి కెరలి పదరి
పలుక నంతలోన బౌండ్రుండు సాత్యకి
విల్లు ముష్టి కొలఁది విఱుగ నేసె. 57

తా : పౌండ్రుఁడు అధికముగా బాణములను లెక్కలేనన్నింటిని, సాత్యకిపై ప్రయోగించి, అతని పతాకమును పడవేసెను. అరదమును పదింటితో, అశ్వములను నాలుగింటితో, కూల్చెను. (కూల్చి హేత్వర్థకము), సాత్యకి, తన భుజబలము మెఱయఁగా వింటితో కూడ నేలకు ఉఱికి పౌండ్రుని అల్లె త్రాటిని వింటిని రెంటిని త్రుంచెను. అంతట, అతఁడు పెద్దదైన బలము కలిగిన వింటిని గ్రహించి సాత్యకిపై బాణములను వేసి బాధించెను. అతఁడు అయిదు అయిదు, ఆఱు, ఎనిమిదింటిని ప్రయోగించి, అతిశయించి (కెరలి) పౌండ్రుని ఆక్షేపించుచు (పదరి) నిందించుచుండఁగా (పౌండ్రుడు) సాత్యకి యొక్కవింటిని పిడికిటిచే పట్టుకొను చోటును విఱుఁగఁ గొట్టెను.

వ్యా. కూల్చి = కూల్చుటచేత, సూ. ఒక్కొక్క చోట భూతార్థక అసమాపక క్రియ హేత్వర్థకంబునగు, క్రియ, ప్రౌఢ - 15.

ఉ. వేఱొకచాప మెత్తి యదు వీరుఁడు డెబ్బది రెండు బాణముల్
మీఱిన పౌండ్రభూవిభుని మేను కలంతట నాటి నల్గడం
బాఱఁగ నేసి యేసె శలభప్రకరంబు మహీరుహంబుపైఁ
దాఱు తెఱంగు చేసి యతిధైర్యము సూపె నతండు సైరణన్. 58

అర్థ :పాఱఁగన్ = ప్రసరించునట్లు; తాఱు= అడఁగు; (శ.ర వీనినే ఉదాహరించినది)

తా : యదు వీరుఁడు సాత్యకి వేఱొక వింటిని తీసికొని, దెబ్బది రెండు బాణములను మితి మీఱుచున్న పౌండ్ర రాజు యొక్కశరీర భాగము లన్నింటిలోను నాలుగు వైపులందు మిడుతల దండు చెట్టును (పెద్దకొండను) పూర్తిగా అడఁచివేయునట్లు (కప్పునట్లు) ఎడములేక శరీరములో నిండునట్లు అన్ని వైపులలో నాటెను. పౌండ్రుఁడును ఓర్పుతో తన ధీరతను (నిశ్చలత్వమును కోల్పోవక) ప్రదర్శించెను.

అలం : ఉపమ, దెబ్బది రెండు బాణముల్ ........ శలభ ప్రకరంబు మహీరుహంబుపై (పాఠాం. మహీధరంబుపై) .

గీ. అర్ధచంద్రబాణంబున యాదవేంద్రు
నేసి తోడన బలుదూపు లేడు వఱపి
యతని వేగంబు మాన్చెఁ బంచాశుగముల
వృష్ణివీరుండు పౌండ్రుని విల్లు దునిమె. 59

తా : పౌండ్రుఁడు అర్ధచంద్రబాణంబును గొల్లవీరునిపై వేసెను. వెంటనే బలమైన ఏడమ్ములతో అతని వేగమును నిరోధించెను. అయినను సాత్యకి, వానిని లెక్క చేయక పౌండ్రుని వింటిని అయిదు అమ్ములతో విఱిచెను.

మ. తన లావంతయునిండఁ బౌండ్రుఁడు గదాదండంబు సారించి వై
చిన శైనేయుఁడు నమ్మహాయుధము డాచేఁ బట్టి నారాచ మే
య నతం డంతన పట్టి శక్తిదశకం బవ్వీరుపై నాటినన్
ధను వల్లంతట వైచి సాత్యకి గదా దండంబు చే నొప్పఁగన్. 60

తా : పౌండ్రుఁడు తన బలమంతటిని ఉపయోగించి, గదాదండమును త్రిప్పి సాత్యకిపై వేసెను.అతఁడు ఆ గొప్ప గదను ఎడమ చేతితో పట్టుకొని, ఒక ఇనుప బాణమును పౌండ్రునిపై వేయఁగా, అతఁడు అంతలోనే దానిని పట్టివేసి పది చిల్లకోలలను సాత్యకిపై నాటెను. సాత్యకి, వెంటనే తన వింటిని నేలపై పడవేసి గదా దండము చేత ఒప్పుచుండఁగా (మీఁది పద్యముతో).

కం. డగ్గఱి యేసినఁ బౌండ్రుఁడు
ద్రగ్గక గదఁ గొనుచు వ్రేటు సరగునఁ గొన్నన్
మొగ్గరములోన యిరువుర
యగ్గలికలు మెఱసె గదలు నాకస మంటన్. 61

అర్థ : డగ్గఱి = సమీపించి; ద్రగ్గక = తగ్గక, వెనుకాడక; సరగునన్ = వేగముతో; కొన్నన్ = ఎదుర్కొనఁగా; మొగ్గరములోన = వ్యూహములోనే; కదలు = కదలికలు, (కౌశలము); అగ్గలికలు = ఆధిక్యములు; అంటన్ = తాఁకునట్లు; మెఱసెన్ = ప్రకాశించెను.

తా : సాత్యకి పౌండ్రుని సమీపించి, గదతో కొట్టెను. ఆ దెబ్బను, పౌండ్రుఁడు వేగముతో ఎదుర్కొనెను. వారి గదలు ఆకాశమును తాఁకు చుండఁగా వారి కౌశలములు శోభించెను.

కం. ఎత్తిన గద లంకించియు
హత్తించియు బ్రమరి దిరిగి యడిచియుఁ బయిపై
నొత్తియుఁ దట్టియుఁ బట్టియు
మత్తగజద్వయముఁ బోలె మలసి రిరువురున్. 62

తా : పైకి ఎత్తిన గదలను, ఎగిరి అందుకొనియును, తాఁకించియును చుట్టి వచ్చియును, కొట్టియును పైపై నొక్కియును తట్టియును, పట్టియును సాత్యకియు పౌండ్రుఁడు మదించిన ఏనుఁగులవలె పెనఁగులాడిరి.

ఈపద్యములో గదాయుద్ధమునకు వర్తించు పారిభాషిక పదము లున్నవి.

అలం : ఉపమ

కం. ఈచందంబునఁ దెఱపులు
వేచియుఁ బయిఁ బూఁచి లాఁచి వ్రేసియుఁ బై పైఁ
ద్రోచు రుధిరమునఁ దడిసిరి
పూచిన మోదువులతోడఁ బుట్టువు లనఁగన్. 63

ప్రతి :ఈ చందంబునన్; తెఱపులు = అవకాశములకై; వేచియున్= ఎదురు చూచియును; పయిన్ పూఁచి = మీఁదికి ఎగయుటకు ప్రయత్నించియు; లాఁచి వ్రేసియున్= పొంచి యుండి గదతో కొట్టియును; పైపైన్+త్రోచు =శరీరము నుండి వెలుపలికి వడిగా ఉబుకు; రుధిరమునన్ = రక్తముచే; పూఁచిన మోదువుల తోడన్ పుట్టువులు = పుష్పించి వికసించిన మోదుగు చెట్లకు సరి సమానులా; అనఁగన్; తడిసిరి =బాగుగా (రక్తముచే) తడిసిరి పాఠాం. తోఁచు = కన్పట్టు

తా :అవకాశములకు ఎదురు చూచుచు, ఆ ఇరువురు నిపుణులు ఎగసి ప్రయత్నించి పొంచి, గదలను ప్రయోగించుచు పోరు సల్పిరి. వారి శరీరముల నుండి వడిగొని నెత్తురు వెల్వడి అంతటిని రక్తమయము చేసినది. అపుడు వారిరువురు, పూసిన ఎఱ్ఱని పూవులతో ప్రకాశించుచున్న మోదుగు చెట్టులా అనునట్లు కన్పట్టిరి.

అలం : ఉత్ప్రేక్ష

వ. ఇట్లు సరిసరిగా బోరు నవసరంబున సాత్యకి సవ్యమండల ప్రచారంబునఁ బొలిసిన వాసుదేవుండు వలవంక శంకింపక పగళంబు గానీక

యర్ధభ్రమణంబునఁ గదిసి యుప్పళిచేసిన శైనేయుం డత్తెఱపికి నాస చేయక ముఖచాళిచేసి మురిసి తూళగించిన నవ్వీరుండు దళది ద్రిప్పి వ్రేసి హోహో యనుటయుం గైటభారితమ్ముండు గనలి నిలునిలు మని యదలించి కక్ష్యావర్తంబున గదాదండంబు వెనుక కొదిగించి మెయి చూపిన నచ్చోరవకు వాసుదేవుండు సీసకంబు వొంచిన శైనేయుండు కుదికిలి గదను డాకేలు దాపించినం బొంచి చొచ్చిన పంతంబునకు మెచ్చి పౌంద్రుండు కంఠాభరణంబను చాళిం జన గద ద్రిప్పి భుజమధ్యంబు వ్రేసిన సాత్యకి స్వస్తికంబుగా నొడ్డి పోకు పో కనుటయు నానృపాలుండు గద సుట్టి తివియ వచ్చిన యదువీరుండు తోడన యెత్తికొన్న నిరువుర గదలును మసకంబునం బెనంగు పాముల పగిదిం దాళించు పాసికల పోలికఁ గైతొట్టు కరళ్ళకైవడిఁ గలయ బెరయు నిరువురు మెయి మలంచి పాసియు డాసియుఁ దట్టియుఁ బట్టియు హత్తియు నొత్తియు మలంగియుఁ దొలంగియు జడిసియు నొడిసియుం దాఁటియుఁం దూఁటియు విసరియుం గొసరియు నదల్చియు ముదల్చియు లాసియు వ్రేసియుఁ దఱిమియు మెఱమియు నొండొరువుల దేహంబులు రుధిరాసారంబునం దడిసి కుసుమితకింశుకంబులం బురుడింప లత్తుక జొత్తిల్లిన పుత్తళ్ళ విడంబింప గైరిక జలంబుల మునింగిన సింగంబులఁ దలఁపింప నున్న సమయంబున. 64

ప్రతి : ఇట్లు; సరిసరిన్ = సరిసరిగా సమాన నిపుణతతో; పోరు+ అవసరంబునన్ = పోరాడు సమయమందు; సాత్యకి, సవ్యమండల ప్రచారంబునన్= ఎడమ వైపునుండి వలయాకారమున తిరుగుచు; పొలసినన్ = సమీపించుచుండఁగా, వాసుదేవుండు; వలవంక= కుడివైపునుండి, శంకింపక = సంశయములేక; పగళంబు గానీక = పొరబాటు చేయక; అర్ధ భ్రమణంబునన్ = సగము మాత్రము నిటునటు తిరుగుచు; కదిసి = సమీపించి; ఉప్పళి చేసినన్= యుద్ధ క్రియావిశేషము (ఉప్పరించు, ఉప్పళించు - సమానార్థకములు); శైనేయుఁడు = సాత్యకి; ఆ తెఱపిన్ = ఆ అవకాశమును; ఆసచేయక = కోరక; ముఖ చాళిచేసి = యుద్ధ క్రియావిశేషము (చాళి, చాళియ- రూపాంతరములు); మురిసి = గర్వించి, తూళగించినన్

పాఠాం. త్రుళ్లగించినన్ = ఎగిరిపడఁగా; ఆ వీరుండు = ఆ పౌంద్రుఁడు; దళది త్రిప్పివేసి (క్రియావిశేషము); 'హోహో' అనుటయున్; కైటభ+అరి = కైటభుని శత్రువు, హరియొక్క; తమ్ముండు (సాత్యకి); కనలి = కోపించి నిలుము + నిలుము + అని అదలించి; కక్ష్యా + ఆవర్తనంబునన్ = చంకవైపు మరలించుటచే; గదా దండంబు = దుడ్డు కట్టి వంటి గదను; వెనుకకు + ఒదిగించి= వెనుక ప్రక్కకు వాలునట్లు చేసి; మెయి చూపినన్ = (రక్షణ లేక) శరీరమును చూపఁగా; ఆ+చొరవకు = ఆ అవకాశమునకు; వాసుదేవుండు, సీసకంబు= క్రియా విశేషము; పొంచినన్ = కనిపెట్టి ప్రయోగింపఁగా; శైనేయుండు; కుదికిలి =నేలపైపడి ముఖము పైకెత్తి కూర్చున్న వాఁడై (శ.ర.);గదను; డాకేలు = ఎడమ చేతితో దాపించినన్= దగ్గఱకు వచ్చునట్లు చేయఁగా (తాపించినన్ = నిలుపఁగా) పొంచి చొచ్చిన పంతంబునకున్ = అవకాశమును గమనించి కావించిన ప్రవేశము యొక్క పౌరుషమునకు; మెచ్చి; పౌంద్రుఁడు; కంఠాభరణంబు + అను చాళిన్, (క్రియావిశేషము); చనన్ = కలుగునట్లు;గద త్రిప్పి; భుజ మధ్యంబు వ్రేసినన్ = భుజముల నడుమ గదతో కొట్టఁగా సాత్యకి, స్వస్తికంబుగాన్+ఒడ్డి= బంధవిశేషముతో చాఁచి, పోకు పోకు అనుటయున్,పాఠాం. బొంకు బొంకనుటయును; ఆ నృపాలుడు=ఆరాజు; గదచుట్టి = గదనుత్రిప్పి; తివియన్ = ఆకర్షించుటకు రాఁగా; యదువీరుండు; తోడన్ = వెంటనే; ఎత్తికొన్నన్ = (గదలతో) సిద్ధముకాఁగా; ఇరువుర కదలును = ప్రయత్నములును; మసకంబునన్ = శృంగార సుఖమునకై ఉత్సాహముతో; పెనంగు పాముల; పగిదిన్ = వలెను; తాళించు పాసికల పోలికన్ = ఇటునటు చేతిలో త్రిప్పు పాచికల తెఱఁగున; క్రేతొట్టు = గట్టొరయు (శ.ర); (కైతొట్టు = ఎగయు); కరళ్ల కైవడిన్ = అలలచందమున; కలయన్ బెరయన్ = అంతటను వ్యాపించుచు; (పెరయన్ = వేఱగుచున్న ఈ అర్థము నిఘంటువులలో లేదు). మెయిమలచి = శరీరములను వంచుచు; పాసియున్ = దూరముగా తొలఁగియును; డాసియున్ = సమీపించియును; తట్టియున్ = చఱచియును; పట్టియున్ = గట్టిగా పట్టుకొనియును; హత్తియున్ = తాఁకియున్ ;ఒత్తియున్ = నొక్కియును; మలంగియున్ = మరలియును; తొలంగియున్ = తప్పించు కొనియును; జడిసియున్ = త్రోసియును; ఒడిసియున్ = ఇంచుకపైకి ఎగిరియును; దాఁటియున్ = దుమికియును; తూఁటియున్ = పొడిచియును; విసరియున్ = ఆడించియును; కొసరియున్ = విజృంభించియును; అదల్చియున్ = బెదరించియున్; ముదల్చియున్ = ఎదుర్కొనియున్; లాసియున్= ఉద్రేకించియును, వ్రేసియున్= తాడించియును; తటిమియున్ = వేగిరపడియును; మెటిమియున్ = ప్రకాశించియును; ఒండొరువుల దేహంబులు; రుధిర + ఆసారంబునన్ = రక్తము యొక్క ధారలచే; తడిసి, కుసుమిత కింశుకంబులన్ = పుష్పించిన మోదుగు చెట్లను; పురుడింపన్ = సాటికాఁగా; లత్తుక జొత్తిల్లిన పుత్తళ్ల విడంబింపన్ = ఎఱ్ఱని లక్కతో చేసిన బొమ్మలను పోలఁగా; గైరిక జలంబులన్ = మిక్కిలి ఎఱ్ఱనైన (జేగురు) ఖనిజ ద్రవ్యము కలిగిన

నీటిలో; మునింగిన సింగంబులన్; తలఁపింపన్= తలఁచుకొనునట్లు; ఉన్న = యుద్ధము కావించుచున్న; సమయంబునన్ =సమయమందు.

వ్యు. గైరికము, గిరియందు పుట్టినది. ఖనిజ ద్రవ్యము. ఆంగ్లమున "రెడ్‌స్టోన్" (ఎఱ్ఱజాయి) అందురు.

తా : ఈవిధముగా సమానముగా పోరుచుండిరి. అప్పుడు సాత్యకి ఎడమ వైపు గుండ్రముగా తిరిగి కన్పట్టఁగా, వాసుదేవుఁడు కుడివైపు జంకులేక, పొరబాటు చేయక, (అపసరణము కానియ్యక) సగము తిరిగి, దగ్గఱకు వచ్చి, చుట్టును గదను త్రిప్పెను. సాత్యకి, ఆ అవకాశమును ఆశింపక, తొందరపడి గదతో కొట్టక, సంతసించి గర్వముతో పైకి ఎగిరెను. అనఁగా పరిచాళిక అనెడి విన్యాసమునకు వశముగాక, ముఖ చాళిచే తప్పించు కొనెను. వెంటనే పౌండ్రుఁడు తిరుగు దెబ్బవేయుచు, (తళది), దళది ప్రయోగించుచు, తన నేర్పునకు తానే ఉబ్బుచు "హోహో" అని తన హర్షమును ప్రకటించెను. సాత్యకి అతని అఱపులకు ఆవేశమును పొంది, "నిలు నిలుము" అని బెదరింపులతో, మండలాకారమున, తిరుగుచు, గదను వెనుకకు సారించి, తన శరీరమునకు రక్షణ లేక వర్తించుటచే ఆ రాజు వెంటనే సీసకమును (శీర్షకమను క్రియా విశేషమును) తలపై ప్రయోగించెను. సాత్యకి, ఆ వేటునుండి రక్షణకై, తటాలున నేలపై కూర్చుండి గదతో ఎడమ చేతిని అడ్డు పెట్టెను. ఇట్లు సాత్యకి తన్ను రక్షించు కొన్న విధము పౌండ్రునికే ఆచ్చెరువు కలిగించినది. అతఁడు సాత్యకి ముందునకు వచ్చి అతని నైపుణ్యమును మెచ్చుకొని కంఠాభరణ మను విన్యాసమును చూపుచు భుజముల మధ్య భాగమున (సాత్యకి) ఱొమ్ముపై కొట్టెను. ఇచ్చట ఈ విన్యాసమును చూపుటచే దీనిచే పరోక్షముగా సాత్యకి "కంఠాభరణమును" అర్పించి ప్రశంసించె నను ధ్వని ఉన్నది.

పిమ్మట సాత్యకి, స్వస్తికముతో వంగి 'పోకుపోకు'"రా రా" అని తన్ను కలియుమని పౌండ్రుని రెచ్చగొట్టెను. ఆ రాజు గదను విసరుచు, ఎగయుచుండఁగా యాదవ వీరుఁడు, ఎదుర్కొనెను.ఇరువురును కామావేశముతో పోరు పాముల వలె, తాళించుచున్న పాచికల వలె, ఒడ్డును ఒరయు అలలవలె కలిసియు విడివడియు (వ్యాపించియు) శరీరములను వంచియు ఇంచుక మరలియు, సమీపించియు తట్టియును పట్టియును అదిమియును, ఒత్తియును, వెనుకకు మరలియును తొలఁగుచును త్రోయుచును, పైకి ఎగురుచును, పాడుచుచును విసరుచు, రేఁగుచు బెదరించుచు, ఎదుర్కొనుచు ఉద్రేకించుచు, వ్రేటు వేయుచు త్వర పడుచు,ప్రకాశించుచు రక్తపు జడిలో తడిసిన మేనులతో పుష్పించిన

మోదుగు చెట్ల వలెను. లక్కతో చేసిన ఎఱ్ఱని బొమ్మలవలెను ఎఱ్ఱని గైరిక ద్రవ్యమును కరిగించిన ద్రవ్యములో మునిఁగిన సింగములవలెను కన్పట్టిరి. ఆ సమయమందు.

విశే. ఇందు గదాయుద్ధ విన్యాసముల పేర్లు ఉన్నవి.తగు తెలుపులతో చదివిన శ్రవణానుభూతి, యుద్ధ భ్రాంతికలుగునని తమ రచనలో శ్రీ వేదము వేంకటరామన్ దీనిని ప్రశంసించిరి. మఱియు గదాయుద్ధ విన్యాసములను కవి ఎఱిఁగియే వ్రాసినట్లు తోఁచుచున్న దనిరి.

గీ. ఆర్చి యెడవంక సాత్యకి యడ్డగింప
వాసుదేవుండు వలవంక వచ్చి యురము
వ్రేయ నవ్వీరుఁ డచ్చోట వ్రేసెఁ దత్త
ఱించి పౌండ్రుఁడు ధర మోఁకఱిల్లఁ బడియె. 65

తా: పెద్దగాఅఱచి,ఎడమ ప్రక్క సాత్యకి అడ్డగింపఁగా వాసుదేవుఁడు కుడి ప్రక్కకు వచ్చి ఱొమ్మును కొట్టెను. సాత్యకియు వెంటనే తానును అతని ఱొమ్మును మోదెను. ఆ దెబ్బకు పౌండ్రుఁడు తత్తఱపాటు చెంది మోకాళ్లు నేలను అంటునట్లు సాగిల పడెను. రూపాం. మ్రోఁకఱిల్లు. (సూ.ని)

కం. ఆలోన నెగసి పౌండ్రన్పృ
పాలుఁడు శైనేయు నిటలపట్టిక వ్రేయం
దూలి యతం డంత గదా
భీలాఘాతమున నతనిఁ బిలుకుర వ్రేసెన్. 66

అర్థ : నిటలపట్టికన్ = నొసటి భాగమును; ఆభీల+ఆఘాతమునన్ = క్రూరమైన దెబ్బతో; పిలుకురన్ = (పిలుకు మారన్) చచ్చునట్లు; (పిలుకురన్ శబ్దము నిఘంటువులలో లేదని బహుశా, ప్రిదుల న్ (సడలన్, పగులన్) రూపాంతరముగ్గా పిలుదురన్ అని పిలుకురన్ పదమును సవరించవచ్చునని శ్రీ వేదము వేంకటరామన్ సూచన. పిలుకు= గర్వము,పిలుకు +అఱన్ = గర్వము నశించునట్లు అనియు, సవరింపవచ్చును.

తా : వెంటనే వాసుదేవుఁడు లేచి సాత్యకినుదుటి పట్టమును కొట్టెను. అతఁడు నేలపై పడుచు, తేఱుకొని గదతో అతని గర్వము నశించునట్లు చావు దెబ్బ నిచ్చెను.

సీ. అటు వ్రేటు వడి పౌండ్రుఁ డంతకుండును బోలెఁ
బెడచాలి గద ద్రిప్పి విడిచిపాటు
వైచినఁ బడి యాదవశ్రేష్ఠుఁ డెన్నఁడేన్
చచ్చినయట్లు భూశయ్య నుండి
గ్రమ్మఱఁ దెలిసి యగ్గద రెండుతునుకలు
చేసి సముద్భట సింహనాద
వదనుఁ డై యున్న నవ్వాసుదేవుఁడు చొచ్చి
యెడమచే సాత్యకి నిఱియఁ బట్టి

గీ. కుడికరంబునఁ బిడికిటఁ బొడిచె నురము
వృష్ణివీరుండు నేలతో వీఁపు మోవ
నతని వైచిన నవ్వీరుఁ డతనిఁ గ్రింద
వైచె రెండు సైన్యంబులుఁ జూచు చుండ. 67

అర్థ : అంతకుండును+ పోలెన్ = యమునివలె; పెడచాలి; క్రియావిశేషము; విడిచివాటు వైచినన్ = విడిచిపడునట్లు చేయఁగా; మోవన్ = అనునట్లు.

తా : ఆ విధముగా దెబ్బతిన్న వాసుదేవుఁడు, యమునివలె గదతో పెడచాళిని ప్రయోగించి సాత్యకిని నేలపై పడఁజేసెను. యాదవవీరుఁడు సాత్యకి ఎప్పుడో చచ్చినట్లు నేల అనెడి పాన్పుపై కొంతసేపు పడియుండి తెలివిని పొంది, లేచి పౌండ్రునిగదను రెండు ముక్కలను చేసి మిక్కిలి పెద్దగా వీరగర్జన చేయుచుండగా పౌండ్రుఁడు మరల పూనుకొని సాత్యకిని ఎడమ చేత కదలనీయక పట్టి ఇఱికించుకొని, (తన శరీరమునకు ఆనించుకొని), కుడిచేతి పిడికిటితో సాత్యకి ఱొమ్మునుపొడిచెను. సాత్యకి, పౌండ్రుని వీపు నేలను తాఁకునట్లు అతనిని బాగుగా గుద్దెను. ఇరుసైన్యములు వారిని చూచు చుండిరి.

అలం : ఉపమ:పౌండ్రుడు అంతకుండును బోలె,
రూపకము, భూశయ్య.

వ. ఇవ్విధంబున మల్లయుద్ధంబునకుఁ దొడంగి. 68

తా : ఈ విధముగా సాత్యకియును, వాసుదేవుఁడును మల్ల యుద్ధమును ప్రారంభించి (మీఁది పద్యముతో).

గీ. కడవరానకుఁ *జోడొక్క కరము హత్తి
జడికిమై బెడగొని పట్టెసమునఁ దొడరి
తోర హత్తంబునకుఁ బోఁత మారి బొబ్బ
ణంబునను వింజ వట్టి విన్నాణ మెసఁగ. 69

ఈ పద్యమందు మల్ల యుద్ధమందు ప్రయోగించు విన్యాసముల పేర్లున్నవి. వానికి సరియైన అర్థమును చెప్పుటకు వీలుకాదు. కనుక, పదస్వరూపమును బట్టి అర్థము ఊహింపఁబడినది. ఆ అర్థములు సరియైనవి కాకపోవచ్చును.

ప్రతి: కడవర + ఆనకున్ = తరువాత ఆనికకు (అదుముటకు) చొచ్చి; డొక్కరము (మల్లబంధము), హత్తి = కూర్చి; పాఠాం. జోడొక్కరము, హత్తి; జడికిమై = మిక్కిలి వేగముతో; బెడగొని =భయంకరముగా; పట్టు+ఎసమునన్ = పట్టు యొక్క అతిశయముచే; తొడరి = ప్రయత్నించి; తోరహత్తంబునకు = మల్లబంధ విశేషము (శ.ర.దీనిని ఉదాహరించెను); పొత్తము + ఊరి = వేర్పడక కలిసి యుండి (రూపాం. పొత్తు); పాఠాం. పోతమారి = క్రొవ్విన ఏనుఁగు యొక్క; బొబ్బణంబునను = బొబ్బరింతలతోను; వింజ (నిఘంటువులలో లేదు), బహుశా "రింజ" కానోపును రింజ = కాలుపట్టుకొనుటకు చొచ్చినచో కాలు తప్పించి మెడను పాదువునట్టి ఒక పట్టు. దీనిని శ.ర ఉదాహరించినది. విన్నాణము + ఎసఁగ = నేర్పు అతిశయింపఁగా.

తా : తరువాత అదుముటకు 'డొక్కరమును' ప్రయోగించిరి. భయంకరముగా వేగముతో పట్టుల అతిశయముతో ప్రారంభించి, 'తోరహత్తమును' ప్రదర్శించుటకై, వేర్పడక కలిసి యుండి, పిమ్మట బొబ్బరింతలతో, 'రింజ'ను నేర్పుతో ఆశ్రయించిరి.

వ. మఱియు వివిధంబులగు విన్నాణంబుల నొడిచియు నెమ్ములు నలియఁ బొడిచియు మండి దాఁకించియుఁ గదలు సోఁకించియుఁ దలలతో భంగించియు భుజంబులు భుజంబులతో ప్రగ్గించియుఁ గక్షంబు కక్షంబుతో ఘట్టించియు వక్షంబు వక్షంబుతో ధట్టించియుఁ గరంబులు కరంబులతో నప్పళించియుఁ బిక్కలు పిక్కలతో నుప్పళించియుఁ జరణంబులు చరణంబులతోఁ దాఁచియు నడుము లాగించి వైచియు లులాయంబులు మలయుమాడ్కిఁ బులులు దలపడ్డ పోలికఁ గరులు

* ఁజొచ్చి డొక్కరము

పోరాడు కయివడి సింగంబులు పెనంగుభంగి నుపతాయితో నళువాయి
నిరువురుం జదిసియుం గదిసియు నచ్చలంబునం జమురు చల్లిన
మంటల పై పయిం బ్రత్తితాల్చిన వడువున నిమ్మపండ్లు నలంచిన
కయివడిఁ బాదరసంబు మర్దించు పంతంబునఁ జోళంబు విఱుచు
తెఱంగున మనసునం బలిమి లేక విసువక పరస్పర జయకాంక్షలఁ
బరాక్రమించు నవసరంబున. 70

ప్రతి : మఱియున్, వివిధంబులు + అగు, విన్నాణంబులన్ = మల్ల బంధ విశేషములతో ఒడిచియున్ = పూనియును; ఎమ్ములున్, నలియన్ పొడిచియున్ = ఎముకలు నలిఁగి పోవునట్లు పొడిచియును; మండి తాఁకించియున్ = మోకరిల్లిన మోకాలిని కొట్టియును కదలు పోకించియున్ = ప్రయత్నములచే ఆవేశమును కల్గించియును; తలలతో భంగించియున్ = డీకొట్టియును; భుజంబులు, భుజంబులతో; ప్రగ్గించియున్ = అడఁచియును; కక్షంబు కక్షంబుతో = ఘట్టించియున్ = ప్రక్కలను ప్రక్కలతో, చేర్చియును; వక్షంబు వక్షంబుతోన్ = ఱొమ్మును ఱొమ్ముతో; ధట్టించియున్ = ఒరయఁ జేసియును; కరంబులు, కరంబులతోన్ = చేతులు చేతులతో; అప్పళించియున్ = పట్టుకొనియును; ఆస్ఫాలనము చేసియును (చఱచియు) పిక్కలు పిక్కలతోన్ = క్రింది కాలి వెనుకటి భాగములను, వానితోనే ఉప్పళించియున్ = తాఁకించియును, క్రియా విశేషము. రూపాం. ఉప్పరించు (దీనిని శ.ర. ఉదాహరించినది) చరణంబులు చరణంబులతోన్ తాఁచియున్ = కాళ్లను కాళ్లతో తన్నియును; నడుము లాగించి; వైచియున్ = పడవేసియును; లులాయంబులు = అడవి దున్నలు; మలయు మాడ్కిన్ = పెనఁగు లాడు విధమున; పులులు తల పడ్డ పోలికన్; కరులు = ఏనుఁగులు పోరాడు కైవడిన్ = పోరు రీతిని; సింగంబులు పెనంగు; భంగిన్ = విధమున; ఉపతాయితోన్ = మల్లబంధ విశేషము; అళువాయిన్ = ఇది యొక పట్టు; పాఠాం. అళుకు = వెఱపు; పాయన్ = తొలఁగఁగా (భయమును వీడి) ఇరువురున్; చదిసియున్ = నలిఁగియును; కునిసియున్ = కృశించియును, అచ్చలమునన్ = కోపముతో; చమురు చల్లిన మంటలపైన్ ప్రత్తిన్; తాల్చిన వడువునన్ = మెలిపెట్టినట్లు కాలుచేతులను మెలియఁజేయుచు, నిమ్మపండున్; నలంచిన కయివడి = నలిపి పిండినట్లు; పాదరసంబు; మర్దించు పంతంబునన్ = నూఱిన తీరున చోళంబు = జొన్న చొప్పను; విఱుచు తెఱంగునన్; మనసునన్; బలిమి లేక (రేఁగ) = సారము లేకయును (వశము తప్పుచున్నను); విసువక = విసుగు చెందక, పట్టుదలను వదలక; పరస్పర జయకాంక్షలన్ = ఒకరిని మఱొకరు జయింప వలె నను కోరికలతో; పరాక్రమించు సమయంబునన్ = పరాక్రమమును ప్రదర్శించునప్పుడు.

తా : సాత్యకియును, పౌండ్రుఁడును పెక్కు మల్ల యుద్ధ విన్యాసములతో శరీరావయము లన్నింటిని ఒకదానితో మఱొకటి రాయునట్లు చేయుచు, అడవి దున్నలు, పులులు, ఏనుఁగులు, సింహములు భయంకరముగా పోరు విధమున భయమును వీడి కోపముతో మంటల మీఁద నూనె చల్లఁగా ఆమంటలు ఎట్లు ఒక్కసారిగా పైకి ఎగయునో, అట్లు ఉప్పొంగుచు, ఆమంటలపై పత్తిని వేసిన అదెట్లు వెంటనే మెలికలును పొంది కాలిపోవునో, ఆవిధముగాను (ఇరువురు) తమ తమ కాళ్ళను చేతులను మెలిపెట్టుచు, నిమ్మపండు పిండినట్లు,పాదరసమును మర్దించునట్లు,జొన్న చొప్పను విఱిచినట్లు,మనసులు వివశములు అగుచున్నను,పట్టుదలను వదలక,తమ జయమందే కోరిక కలవారై తమ పరాక్రమమును ప్రదర్శించు సమయమందు.

ఉ. రెండుబలంబులందు నర రే యరరే యరరే యనంగ నొం
డొండఁ జెలంగు సన్నుతుల నుబ్బుదు రీయదు వీరుఁ జంపుఁ బౌం
డ్రుం డనువారు సాత్యకి కఠోర భుజాపరిఘుండు పౌండ్ర భూ
మండల నాథుఁ జంపు ననుమానము లేదను వారుఁ బోరిలోన్. 71

అర్థ : ఒండొండన్ = క్రమక్రమముగా; కఠోర భుజాపరిఘుండు = కఠినములైన ఇనుప గుదియలవంటి భుజములు కలవాఁడు;

తా : సాత్యకి పౌండ్రరాజుల మల్ల యుద్ధమును చూచు ఇరుపక్షములలో గల సైన్యము "అరరే! అరరే! అరరే!" అనుచు క్రమక్రమముగా కావించు పొగడ్తలు, వారివురిని పురికొల్పినవి. కొందఱు "ఈ యదువీరుని వాసుదేవుఁడు తప్పక చంపును" అనిరి. కొందఱుకు "కఠినములైన గుదియలవంటి భుజములు కల సాత్యకి పౌండ్రుని చంపును సందేహము లేదు" అనిరి. ఇట్లు సైనికులు తమలో తాము యుద్ధ సమయమందు మాట్లాడు కొనుచుండిరి.

కం. అట్టి యెడఁ బుండ్రనందను
ఘట్టించి యదూద్వహుండు దశముష్టిహతిన్
బిట్టడువ నయిదు ముష్టుల
నెట్టు వొడిచె నతఁడు నొడలు నెళినెళి యనఁగన్. 72

ప్రతి :అట్టి+ఎడన్;పుండ్రనందను ఘట్టించి= వాసుదేవుని అదలించి;యదు+ఉద్భవుండు (ఉద్వహుండు)= యాదవ వంశమున జన్మించిన సాత్యకి, (ఉద్ధరించువాఁడు); దశముష్టిహతిన్

= పది పిడికిటి పోట్లతో; బిట్టు+అడువన్= అతిశయముగా అతని(ఉద్రేకమును)తగ్గింపఁగా; అతఁడు = వాసుదేవుఁడు; అయిదుముష్టులన్ = అయిదు పిడికిటి గ్రుద్దులతో; ఒడలు = (సాత్యకి)మేను; నెళినెళి అనఁగన్ = ఎముకలు విఱుఁగుచున్న శబ్దము కలుగు చుండఁగా;నెట్టు + పొడిచెన్ = (నెట్టుగా) పూనికతో పొడిచెను.

తా : ఆ సమయమందు, సాత్యకి వాసుదేవుని అదలించి, పది పిడికిటి పోట్లను ఇచ్చి, అతని పొంగును తగ్గించెను. వాసుదేవుఁడును, అయిదు పిడికిటి గ్రుద్దులతో "నెళి నెళి" అను ఎముకలు విఱుగుచున్న ధ్వనులు వినఁబడుచుండగా సాత్యకి మేను సడలునట్లు పూనికతో పొడిచెను.

ఒక పిడికిటి గ్రుద్దు అయిన వెంటనే మఱొకటి వరుసగా విరామము లేక అయిదింటిని అర్పించి తృప్తి పడెను.

## - : బలరాముఁ డేకలవ్యునితోఁ దలపడి పోరుట : -

గీ. అంతలో నేకలవ్యుండు హలధరుండు
నాహవోత్సాహ సన్నాహ మతిశయిల్ల
నెక్కటెక్కటిఁ దలపడ్డ నేకలవ్యుఁ
డేసె బలభద్రు నమ్ముల నిరువదింట. 73

తా: సాత్యకియును వాసుదేవుఁడును మల్ల యుద్ధమందు బల ప్రదర్శనమును కావించు చుండఁగా, ఏకలవ్యుఁడును బలరాముఁడును యుద్ధము చేయవలెనను ఉత్సాహముతో (పట్టుదల) కూడిన ప్రయత్నము అధికమగుచుండఁగా ఒకరిని మఱొకరు ఎదిరించిరి. అప్పుడు ఏకలవ్యుఁడు బలరామునిపై ఇరువది బాణములను వేసెను.

కం. ప్రదరంబులు పదియింటం
బదియింటం బదిట రెంటఁ బరువడి నేసెన్
మొదల నరదంబు సూతుం
దుది నేసె న్నారి దునియఁ ద్రుళ్ళి చెలఁగుచున్. 74

తా : ఏకలవ్యుఁడు ఒక్క చోట నిలువక అతిశయించుచు క్రమముగా మొదట ఇరువది బాణములను తేరుపై, పిమ్మట సూతుని మీఁద పదింటిని, ప్రయోగించెను. తుదిని రెంటిని వేసి, బలరాముని వింటి అల్లె త్రాటిని తెగఁగొట్టెను.

ఉ. అంతట రాముఁ డొండు గొనయం బమరన్ శరముల్ నిషాద సా
మంతుని మేనిలోఁ బది యమర్చి తదీయధనుఃప్రకాండ మిం
తింతలుగా దశాశుగము లేసి పదింటను ముప్పదింటఁ ద
ద్దంతి బలంబు నేయుచుఁ బతాక ధరం బడ భల్ల మేసినన్. 75

అర్థ : ఒండు = మఱొక; గొనయంబున్ = త్రాటిని; ధనుఃప్రకాండము = వింటిబద్దను; దంతిబలంబున్ = ఏనుఁగుల సైన్యమును.

తా : బలరాముఁడు మఱొక నారిని తన వింటిలో అమర్చుకొని, సామంతుఁడగు, బోయరాజు శరీరములో పది బాణములను నాటెను. వానివింటి బద్దను పదింటితో ముక్కలు ముక్కలుగా చీల్చెను. తర్వాత పదియును ముప్పదియును, మొత్తము నలుబది బాణములను వేసి, వాని ఏనుఁగుల సేనపై ప్రయోగించి, అతని పతాకమును నేలమీఁద పడఁగొట్టెను.

వ్యు. దంతి, దంతములు కలది, ఏనుఁగు
గొనయము(వి),గుణము (ప్ర)

సీ. ఆనిషా దేశ్వరుం డపర కోదండంబు
మధ్యమాంగుష్ఠప్రమాణదశక
ముగ మహామౌర్వీకముగ ధరించి నిశాత
ముఖసాయకమున రాముని యురంబు
నెఱ నాట నేసిన నిట్టూర్పు నిగిడించి
యతఁ డేకలవ్యు బాణాసనంబు
దశవిశిఖముల లస్తకము *చక్కటిఁ ద్రుంచె
నవ్వీరుఁ డొక నిశాతాసి వైవ
గీ. నడుమ నయిదుబాణంబుల నఱకె సీరి
వాఁడు సూతుపై నొక హేతి వైవ నదియుఁ
బదిశరంబులఁ దునిమె నబ్బలుఁడతండు
ఘంటలు చెలంగ నొకశక్తిఁ గనలి వైచె. 76

* చక్కికిఁ

అర్థ : కోదండంబు = నాలుగు మూరలవిల్లు (శ.ర) ఆఱు అడుగులు (72 అం); మధ్యమ + అంగుష్ఠ ప్రమాణ దశకముగన్ = నడిమి వ్రేలికిని, బొటన వ్రేలికిని చాచినప్పుడు నడుమ గల దూరమునకు పదిరెట్లు పొడవుండునట్లు అనఁగా పదిజేనల పొడవు. జేన అనఁగా శ.ర 12 అం. అని చెప్పుచున్నది. జేన అనగా తొమ్మిది అంగళములు అను అభిప్రాయము ఉన్నది. కనుక కోదండము 72అం. 90అం, 120అం పొడవు కల దగును. మహా మౌర్వీకముగన్ = గొప్ప గట్టిదైన అల్లె త్రాటితోను; బాణ + ఆసనంబున్ = వింటిని; లస్తకము చక్కటిన్ = వింటి నడిమి చోటును; నిశాత + అసిన్ = వాఁడియైన కత్తిని; శక్తి = చిల్లకోల.

తా : ఆ బోయరాజు మఱియొక పెద్ద వింటిని (72/90/120/అం. పొడవు) గట్టిదైన అల్లె త్రాటిని కల దానిని గ్రహించి, వాఁడియైన మొనగల బాణమును ప్రయోగించి, బలరాముని ఱొమ్మున నాటునట్లు చేసెను. అతఁడు ఆ వేటునకు పెద్ద ఊర్పు వదలి ఏకలవ్యుని వింటి నడిమి చోటును సరిగా పదిబాణములచే చక్కగా విఱుగఁగొట్టెను. అంతట ఆ బోయరాజు ఒక వాఁడియైన కత్తిని తీసికొని, బలరామునిపై వేయఁగా అతఁడు దానిని అయిదింటితో దానిని నఱికి వేసెను. బోయఁడు మరల మఱొక కత్తిని విసరఁగా దానిని కూడ బలీయుఁడైన బలరాముఁడు పదింటితో ముక్కలు చేసెను. కోపించి నిషాదుఁడు మ్రోఁగెడు ఘంటలున్న ఒక చిల్లకోలను బలరామునిపై వేసెను.

వ్యు. సీరి : సీరము (నాఁగలి) కలవాఁడు, బలరాముఁడు (సీరపాణి).

వ్యు. కోదండము 'గో' అనగా బాణము. గోదండము = విల్లు, అమ్ముకట్ట; వ్యవహారమున గోదండము కోదండమైనది (వే. వేంకటరామన్)

గీ. ఒడలు నొలియించి యదువీరుఁ డొడిసి పట్టి
యమ్మహాశక్తిఁ గ్రమ్మఱ నతని వైచె
నురము గాడఁగ భూపతుల్ తిరిగి చూడ
వేగ నది చేసె నించుక వెలితి చావు. 77

అర్థ :వెలితిచావు= జీవము కొంత మాత్రమే మిగిలియుండుచావు.

తా : బలరాముఁడు మేనిని ఇంచుక వంచి ఆ గొప్ప శక్తిని, పైకి ఎగిరి వాటముగా పట్టుకొని దానినే మరల బోయనిపై విసరివేసెను. ఆ శక్తి, వేగముతో బోయని ఱొమ్మును తాఁకి అందు నాటుకొనెను. రాజులు అందఱు చూచుచుండఁగా ఆ ఏకలవ్యునిలో ఇంచుకంత జీవము మాత్రమే మిగిలి ఉండెను. ఏకలవ్యుఁడు మరణించె ననియే అందఱు తలంచిరి.

వ. అట్టి యెడఁ దదీయ సైన్యంబు గజిబిజించిన. 78

తా : ఆ సమయమందు బోయరాజు సైన్యము గజిబిజించినది. కలఁతచెందినది (శ.ర. దీనిని ఉదాహరించినది.)

విశే : "గజిబిజించు" సోమన మొదట ప్రయోగించెను.

శా. దృష్టారాతినృపప్రతాప కలుషోద్రేకోగ్రమై తాఁ కె నం
దష్టాశీతి సహస్ర నిష్ఠుర నిషాదాధీశ సైన్యంబు సం
ఘృష్టాన్యోన్య భుజావిజృంభణ రణ త్కేయూర ధారోన్నత
స్పష్టాసి క్షురికా కుఠారపరిఘ ప్రాసక్షురప్రోద్ధతిన్. 79

ప్రతి : అందు = అక్కడ; అష్ట + అశీతి సహస్ర నిష్ఠుర నిషాద + అధీశసైన్యంబు = ఎనుబది ఎనిమిది వేల సంఖ్య గల క్రూరమైన బోయరాజు సైన్యము; దృష్ట + అరాతి నృప ప్రతాప కలుష + ఉద్రేక + ఉగ్రమై = ప్రకటమగుచున్న (స్పష్టముగా తెలియుచున్న), శత్రురాజుల యొక్క పాప పూరితమైన ఆవేశము కలిగి, భయంకరమై; సంఘృష్ట + అన్యోన్య భుజా విజృంభణ రణత్ కేయూర = ఒక దానిని మఱొకటి ఒరసి కొను భుజములచే చెలరేఁగుచు, శబ్దించుచున్న కడియముల యొక్క; ధార + ఉన్నత = మిక్కిలి పదును గల; స్పష్ట = బాగుగా కన్పట్టుచున్న; అసి = కత్తులు; క్షురికా=సురియలు (చురకత్తులు); కుఠార = గొడ్డళ్లు; పరిఘ = ఇనుప గుదియలు; ప్రాస = విసరివేయు ఈఁటెలు; క్షుర= పెద్దకత్తులు (మొదలగువాని) ప్రోద్ధతిన్= అతిశయమైన దర్పముతో; తాఁకెన్ = యాదవుల సేను ఎదిరించెను.

తా : ఏకలవ్యుని క్రూరమైన ఎనుబది ఎనిమిది వేల సైన్యము యాదవుల పరాక్రమమునకు కలఁతచెందినది. పాపపూరిత మైన ఆవేశముతో భయంకరముగా ఒరయుచున్న తమ భుజములపై కల కడియములు శబ్దించు చుండఁగా మిక్కిలి మేలైన ఆయుధములు తమ కాంతులను ప్రకటించుచుండగా గర్వముతో ఏకలవ్యుఁడు యాదవులను ఎదిరించెను.

పాఠాం. ప్రథమపాదము : సందష్ట

అలం: వృత్త్యనుప్రాసము "దృష్ట దష్ట ఘృష్ట స్పష్ట" ఇందు "ష్ట" ఆవృత్తమైనది.

ఛం. దుష్కరప్రాసము. షకార టకారముల సంయుక్తాక్షరము.

ఇందు పదప్రయోగము, సైనికుల భావోద్రేకమును పోషించునదిగ నున్నది.

వ. ఇట్లు దాఁకి బలభద్రుం బొదివి వివిధాయుధంబులం గనలించిన నవ్వీరుండు లయకాలశూలాయుధుండునుం బోలె హల విహారం బమర సమరంబు సలుప బలుపు మిగిలి మగతనంబునం దలపడి మడిసిన ముంగలివీరులం గనుంగొనియునుం గడివోవని కడిమి నిగుడం దెగి నడచి మగుడం దెరువు లేక నెగ డడిచిన చందనంబునం బొలియు బలుమూఁకలును నాఁకొనిన బెబ్బులికి నబ్బిన గిబ్బలవిధంబున బహువిధ వధంబులం బడిన బలు మానుసులును నుసులు లేక మానంబు మనంబునకు ధనంబుగా వనంబునం గార్చిచ్చునం గమరిన యట్లు రూపు చెడి పీనుంగు పెంట లగు చోట్ల శరంబులు రాలినను శిరంబులు వంపక కుంతంబులు వడినను బంతంబులు వదలక ప్రాసంబులు వెడలినను రోసంబులు సడలక గదలు తొలంగినను నెదలు సలింపక శూలంబులు వోయినను నోలంబులు దలంపక చాపంబులు విఱిగినను దాపంబులం బొరలక లావున నిక్కియుఁ బ్రేవులం జిక్కియు మెడలు మ్రగ్గియుఁ దొడలు స్రగ్గియుఁ బ్రక్కలు నలిసియు డొక్కలు నులిసియు వీఁపులు వగిలియు మూఁపులు నొగిలియు ముక్కులు చదిసియుఁ జెక్కులు చిదిసియు నెత్తురుల జొత్తిల్లి లత్తుక పుత్తళుల పోలికం గాలు గాలునం బెనంగ నిడు పొడువునం గూలిన యట్టల తెట్టలు గట్టలుగొన్న నెదురు దొట్టిన రుధిర తరంగిణీ తటాకంబుల నోలలాడు భూతబేతాళంబుల వైతాళంబునకు నంతరంగంబు రంజిల్ల నయ్యాదవసింహంబు సింహనాదంబు చేసిన. 80

ప్రతి : ఇట్లు; తాఁకి = ఎదుర్కొని; బలభద్రునిన్; పొదివి = చుట్టుముట్టి వివిధ +ఆయుధంబులన్ = వేర్వేఱు పోరుటకు ఉపయోగించు సాధనములతో,; కనలించినన్ = కోపమును కలిగింపఁగా; ఆ+వీరుండు;లయకాల శూల + ఆయుధుండునున్ + పోలెన్= భయంకరుఁడైన ప్రళయ కాలమందు, సర్వమును నాశము చేయు శూలమును ధరించిన వానివలె(శివుని);హలవిహారంబు+అమరన్= నాఁగలి ప్రయోగమును చక్కగా చేయుచు; సమరంబున్= యుద్ధమును; సలుపన్= చేయుటకు రూపాం. చలుపన్ (ఇది వ్యవహారమున సకారాది పదము; వ్రాఁత ప్రతులలో పరుషాదిగానున్నది); బలుపు మిగిలి = బలము

అతిశయించి; మగతనంబునన్ = పౌరుషముతో; తలపడి; మడిసిన = చచ్చిన; ముంగలి వీరులన్ = ముందు నడిచిన యోధులను; కనుగొనియునున్ = చూచియును; కడి + పోవని = నశింపని; కడిమి = పరాక్రమము; నిగుడన్ = మెఱయు చుండఁగా; తెగినడిచి = తెగువతో సాగి; మగుడన్ = తిరుగుటకు; తెరువులేక = దారిలేక; నెగడు + అడిచిన చందంబునన్ = కాళ్లకు వేయు బంధముచే కదలలేని విధమున; పొలియు = ప్రాణములను వదలిపెట్టు; పలు మూఁకలున్ = పెక్కు సైనికుల గుంపులును, ఆఁకొనిన = ఆఁకలి చెందిన; బెబ్బులికిన్ = పెద్ద పులికి; అబ్బిన గిబ్బల విధంబునన్ = దొరకిన అచ్చుటెద్దుల వలె (శ.ర. దీనిని ఉదాహరించినది.) బహువిధ వధంబులన్ = పెక్కు రీతులుగా ప్రాణములను తొలఁగించుటచే పడిన; బలు = బలమైన; పెద్ద; మానుసులును; నుసులు = లాఘవము లేక పోయినను, (సులభముగా యుద్ధము చేయుటకు అవకాశము లేక పోయినను); మానంబు = వీరుఁడనెడి పేరునకు తగిన మనస్సు యొక్క ఉనికి, గౌరవము; ధనంబు + కాన్ = సొమ్ముగా (తలఁచి); కారు + చిచ్చునన్ = అడవి మంటలో; కమరిన యట్లు; మాడిన తీరున; రూపుచెడి; పీనుంగు పెంటలు + అగుచోట్లన్ = శవముల మొత్తము కూడు చోట్లలో; శరంబులు = బాణములు; రాలినను = మీఁద పడినను; శిరంబులు = తలలను; వంపక; కుంతంబులు + పడినను = బల్లెములు తమపై పడుచున్నను; పంతంబులు = పౌరుషములను వదలక; ప్రాసంబులు = విసరివేయునట్టి ఆయుధములు; వెడలినను = వెల్వడి (నొప్పించు చున్నను); రోసంబులు; సడలక = మార్పును పొందక; కదలు = ప్రయత్నములు; తొలంగినను; ఎదలు = హృదయములు; చలింపక = భయపడక; శూలంబులు పోయిననున్ = (చేతిలోనున్న) మూడు మొనలుగల ఆయుధములు (విఱిగి) పోయినను; ఓలంబులున్ = దాఁగు కొనుటకు చోట్లను; తలంపక; చాపంబులున్ = విండ్లును; విఱిగిననున్; తాపంబులన్ + పొరలన్ = చింతలతో, వర్తింపక; లావునన్ = బలముతో, నిక్కియున్ =రెచ్చియును, ప్రేవులన్ = (వెలుపలికివచ్చిన) ప్రేగులతో; చిక్కియున్ = కృశించియును; మెడలు; ద్రుగ్గియున్ = (వ్రాలి పోవుటచే) బాధ పడియును; తొడలు; స్రగ్గియున్ అఁడగిపోయియును, రూపాం . సగ్గు; ప్రక్కలు = శరీరము యొక్క కుడి ఎడమ భాగములు; నలిసియున్ = నలిఁగిపోయియును, (శ.ర.) డొక్కలు = ఎముకల గూళ్లు; నులిసియున్ = పొడిపొడిగా అయినను; వీఁపులు + పగిలియున్, మూఁపులున్ = ఎగుభుజములును; నొగిలియున్ = బాధను పొందియును; ముక్కులు; చదిసియున్ = అదుమఁబడియును; చెక్కులు = చెక్కిళ్ళు, చెంపలు; చిదిసియున్ = చీలియును; నెత్తురులన్; జొత్తిల్లి = ఎఱ్ఱఁదనమును పొంది; లత్తుకల = ఎఱ్ఱని లక్కతో చేయఁబడిన; పుత్తడుల పోలికన్ = బొమ్మలవలె; కాలు కాలునన్ పెనంగన్; నిడుపాడువునన్ = నిడుపైన ఎత్తుతో (స్తంభమువలె); కూలిన అట్టల తెట్టలు = నేలపైపడిన (తలతెగిన శరీరముల) మొండెముల మొత్తములు; కట్టలు కొన్నన్ = రాశులు అగుచుండఁగా; ఎదురు తొట్టిన = ఎదుట నిండినట్టి; రుధిర

తరంగిణీ = నెత్తుటి అలలుగల; తటాకంబులన్ = చెఱువులలో; ఓలలాడు = వినోదము కొఱకు క్రీడించు; భూత = అమానుషజీవుల యొక్క; బేతాళంబుల = ప్రేతముల యొక్క; వైతాళంబునకున్ = వికృతమైన చేష్టలకు; అంతరంగంబు = మనస్సు; ఆహ్లాదమును పొందఁగా; ఆ యాదవ సింహంబు = ఆ గొల్లలలో మేటి అయిన ఆ బలరాముఁడు; సింహనాదంబు చేసిన = సింహము వలె, గర్జన చేయఁగా.

తా : ఈ విధముగా బలరాముని ఎదుర్కొని రకరకములైన ఆయుధములతో అతని కోపమును రెచ్చఁగొట్టఁగా ఆ బలుఁడు, ప్రళయకాలమందు విజృంభించు రుద్రునివలె, నాఁగలిని త్రిప్పుచు, గర్వించి పౌరుషముతో శత్రువులను మార్కొనెను. అప్పుడు మరణించి తనఎదుట నున్న వీరులను చూచియును, ఇంకను పరాక్రమము ప్రకాశించుచుండఁగా, సాహసముతో ప్రవర్తించి మరల పోవుటకు వీలులేక కాళ్లకు కట్టిన ఇనుప గొలుసులచే పడిపోయినట్లు ప్రాణములను వదలుచున్న పెక్కు సైనికులును, ఆఁకలిగొన్న పెద్ద పులికి దొరికిన ఎద్దులవలె పెక్కు రీతులతో చంపఁబడిన బలవంతులైన మనుష్యులును; యుద్ధము చేయుటకు అవకాశము అల్ప మైనను అనఁగా తమ ఉనికి కష్టమైనను, పోరాటము ప్రతికూలముగా పరిణమించుచున్నను గౌరవము (వీరత్వము) మనస్సునకు ముఖ్యమైన ధనమని తలంచి అడవి మంటలలో మాడిపోయినట్లు, రూపులు చెడి పీనుఁగు పెంటలగు చోట్లలో, బాణములు మీఁద పడుచున్నను, తలలను వంచక, బల్లెములు, ఇతర ఆయుధములు పడుచున్నను, పౌరుషమును వీడక, రోషమును వదలక, తమ ప్రయత్నములు చేయలేక పోయినను; భయపడక, చేతులలో నున్న శూలములు విఱిగి పోయినను దాఁగు కొనుచోట్లను తలఁపక, విండ్లు విఱిగినను చింతింపక, బలముతో రేఁగి, ప్రేవులు వెల్వడి కృశించి, మెడలు వాలిపోవుచు బాధ పడియును, తొడలు అఁడగిపోయినను, మేని ప్రక్కలు నలిగి పోయినను, డొక్కలు పొడిపొడి అయినను, వీఁపులు పగిలినను, మూఁపులు నొచ్చియును, ముక్కులు అదుమఁబడియును, చెక్కిళ్లు చీలియును, నెత్తుటిలో తడిసి, ఎఱ్ఱని లక్క బొమ్మల వలె, కాళ్లతో పెనఁగుచు నిట్ట నిలువున కంబములవలె కూలుచు, మొండెములు రాశులు అగుచుండఁగా ఎదుట నిండిన నెత్తుటి చెఱువులలో ఆటలాడు భూతముల ప్రేతముల యొక్క వికృత చేష్టలు తన చిత్తమునకు ఆహ్లాదమును ఒసఁగు చుండఁగా, ఆ గొల్లలలో మేటి వీరుఁడు బలరాముఁడు సింహమువలె గర్జనలు చేయుచు ఉప్పొంగుచుండఁగా.

(వి) నెగుడు, నెగడు, నిగడము; ప్ర. నిగళ= ఇనుపగొలుసు.

మ. హృదిఁ జైతన్యము వొందఁ దెప్పిఱి నిషాదేశుండు సంరబ్ధతం
గద చేతం గొని కామపాల హల సంఘట్ట క్షతాత్మీయ సై
న్య దశాదర్శన జాత రోషతఁ బ్రలంబారాతి జత్రు స్థలం
బదర న్వేయఁగ సీరియుం గదఁ దదీయాంగంబు నొప్పించినన్. 81

ప్రతి : నిషాద + ఈశుండు= బోయరాజు;హృది = హృదయము; చైతన్యమున్= పొందన్ = (ఇంతకు ముందు వెలితి చావును పొందిన ఏకలవ్యుఁడు) తేలుకొని తెలివిని పొంది; సంరబ్ధతన్ = వేగిరపాటుతో; గద చేతన్ +కొని; కామపాల హల సంఘట్ట క్షత = బలరాముని నాఁగలియొక్క వ్రేటులచే గాయ పడి (చచ్చిన);ఆత్మీయ సైన్య దశాదర్శన = తనసైన్యము యొక్క దుర్దశను చూచుటచే; జాత = తనలో రెచ్చిన; రోషతన్ = కోపముతో; ప్రలంబ+అరాతి = ప్రలంబుని పగవాడైన బలరాముని యొక్క; జత్రు స్థలంబున్= మూపుల యొక్క సంధులలో నుండు ఎముకలను;అదరన్ వ్రేయఁగన్;సీరియున్ = (నాఁగలి ధరించిన వాఁడు) బలరాముఁడు; గదన్ = తన గదతో; తదీయ + అంగంబున్ = బోయని, శరీరమును; నొప్పించినన్ = బాధింపఁగా.

తా : ఇంచుక ప్రాణము మాత్రము మిగిలియున్న బోయరాజు కొంతసేపటికి తెలివిని పొందెను. వెంటనే వేగిరపాటుతో తనగదను ధరించి నాఁగటి దెబ్బలచే గాయపడి మృతిచెంది, దుర్దశను పొందిన తన సైన్యమును చూచి అతిశయించిన కోపముతో బలరాముని మూపుల సంధులందుండు ఎముకలను అదరఁగొట్టెను. వెన్వెంటనే బలరాముఁడు తన గదతో బోయరాజు మేనిని బాగుగా కొట్టి బాధించెను.

కం. అయ్యిరువురు గద లడరఁగ
వ్రయ్యం గ్రుయ్యంగ వ్రేయు రవమున జలధుల్
వియ్యా లందఁగ మదమున
డయ్యక పోరిరి వికంకట బలోద్భటు లై. 82

అర్థ : అడరఁగన్ = విజృంభించు చుండఁగా (అదరఁగన్) వ్రయ్యన్ = పగులునట్లు చేయుటకు;క్రుయ్యంగన్=వెనుదీయునట్లును;వియ్యాలు+అందఁగన్=నెయ్యము (స్నేహము) ఏర్పడునట్లు(వియ్యము = వివాహసంబంధము); డయ్యక = అలసిపోక; వికంకటబల+ఉద్భటులై = అధికమైన బలముచే ఉత్సాహముతో అతిశయించిన వారై.

తా : ఆ ఇరువురు తమ గదలు అతిశయించుచుండఁగా వానిని పగులకొట్టుటకు,

అవి వెనుదీయుటకును చేయు ఆ బొబ్బరింతలలో సముద్రములు, నెయ్య మేర్పఱుచు కొన్నట్లయినవి. ఇట్లు పొగరుతో అలయక అధికమైన బలోత్సాహములతో పోరాడిరి.

కం. ఆ సమయంబునఁ బౌంద్రుఁడు
వ్రేసెన్ గద వ్రేసినట్లు వృష్ణివిభుఁ దిరం
బై సాత్యకియును వానిం
జేసేతన వ్రేసెఁ బిడుగు చిట్లిన భంగిన్. 83

అర్థ : వృష్ణి విభున్ =వృష్ణి వంశమునకు చెందిన సాత్యకిని; గద వ్రేసినట్లు = గదతో కొట్టినట్లు,(తన పిడికిటితో) కొట్టెను; సాత్యకియును తిరంబై = గట్టిగా ఆ దెబ్బకు చలింపక (నిలఁద్రొక్కుకొని); చేతన్+చేతన్+అ = వెంటనే; పిడుగు చిట్లిన భంగిన్ = పిడుగు కొట్టినట్లు; వ్రేసెను = పిడికిటితో పొడిచెను.

తా : ఆ సమయమందు, వాసుదేవుఁడు సాత్యకిని పిడికిటితో గదతో కొట్టినట్లు ఒక పోటును ఇచ్చెను. సాత్యకి చలింపక ఆ దెబ్బను సహించి గట్టిగా నిలిచి, తన చేతియొక్క బలము నంతటిని ఉపయోగించి పిడుగు అతని మేనిని చీల్చినట్లు పిడికిటితో పొడిచెను.

అలం : ఉపమ, పిడుగు చిట్లిన భంగిన్.

తిరము (వి)స్థిరము (ప్ర)

విశే. చూడుము. 72 వ పద్యము. సాత్యకి వాసుదేవులు ముష్టియుద్ధమును కావించుచుండిరి. ఇచ్చట అది సాగుచుండె నని తలంప వలెను.

కం. వేవిన యంతకు నలువురు
జావంకంబులును బోలె సైన్యము హాహా
రావములతోడఁ జూడఁగ
దీవన వడయంగఁ దూర్పు తెలతెల *వాఱెన్. 84

ప్రతి : వేవిన+అంతకున్ = సూర్యుఁడు ఉదయింపఁగా; నలువురు = సాత్యకి, వాసుదేవుడు, బలరాముఁడు ఏకలవ్యుడు; చావు+ వంకంబులును + పోలెన్ = చావఁబోవునపుడు కన్పట్టు గుర్తులవలె (ప్రేత కళలతో); సైన్యము; హాహా రవములతోడన్ = దుఃఖముతోను, ఆశ్చర్యముతోను

* వేగెన్

'ఆహా ఆహా' అనెడి శబ్దములను చేయుచు (శరీరములు రక్తముతో తడిసి అంతటను ఎఱ్ఱనైఉన్నవి); చూడఁగన్ = చూచుచుండఁగా; దీవన + పడయంగన్ = భక్తుల మునుల, జనుల ఆశీస్సులను అందుకొనుటకు తూర్పు సంధ్య తెలతెలవాఱెను = తెల్లనై గోచరించెను, తూర్పు దిక్కు తెల్లనై సూర్యోదయముతో కన్పట్టెను.

అలం : ఉపమ, నలువురు చావంకంబులును బోలె.

ఉత్ప్రేక్ష, దీవన వడయంగ 'దూర్పు తెలతెలవాఱెన్'.

పాఠాం. జావంకంబులును బోలె, జా=జాబుర అనెడి ఎఱ్ఱని మొక్కలవలె (జాబురా, జాబరా రూపాం.) దీనికి సిందూరపుష్పి అనియు పేరు. మూడు మీటర్లు పెరుగును. పూవులు గుత్తులు గుత్తులుగా ఎఱ్ఱగా నుండును. జా వంకంబులును పోలెన్, జాజు + వంకంబులును వలె; జాజు = ఎఱుపు (వన్నె), వంకంబులును వలె = కొయ్యలవలె.

వ. తదనంతరంబ. 85

తా : సులభము

సీ. కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన
పురుహూతు నిల్లాలి బొట్టనంగఁ
జక్రవాకములకుఁ జల్లఁగా మందు ద్రా
గించిన చెంద్రంపుగిన్నె యనఁగఁ
బార్వతీ పతికిఁ బ్రభాత భూపతి గొన్న
యలరు గెందమ్మి కోహళి యనఁగఁ
తొలిదిక్కు తొయ్యలి చెలులపైఁ జల్లంగ
నిండ ముంచిన పైఁడికుండ యనఁగ.

గీ. మేరు ధరణీధరంబుతో మేలమాడ
నుదయగిరిరాజు దల యెత్తెనో యనంగ
గ్రమముతో నించుకించుక గాన నగుచు
భానుబింబంబు గన్నుల పండువయ్యె. 86

అర్థ : కుంకుమ =ఎఱ్ఱని వన్నెకల పొడి. నుదుట పెట్టుకొనుటకు ఉపయోగింతురు.

చెంద్రము+గిన్నె > చెంద్రంపు గిన్నె = ఎఱ్ఱని పాత్ర; ప్రభాత భూపతి = తెల్లవాఱుటకు నాల్గు గడియలకు పూర్వమున గల కాలము, ప్రభాతము, గడియ = ఇరువదినాలుగు నిముషములు, ప్రభాతకాల మనెడి రాజు; కోహళి = మొగ్గ; పైఁడి = బంగారు; ఉదయగిరి రాజు = ఉదయ గిరులకు రాజు; మేరు ధరణీ ధరంబుతో = మేరు పర్వతముతో; మేలమాడన్ = (అంత ఎత్తు లేక పోయినను)పరిహసించుటకై; కన్నుల పండువు+అయ్యెన్ = కన్నులకు గొప్ప సంతోషము కలిగినది.

తా : నొసటియందు కుంకుమను అత్తి అలంకరించి కొనగోటితో దానిని గుండ్రముగా నుండునట్లు సవరించిన ఇంద్రుని ఇల్లాలైన శచీదేవి యొక్క ఎఱ్ఱని సిందూర తిలకము వలెను, ఎడబాటు చెంది తపించు చున్న చక్రవాకపు జంటకు శైత్యోపచారముగా (చల్లఁదనమును పొందుటకు) అవసరమైన (ఔషధమును) పానీయమును త్రాపింపఁజేసిన ఎఱ్ఱని పాత్రవలెను, శివునకు ప్రభాతకాలమనెడి రాజు పూజకై గ్రహించిన వికసించిన ఎఱ్ఱదామర మొగ్గ వలెను, తూర్పు దిక్కాంత, తన చెలిమి కత్తెలపై జలక్రీడలలో పాల్గొనుచు, వారిపై చల్లుటకు నీరు నిండునట్లు ముంచినట్టి బంగారు కుండవలెను, మేరు పర్వత రాజుతో సల్లాపముచేసి పరిహసించుటకు తన ఎత్తును పెంచుటకై ఉదయగిరుల రాజు తలను పైకెత్తి నట్లును, ఆకాశముపైకి క్రమ క్రమముగా వచ్చుచు, సూర్య బింబము, కన్నులకు మహానందమును కూర్చెను.

అలం : ఉత్ప్రేక్ష.

(వి) చెంద్రము, చెందిరము. (ప్ర) సిందూరము

(వి) కుంకుము, (ప్ర) కుంకుమ.

## - : శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున కేతెంచుట : -

ఉ. అంత మురాంతకున్ బదరికాశ్రమవాసులు వీడుకొన్న ని
శ్చింతుఁ డతండు పత్త్రరథసింహము నెక్కి విమానపంక్తు లం
తంతఁ దొలంగ వచ్చి నగరాంతిక సంగర సంభ్రమారవం
బెంతయు దవ్వులం జెవుల నించుక సోఁకిన సంశయించుచున్. 87

అర్థ : పత్త్ర రథ సింహమున్ = శ్రేష్ఠమైన ఱెక్కలే సాధనములైన రథము; గరుడుఁడు; అంతిక = సమీపమందు; సంగర సంభ్రమ+ఆరవము = సమరము చెలఁగు ధ్వనులు;ఎంతయు దవ్వులన్ = చాల దూరమునుండియే,

తా : పిమ్మట శ్రీకృష్ణుడు బదరికాశ్రమ వాసులైన మునీంద్రులు వీడ్కోలియ్యఁగా చింతలేక గరుడుని ఎక్కి ఆకాశమందు విమానముల వరుసలు, అడ్డు తొలఁగుచుండఁగా ద్వారకానగర సమీపమును చేరెను. దూరమునుండియే యుద్ధము చెలఁగు ధ్వానములు ఇంచుక, చెవులకు సోకినవి. సంశయము కలిగినవాఁడై (మీఁది పద్యముతో).

గీ. హలధరుని యార్పు సాత్యకియార్భటియును
ప్రతిభటనినాదముల దాఁటి పరఁగుటయును
దెలిసి కంసారి సంగరోద్రేకఘూర్ణ
మాన నయనుఁ డై యి ట్లని మదిఁ దలంచు. 88

తా : హలధరుఁడైన బలరాముని పెద్ద అఱపులును, తమ్ముఁడైన సాత్యకి గొప్ప మ్రోఁతలును, శత్రువులు కావించు యుద్ధధ్వనులను అతిక్రమించి వ్యాపించుచుండఁగా, ద్వారకలో ఏమి సంభవించినదో తెలిసి కొన్న వాఁడై, శ్రీ కృష్ణుఁడు, యుద్ధము చేయ వలె ననెడి ఆవేశముచే తీవ్రముగా చలించుచున్న కన్నులు కలవాఁడై మనసులో ఇట్లు తలంచెను.

చం. కటకట పుండ్రనందనుఁడు కన్నులఁ గానక వచ్చి వీటిపై
నిటు విడియంగఁ జాలె నఁట యింకిట యాదవకోటి కేటికిం
జటుల పరాక్రమం బనుచుఁ జయ్యనఁ జేరి మురారి యొత్తె ను
ద్భట కుటిలారి హృత్పుట విపాటన ధన్యముఁ బాంచజన్యమున్. 89

అర్థ : ఉద్భట కుటిల+అరి= అతిశయించుచున్న(గర్వించుచున్న), దుర్జనులైన శత్రువుల యొక్క; హృత్+పుట విపాట ధన్యమున్ = దొప్పల వంటి హృదయములను (గుండెలను) చీల్చు (కంపింపఁజేయు), పుణ్యము చేయు నట్టిదియునైన;పాంచజన్యమున్ = ఆ పేరుగల శంఖమును; ఒత్తెన్ = పూరించెను, ఊఁదెను.

తా : "అయ్యో! ఎంతసంకటము సంభవించినది. మదముతో ఆ పుండ్ర రాజ తనయుఁడు, వాసుదేవుఁడు ఈ ద్వారకను ఇట్లు రాత్రి పూట ముట్టడించుటకు సాహసించెను కదా! ఇంక మీఁద యాదవుల సమూహమునకు పటుత్వమైన పరాక్రమము కలిగియు ప్రయోజనమేమి?" అనుచు, వేగముతో ద్వారకను చేరి శత్రువుల గుండెలను కంపింపఁజేసి చీల్చునట్టి తన పాంచజన్య మనెడి పవిత్ర కార్యములందు ప్రవర్తించునట్టి శంఖమును, భయంకరముగా పూరించెను.

అలం : రూపకము హృత్పుటము.

అలం : అంత్యానుప్రాసము, ధన్యమున్, జన్యమున్.

వ్యు. : పాంచజన్యము. పంచజనుఁడనెడి రక్కసుని ఎముక వలన కలిగినది. పంచజనుఁడు సాందీపని పుత్రుని అపహరించెను. బలరామ కృష్ణులు, గురు పుత్రుని విడిపించుటకై అతనిని వధించిరి.

కం. ఆనినదము విని యాదవ
సేనలు పొంగారె నెదిరి సేనలు సళ్లెన్
మానవపతితతి వంది జ
నానూనస్తుతులు చెలఁగె నచ్యుతు మ్రోలన్. 90

తా : ఆ పాంచన్య శంఖ నాదమును విని యాదవ సేనలు సంతసముతో పొంగినవి. శత్రువుల సేనలు (పాఠాం. చట్లెన్) సళ్లెన్ = సడలినవి. వారి ధైర్యము సన్నగిల్లనది. రాజుల సమూహము యొక్కయు భట్రాజుల యొక్కయు తక్కువకాని (ఎక్కువైన) పొగడ్తలు, శ్రీకృష్ణునికి బాగుగా వినఁబడినవి.

వ్యు. అచ్యుతుఁడు, చ్యుతిలేని వాఁడు, హరి.

చం. గరుఁడుని డిగ్గి వీడ్కొలిపి కంసవిరోధి పురంబులోపలం
దిరపడి దారుకుం బనిచెఁ దే రలవాటుగఁ దేర నెక్కి సం
గరకుతుకంబుతో వెడలి గర్వితు లెల్లను దల్లడిల్ల ని
ష్ఠుర రవ పాంచజన్యుఁడగుచున్ నిగుడం గని పౌండ్రుఁడత్తఱిన్. 91

తా : శ్రీ కృష్ణుడు గరుడునిపై నుండి దిగి, అతనికి వీడ్కోలు ఇచ్చి, ద్వారకలో (తిరముపడి) కుదురుకొని విశ్రమించి దారుకునకు ఆనతిచ్చి పంపెను. రథమును అలవాటు ప్రకారము తీసికొని రాఁగా దానిని ఎక్కి యుద్ధము చేయవలె నను కుతూహలంబుతో పయనమై, గర్వించిన పగవారందఱును తల్లడిల్లఁగా, క్రూరమును భయంకరము నగు రవమును కల పాంచజన్యమును ధరించినవాడై, నిలఁబడఁగా పౌండ్రుఁడు, ఆ సమయమందు.

వ్యా. తేరన్ తెచ్చు+నుజ, తుమర్థ భావలక్షణమందు 'నుజ' వచ్చును.

క్రియ బాల - 40, ఇచ్చట భావలక్షణమున నుజ వచ్చినది.

2. 'జీ'ఇత్తు గలది జీత్తు, క్రియ, బాల - 86

3. 'తే తేరులు' తెచ్చునకగు. క్రియ, బాల - 93 సూత్రముచే (ముజ జత్తులు) ముత్తు పరమగుచో తెచ్చు ధాతువునకు "తేరు" ఆదేశమైనది. కనుక "తేరన్" సిద్ధించినది, "తేన్" అనురూపమును, సిద్ధించును.

కం. శిని మనుమఁడు నిలు నిలు మని
వెనువెంటం దవిలి రాజవే నీవు ననుం
జెనకి యపకారితనమునఁ
జన వచ్చునె యనుడు శౌరి సాత్యకి కనియెన్. 92

పౌండ్రుఁడు, సాత్యకితో యుద్ధముచేయుటకు ఇష్టము లేని వాఁడై శ్రీ కృష్ణుని పాంచజన్య రవమును విని అతనితో యుద్ధము చేయుటకు అవకాశము లభించినదని తలంచి పోవనుండఁగా సాత్యకి వెంటపడి ఇట్లనెను.

తా : "నిలువు నిలువుము. నీవురాజవా?నన్ను ఎదుర్కొని (ఉపకరించు నెపముతో తొలఁగి పోవచ్చునా?) యుద్ధ ధర్మమునకు వ్యతిరేకముగా తొలఁగిపోవుట తగునా?" అని సాత్యకి పౌండ్రునితో వచించుచుండఁగా శ్రీ కృష్ణుఁడు ఇట్లు సాత్యకితో పలికెను.

విశే. అపకారము, కీడు కాదు. పద్ధతికి విరుద్ధమని భావము (వే.వేం)

మ. రణసంరంభము మాన్ప నేమిటి కనా రానిమ్ము రానిమ్ము వా
రణ గర్వంబు మృగేంద్ర సంచరణపర్యంతంబ నీగాలికిం
దృణమీతం డనుచు న్ని జానుజునిఁ బ్రీతిం దేర్చినం బౌండ్రుఁ డు
ల్బణరోషంబున వాసుదేవునకు నుల్లాసంబుతో నిట్లనున్. 93

ప్రతి : అనా = అన్నా! (వాత్సల్యముతో తమ్ముని పిలుచుచున్నాఁడు); రణ సంరంభమున్ = నాతో యుద్ధము చేయవలయుననెడి, (పౌండ్రుని) ఉద్రేకమును; మాన్పన్ + ఏమిటికి = ఏల నీవు అడ్డగింప వలెను; రాన్+ఇమ్ము= నాపైకి తల పడ నిమ్ము; వారణగర్వంబు = ఏనుఁగు యొక్క గర్వము; మృగ+ ఇంద్ర సంచరణ పర్యంతంబు+అ = సింహము దాని కడకు వచ్చునంత వఱకేకదా! నీ గాలికిన్ +తృణము+ఈతండు = ఈ పౌండ్రుఁడు నీవు అనెడి

గాలికి గడ్డి పోచయే (నీవు సులభముగా అతని గర్వమును అణఁచ గలవను తన నమ్మకమును ప్రకటించుచు, తమ్ముని నొప్పింపక) అనుచున్; నిజ+అనుజునిన్ = తన తమ్ముని; ప్రీతిన్= ప్రేమతో; తేల్చినన్ = ఉప్పొంగఁ జేయఁగా; పౌండ్రుఁడు; ఉల్బణరోషంబునన్ = ఉబుకు చున్న తీవ్రమైన కోపముతో (తన్ను గడ్డిపోచతో పోల్చినందులకు); ఉల్లాసంబుతోన్= యుద్ధమందుఁగల ఉత్సాహాతిశయముతో; ఇట్లు + అనెన్.

తా : "అన్నా! పౌండ్రుని సమరోత్సాహమునకు ఏల అడ్డు పడెదవు? రానిమ్ము ఏనుఁగు గర్వము సింహము దానిని వధించునంతవఱకే కదా! నీకు అతఁడు గడ్డిపోచ అని శ్రీ కృష్ణుఁడు తమ్ముని ప్రేమతో ఆదరించి సంతోషింపఁ జేసెను. పౌండ్రుఁడు ఆ మాటలకు కినుక వహించి ఉత్సాహాతిశయముతో వాసుదేవునితో ఇట్లనెను.

అలం : రూపకము నీగాలికిన్ తృణమీతండు .

2. దృష్టాంతము : "వారణ గర్వంబు మగేంద్ర సంచరణ పర్యంతంబు"

ఉ. నీవును వాసు దేవుఁడవు నిక్కమ యేనును వాసుదేవుఁడం
బో వినువారి కైన నిది వోలునె యింతటనుండి ధాత్రిలో
గోవులఁ గాచి గాడిదల గొడ్డులఁ బోతులఁ జంపిరేని నే
జీవుల వాసుదేవ్వఁ డనం జెల్లునె లావునఁ బేరు సెల్లునే. 94

తా : నీవును వాసుదేవుఁడను పేరును కలిగిఉన్నావు. నిజమే! నేను వాసుదేవుఁడను, (అంచోన్ = అన్నచో) అన్నచో (పాఠాం. వాసుదేవుఁడన్ +పో) వినువారికి ఇది సరియైనదా? (అట్లనుట దోషమనుట), ఇంక మీఁద ధరణిలో ఆల మందలను పాలించుచు గాడిదలను జంతువులను ఆల పోతులను, చంపినచో ఏ ప్రాణులను అయినను (ఎవరినైనను) వాసుదేవుఁడనుట తగునా? కేవలము బలముచే పేరువచ్చునా? పేరునకు యోగ్యత అవసరము.

ఖర రూప రాక్షసుఁడు : ధేనుకాసురుఁడు గాడిద రూపము కలవాఁడు ఇతనిని బలరాముఁడు చంపెను. ఈ రాక్షసుని బంధువులు అందఱును, గాడిద రూపము కలవారై, తాళ వనమునందు బలరామ కృష్ణులచే హతులైరి.

ఘోటకాసురుఁడు : కేశి అనురాక్షసుఁడు అశ్వరూపము కలవాఁడై కృష్ణునిచే చంపఁబడెను.

కువలయాపీడము : ఈ పేరుగల ఏనుఁగును మావటీంద్రతో కూడ, కృష్ణుఁడు వధించెను.

బకాసురుఁడు : పూతన అనెడి రాక్షస స్త్రీ యొక్క తమ్ముఁడు. కొంగరూపుకలవాఁడు, ఇతనిని కృష్ణుఁడు చంపెను.

అఘాసురుఁడు : బకాసురుని తమ్ముఁడు. కొండ చిలువ రూపము కలవాఁడు. ఇతనిని కృష్ణుఁడుచంపెను.

వత్సాసురుఁడు : లేఁగదూడ రూపమున వచ్చి దూడలను చంపుచుండఁగా 'కృష్ణుడు' ఇతనిని చంపెను.

వృషభాసురుఁడు : అరిష్టుఁడను రాక్షసుఁడు. ఆఁబోతు రూపమును ధరించి కృష్ణునిచే హతుఁడయ్యెను.

పై వారిలో గాడిద, గుఱ్ఱము, కొంగ, కొండచిలువ లేఁగదూడ, వృషభ రూపములు కలిగిన రాక్షసులు, కువలయాపీడ మను ఏనుఁగు, చంపఁబడుటచే, పౌండ్రుఁడు హేళన చేయుచున్నాఁడు.

కం. నాకును గద నీకును గద
నాకును నందకము నీకు నందక మహహా
నాకును జక్రము చక్రము
నీకును విలు నాకు విల్లు నీకుం దగునే. 95

తా : 'నాకును గద' నీకును గద ఉన్నది. నాకు నందకము అనెడి కత్తి నీకు కూడ ఆ పేరుగల కత్తి ఉన్నది. ఆహా (వికటమైన నవ్వుతో) నాకును చక్రము నీకును చక్ర మున్నది. నీకును విల్లు, నాకును విల్లున్నది. ఇట్లు నీవు నా వలె, గద, కత్తి, చక్రము విల్లు ధరించుటకు తగిన వాఁడవా?

మ. నిను నీవారలఁ బోరిలో గెలిచెదన్ నేఁడెందుఁ *పోవచ్చు నీ
కనుమానింపక వాసుదేవుఁడన నొయ్యారంబునం జెల్ల దె
వ్వనిఁగాఁజూచితి నన్ను నొక్కగుహలో వర్తింప సింహద్వయం
బునకుం గూడునె యోడునే యొరునికిం బుండ్రక్షమాధీశుఁడున్." 96

* ఁబో

తా : నిన్ను, నీ బంధువులను, యుద్ధముతో గెలిచెదను. నేఁడు నన్ను తప్పించుకొని ఎచ్చటికి పోఁగలవు? నీవు ఎట్టి సందేహము లేక (తగిన వాఁడవు కాకపోయినను) కులుకుచు 'వాసుదేవుఁడు' అను పేరును వహించినను, అది నీకు వర్తింపదు. నన్ను ఎట్టి వాఁడవని తలఁచినావు? (సామాన్యుఁడను కాను అనుట). ఒక్క గుహలో రెండు సింహములు ఉండునా? ఈ పుండ్ర వంశమునకు చెందిన ధరణీనాథుఁడు (రాజు) ఎవని చే నైనను ఓటమిని పొందునా?

"నీవు నేను ఒకే పేరు కలిగియున్నాము. మనలో ఒకఁడే జీవింపవలెను. నీకు ఆ పేరు తగదు. నిన్ను జయించి నా పేరు నిలఁబెట్టుకొందును" అని హెచ్చరిక.

వ్యు. క్షమా+అధీశుఁడు. పుడమికి నాయకుఁడు, రాజు.

ఉ. నావుడు నవ్వు నెమ్మొగమున న్నెగయంగ జనార్దనుండు రా
రా వెడమాట లాడక దురాగ్రహ చెల్లదు వాసుదేవ సం
భావన నీకు నేఁ గలుగఁ బార్థివు లెన్నరు గాక *యెన్నఁడున్
లావు గొఱంత గాక నిఖిలక్రియ చక్రము నీదు చక్రమున్. 97

అర్థ : వెడమాటలు = సారములేని, అల్పమైన; దురాగ్రహ = మూర్ఖమైన పట్టుదల కలవాఁడా! సంభావన = గౌరవము; కొఱంత = లోపము; నిఖిల క్రియ చక్రము ఇందు క్రియ హ్రస్వాంతముగా నుండ రాదని శ్రీ వేదము వేంకటరామన్ 'నిఖిలాయస' లేదా నిఖిలాకృతి అని సవరణ చేయఁదగు ననిరి.

తా : అని పౌండ్రుఁడు వచింపఁగా జనార్దనుఁడు, నిండు ముఖమున నవ్వు తోఁపఁగా (పరిహాససూచకము), "నాతో యుద్ధమునకు సిద్ధపడుము. అల్పమైన, ప్రయోజనము లేని మాటలు ఆడవద్దు. మూర్ఖుఁడా! నేనుండఁగా ఒక్క చోట కూడ, రాజులు, నీకు వాసుదేవుఁడను గౌరవమును ఇచ్చి ఆదరింపరు, (నిన్ను లక్ష్యము చేయరు). నీ చక్రము పూర్తిగా ఇనుముతో చేయఁబడి, నిండైన ఆకృతి కలదై, గొప్ప బరువు కలిగియున్నది. (బరువులో లోపములేదు).

విశే. స్థూలమైనను సామర్థ్యము లేని దనుట. పాఠాం. ఎన్నడున్ = ఏకాలమందును,

నానా. చక్రము = ఆయుధ విశేషము, నీటి సుడి, రాష్ట్రము, కమ్మరిసారి, చక్రవాక పక్షి, గుంపు, బండికల్లు, చిన్న నాణెము, దండు మొ.

---

* యొక్కెడన్

గీ. వెండియును గైదువులు నీకు వేఱ కలుగుఁ
బేరు కలసొమ్ము లగుఁ బోర బెండుకంటె
లావు గల వని వింటిమి లజ్జకండ
యొడలఁ గలదేని బలుమాట లుడిగి నడవు. 98

తా : మఱియును నీకు ఆయుధములు వేర్వేఱు ఉన్నవి. గొప్ప పేర్లే వాని సంపద. అట్టి నీ అధీనములోని వస్తువులు కయ్యములో బెండు కంటె బలమైనవి అని వింటిమి. వాని శక్తి అంతే. నీ శరీరములో సిగ్గు, కండబలము రెండును ఉన్నట్లయితే మాటలు మాని పోరుటకు నడువుము (అధిక ప్రసంగమేల?),

సీ. అనుచు మురాంతకుం డాపౌండ్రు నొకనిశా
తాశుగంబున నేసె నతఁడు బాణ
దశకంబుఁ గంసారి దాఁకించి దారకు
నిరువదేనమ్ముల నేసి తురగ
ముల మేనఁ బదిశరంబులు గ్రుచ్చి వెండియు
హరిమీఁద డెబ్బది యమ్ము లేయ
మురవైరి మానసంబున నగి వాని ద
ర్పము గంద దొడ్డ నారసము దొడిగి

గీ. జలజనాభుండు కోదండ చతురుఁ డగుచు
గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి
వారెనయుఁ జక్రరక్షక ద్వయముఁ ద్రుంచి
కల్లు బిల్లలు చేసి వెగ్గలము నవ్వె. 99

అర్థ : వాఱెన = నొగతో కాడిని చేర్చి కట్టెడు సన్నని చర్మ పుత్రాడు (శ.ర. దీనిని ఉదాహరించినది); చక్ర రక్ష కద్వయము = తేరునకు ఇరు ప్రక్కలనుండి రక్షించువారు; వెగ్గలము = అధికము.

తా : అనుచు శ్రీ కృష్ణుఁడు ఆ వాసుదేవునిపై ఒక వాఁడియైన ఆశుగమును (బాణమును) వేసెను, అతఁడు పది బాణములచే హరిని తాఁకించి, రథ సారథిపై

ఇరువదింటిని ప్రయోగించెను. గుఱ్ఱముల మేనిపై, పదింటిని నాటఁజేసి, మరల హరిపై డెబ్బది బాణములను వేసెను. మురాసురుని విరోధి, శ్రీకృష్ణుఁడు మనసులోనే నవ్వుకొని, వాని గర్వమును మాడ్చుటకు ఒక పెద్ద బాణమును వింటిలో కూర్చి, విలు విద్యయందు చాతుర్యమును ప్రకటించుచు, వరుసగా, గుఱ్ఱములను, సారథిని, నొగకు కాడికిని కట్టిన చర్మపు త్రాటిని, ఇరువైపులనుండి, తేరును రక్షించు ఇరువురు బంటులను, కూల్చి, బండి చక్రముల ఆకులను ముక్కలు ముక్కలుగ తెగఁగొట్టి, అట్ట హాసము చేసెను. (పెద్దగా నవ్వెను).

గీ. తేరిపని మానిపిన వాసుదేవుఁ డిలకు
దాఁటి శాతాసి వైచె మాధవుని మీఁదఁ
బదిశరంబులఁ ద్రుంచి గోపాలవిభుఁడు
ముద్దుఁడును బోలె కన్నులు మూసికొనియె. 100

తా : తేరిమీఁద నుండు పనిని తొలఁగించుటచే పౌండ్రుఁడు నేలమీఁదికి దుమికి మాధవునిపై వాఁడియైన(శాత+అసి) కత్తినివేసెను.గోవులకు ప్రభువు, శ్రీకృష్ణుఁడు, పది బాణములతో దానిని త్రుంచి వేసి, అప్పుడు ఏమి చేయుటకు తోఁపనివానివలె కన్నులను మూసికొనెను.

వ్యా. తేరు+పని > తేరిపని. ఔపవిభక్తిక ఉత్వమునకు ఇత్వము.

విశే. పౌండ్రుకునకు మరణకాలము ఆసన్నమైనది. అతనిని వధించుటకు, తన చక్రాయుధమును ఆయత్తము చేసికొనుటకు అద్దానిని స్మరించెననవచ్చును.

చం. అతఁ డొక శక్తివైచిన మురాంతకుఁ డంతన రెండు నేసె న
క్షతమదలీల వాఁడు పరిఘంబున వైచినఁ ద్రుంచెఁ బౌండ్రభూ
పతి బహులోహ భారదృఢభార దృఢార కఠోర చక్ర ము
ద్ధతిఁ గొని నీతలంబె యిది దాఁకిన నోర్వఁగ నంచు నేసినన్. 101

అర్థ :బహులోహభార = పెక్కులోహముల యొక్క బరువును; దృఢభార = ఇనుము యొక్క బరువును, దృఢ+అర = (చక్రపు) బలమైన ఆకులు (అడ్డచెక్కలు);కఠోర చక్రము= గట్టిదైన చక్రాయుధము.

తా : పౌండ్రభూపతి ఒక చిల్లకోలను వేయఁగా శ్రీ కృష్ణుఁడు దానిని వెంటనే రెండుగా

చీల్చెను. మొక్కవోని పొగరుతో ఆ రాజు, ఇనుప గుదియను వేసెను. దీనిని హరి త్రుంచెను. ఆ వాసుదేవుఁడు (పౌండ్రరాజు) పెక్కు లోహములతో బరువైనదియును, అధికముగా ఇనుము కలియుటచే బరువైనదియును, బలిష్ఠమైనదియు ఆకులు కలదియును, అత్యంతము కఠినమైనదియును, అగు చక్రాయుధమును గ్రహించి "ఓయీ, ఈ చక్రము నిన్ను అంటఁగా దానిని ఎదుర్కొని సహించుటకు నీకు సాధ్యమా?" అనుచు గర్వముతో హరిపై దానిని ప్రయోగించెను.

కం. గగనమున వచ్చు చక్రముఁ
జిగురాకుం బోలెఁ జక్రి చేఁబట్టి వడిన్
మగుడంగఁ ద్రిప్పి వైచిన
బెడగక మై ముఱిసి వాఁడు వెల్లుగ నార్చెన్. 102

అర్థ : బెగడికమై = భయముతో; మురిసి = కులుకు చున్నవాఁడై; (ముఱిసి = గర్వించి)

తా :ఆకసమున వచ్చు పౌండ్రుని చక్రాయుధమును, హరి చిగురాకును పట్టుకొన్నట్లు తేలికగా పట్టుకొని వేగముతో దానినే త్రిప్పి పౌండ్రునిపై మరల్చి వేసెను. అతఁడు భయముతో చలించుచు పెద్దగా అఱచెను.

అలం : ఉపమ, చిగురాకుంబోలెఁ జక్రి చేపట్టి.

వ్యా. వాడుడు+పెల్లుగ = వాఁడు వెల్లుగ(గసడవాదేశము).
ముఱిసి = గర్వించి ఈ అర్థము కుదురదు.

వ్యా. బెగడు+ఇక = బెగడిక

సూ. ఇకవర్ణకం బగ్గలాదులకగు. తద్ధిత, బాల - 7.

కం. కడు వెఱఁగంది మురాంతకుఁ
డొడి దప్పినపాము వోలె నుండఁగ మఱి *దా
నొడిసెల జొన్నల కాడెడి
వడువునఁ బౌండ్రుండు ఱాల వైచెం బెలుచన్. 103

అర్థ : ఒడి = ఒడుపు (లక్ష్యము). శ.ర. దీనిని ఉదాహరించినది. ఒడిసెల = క్షేపణి,ఱాలు విసరివేయుటకై ఏర్పఱుచుకొన్న చిన్న దారపు వల.

* యున్, వడిసెడి త్రొక్కుల

తా : హరి, పౌండ్రునిపై ప్రయోగించిన అతని చక్రము అతనిని ఏమియును చేయలేకపోయినది. అపుడు అతఁడు లక్ష్యము తప్పుటచే పూనిక లేని పామువలె ప్రూన్పాటు చెందెను. పౌండ్రుఁడు. ఆయుధము ఏదియు తన కడ లేక పోవుటచే చిన్న దారపు వలతో జొన్నల కొంకు ఊలను వేసినట్లు ఊలెను అధికముగా విసరెను.

అలం. ఉపమ.

## - : శ్రీ కృష్ణుఁడు చక్రమునఁ బౌండ్రుని తలఁ దునుముట : -

మ. అవి నారాయణుఁ డమ్ములం దునిమె నానాస్త్రంబులం గ్రమ్మఱం
గవియం జేసి యొకింత బీరము సెడం గారించి దైతేయ చ
క్రవిదార క్రకచ క్రమం బయిన చక్రం బెత్తి తద్దేహముం
బవుల వ్రైచినఁ దుంగ వ్రచ్చిన గతిం బాసెం బ్రకాశంబుగన్. 104

ప్రతి : అవి= ఆ ఊలను; నారాయణుఁడు; అమ్ములన్ = బాణములతో; తునిమెన్ = ముక్కలు చేసెను. క్రమ్మఱన్ = మరల; నానా+అస్త్రంబులన్ = వివిధములైన ఆయుధములను కవియన్ + చేసి =అతనిపై వ్యాపింపఁజేసి; ఒకింత బీరము + చెడన్ = కొంత వఱకు పరాక్రమము చెడునట్లు; కారించి = బాధ పెట్టి; దైతేయ చక్ర = రక్కసుల సమూహమును; విదార చీల్చునట్టి; క్రకచ క్రమంబు+అయిన = అంపపు అంచుల పదును కలిగినట్టి చక్రంబు = సుదర్శన చక్రాయుధమును ఎత్తి; తద్ దేహమున్ = ఆ వాసుదేవుని శరీరమును; పవులన్ వైచినన్ = పగులఁగొట్టఁగా; తుంగ వ్రచ్చిన గతిన్ = తుంగ గడ్డ చీలిన విధమున; ప్రకాశంబుగన్ = స్పష్టముగా (అందఱు చూచుచుండఁగా);పాసెన్ = ఆ శరీరము విడివడినది (రెండు ముక్కలైనది).

తా : ఆ నారాయణుఁడు తన అమ్ములతో, ఆ ఊలను నిర్మూలించెను. మరల వేర్వేఱు ఆయుధములను వేసి వ్యథను కలిగించి, పీడించి, రాక్షస సమూహమును చీల్చుటలో, అంపపు అంచులవంటి పదును కల సుదర్శన చక్రముతో అతని శరీరము రెండగునట్లు చీల్చెను.

అలం : ఉపమ. తద్దేహమున్ తుంగ వ్రచ్చిన గతిన్ పాసెన్.

వ. ఆ సమయంబున. 105

తా : సులభము.

చ. హలధరుఁ డేకలవ్యహృదయంబు గొనన్ ఘనశక్తి వైచినన్
బలుగద వైచె వాఁడు బలభద్రుని వక్ష మతండు రెండు సే
తుల గద పూన్చివైచె నదితోరపు మంటలు మింటనంటఁ బైఁ
బొలసినఁ దేరుడిగ్గి చెడిపోయె నిషాదుఁడు గాందిశీకుఁడై. 106

ప్రతి : హలధరుఁడు = బలరాముఁడు; ఏకలవ్య హృదయంబున్ = ఱొమ్మును; కొనన్ = నాటునట్లు, తాఁకునట్లు; ఘనశక్తిన్ = చిల్లకోలను; వైచినన్; వాఁడు = బోయఁడు;బల భద్రుని వక్షమున్ = బలరాముని ఱొమ్మును లక్షించి; బలు గదవై చెన్ = బలమైన గదను విసరెను;అతండు = బలరాముఁడు; రెండు+చేతులన్ (తన) గదన్; పూన్చి = పట్టుకొని; వైచెన్ = (నిషాదుని) గదపై వేసెను; అది = ఆ బోయని గద; తోరము+మంటలు = ఎక్కువైన మంటలతో మింటన్ అంటన్ = ఆకాశమును తాఁకునట్లు; పొలసినన్ = ప్రకాశింపఁగా (గోచరమగు చుండఁగా); నిషాదుఁడు = బోయఁడు ఏకలవ్యుఁడు; కాందిశీకుఁడై = భయముచే దిక్కులను గుర్తింపక, ఏవైపు ఎక్కడికి పోవుచున్నాఁడో తెలియని వాడై; తేరు డిగ్గి; చెడిపోయెన్ = పాఱిపోయెను.

నానా : హృదయము = మనస్సు, గుండెకాయ, ఱొమ్ము (వి) ఎద ఎడద ఎడ్ద.

తా : బలరాముఁడు ఆ ఏకలవ్యుని ఱొమ్మును తాఁకుటకై శక్తిని ప్రయోగించెను. అతఁడు బలరాముని ఱొమ్ము పైకి బలమైన తన గదను విసరెను. బలరాముఁడు తన గదను రెండు చేతులతో పట్టుకొని బోయని గదను శక్తి కొలది కొట్టెను. అప్పుడు బోయని గద రేఁగిన మంటలతో ఆకాశమును అంటు చు జ్వలించెను. ఆనిషాదుఁడు ఆ దృశ్యమును చూచి ధైర్యము వీడి ఎక్కడికి పోవుచున్నాఁడో తెలియని వాఁడై తేరును దిగి తన ప్రాణములను రక్షించుకొనుటకై యుద్ధమును విరమించుకొని పరుగిడి పోయెను.

వ్యా. బలభద్రుని వక్షమున్, ఇచ్చట ద్వితీయకు ప్రథమ, "వక్షము" అని. జడంబు ద్వితీయకు ప్రథమ వచ్చినది కారక, బాల - 24.

గీ. విఱిగి పాఱినఁ బో నీక వెన్నడించు
హలధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన
నుఱికి దరి చేర రా కైదు యోజనములు
లావుతో నీఁది వాఁ డొక దీవి చేరె. 107

అర్థ : విఱిగి = ఓడిపోయి; వెన్నడించు=వెంబడించు శ.ర. దీనిని ఉదాహరించినది; వెగడు+ఒంది = తల్లడ పడి; (చలించినమనస్సుకలవాఁడై); యోజనము = ఆమడ;నాలుగు కోసుల దూరము; కోసు = రెండు వేల విండ్లు పట్టు దూరము, యోజనము = సుమారు తొమ్మిది మైళ్లు (వే.వేం)

తా : ఏకలవ్యుఁడు బలరామునకు ఓడి పాఱిపోవు చుండఁగా బలరాముఁడు అతనిని తఱుముకొని పోయెను. వెనుకవచ్చు బలరాముని చూచి, బోయఁడు బెగడొంది. మనస్సు చలించి ప్రాణభీతితో సముద్రములోనికి ఉఱికెను. తీరము చేరలేక ఇరువది కోసుల దూరమును ఈదు కొనుచు పోయి ఆవల దరి చేరెను.

వ్యా. దీవిని=దీవి ద్వితీయకు ప్రథమ కారక, బాల - 24. దీవి (వి). ద్వీపము (ప్ర)

విశే. నిషాదుఁడు నీచ కులజుఁడు యుద్ధ రంగమందు భయ మావేశించుటచే పిఱికి వాఁడై ప్రాణరక్షణకై సముద్రములో దుమికి, గొప్ప ఈఁతగాఁ డగుటచే చాల దూరము ఈఁది తన్ను రక్షించుకొనెను.

వ. ఇట్లు నీలాంబరుం డేకలవ్యు పలాయనంబునం బరిపూర్ణమనోరథుం డై మరలి యంతకు మున్న సంతసంబున సామంత సహితుం డై సభామండపంబునం బేరోలగంబున నున్న నీల వర్ణుం గలసె, సాత్య కియును సకల యదు వీరసమేతంబుగా నయ్యెడకు వచ్చె నవ్వి ధంబున విజయవిభవభాసురుండై వాసుదేవుండు కైలాస యాత్రా ప్రసంగంబు చేసి ఘంటాకర్ణ కాలాంతకుల వృత్తాంతంబును గొనియాడి పార్వతీపతి ప్రసన్నుం డగుటయు వరలాభంబును సురలు సంయములు హరిహరాభేదభావంబుఁ దెలియుటయు నెఱింగించి యెల్లవారల నిజనివాసంబులకు వీడుకొలిపి యనంతరంబ యంతఃపుర ప్రవేశంబు చేసి సత్యభామా రుక్మిణుల సన్నిధిం దన సకల వృత్తాంతంబును జెప్పె నని చెప్పి వైశంపాయనుండు జనమేజయునితో నట్టి యెడ నొక్క విస్మయంబు వినఁ గల దవధరింపు మని యిట్లనియె. 108

తా :- ఈ విధముగా నీల వస్త్రధారి బలరాముఁడు ఏకలవ్యుఁడు యుద్ధముచేయక పిఱికి పందయై పరుగిడి పోఁగా, సిద్ధించిన కోరిక కలవాఁడై మరలి ద్వారకకు వచ్చి అంతకు ముందే సంతసముతో సామంతులతో కూడి సభామండపమందు నిండు

కొలువులో నున్న నల్లని వాఁడైన శ్రీ కృష్ణుని కలిసి కొనెను. సాత్యకియును యదువీరులతో కూడ, ఆ చోటికి వచ్చెను. ఆ విధముగా శత్రువులను జయించిన సమృద్ధిచే ప్రకాశించుచున్న వాఁడై వాసుదేవుఁడు, కైలాస యాత్రను గుఱించి ప్రసంగించెను. పిమ్మట ఘంటాకర్ణ కాలాంతకుల వృత్తాంతమును చెప్పి వారిని కొనియాడెను. శివుఁడు ప్రసన్నుఁడై పుత్ర ప్రాప్తిని వరముగా నిచ్చుటను తెల్పెను. ఆ సమయమందు దేవతలు మునివరులు హరిహరుల అభేద భావంబును (ఏకత్వమును) తెలిసికొనిరని తెలియఁజెప్పెను. అనంతరము, ఎల్లవారలను వారి వారి ఇండ్లకు వీడ్కోలిచ్చెను. ఇది అంతయు ముగిసినవెంటనే నగరిలోనికి పోయి, అంతఃపురమును ప్రవేశించి సత్యభామా రుక్మిణులకు, తనసకల వృత్తాంతమును నివేదించెను,' అని కథను వైశంపాయనుఁడు పూర్తిచేసెను. అనంతర కథను వైశంపాయనుఁడు జనమేజయునితో 'ఆ సమయమందు ఒక్క అచ్చెరువు కొల్పు వృత్తము వినుటకు ఇంపుగా నుండును. దానిని వినుము' అని ముని ఇట్లు కథను మొదలిడెను.

## - : కృష్ణుఁడు రుక్మిణీ సత్యభామలతో జూదమాడుట : -

గీ. చక్రధరుఁ డట్లు రుక్మిణీ సత్యభామ
లిరుగెలంకులఁ గొలువ ననేక గణిక
లంత నంత భజింప సత్యాముఖంబు
చూచి నెత్త మాడుద మనుచును గడంగి. 109

తా : చక్రధారి శ్రీ కృష్ణుఁడు, ఆవిధముగా అంతఃపురములో రుక్మిణియు సత్యభామయు, ఇరువురును, ఇరు ప్రక్కలలో సేవించు చుండఁగా పెక్కు వారకాంతలు, అప్పటికి అప్పుడు అవసరమైన పనులు కావించుచుండఁగా సత్యాదేవి ముఖమును చూచి "జూదము ఆడుదము" అనుచు ప్రయత్నించి (మీఁది పద్యముతో).

కం. ఓతరుణి నేను నెత్తము
నీతో నాడునెడ రుక్మిణి గనుంగొను ని
న్నాతి మఱియాడ నీవుం
జూ తింతియ పంత మడుగుచోఁ దెల్పుటకున్. 110

తా : ఓ యౌవనాంగి! సత్యా నేను నీతో జూదము ఆడునపుడు రుక్మిణి చూచును.

(సాక్షిగానుండును). (ఈనాతి= ఇన్నాతి) ఈ రుక్మిణి ఆడగా నీవును (సాక్షిగా) చూచెదవు. పందెము అడిగినప్పుడు దీనిని గుఱించి సంశయము కలిగినచో తెల్పుటకు ఇదియే సరి అయిన పద్ధతి.

వ్యా. 1 ఆడు+ఎడున్> ఆడునెడన్, ఉదంత తద్ధర్మార్థక విశేషణమునకు నుగాగమము.

2. చూచుదువు > చూతువు, క్రియ, బాల - 108 "చుద్‌కు సకారతకారాదేశము.

వ. అనుటయు నద్దేవి యిట్లనియె. 111

తా : సులభము

ఆ.వె. వాదు లానితోడ వాట్లీనితోడను
బూతుతోడఁ దిండిపోతుతోడ
నటమటీనితోడ నడియరితోడను
వెలకు నెత్త మాడ వెరవు గాదు. 112

తా : "వాగ్వాదము చేయువానితో జగడమాడువానితో బూతు మాటలాడు వానితో తిండి పోతుతో మోసగానితో సేవకునితో పణము పెట్టి జూదము ఆడుటకు తగిన పనికాదు."

విశే. ఇవన్నియును, సత్యభామ, శ్రీ కృష్ణుని ఉద్దేశించి పలికినవి. . కొన్ని శ్రీకృష్ణునకు వర్తించు ననవచ్చును. అడి + అరి అనఁగా పాదసేవకుఁడని అర్థము. సత్యభామ దృష్టిలో, రుక్మిణికి శ్రీ కృష్ణుఁడు పాదసేవకుఁడు.

కం. జూదరివి సుమాళివి నెఱి
వాదివి తసుకరివి గెలువ వచ్చునఁటే దా
మోదర నిను మా కనుటయు
నాదెసఁ గనుఁగొనక పిలువు మనె జాంబవతిన్. 113

తా : "నీవు జూదరివి (జూదమాడు వ్యసనము కలవాఁడవు). ఆవేశ పరుఁడవు. వాద నైపుణికల వాఁడవు, (మాటలలో నేర్పరి). వంచకుఁడవు. ఓ తులసి మాలను ధరించినవాఁడా!

(ఓ వేషధారి అని హేళన) నిన్ను గెలుచుటకు మాకు శక్యమగునా?'' అనుచుండఁగా ఆ సత్యభామ వైపు చూడక, జాంబవతిని 'పిలువుము' అని (ఒక సేవికను) ఆదేశించెను.

వ. అనుటయు సత్యభామ సాసూయంబు గా వాసుదేవున కిట్లనియె. 114

అర్థ : స+ అసూయంబు +కాన్ = అసూయతో కూడ

తా : శ్రీ కృష్ణుఁడు జాంబవతిని పిలువ నంపఁగా, సత్య భామ తన సవతియెడ అసూయ కలదై, ఇట్లు అతనితో పలికెను.

కం. కలిగె నొకజాంబవతి వె
న్నెలవడఁ [1]బడె దేల వలపు నీతల వేగెన్
బులియ[2]క వే సవతులు గల
పొలఁతుల కేపాటు వడక పో రా దనియెన్. 115

అర్థ : వేగు = త్వరపడు; వేఁగు = వేఁడెక్కు.

తా : 'జాంభవతి' అనెడి వనిత నీకు ప్రియురాలైనది. ఆమె యొక్క కాంతి (వెల్లి+నెల=చంద్రిక) నీపై పడువిధమున ఏల ఆమె వెంట పడుదువు? ఆమె ఎడ కామముచే నీ తల త్వరపడు చున్నది. (వేఁడెక్కినది) చులుకన కావద్దు (పులిసిన వస్తువులు తినుటకు తగవు కనుక ఎక్కువ కామమును పెంచుకొని ఆమె అధీనుఁడవు కావలదు? ఆమెయే, నీమితి మీఱిన చేష్టలను సహింపదు. "పులియకు'' అనుపదములో ఇట్టి భావపరంపర కలదు;) పెక్కు సవతులు ఉన్న పొలతులకు ఏ పాటైనను అవమానమైనను పడక పోరాదు (అనుభవింపక తప్పదు).

మఱొక విధముగా కూడ పద్య భావమును చెప్పవచ్చును. శ్రీవేదము వేంకటరామన్ అభిప్రాయమిది.

తా : జూదమును తేలికగా తీసికోవద్దు. మన ఆటలో ఆమె ఇప్పుడుఎందుకు? నీ "పులుముడు'' వ్యవహారము ఎందుకో? సమాధానము చెప్పు. చల్లని వెన్నెలలో కూడ వేఁడిమి ఏల? మేము ఇద్దఱము ఉండఁగా ఆమె మీఁదమనసు ఎందుకో? మా కర్మ ఇది. పెక్కు చోట్లలో వేయి భార్యలు కల నీ వంటి భర్తను పొందిన మావంటి నెలఁతలు అవమానముల పాలగుట తప్పదు.

అలం : అర్థాంతరన్యాసము.

---

1. బడనేల 2. కు.

కం. చిత్తం బూరక కలఁచెదు
నెత్తము నాతోడ నాడ నేరుపు గలదే ?
పొత్తు గలసి నీవును నీ
తత్తబళలు రండు గెలిచెదం బరువడితోన్. 116

ప్రతి : చిత్తంబున్ = నామనస్సును; ఊరక = వినోదముకొఱకై పనిలేక; కలఁచెదు = కలఁత కలిగించు చున్నావు; నాతోడన్; నెత్తమున్ = జూదమును; ఆడన్ = ఆడుటకు; నేరుపు కలదే = నేర్పు ఉన్నదా? పొత్తు కలసి = మీరు అందఱు కలసి ఒక్కటియై నీవును; నీ తత్తబళలు = అనుచరులు, (సేవక సేవికాజనము); తత్తబడ రూపాం. దీనినే శ.ర. ఉదాహరించినది, పరివారము; రండు; పరువడితోన్ = క్రమముతో, నియ మానుసారముగా; గెలిచెదన్.

తా : నీవు పనిలేక వినోదార్థము నా మనస్సును కలఁచు చున్నావు. (జాంబవతిని పిలువుమనుటచే) నాతో జూదము ఆడుటకు నీకు నేర్పున్నదా? నీవును, నీ పరివారమును ఉమ్మడిగా కలసి ఒక పక్షమందుండి ఆడినను నేను మిమ్ముఎదిరించి నెత్తపు క్రమమును పాటించి తప్పక గెలిచెదను.

విశే. సత్యభామ, సంపన్నురాలు బాల్యము నుండియే సొగటాలాటలో ప్రవేశము కలదై చాతుర్యమును అలవఱుచుకొన్నది. కనుక విశ్వాసముతో తన నేర్పును గురించి ఆత్మప్రశంసను చేసికొన్నది. ఇట్లు తన నేర్పును తానే మెచ్చుకొనుట ఆమె నడవడికకు తగియున్నది.

ఉ. ఇంతయు నేల మీకు నెదు రెక్కటి[1] లోమునికి బదాఱు సె
ల్లింతుం[2] గడళ్లతాఁకున వెలిం బడ సారె గలప్పుడిత్తు గె
ల్పింతన సంగ్రహంబున సహోరువు[3]తోఁ గను మాడిపోయినం
బంతముతో దొహారమునఁ బట్టుదుఁ బాసిక బొమ్మగట్టుదున్. 117

ప్రతి : మీకు, ఇంతయున్ = ఇదంతయును; ఏల = ఎందుకు? ఎదురు+ఎక్కటిన్ = ఎదుర్కొనునట్టి, జూదములో (ఎక్కటి కయ్యములో); ఒక్కటికిన్ = ఒక్కొక్క పణమునకు (జూదమునకుఒడ్డు సొమ్మునకు); పదాఱు+చెల్లింతున్ = పదునాఱు రెట్లుపణమును, గెల్చిన ధనముగా ఇచ్చెదను; కడళ్ల తాఁకునన్ = జూదపు పలక యొుక్క అంచులకు తగులుటచే సారె = పాచిక (రెండింటిలో ఒకటి); వెలిన్ పలకలను వీడి వెలుపల; పడన్ +కల+అప్పుడు =

1. నొక్కటి 2. దగ 3. లోగమ

పడినప్పుడు; ఇత్తున్ = (ఆటను వదలి మీకే) ఇచ్చెదను; గెల్పు+అంతనన్ (నేను) గెల్పు పొందిన అనంతరము; సంగ్రహంబున = చక్కగా దానిని మనసార అంగీకరించి; సహారువుతో = (గెలిచిన) పందెపు సొమ్ముతో; (నీ) చక్కని ఓటమితో; కనుము = నా (భాగ్యమును) చూడుము; ఆడిపోయినన్ = ఆట పోయినను, ఆటలో నాకు ఓటమి కలిగినచో;పంతముతోన్ = స్పర్ధతో పట్టుదలతో; దొహారమునన్ = రెండు ఆటలలో (హారము = యుద్ధము); పట్టుదున్ =నేనే జయమును పొందెదను, (నిన్ను రెండు ఆటలలో ఓడింపఁగలను); పాసిక బొమ్మకట్టుదున్ = (పిమ్మట) జయసూచకముగా నేనే పాచిక (గల) బొమ్మను నా ఎడమ కాలికి కట్టుకొందును. మొదట సత్యభామ జాంబవతిని పిలువుమనఁగా తన అసూయను ప్రకటించినది. పిమ్మట తాను నెత్తమును నేర్పుతో అందఱు కలిసి ఆడినను గెలిచెద నన్నది. ఇందు తన నిర్ణయమును పణమును గూర్చి, పంతమును దృఢముగా గర్వముతో పల్కి శ్రీకృష్ణుని రెచ్చఁగొట్టినది.

తా : పలు మాటలు ఏల? నీవు ఒక్కడివే ఆడితే ఒక్కొక్క పణమునకు ఓడినప్పుడు పదాఱు రెట్లు చెల్లింపఁగలను. సారె, నెత్తపు పలకకు వెలుపల పడినట్లయితే ఆటను నీకు ఇచ్చెదను. గెల్పు పొందిన తర్వాత, నీవు నీ ఓటమిని చక్కగా అంగీకరించి నా భాగ్యమును చూచి సంతోషించుము. (నీ ఓటమికి చింతింపవద్దు అనుట). నేను ఆటలో ఓటమి పాలయినచో, పట్టుదలతో మరల రెండు ఆటలలో విజయమును సాధింపఁ గలను. అంతమున జయ సూచకముగా నా ఎడమ కాలికి పాచిక బొమ్మకట్టి సంతోషించెదను. ఇట్లు సత్య గర్వవాక్కులను ఉచ్చరించినది. సోమన మూలములో లేని సత్య చిత్రణమును కావించి ఆమె మూర్తిని కన్నులకట్టినట్లు చేసెను.

విశే. హరువు = నాణెము, సహారువు = పందెపు సొమ్ము, లేదా చక్కని ఓటమి;

నానా : హారము = యుద్ధము, హారసంబంధమైనది, దండ.

చం. తొలితొలి రుక్మిణీరమణితో నెఱవాదివి నెత్త మాడుమా
గెలిచెదవేని మేలు సరికిం దగ నాడెద సూడు పట్టు నీ
కొలఁది యెఱుంగమే యనుడుఁ గోపము గన్నులఁ గ్రోలి నవ్వి య
చ్చెలువలతోడ శౌరి పాలిచెం జతురంత సమాసనంబునన్. 118

అర్థ : నెఱవాదివి = వాదనలో నిపుణుఁడవు; ఆడెద+చూడు; పట్టు = (నా) పట్టుదల; నీ కొలది = (తెలివియొక్క) పరిమితి; ఎఱుంగమే = మాకు తెలియదా ఏమి? (నీ తెలివి మిక్కిలితక్కువ అని); చతురంత సమాసనంబునన్ = నాలుగు అందమైన శిల్పసౌందర్యము గలచక్కని పెద్ద పీటల మీఁద.

తా: "వాదనలో నిపుణుఁడవుకదా! మొదట రుక్మిణితో జూదమాడమ! (ప్రార్థన) గెల్పును పొందినచో మంచిది. సంతోషమే. తర్వాత నీకు సమానముగా నీతో జూదమాడెదను. చూడు నాపట్టుదల. నీ జూదపు నేర్పు ఎంతో, దాని పరిమితి మాకు తెలియదా ఏమి?" (అది చాల తక్కువ అనుట) అని సత్యభామ పలుకఁగా శ్రీ కృష్ణునికి కోపము వచ్చినది. దానిని కండ్లలోనే అణఁచుకొని చిఱునవ్వుతో రుక్మిణి సత్యల నడుమ విశాలమైన నలు వైపుల చదరముగా నున్న పెద్ద పలకపై విలాసవంతుడై జూదమునకు కూర్చుండెను.

వ. ఇట్లు చతురంతాసనంబున నుండి సకలలోకనాథుండు సత్యభామకు సాక్షిపదం
బొసంగి రుక్మిణీసమ్ముఖంబుగా సమాసీ నుండైన నద్దేవియు. 119

తా : ఈ విధముగా ఆ నాలుగు అంచులు గల అందమైన పెద్ద పలకపై ఉండి సకలలోకములకు ప్రభువు, శ్రీ కృష్ణ భగవానుఁడు సత్యభామకు సాక్షి పదవిని ఇచ్చి రుక్మిణితో జూదమాడుటకు ఎదుట చక్కగా కూర్చుండఁగా, ఆ రుక్మిణీ మాతయును, (మీఁది పద్యముతో అన్వయము).

సీ. జోగిణి గొసరి [1]బైసుక వెట్టి పలకపై
సారెలు వోయించి సరము చూచి
తనకు లా గయిన నెత్తంబు గైకొని పన్ని
పాసికల్ దాళించి పా టెఱింగి
లోహటంబులు మాని [2]లులిఁ గన్నఁ బడకున్నఁ
బరదాళ మని పోవుఁ బలక లిచ్చి
తప్పార్తుఁ జూ రెండు దాయంబులును గని
వారింపకుము పోటుద్రాలు గలవు

గీ. పంత మడిగిన నీవలె భాగ మింతఁ
బోరఁ బెద్దదాయం బాడి పోరు వుచ్చి
వైచు నది ధన మునికి పో వచ్చు నను చుఁ
బేరుకొని పాటుతఱి సరి బేసి యడిగి. 120

1. వైసిక 2. లులితంబువడ

పట్టుదల పెంచుకొనక, తక్కువ సంఖ్య పడినను, కావలసిన సంఖ్య పడక పోయినను, తన ఆట పూర్తి అయినదని, ఎదుటనున్న శ్రీ కృష్ణునకు పలకయిచ్చి పోవును. "తప్పును ఖండించెదను. రెండు సార్లు ఆడినచో నాకు అడ్డు చెప్పవద్దు. నా యొద్ద మేలైన బొట్లు ఉన్నవి. అవి మోసపు పాచికలు కావు. నాకు రావలసిన పందెపు సొమ్మును అడిగిన వెంటనే నా భాగమును ఇయ్యవలెను. ఈ ఆటలో పెద్ద పణము పెట్టవలెను. మొత్తము అసలు ధనము అంతయును పోవచ్చును" అనుచు రుక్మిణి భగవానుఁడైన హరిని ధ్యానించి నమస్కరించినది. తర్వాత, పాచికలు తాళించు సమయమందు తనకు కావలసిన సరియో లేక బేసి సంఖ్యయో కోరుకొని (మీఁది పద్యముతో).

జోగిణి : అలంపుర క్షేత్రమును గుఱించి శ్రీ గడియారం రామకృష్ణ శర్మగారు, ఒక చిఱుపుస్తకమును 1965 సం. ప్రచురించిరి. అందు వారు మహాశక్తి యొక్క పదునెనిమిది పీఠములను క్రిందివిధముగా తెల్పిరి.

1. శంకరీ2. కామాక్షి 3. శృంఖల, 4. చాముండి, 5.అలంపురములో జోగుళాంబ, 6. భ్రమరాంబ,7.మహాలక్ష్మి, 8. ఏకవీర, 9.మహాకాళి, 10. పురుహూతి; 11. గిరిజ, 12.మాణిక్యాంబ, 13. కామరూపి, 14. మాధవేశ్వరి, 15. వైష్ణవీ దేవి, 16. మాంగల్య గౌరి, 17. విశాలాక్షి, 18. సరస్వతి, (మునీశ్వరులు ఈ శక్తులను స్తుతించిరి.)

విశే. జోగిణి= అక్ష క్రీడాధిష్ఠాన దేవత బభ్రునాయక దేవత, అధర్వణ వేదములో

"ఇద ముగ్రాయ బభ్రవే నమో! యో అక్షేషు తనూవశీ" అని ఉన్నదని శ్రీ ఉన్నం జ్యోతివాసు, బి.ఎస్.సి. వేముల పాడు, ప్రకాశం జిల్లా - 523273 నాకు తెలియజేసినారు.

మ. అత్తీవం *చ తిగ దుగయు
సత్తా దచ్చొక వంచి చౌవం చీరై
దిత్తిగ యిద్దుగ బద్రలు
చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్. 121

ఈపద్యములో ద్వితీయ పాదములోని"వంచి"ని "దంట"గా గ్రహించినదో సంఖ్యలన్నియు, సరిపోవును.

ప్రతి: 1. ఆ+తీవంచ = (మూడు+ వంచ) నాలుగు, తిగ = మూడు, దుగయున్ = రెండును,(మొత్తము నాలుగు మూడు రెండు = తొమ్మిదియును);

* చిత్తగ, చవుకదుగ

ప్రతి : జోగిణిన్ = జోగాంబ, జోగులాంబను; (భారత దేశములో అష్టాదశపీఠములలో "జోగిణి" యొక మహాశక్తి); కొసరి = ప్రార్థించి; బైసుకన్ +పెట్టి = నియమమును పెట్టుకొని రూపాం. బయిసుక, బైసిక (పేశికపెట్టి = కానుక, పైసలు దక్షిణను సమర్పించి); పలకపై = జూదమాడు చిన్న బల్లపై; సారెలున్ + పోయించి = గీతలు, (గళ్లు) గీయించి చాఱలు, సారలు, సారెలు రూపాం. సరము చూచి = కుడి శ్వాస గమనించి; ఆటగాండ్లు స్వరము అనఁగా, సూర్య చంద్రనాడులను, నాసికా శాస్త్రమును గమనించి, జూదమును ప్రారంభింతురని, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు వారి ఆంధ్రుల సాంఘిక చరిత్రలో వచించిరి; తనకు లాగైన నెత్తంబు కైకొని = తనక్కులాగు లాగము(వి), లాఘవము (ప్ర), తేలిక యైన పందెమును, లక్ష్యముగా పెట్టుకొని; పన్ని = ఆటకు సిద్ధమై; పాసికల్ = పాచికలను, తాళించి = చేతిలో ఇటునటు త్రిప్పి; పాటు+ ఎఱింగి = అవి పడు తీరు గ్రహించి; లోన్+హటంబులు మాని = మనస్సులో పట్టుదలను పెంచుకొనక, వదలి, ఆటలో ఆవేశమును పొందక; లులిన్ +కన్నన్ = నష్ట సంఖ్య పడినను, తక్కువ పడినను; పడకున్నన్ = సరిగా సంఖ్య అనుకూలముగా, మేలైన సంఖ్య పడక పోయినను; పరదాళము +అని = పాచికలను తాళించు అవకాశము ఎదుట నున్న వారిదని; పలక+ఇచ్చి పోవున్ = ఆటను ముగించుకొనును; తప్పు+ ఆర్తున్ = తప్పుగా ఆడిన ఆటను, ఆఱుతును ఆర్తున్ +చూ = లెక్క పెట్టను (నశింపఁజేయుదును). చూడు ఈ నియమమును గమనించు; రెండు దాయంబులను కని =రెండు సార్లు ఆడినచో, వారింపకుము = అడ్డుపడకూడదు; పోటు వ్రాలు కలవు=నా యొద్ద మేలైన బొట్లు (పాచికలు ) కలవు (కల్ల సారెలుకావు); పంతము+ అడిగినన్ = పందెపు సొమ్ము నాకు రావలసినది ఇమ్మన్నచో; (ప్ర) పణితము (వి) పందెము రూపాం. పణము, పంతము; ఈ వలె భాగము = నా భాగమును ఇయ్యవలెను; ఇంత పోరన్ = ఇట్టి ఆటలో; పెద్ద దాయంబు+ఆడి = ఎక్కువ పందెపు సొమ్మును పెట్టి; పోరు పుచ్చి వైచునది = జూదపు పోరాటమును సాగించి పూర్తి చేయవలెను; ధనము+ఉనికి = (అసలు) తాను ఒడ్డిన ధనము పాఠాం. తన మునికి (మునుకువ) = తన పూనిక; పోవచ్చున్ = చెడి పోవచ్చును. ఓడిపోవచ్చును; అనుచున్ = అని తలంచుచును; పేరుకొని = స్తుతించి, ధ్యానము చేసి (చూడు, పేర్కొని, వచన 128 - 2అ); భగవానుఁడగు హరి నామస్మరణము చేసి, భర్త శ్రీకృష్ణుని తలంచి; పాటు తఱి = పాచికలను తాళించు సమయందు; సరి బేసి అడిగి = సరి సంఖ్యయో లేదా బేసి సంఖ్య, ఏది కావలెనో దానిని కోరుకొని.

తా : 'జోగులాంబ' అనెడి అక్ష క్రీడయొక్క దేవతను ప్రార్థించి, దక్షిణను పెట్టి పూజించి నెత్తపు పలక మీఁద గళ్లు (ఇండ్లు) గీయించి, కుడి శ్వాస రీతిని గమనించి, తనకు లఘువైన పందెమును లక్ష్యముగా నిర్ణయించుకొని ఆటకు సిద్ధమై, పాచికలను రెంటిని, చేతిలో పట్టుకొని ఇటునటు త్రిప్పి, అవి పడు తీరును తెలిసికొని, మనసులో

2.సత్తా = ఏడును;3. దచ్చొక నాలుగునకు రెండురెట్లు ఎనిమిదియును, 4. (వంచి) దంటగా మార్చబడినది, కనుక దంట = రెండును; 5. చౌవంచ =నాలుగును ఒకటియును (కలసి) అయిదును; 6. ఈరు+ఐదు =ఐదునకు రెండురెట్లు, పదియును; 7. ఇరు+తిగ, మూడింటికి రెండు రెట్లు ఆఱును, 8. ఇరు+దుగ = రెండునకు రెండు రెట్లు, నాలుగును;బద్రలు = పండ్రెండు మొదలగు సంఖ్యలను; చిత్తంబునన్ = మనసుల్లో తలఁచి నట్లు; చేతికిన్ + తెచ్చున్= చేతిలోనికి తెచ్చుకొనును.

తా : 9,7,8,2,5, 10, 6, 4, 12, అను వ్రాలలో తానేది మనసునందుకోరునో, దానిని రుక్మిణి తన పాచికల యందు పొందఁగలిగెను. అది ఆమె అదృష్టము. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు ఇట్లు ఈ ఆటను తన గ్రంథములో వివరించిరి.

సొగటాలయందు, పాచికలు రెండు, ఆ పాచిక లొక్కొక్కటికి నాలుగు ప్రక్కలు, ఒక్కొక ప్రక్కకు ఆరు ఆరును, నాల్గు నాల్గును, మూడు మూడును, ఒకటొకటి అనఁగా జతలు, ఎనిమిదింటికి, బొట్లు ఇరువది యెనిమిది యుండును. ఆ పాచికలు రెంటిని తూలించి వేయునప్పుడు, వాని పొర్లిక భేదముచే 12, 10, 9,8, 7, 6, 5, 4, 2 గా పందెములు, తొమ్మిదిపడును. కాన ఆ పందెములు తొమ్మిదియును ఈ పద్యములో చెప్పఁబడి యున్నవి.

సూచన : శ్రీ రెడ్డిగారు వంచి = ఒకటి అని అర్థమును వ్రాసిరి. కాని దానిని సవరింపలేదు.

తరువాతి కాలములో; రెండు పాచికలపై ప్రక్కలలో వరుసగా 1+1, 2+2, 3+3, 4+4 బొట్లు ఉన్నట్లు కొందఱు వచించిరి.సోమన కాలములో బొట్లు శ్రీ రెడ్డిగారు వివరించి నట్లుండెనని గ్రహింప వలసియున్నది. గళ్ల విషయములో, ఎన్నిగళ్లుండెనో, ఎట్లుండెనో తెలియుట లేదు. కేవలము ఊహ మీఁదనే ఆధారపడవలసియున్నది. సోమన కాలమందు అయిదు గళ్ల చదరమును పలకపై చిత్రించి జూదమాడిరని తోఁచుచున్నది.

ఈ అక్షఖేలనమును గుఱించి ఋగ్వేదములో సంకేతములు ఉన్నవి. పూర్వకాలపు సారెలపై ఒక చుక్క, కలి, రెండుచుక్కలు, ద్వాపర, మూడు చుక్కలు, త్రేత, నాలుగు చుక్కలు, కృత అను పేర్లతో పిలువఁబడినవి. నాలుగు చుక్కలు పడిన వాఁడు, పందెపు సొమ్మును పూర్తిగా తీసికొనుచుండెను.

శబ్ద రత్నాకరములో 'బ(ద్ర' కు అర్థము 'పం(డ్రెఁడు' అను చోట పై పద్య వివరణము కలదు. "సత్తా" కు అర్థము, 'ఏడు' అనుచు కుండలీకరణములో బ(ద్రకడ (వ్రాసిన దానిని పరిహరింపవలయును అని ఉన్నది. బహుశా "వంచ" పదమునకు "రెండు" అను అర్థము సిద్ధింపనందున శ.ర. ఈ సూచన చేసినని తోఁచుచున్నది.

సీ. దుగుణంబు నేసినతోడనే మూఁడని
వారించి లేదని వలుము సేసి
యూర కెత్తకు దాయ ముగ్గడించినఁ గాని
పట్టి వేయకు మని పటితళించి
వెడలిన సారెలు వెనుక ముందఱ చేసి
యెత్తినసారె పో నీక యార్చి
సమ మాయె రమ్మని సరస *వారలఁ బిల్చి
గెలుపు సుమాళంబు గెరలఁ జేయఁ
గీ. బడిసి యీరైదు పూజించి పలక మీఁద
బలుపమున (వ్రాసి వెలి(వ్రాయిఁ దొలఁగ వైచి
పన్ని పంచి యెక్కటి నాడఁ బంచి (వ్రాలుఁ
దప్పు నో పత్రనయమునఁ దాన గెలిచె. 122

(ప్రతి : దుగుణంబున్ + ఏసినతోడనే = రెండు సంఖ్యను వేసి నప్పుడు; మూడు+అని; వారించి = అడ్డుపెట్టి; లేదు = అట్లు కాదని; బలుము (బలిమి)+చేసి = బలాత్కరించి; ఉగ్గడించినన్+కాని = అనుమతించినపుడే, "సరే" అని వచించినప్పుడే. పాచికలను పైకి తీసికొనవలెను; ఊరక+ఎత్తకు (ము) + దాయము= అనుమతి లేక పోయినపుడు, పాచికలను చేతిలోనికి తీసికొన వద్దు; పట్టి వేయకుము+అని = చేతితో పట్టుకొని, నేలపై విడువవద్దు+అని; పటితళించి = చఱచి చేతితో నేలను-కొట్టి; వెడలిన సారెలు = పలకపై కదలిన పాచికలను; వెనుక ముందఱ చేసి; ఎత్తిన సారె = మరల ఆడుటకు చేతికి తీసికొన్న పాచికలను; పోనీయక = పలకపై వేయ నియ్యక; ఆర్చి = అఱచి (అడ్డుపెట్టి); సమము+ఆమెన్ = (ఒక పందెము) సమాప్తమైనది; సరసవారలన్ = సమీపము నందున్న వారిని, తనకు అనుకూలురైన చెలికత్తెలను; రమ్ము+అని = పిల్చి; గెలుపు సుమాళంబున్ = రుక్మిణి ఆట గెలిచిన విధము,

* వారికి నిచ్చి

ఆవేశమును; కెరలన్+చేయన్= తత్తఱ పాటును కలుగఁజేయఁగా సంభ్రమమును కలిగింపఁగా; రుక్మిణి ఓటమి పొందలేదను చింత అతనిని బాధించినది. బడిసి= దృష్టి దోషమును తొలఁగించి; (ఇతరుల చూపు వలన కలుగు నష్టమును తొలఁగించుకొనుటకు, శ్రీకృష్ణుఁడు, పూజచేసెను) పలక మీఁదన్=నెత్తపు పలకమీఁద; బలుపమునన్ వ్రాసి; వెలి వ్రాయిన్+తొలఁగవైచి = వదలి పెట్టవలసిన బొట్లను తీసివేసి; ఈరు+ఐదు పూజించి = రెండు, అయిదు' అనెడిసంఖ్యలను మాత్రమే (వ్రాసి) పూజించి; ఆటకు సిద్ధమై (గీతలు గీయించి); పంచి= మరల అయిదు గళ్లుగా (విభజించి)భాగించి ఎక్కటిన్ = ఒక్కఆటను;ఆడన్ +పంచి = ఆడుటకు ఆజ్ఞ ఇచ్చి; (మొండి ఆట ఆడినందులకు రుక్మిణి మరల ఆటలో పాల్గొనదేమో అని, ఆమెను నిర్బంధించెను); తప్పన్ = గళ్లను అతిక్రమించుచు, క్రమము తప్పియే, వంచనచే, కృష్ణుఁడు గెలిచెను. ఓ పత్ర నయమునన్ =ఏదో విధమైన ద్యూత వ్యవహార నియమమును పాటించుచు; తాను+ఏ = తానే, శ్రీకృష్ణుఁడు గెలిచెను; ఓ = సందేహమును ప్రకటించు అవ్యయము. కనుక శ్రీకృష్ణుని గెలుపు సరియైనది కాదని గ్రహింప వలెను. అనంతర గద్యలో కపటనాటక సూత్ర ధారుఁడనుటచే, ఇది ధ్రువపడుచున్నది.

తా: రుక్మిణికి రెండుబొట్టు పడఁగా, మూ డని బలాత్కరించి మొండిచేసి, పందెపు సొమ్మును చెప్పక ముందే, పాచికలను పైకెత్త వద్దు చేతిలో పట్టుకొని పాచికలను విడువకు అనుచు చేతిని అప్పుడప్పుడు చఱచుచు పడిన పాచికలను ముందు వెనుకలు చేయుచు ఎత్తుకొన్న పాచికలను వేయ నియ్యక అఱచుచు, ఆట ముగిసినదని దగ్గఱ నున్న వారిని పిలిచి, ప్రకటన చేయుచు, రుక్మిణి గెలుచుటచే తనకు ఆవేశము తల్లడము కలుగఁగా దిష్టి తీసి రెండు అయిదు సంఖ్యలను పూజచేసి గళ్లను బాగుగా గీయించి మఱొక ఆటను ఆడుమని రుక్మిణిని ఆజ్ఞాపించి, ఏదో విధముగా సంశయాత్మకముగా ద్యూత నియమములను పాటించుచు శ్రీకృష్ణుఁడు గెల్పును పొందెను.

నానా : దాయము = పందెము; గవ్వలాట, ఆపద, ఈవి, అరణము కట్నము, నెత్తపు బొట్టు తండ్రిసొత్తు, తావు,నష్టము మొ.

వ. ఇత్తెఱంగున నత్తరుణి కరకౌశలంబున దట్టనయుం బుచ్చి పెట్టు వెరవును గెలుపు లెక్కయు లోపలఁ గలంగుటయు మోస పోక పంతం బడిగిన నిమ్మపండు వైచి యుఱికితి నని సరి సరి యన్న జొన్నల కని తాఁకె నన్నుఁ గొన్న వారికి నని గెలిచితి నన్న మగనికి ము న్నని

పుడికి పుచ్చికొన్నట్టు గత్తరించిన చందంబునఁ బందెంబు సఱచినవిధంబున మ్రొక్కిన దీవించినవిధంబున వెరవున నాడుటయు నాకపటనాటకసూత్రధారుం *డంకించుకొని యుల్లసంబున సారె యొడ్డి తొమ్మిదిదాయంబుల కిచ్చిన నచ్చెలువ యెక్కిపలక తప్పుదాయంబునకు నొకవ్రాయి విడిచెద ననుటయు నద్దేవుండు నాదాయ మీరైదు వెనుక యోటంబు విఱుగు ననుటయు నుదరిపడి యమ్ముదిత సవిలాసంబుగా వైచిన నాశౌరి గోరిన దాయంబ పడినం బొంగి వెనుక సరి సరి యని యంతనుండి విన్ననై యాడి యన్నాతి మిగుల నోడియుం దలంకక. 123

ప్రతి : ఈ తెఱంగునన్ = ఈ విధముగా; ఆ+తరుణి = ఆ రుక్మిణి; కరకౌశలంబును = చేతి నేర్పును; దట్టనయున్ = తాళించు తీరును; పుచ్చి పెట్టు వెరవును = పాచికలను తీసికొని వేయు నైపుణిని; గెలుపు లెక్కయున్ = జయముపై గల గుఱియును; లోపలన్ = మనస్సులోపలన్; కలంగుటయున్ = (ఓటమి కలిగినను) వ్యాకుల పాటు చెందియును; మోసపోక = (జాగరూకతతో)వంచనకు వశముగాక; పంతంబు +అడిగినన్ = పందెపు సొమ్మును = అడుగగా; నిమ్మపండు వైచి +ఉఱికితిన్ +అని = నిమ్మపండు వేసి ఓటమిని తప్పించుకొన్నాను అని; సరి సరి అన్నన్ = సరికి సరికి, ఇరువురుసమానముగాగెలుపు ఓటములు కలిగి ఉన్నాము అనఁగా; జొన్నలకు =ఓడిన వారికిచ్చు ధాన్యమునకై; అని తాఁకెన్ = యుద్ధము కలిగిన దనఁగా; కొన్న వారికిన్ +అని = ఓటమి పాలైన వారికి అది యియ్యవలెను అని; గెలిచితిన్ + అన్నన్ = (కృష్ణుఁడు) తాను గెలిచితిని అనఁగా మగనికిన్ మున్న+అని = తన మగఁడైన శ్రీ కృష్ణునకు ముందే అని; పుడికి పుచ్చుకొన్నట్లు = ఇచ్చి, తీసికొన్నట్లు;కత్తరించిన చందంబునన్ = నిశ్చలముగా నున్నట్లు; పందెంబున్ +చఱచిన విధంబునన్ = భర్త ఆటను పడఁగొట్టినట్లు, (ఓడించినట్లు); మ్రొక్కినన్ = రుక్మిణి శ్రీ కృష్ణునకు నమస్కరింపఁగా; దీవించిన విధంబునన్ = అతని దీవెనలనుపొంది, ఉత్సాహముతో ఆడినట్లు; వెరవునన్ = నేర్పుతో; ఆడుటయున్ = (రుక్మిణి) ఆడుచుండఁగా; ఆ కపట నాటక సూత్ర ధారుండు = ఆ బ్రహ్మాండమును నిర్వహించుట అనెడి మాయతో కూడిన నాటకమునకు ప్రభువైన, హరి; అంకించుకొని = (కృత్యా సంహార నాటకమునకు ప్రస్తావన యైన) నెత్తపు ఆటయందు పాల్గొని; ఉల్లసంబునన్= వికాసముతో; సారె+ఒడ్డి = పాచికలను తాళించి వేసి; తొమ్మిది దాయంబులకు, తొమ్మిది పందెములకు; ఇచ్చినన్ = సమ్మతి తెలుపఁగా; ఆ+చెలువ = ఆ రుక్మిణి; ఎక్కి =

* డెక్కించుకొని

ఆటను మరల అంగీకరించి, ఆటను ప్రారంభించి; తప్పు దాయంబునకు = తప్పైన ఆటకు; ఒక వ్రాయి విడి చెదన్+ అనుటయున్ = ఒక బొట్టును వదలివేయుదును, అనఁగా; ఆ+దేవుండున్ = ఆ శ్రీ కృష్ణుఁడును దాయము = ఆ రుక్మిణి పందెము, ఊరు +ఐదువెనుక = పది ఆటలైన పిమ్మట;ఓటంబు = తనకు కలుగు చున్న అపజయము; విఱుఁగున్ + అనుటయు = తప్పక తొలఁగి పోవును, అనఁగా; ఆ +ముదిత; ఉదరిపడి = చలించినదై; సవిలాసంబుగాన్ = ఒయ్యారముగా; వైచినన్ = పాచికలను పలకపై వేయఁగా; ఆ శౌరి కోరిన దాయంబ పడినన్ = ఆతఁ డేది కోరెనో ఆ బొట్లే పడుచుండఁగా పొంగి = పొంగుటచే సరిసరి+అని = తాను జయించుట ముగిసినదనెను; అంతనుండి = అప్పటినుండి;' విన్ననై ఆడి = సడలిన పట్టుదలతో ఆడుచు, ఆ + నాతి = ఆ వనిత రుక్మిణి; మిగుల ఓడియున్ = బాగుగా ఓటమి పాలైనను; తలంపక = చలింపక;

తా : ఈ విధముగా ఆ రుక్మిణీ రమణి, తన హస్త లాఘవమును, పాచికల తాళించు తీరును, గెలుపుపై గల గుఱియు కలిగి, మదిలో కలఁత చెందియు, ఏమఱుపాటు లేక పందెపు సొమ్మును అడుగఁగా శ్రీ కృష్ణుఁడు నిమ్మపండు వేసి, ఓటమిని తప్పించుకొన్నాను అనెను. 'ఇంతకు సమానముగా గెలుపు ఓటమి కలిగియున్నాము అనఁగా అతఁడు జొన్నలకై చివఱి ఆటకలిగినది" అనఁగా; "ఓటమిపాలైన వారికి కదా జొన్నలు" అనెను. శ్రీ కృష్ణుఁడు "నేను గెలిచితి" ననఁగా"పతికి ముందే నేను విజయమును సాధించితిని" అనెను. ఇట్లు ఇచ్చి పుచ్చుకొన్నట్లు, నిశ్చలముగా తత్తఱపాటు లేనట్లు అతని ఆటను పడఁగొట్టినట్లు భగవానుఁడైన శ్రీ కృష్ణునకు రుక్మిణి మ్రొక్కఁగా ఆతని దీవెనలను పొందినట్లు ఉత్సాహముతో ఆ అతివ చాతుర్యముతో పాచికలను వేయుచుండెను. ఈ బ్రహ్మాండ మను నాటకమునకు ప్రస్తావనగా నుండు నెత్తపు ఆటలో ఆ మాయా జాలమును నడపునట్టి జగన్నాయకుఁడు హరి, గెలుపు విషయములో ఏకాగ్రత కలవాఁడై తొమ్మిది ఆటలకు సమ్మతి తెలిపెను. సుగుణమణి రుక్మిణి పాచికలను వేయుటకు పలకను గ్రహించి తప్పైన ఆటకు ఒక బొట్టు (అవకాశము) విడిచెద ననెను. శ్రీ కృష్ణుఁడు. సమాధానముగా తన ఓటమి పది ఆటలలో తొలఁగి పోయి గెలుపు కలుగుననెను. ఆ మాటలకు ఆమె చలించినను, విలాసముతో పాచికలను వేయుచుండెను. శ్రీ కృష్ణుఁడు కోరిన బొట్లే, అతనికి అనుకూలముగా పడుటచే, అతఁడు సంతోషించి, తాను గెలుచుట సమాప్త మయిన దనెను. అప్పటినుండి రుక్మిణిని పట్టుదల తగ్గినది. బాగుగా ఓటమి పాలైనది అయినను చలింపక (మీఁది పద్యముతో).

నానా. వ్రాయు= అక్షరము, పాచిక మీఁది బొట్టు; రేఖ (గీఁత);

విశే :నిమ్మపండు వైచుట అనఁగా ఓటమి లేదనుట. జొన్నలకు అనఁగా ఓడినవారికి పందెపుసొమ్ముగా జొన్నలు ఇత్తురట. (శ్రీ ఉన్నం జ్యోతివాసు బి.ఎస్.సి., వేములపాడు ప్రాకశం జిల్లా).

సీ. చేయదు దుగుణఁబు సెలవు లే కుండిన
నెక్కిన పలకఁ బో నిచ్చుఁగాని
పలుకదు రోషించి పడని పాసికలతో
నవదాయ మైనను నాడుఁ గాని
యొల్లదు గోపించి యొండు నెత్తము వన్న
[1]నెచరంబు నేర్పని యెన్నుఁగాని
నడుఁకదు వంచించి నయ మెక్కు డడిగిన
నిలుత మింతట నన్న నిలుచుఁ గాని

గీ. పలక దఱుమక [2]బయసుక పల్లటిలక
బోఁటి దూఱక యాతావు పుచ్చు మనక
[3]క్రింద గెలిచిన వ్రాలు లెక్కించు మనక
తప్ప నాడక తొల్లింటిదారి చెడక. 124

అర్థ : దుగుణంబు = రెండుసార్లు పాచికలను; చేయదు = వేయదు; సెలవు లేకుండినన్ = అవకాశము లేనప్పుడు; ఎక్కిన = తాను పొందిన(పలకను); పోనిచ్చున్ = ఇచ్చివేయును; అవదాయమైననున్ = తక్కువ పందెపు సొమ్ముతో అయినను; ఒండు = మఱొక; ఎచరంబు నేర్పు+ అని = తన ఏకాగ్రత యొక్క నేర్పు (తక్కువ) అంతమాత్రమని; ఎన్నున్ = తన్నే ఆక్షేపించుకొనును (తలంచును); నడుకదు =జంకదు, చలింపదు; వంచించి = మోసముచేసి, నయము = లాభము; పలకన్ + తఱుమన్ = పలకను త్రోసి వేయక (ఆట అనుకూలముగా లేనపుడు); బయసుకన్(బైసుక, బయిసుక రూపాం) = నియమును; పల్లటిలక = అతిక్రమింపక; పోఁడి = తన పొందికను (ఆట తీరును); ఆ తావు పుచ్చు మనక = గళ్లలో స్థానమును మార్చు మనక; క్రిందన్ = ఇంతకు ముందు లెక్కించిన; వ్రాలు = బొట్ల లెక్కలను; తప్పన్ = క్రమము తప్పునట్లు; దారి = మార్గము; తీరు; చెడక = తొలఁగిపోక.

తా : తనకు అవకాశము లేనప్పుడు (తాను ఒక్కసారి పాచికలను వేసి తాను

1. నచరంబు... యరయు 2. బైసిక 3. యెంత లెక్కించు మనక వ్రాయెక్కుడనక

రెండవసారి ఆడుటకు వీలు లేనప్పుడు) రెండవసారి పాచికలను వేయదు. తాను గ్రహించిన పలకను వెంటనే ఇచ్చి వేయును. పాచికలు అనుకూలముగా పడనిచో రోషముతో మాట్లాడదు. తక్కువ పందెపు సొమ్ముతో ఆడును. మఱొక ఆటకై సిద్ధపడు నప్పుడు కోపింపదు. ఆటలో ఓటమికి, తన అవధాన లోపమని తన్నే ఆక్షేపించుకొనును. మోసముతో పందెములో ఎక్కువ సొమ్ము (లాభము) అడిగినచో చలింపదు. ఆటను ఆపి వేయు మనఁగా అట్లే చేయును. అప్పుడు పలకను, త్రోసి వేయదు. నియమములను దాఁటదు. తన పొందికను నిందించుకొనదు. గళ్లలో తావులను మార్చుమని కోరదు. ఇంతకు ముందు పొందిన బొట్ల లెక్కింపు మనదు. తప్పుగాఆడక, మునుపటి పద్ధతి నుండి తొలఁగక. (మీఁది పద్యముతో).

వ్యా. అవదాయము : సంస్కృతాంధ్రములు కలిసిన శబ్దము మిశ్రమ పదము పూర్వపదము సంస్కృతము, పరమైన తెలుఁగుతో సమసింపదు. కనుక గ్రామ్యము అయినను అనింద్యము. సంజ్ఞ, బాల - 23.

కం. ఇవ్విధమున రుక్మిణిమదిఁ
బువ్వుం బరిమళముఁబోలెఁ బొలుపుగ నెత్తం
బువ్వాయి గలిగె శౌరికి
మవ్వము దిగఁ దొడఁగె గెలుపు మట్టం బయ్యెన్. 125

అర్థ : ఉవ్వాయి = వికాసము. శ.ర దీనిని ఉదాహరించి ఇదియింకను విచార్యము అన్నది. మవ్వము = కోమలత; మట్టంబు+అయ్యెన్ = తగ్గెను.

తా : ఈ విధమైన రుక్మిణి యొక్క చిత్త వైశాల్యముతో, ఆమె నెత్తంపు తీరు, పువ్వు పరిమళమువలె, కలిసి, శ్రీ కృష్ణునకు ఆహ్లాదము నిచ్చి, అతని మనస్సునకు వికాసము కూర్చినది. ఆమె మనస్సులో జూదమునందు కల ప్రసన్నత తగ్గుటకు మొదలయ్యెను. ఆమె గెలుపుకూడ సన్నగిల్లెను.

గీ. చాలు నని పాసె రుక్మిణి సత్యభామ
కరము గరమునఁ గీలించి కమలనాభుఁ
డింది రమ్మని పిలువ నయ్యింతి నగుచు
నభిముఖంబునఁ బాసిక లందుకొనియె. 126

తా : "ఇంక ఈ జూదము చాలు" అని రుక్మిణి ఆట నుండి తొలఁగినది. సత్యాదేవి చేతిని తన చేతితో గట్టిగా బిగించి, (కమలమును బొడ్డున గల వాఁడు) హరి, "ఇక్కడికిరా" అని ఆమెను పిలువఁగా ఆమె, అతని సాద రాహ్వానమునకు నవ్వు మొలకెత్తగా ఎదుట కూర్చుండి పాచికలను ఉత్సాహముతో అందుకొనెను.

వ. పందెంబు చెప్ప రుక్మిణిం జాలించి. 127

తా : సత్యా కృష్ణులు నెత్త మాడఁగా రుక్మిణిని (సాక్షిగా) తీర్పరిగా నుండుటకై నియోగించి (మీఁది పద్యముతో).

సీ. ఒకదాయ మాడిన నున్న దాయం బాడు
మనక వాటులు రెండు గొని చెలంగి
కాననియాటఁ దాఁ గడచి పోయినఁ జెప్పు
నెత్తంబు వడ దని నేర్పు దెగడి
యొక దాయమునకును నొంటి దాఁకినఁ బోయి
యింక వైచెద నని యినుమడించి
పోయెడి నని వ్రేయఁ బూఁచిన వారించి
చూచి *పో నిమ్మని సూటి చెఱిచి
గీ. సారె మోపును బొరలును సదర నిదర
మెఱిఁగి లాగైనఁ గైకొని యించు కంత
పాసఁగ కుండిన రుక్మిణి బొంకు బొంక
శౌరిఁ బలుమఱు గెలిచె నా సత్యభామ. 128

అర్థ : ఆదుకొనక = ఆదరింపక (పాఠాం : ఆడుమనక) అంగీకరింపక; సదర నిదర = చదరపుఁదనమును, చదరపు తీరును, సేద్యము నాద్యము వంటిదని (శ్రీ యల్లంరాజుగారి అభిప్రాయము).

తా : ఒక ఆట అయిన వెంటనే పొందిన బొట్లను అంగీకరింపక, రెండు సార్లు పాచికలను వేసి అనుకూలమైన బొట్లు పడఁగా పొంగుచు, చూడని ఆటను గుఱించి పిమ్మట చెప్పును. తనకు ఇష్టమైన బొట్లు పడుట లేదని తన నేర్పును ఆక్షేపించు

* పొమ్మని వ్రేటు సూటి

కొనును. ఒక పందెమును ఒడ్డి (ఒడ్డితాకినన్ పోయి) ఆటను సాగించి నష్టపడి, మఱొక సారి ఆడెదనని అతిశయించును. (పోయెనని) నీఆట పోయినది, అని శ్రీ కృష్ణుఁడు తాను పాచికలను తీసికొనుటకు ప్రయత్నింపఁగా, అతనిని కొంతసేపు అడ్డగించి, అతనివైపు చూచి అతని లక్ష్యమును చెఱిచి, 'సరే పాచికలను (పోనిమ్ము)' వేయుమనును.

ఆట తనకు ఒకింత పొసఁగని అప్పుడు (బొట్లు సరిగా పడనప్పుడు) పాచికల బరువును అవి పొరలునట్టి రీతిని, పలక యొక్క చదరపుఁ దనమును (నాలుగు వైపులు సమమైన ఎత్తులో నున్నవా లేదా అని) పరిశీలించి, సమ్మతి అయినచో (అంతయును సరిగా నున్న దని తలంచి) పాచికలను గ్రహించును. సత్యభామ ఆడునపుడు, రుక్మిణి పొంకు పొందిక) తటస్థభావము (పొంకన్) అనుకూలించుచుండఁగా, (పొందుచు), ఆమె హరిని (విష్ణువును) పెక్కుసార్లు గెలిచెను.

మధ్యవర్తి రుక్మిణి పొందికతో ప్రవర్తించెను. రుక్మిణి బొంకు బొంకె నను అర్థము ఇచ్చుట కుదురదు. బొంక వలసిన అవసరము లేదు. సత్యభామ ఆట తీరును నిరోధింపక పోవుట బొంకు కాదు. పాఠాం. ఒడ్డి (ఒంటి)

ఈ పద్యములో సాక్షి పదమునందున్న రుక్మిణి తటస్థ భావము వహింపక సత్యభామకు అనుకూలముగా 'బొంకు బొంకుట'చే ఆమె శీలము వివాదాస్పదమైనది. సోమన రుక్మిణిచే బొంకించెనని ఆక్షేపించువారుండఁగా రుక్మిణి బొంకిన దనుట సరికాదని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి అభిప్రాయము. వీరి అభిప్రాయమును దృష్టిలో పెట్టుకొనుట ఉచితము. దానికి అనుగుణముగా అర్థము వ్రాయఁబడినది.

విశే : పోయెడినని - పోయిన దని సవరించినచో గణభంగములేదు. లేదా తద్ధర్మ క్రియ భూతార్థమున ప్రయోగింపఁబడెనన వచ్చును.

కం. నిష్కము మొద లెక్కెన్ ద్వి చ
తు ష్కాష్టక షోడ శాది దుర్వహ శుల్కా
నిష్కములు వెరుగఁగా శో
చిష్కేశద్యోత మగు హృషీకేశు మదిన్. 129

ప్రతి : నిష్కము = బంగారు నాణెము యొక్క; మొదలు = మూలధనము; ఎక్కెన్ = ఎక్కువైనది; ద్వి= రెట్టింపు; చతుష్క = నాలుగు రెట్లు; అష్టక = ఎనిమిది రెట్లు, షోడశ+ఆది = పదునాఱురెట్లు, ఇట్లు మొదలై; దుర్వహ = (పొందుటకు అధికమై) ఆశ్చర్యకరముగా వృద్ధి

పొందినవై; శుల్కానిష్కములు = పందెపు సొమ్మైన నాణెములు; పెరుగఁగా; హృషీకేశుమదిన్ = (వ్యు) ఇంద్రియములకు ఈశుఁడు, విష్ణువు, శ్రీ కృష్ణుని మనస్సులో; శోచిస్ + కేశ = (వ్యు) ప్రకాశించు కేశములు కలవాడు, అగ్ని అనఁగా వేఁడిమి, ద్యోతము+అగున్ = (ఉద్రేకము) కలిగెను.

తా : సత్యభామ యొక్క బంగారు నాణెముల మూలధనము ఎక్కువైనది. ఇట్లు, రెండు, నాలుగు, ఎనిమిది పదునాఱు రెట్లుగా మొదలై ఆశ్చర్యకరముగా పందెపు సొమ్ము అధికముగా ఆమెకు చేరినది. శ్రీ కృష్ణుని మదిలో వేఁడిమి ఎక్కువైనది. హృషీకేశుఁడను ప్రయోగము, ఇచ్చట శ్రీకృష్ణుని, నిశ్చలత్వమును ప్రశంసించునదిగా, తరువాత కృత్యా సంహారమునకు అతని ఉద్రేకమును పోషించుచున్నదిగా ఊహింపఁదగును. సత్యభామ నైపుణి కలదయ్యెను. జయకాంక్షచే ఉద్వేగముతో ఆడినది. అట్టి విజయము ఆమె స్వభావమునకు తగినదనియే భావింప వలెను.

శుల్కా : ఆకారాంత స్త్రీలింగ రూపము సంస్కృతమున లేదు. పందెపు ధనమని అర్థము. ఇందు, ఆకారాంత స్త్రీ లింగరూపముగా ప్రయోగింపఁబడినది.

వ. ఇట్లు విశ్వలోకేశ్వరుండు వినోదించు నవసరంబున. 130

తా : విశ్వమునక అంతటికిని ప్రభువైన శ్రీ కృష్ణుఁడు మొదట రుక్మిణిచే ఓటమిని పొందెను. పిమ్మట ఆమె నిలుకడతో సహజగంభీరతతో ఆడినను శ్రీకృష్ణుఁడు సంశయాత్మకమైన జయమునే పొందెను. అయినను, రుక్మిణి ప్రసన్నత లోపింపలేదు. శ్రీ కృష్ణునకు ఆమె ఆడిన తీరు వికాసమును కల్గించెను.

అనంతరము, సత్యాదేవి తన యిష్టానుసారము పాచికలను తాళించి వేయుచు శ్రీ కృష్ణుని పలుసార్లు ఓడించెను. ఈ విధముగా మాయానాటక సూత్రధారుఁడు తన కాంతలతో అంతఃపురములో నెత్తమాడు తఱి (మీఁది పద్యముతో).

పాఠాం. సర్వలోకేశ్వరుండు.

## - : కాశీపతి ద్వారకపైఁ గృత్యను బనుచుట : -

ఉ. తాపముఁ గోపముం *దలము దాఁకినఁ బౌండ్ర సహాయుఁడైన కా
శీపతి సైఁప లేక హరుచేఁ బడసెన్ పురిదేహదాహ సం

* తలఁపు

దీపనిఁ గృత్య నాఁగ నొక దేవతఁ బావకకుండ మధ్య కీ
లా పరిశోభితం గొలువు లావులు వేలుపులైన మెచ్చరే. 131

ప్రతి : పౌండ్ర సహాయుఁడు + ఐన = పౌండ్రునకు సహాయము చేయు వాడైన (మిత్రుఁడు); కాశీపతి = కాశీనగరమును పాలించురాజు; తాపమున్ = (మిత్రుఁడు వధింపఁబడెనని) బాధయును; కోపమున్ = కోపమును; తలము తాఁకినన్ = ఓర్పు యొక్క మేరను అంటఁగా; అధికమగుటచే, ఓరిమిని నశింపఁజేయఁగా; పాఠాం. తలఁపు తాకినన్ = మనస్సును పీడింపఁగా; పాఠాం. దళము తాఁకినన్ = అధికముగా బాధింపఁగా; సైపలేక = ఆ మనఃక్లేశమును సహింపఁజాలక; హరు చేన్ = శివుని చేత; పురి దేహ దాహ సందీపనిన్ = ద్వారకా నగరము యొక్క శరీరమును (రూపమును), ద్వారకలోనున్న ప్రాణులను భవనములను (సర్వమును) కాల్చుటకై చక్కగా ప్రకాశించునట్టిదియును; పావక కుండ కీలా పరిశోభితన్= అగ్ని గుండము నడుమ మంటలతో చక్కని (శోభతో) వెలుఁగు నదియును; కృత్య నాఁగన్ = కృత్య అనెడి పేరు కలదియును; ఒకదేవతన్; పడసెన్ = (తపఃశక్తిచే) పొందెను. కొలువులావులు= సేవల గొప్పలను (గొప్పతనమును) వేలుపులు+అయిన = దేవతలు కూడ; మెచ్చరు+ఏ = నుతింపరా?

తా : పౌండ్రుని మిత్రుఁడైన కాశీరాజు, అతనిని శ్రీకృష్ణుఁడు చంపుటచే బాధ, కోపము కలవాఁడై ద్వారకా నగరమును దహించునట్టిదియు అగ్ని గుండములో మంటలతో వెలుఁగు నట్టిదియును, కృత్య అను పేరు గల దేవతను, శివుని గుఱించి, తపస్సు చేసి, అతని వలన పొందెను. దేవతలు భక్తుల సేవల ఆధిక్యమును శ్లాఘించి ఆదరింతురు కదా!

అలం : అర్థాంతర న్యాసము .

కం. మంటల మలఁచిన రూపై
మింట నడరి చూపు చూపు మ్రింగెదఁ గడు నాఁ
కొంటిం గలదే యాహుతి
యంటయు వాఁ డంటఁ బనిచె యాదవ పురమున్. 132

ప్రతి : మంటలు మలఁచిన రూపై = మంటలతో ఏర్పడిన రూపముకలదై; మింటన్ + అడరి = ఆకాశమందు అతిశయించి; చూపు, చూపు = చూపుము చూపుము; కడున్ +ఆఁకొంటిన్ = మిక్కిలి ఆఁకలి కలిగి ఉన్నాను; కలదే ఆహుతి = మండుటకు సామగ్రి ఉన్నదా? మ్రింగెదన్; అంటయున్ = అనఁగా; వాఁడు = ఆ కాశీరాజు (నిర్దయుఁడై);యాదవ పురమున్ = యాదవుల పురమైన ద్వారకను; అంటన్+ పనిచెన్ = కాల్చుటకు (కృత్యను); పనిచెన్ .

చం. బిందుపూర్వక టకారము ప్రాసాక్షరము. భావపుష్టికి ఇది పోషకముగా నున్నది.

తా : మంటలే శరీరరూపమై, ఆకాశమున అతిశయించి, చూపుము. మిక్కిలి ఆఁకలి చెంది యున్నాను. దహించుటకు సామగ్రి ఉన్నదా? వెంటనే దానిని మ్రింగి వేసెదను" అని కృత్య త్వరపడుచుండఁగా కాశీరాజు, ద్వారకను బూడిద చేయు మనెను.

వ్యా. అనుటన్ > అంటన్. సూ. 'తిదుట'లు పరంబులగునపుడు అన్వాదుల 'ను' స్థానంబున సున్నయు నుండు 'డు' లోపంబును, విభాష నగు,క్రియ, బాల - 58.

గీ. ఒడల నేదిక్కు సూచిన యోజనంబు
మండుచుండఁగ ఁదానును మగువ వోలె
ద్వారవతిసేర నబ్బారిఁ దల్లడిల్లి
పట్టణం బెల్ల నిట్టట్టు పడఁ గలంగె. 133

అర్థ : ఆ బారిన్ = ఆ వ్యధకు, ఉపద్రవమునకు; ఇట్టు+అట్టు = నలువైపులందు; పడన్ = పరుగిడఁగా; పాఠాం. వడన్ = వేఁడిమిచే; కలంగెన్ = కలఁతచెందెను.

తా : ఆ కృత్య స్త్రీ రూపధారిణియై అన్ని దిక్కులందును యోజనదూరము మంటలతో విస్తరించుచు ద్వార వతిని చేరినది. ఆ ఆపదను చూచి పట్టణమందలి ప్రజలు అందఱును భయముతో (ఆ వేఁడిమికి) తత్తఱపాటు చెంది నలువైపులకు పరుగిడిరి.

గీ. సాత్యకియు సీరపాణియు సంభ్రమించి
తమకుఁ జెప్పినవారును దారుఁ గూడి
పెద్దలైన సావాసులఁ బిలిచి పంచి
రంతిపురములో హరి నెత్త మాడునెడకు. 134

తా : సాత్యకియు, నాఁగలి ధరించిన బలరాముఁడును, తత్తఱపాటు చెంది తమకు ఆ వార్తను చెప్పిన వారును, తామును గూడి పెద్దలైన కావలివారిని పిలిచి, శ్రీ కృష్ణుఁడు అంతఃపురములో జూదమాడు చోటికి పోవలసినదిగా ఆన తిచ్చిరి.

విశే. సావాసము+ఇ = సావాసి, అంతఃపురపు కావలివాఁడు, సౌవిదల్లుఁడు శ.ర.

వ. వారును దత్కృత్యాదర్శనంబు వెగడందినవారు గావున. 135

తా : ఆ కావలివారు ఆ మంటలే రూపుగొన్న మగువ వలె నున్న ఆకృత్యను చూచి భయపడి తల్లడిల్లి యున్నందున (మీఁది పద్యముతో).

కం. పెదవులు దడుపుచుఁ బదములు
గుదిగొనఁ దత్తఱపు మాట గుత్తుక దగులన్
ముదుసలితనమున బెదరున
వదలిన యంగములు మిగుల వడఁకఁ గడంకన్. 136

అర్థ : పదములు = పాదములు; గుదిగొనన్ = నిలబడక పోఁగా; కుత్తుకన్ = గొంతులో, తత్తఱము+మాటలు = తడఁబడుమాటలు; తగులన్ = తగుల్కొనఁగా; వెలికి రాకపోఁగా, (అణఁగి పోయినవి); వదలిన = సడలిన; కడంకన్ = ప్రయత్నముతో.

తా : పెదవులలో తడి ఆరుచున్నది. కాళ్ళు నిలుచుటలేదు. గొంతులోని మాట తడబాటువలన వెలుపలికి వచ్చుటలేదు. ముసలితనము చేతను భయము చేతను సడలిన అవయవములు బాగుగా వణకుచున్నవి. అయినను ప్రయత్నముతో కావలి వారు ఇట్లనిరి. (మీఁది పద్యముతో).

కం. "సకలజగన్నాయక నేఁ
డొక లలన వపుఃకృపీట యోనిజ్వాలా
వికట చ్ఛట చ్ఛటారవ
నికారఘోరముగఁ జేరె నీ పురమునకున్. 137

అర్థ : లలన = మగువ; వపుఃకృపీటయోని = శరీరమందు నిండియున్న నిప్పుయొక్క; జ్వాలా =మంటలు గల; వికట ఛట+ఛట+ ఆరవ నికార ఘోరముగన్ = విరివియైన ఛట ఛట అనెడి ధ్వనులతో; పండ్లు "పట పట" కొఱుకు చున్నట్లు భయంకరముగా కన్పట్టుచు; ఈ పురమునకున్ + చేరెన్.

తా : సమస్తమైన పదునాలుగు లోకములకు ప్రభువైన వాఁడా! ఈ దినము ఒక మగువ తన శరీరమగు మంటలతో "ఛట ఛట" అను ధ్వనులతో పండ్లు పట పట కొఱుకు చున్నట్లు భయంకరముగా ఈ ద్వారకను చేరియున్నది.

వ్యా. జగత్+నాయక > జగన్నాయక, అనునాసిక సంధి.

వ్యు. కృపీటయోని, నీటికి ఉత్పత్తి స్థానమైన వాఁడు, అగ్ని.

భయపడవద్దు' అని నీ చెలికత్తెలు అను చున్నారు కదా! పలక మీఁద నున్న లెక్క తొలఁగి పోవును" అని సత్యతో వచించి, శ్రీ కృష్ణుఁడు సావాసులతో "ఇంక మీరు పొండి పొండి" అనఁగా (మీఁది వచనముతో).

కావలి వారిని ఉద్దేశించిన అర్థము.

ప్రతి : నావుడున్; దుగుణము = ఇది చాల చెడ్డపని; సూ = చూడుమా! ఇది = ఇట్లు కావించుట; తీవంచన = ముమ్మాటికి మోసము, (రాత్రిపూటదొంగవలె వచ్చి ముట్టడించి నగరమును కాల్చుట); ఒడ్డి = శత్రువును ఎదుర్కొని; తప్పితే సరి = ఆ మగువను కాల్చి వేయుట తప్పదు కదా! ఏమీ+ఏమీ = మంటయా, కాల్చినదా! మగువయా!; వెఱవకు = భయపడవలదు; మనరో = తప్పక ప్రజలు రక్షణ పొందుదురు గాక!; పోన్+పోను +చుమీ = ఈ ఉపద్రవము త్వరలో తొలఁగును చూడండి; పలక వ్రాయి = నొసటి వ్రాత (కొంత కష్టము అనుభవింప వలసినదే); పొద పొదఁడు =ఇంక మీరు వెంటనేపొండి; అనినన్ = అనఁగా.

తా : అని సావాసులు పలుకఁగా 'ఇప్పుడు జరిగినది చాల చెడ్డపని ఈ దహనకార్యము ముమ్మాటికిని గొప్ప మోసము. శత్రువును ఎదుర్కొని నాశము చేయఁగలను. ఏమైనప్పటికిని భయపడకండి. ప్రజలకు ఎట్టిభయము లేదు. వారు తప్పక రక్షణ పొందుదురు. ఈ ఉపద్రవము త్వరలో తొలఁగును. బ్రహ్మ వ్రాఁత వలన ఈ కష్టము వచ్చినది చూడండి. ఇంక మీరు వెంటనే పొండి పొండి" అనఁగా (మీఁది వచనముతో).

వ్యా. పోవుఁడు > పొద, పొదఁడు (పొండు)

సూ. పోవునకు దుఙ్ ముత్తులు ముజ్జు పరంబు లగునపుడు 'వు' లోపము, పొద పదలు విభాషనగు. క్రియ, బాల - 98. (చూడుము పద్య- 151)

వ. వార లన్నారాయణదేవుండు నెత్తంబు తమకంబునం దత్త
అంపునొడువులఁ గలయం దమకు నుత్తరంబిచ్చిన పలుకులు
బురుషోత్తముని చిత్తంబు దమమీఁద లే దని విచారించి విన్నపం
బవధారు దేవా యనుటయు నయ్యాదుకులాంబుధి సుధాకరుండు
సకల కళాకుశలుండు గావున నత్తఱి సత్యభామ పాసికలు దాలించి
వైచిన. 140

కం. "ఆఁకొన్న మృత్యువో వెలిఁ
బ్రాఁకిన లయకాలరుద్ర ఫాలానలమో
యూఁకొనఁ దడ వయ్యెడు నది
సోఁకినచోటెల్లఁ గాలుఁ జొర నిచ్చెదవే. 138

తా : "ఆకలి కలిగిన మృత్యు దేవతో? శివుని నొసటినుండి వెలుపలికి వెడలినట్టి ప్రళయ కాలమందలి శివుని మూడవ కంటి అగ్నియో? మేము చెప్పెడి మాటలకు, "ఊ ఊ" అని (శ్రద్ధగా వినక) "ఊ" కొట్టు చున్నచో (ఊఁకొను శ.ర. ఉదాహరించినది అర్ధ బిందువు అను నాసికోచ్చారణమునకు చిహ్నము) ఆలస్యమగును. అది తాఁకిన చోటంతయును మండి బూడిద అగును. అట్టి అగ్ని జ్వాలలను ద్వారకలోనికి ప్రవేశించుటకు అవకాశమిచ్చెదవా? దీనికి ప్రతి క్రియ చేయువా?"

ఛం. అర్ధ బిందుపూర్వక 'క' వర్ణము, ప్రాసాక్షరము.

కం. నావుడు"దుగుణము సూ యిది
తీవంచన [1] యోడెఁ దప్పితే సరి యే మే
మీ వెఱవకు మన [2] రో ప్రజం
బోవుఁ జుమీ పలకవ్రాయి పొదపొదఁ"డనినన్. 139

సత్యభామకు ఉద్దేశించిన అర్థము.

ప్రతి : నావుడున్ = అని సావాసులు పలుకఁగా; దుగుణము = ఇప్పుడు పడినది రెండు బొట్లు (అనుకూలమైన సంఖ్య); చూడు = బాగుగా గమనించు; ఇది తీవంచన = నీకు పడినది, నాలుగు; ఒడ్డి తప్పితివి+ఏ = నీవు కోరిన పందెము పడలేదు. కనుక నీవు తప్పితివే (ఓడితివి కదా!) సరి = సరియే; ఏమీ +ఏమీ = ఓడినప్పటికిని భయపడకుము+ అనరో = (నీ చెలికత్తెలు) భయపడవలదు అని నిన్ను ప్రోత్సహింపరా? పలక వ్రాలు = పలక మీఁద లెక్క; పోన్ +పోవున్ = తప్పక తొలఁగి పోవును; చుమీ = చూడుమా!"

పొద పొదఁడు = (వచ్చిన వారితో) ఇక్కడ నుండి మీరు పొండి, పొండి

తా : అని సావాసులు పలుకఁగా "ఇది రెండు బొట్లు. చూడు. నీది నాలుగు బొట్లు. నీవు ఒడ్డినది తప్పి పోయినది. నీవు ఓటమి పాలైనావు. ఇది యుక్తమే. 'నీవు ఏమియును

1. యొడ్డిత 2. రోపో

అర్థ : తమకము = త్వర; చలనము;

తా : ఆ వృద్ధులైన కావలి వారలు, ఆ నారాయణ దేవు(డు, జూదపు ఆటలో మనస్సు చలించుటచే తడ(బడు మాటలను కలిపి తమకు సమాధానంబు ఇచ్చినట్లు శ్రీకృష్ణుని మనస్సు తమ మీ(దలేదని చింతించిరి. వారు ఆదేవునితో "దేవా! మా విన్నపంబును శ్రద్ధగా వినుము", అనుటయును ఆ యదు వంశము అనెడి సముద్రమునకు అమృత కిరణు(డు (చంద్రు(డు), శ్రీకృష్ణు(డు సమస్తమైన కళలయందు చతురు(డు కావున, ఆ విప త్సమయములో సత్యభామ పాచికలు తాళించి వేయ(గా (ఆమెతో మేల మాడినట్లుగా) ఇట్లనెను.

గీ. దాయ మెత్తనో యీసారె దా(క నీక
కట్టి గెలిచెద నిదె పాసి కల*నిదయ్యు
ముల బటాబూర మిందేమి ముట్ట( గలదొ
పొంది వచ్చిన ప్రాలకు( బోవు( గాక. 141

సత్యభామ పక్షమున :

ప్రతి : దాయము +ఎత్తన్ +ఓ = ఈ పందెమును గెలిచితే ఏమి? (ఓ=కిమర్థకము); ఈ సారెన్ = ఈ పాచికలను; తా(కనీక = తా(క నియ్యక చేయి దా(టి పోనియ్యక; కట్టి గెలిచెదన్ = ఆటను బంధించి, నిరోధించి, ముందునకు సాగనియ్యక, తప్పక గెల్చెదను; ఇదె = ఇదిగో; పాసికలను = ఈ పాచికలను; దయ్యముల బటాబూరము = దైవముల పిశాచముల, పెద్దఱికము; ఇందు = ఈ పాచికలలో ప్రవేశించి; ఏమి ముట్టన్ +కలదొ = ఏమి ప్రయోజనమును పొంద(గలదో? పొంది వచ్చినన్ =పొందికగా పడినను; ప్రాలకున్ = (నా) బొట్లకు; పోవున్+కాక = (అవి) తప్పక నశించును.

తా : ఈ పందెమును గెలిచితే ఏమి? ఇప్పుడు నేను వేయు పాచికలతో నీ ఆటను నిరోధించి ఇదిగో చూడు తప్పక గెలిచెదను. ఈ పాచికలను ప్రవేశించిన దయ్యముల పెద్దఱికమువలన ప్రయోజనము ఏమి? నీకు పాచికలు పొందికగా పడినప్పటికిని నా బొట్లకు ఆటలో జయము లభించును.

సావాసుల పక్షమున :

ప్రతి : దాయము = విపత్తు (ఈ కృత్యవలన ఉపద్రవము); ఎత్తన్ +ఓ = కలిగితే ఏమి?

* ను వచ్చి పట్టెనో భూతమిందేమి పుట్ట( గలదొ.

ఈ సారె = ఈ దండయాత్ర (రూపాం. సారి); తాఁక నీక = నష్టమును కలింగింపనియ్యక; ఇదె = ఇప్పుడే; పాసి = ఇచ్చటనుండి వెడలి; కట్టి = ఆ (కృత్యను) నిరోధించి, గెలిచెదన్; కలను = యుద్ధమున; దయ్యముల బటా బూరము = అతిశయము; ఇందు = ఈ ద్వారకలో; ఏమి ముట్టన్ +కలదు =ఏ శత్రువును ఎదుర్కొనును? పొంది వచ్చినన్ = రూపమును పొంది, వచ్చినప్పటికి వ్రాలకున్ = తన విధి వ్రాతలను అనుసరించి; పోవున్+కాక = తప్పక తిరిగి పోవును. నాశ మగును. అగ్ని గుండమునుండి వచ్చినది, అగ్నిచేతనే బూడిద అగును.

తా : ఈ స్త్రీరూప ధారిణియైన కృత్యవలన ఇప్పుడు ఈ విపత్తు కలిగితే ఏమగును? ఈ కృత్య దండ యాత్రవలన ద్వారకకు ఎట్టి కష్ట నష్టములను కలుగనియ్యక, ఇప్పుడే ఆ ఆపదను నిరోధించి గెలిచెదను. దయ్యముల విజృంభణమువలన ఏమి నష్టమును కలుగదు. పొందికగా వచ్చినప్పటికిని, ఆ కృత్య తన విధి వ్రాతలను అనుసరించుచు తప్పక నాశమగును. (అగ్ని యందు పుట్టినది అందే అణఁగి పోవును).

అలం : శ్లేష. ఈ పద్యమున అర్థ శ్లేష (అభంగ), శబ్ద శ్లేష (సభంగశ్లేష), సత్యభామ, సావాసుల పరమున అర్థ స్ఫూర్తి నిచ్చుచున్నది.

కం. నావుడు సంతోషించిరి
సావాసులు వీరవచనచతురత సత్యా
దేవియు నెత్తపుమాటలు
గా విని తెలిసికొని మెచ్చెఁ గంసారాతిన్. 142

తా : అని హరివచింపఁగా సావాసులు అతని వీరవచనములలో గల చాతుర్యమును గుర్తించి సంతోషించిరి. సత్యాదేవి ఆతని పలుకులు, జూదపు మాటలుగా విని గ్రహించి కృష్ణుని మెచ్చుకొనినది.

## - : శ్రీ కృష్ణుఁడు కృత్యపైఁజక్రముఁ బంపుట : -

మ. మతి నొక్కింతయు సంచలింపక నిలింప త్రాణపారీణుఁడ
చ్యుతుఁ డాకృత్య కకృత్యకారిణికి మృత్యుప్రాప్తిగాఁ బంచె ని
ర్గతబాష్పోదక దానధార రిపురా ట్కాసార *విస్తార సం
తతపూర స్థిరమాన మీనహరణాంత ర్నక్రముఁ జక్రమున్. 143

* ధీసార

ప్రతి : మతిన్ = మనసునందు; ఒక్కింతయున్ = కొంచెమైనను; సంచలింపక = ఎట్టి ఆందోళనమును లేక; నిలింప త్రాణ పారీణుఁడు = దేవతలరక్షణ యందు శ్రద్ధ కలవాఁడు; అచ్యుతుండు = చ్యుతిలేని శీలము కలవాఁడు, హరి; ఆ కృత్యకు = ఆ "కృత్య" అనెడి పేరుగల మంటలే రూపైన; అకృత్యకారిణికిన్ = దుష్కార్యములు చేయుచున్న ఆ మగువకు మృత్యు ప్రాప్తిగాన్ = చావును కూర్చుటకై; నిర్గత = బయ ల్వెడలుచున్న; బాష్ప+ఉదక దాన ధార = కన్నీరైన మదజల బిందువులు కల;రిపురాట్ కాసార విస్తార = శత్రువురాజుల విరివియైన నీచకార్యములచే (బలాత్కారములచే); సంతత పూర స్థిరమాన = ఎల్లప్పుడును, సమృద్ధముగా నున్న (నిండియున్న) గర్వము అనెడి; మీన = చేపలను హరణ = హరించు నట్టి (మ్రింగునట్టి; అంతః+నక్రమున్ = మనస్సుగల మొసలి అగు; చక్రమున్ = చక్రాయుధమును; పంచెన్ = ఆజ్ఞాపించెను, ప్రయోగించెను.

తా: చింత ఆవంతయులేని వాఁడై, దేవతల యెడ ఆసక్తుఁడును, పరిశుద్ధ శీలము కలవాఁడును, అగు హరి, ఆ కృత్య అనెడి మంటల రూపై చెలరేగుచు చెడ్డ పనులు చేయునట్టి మగువను మట్టు పెట్టుటకు కన్నీరై ప్రవహించుచున్న మదజలము కల శత్రురాజుల గర్వమనెడి మీనములను హరించు నట్టి మనస్సు గల మొసలి అయిన చక్రాయుధమును ప్రయోగించెను.

అలం. రూపకము: ఉపమేయములు : శత్రురాజులమానము, చక్రము
ఉపమానములు : మీనములు, నక్రము

వ్యు. కాసార = కుత్సితమైన బలాత్కారములు కలవారు, నీచులు

నానా : సారము : జలము, బలిమి, చేవ.

వ. అదియును శతకోటిశతకోటిసన్నిభం బై చిత్రభానుచిత్ర భానుభావం బై సహస్రకిరణసహస్రకిరణనిపుణం బై సహస్రారుణమండలమధ్య దేవతా వివిధాయుధవిహరణవిద్యుల్లతికా విలాసం బై జపాక్షర నిక్షిప్త రక్షాలక్షణం బై మంటలు మింట నంట వెడలి కడలి వెడలిన బడబానల కీలాకలాపంబు చందంబునఁ గాలకూట విషవహ్నిజ్వాలామాలి కాభీలం బై నీలకంఠ నిటలతట నయన శిఖిశిఖా సహాయం బైన తెఱంగున మెఱచి చఱచినం బురంబు సార నేరక కృత్య కృత్యంబు లేక మరలి పఱవం జొచ్చిన విచ్చలవిడిఁ దనమయంబుగా గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుంగొని. 144

ప్రతి :అదియును = ఆ సుదర్శన చక్రమును; శతకోటి నూఱు అంచులతో; శతకోటి = ఇంద్రుని వజ్రాయుధముతో; సన్నిభంబై = సమనమ్మై;చిత్రభాను = విచిత్రములైన కాంతులను వెదజల్లు; చిత్రభాను భావంబై = అగ్ని తేజస్సు కలదై; సహస్ర కిరణ = వేయి వెలుఁగులతో; సహస్రకిరణ నిపుణంబై = సూర్యుని యొక్క నేర్పరితనము కలదై; సహస్ర + అరుణమండల = వేయి ఎఱ్ఱని వలయాకారముల (గుండ్రముల); మధ్య = నడుమ నున్న; దేవతా = (స్త్రీలింగములో నున్నది) వేలుపు యొక్క; వివిధ + ఆయుధ విహరణ విద్యుత్ + లతికా విలాసంబై = వేర్వేఱు, యుద్ధ సాధనములను విశిష్టముగా నిర్మూలించునట్టి మెఱపు తీఁగల (పోకడల) విన్యాసంబులు కలదై; జపా+అక్షర నిక్షిప్త రక్షా లక్షణంబై = జపము చేయు మంత్రములందు ఉంచఁబడిన, సమస్తమును రక్షించు శక్తియై; మంటలు; మింటన్+అంటన్ = నిప్పు సెగలు, ఆకాశమును అంటుచుండఁగా; వెడలి = బయల్పడి; కడలి వెడలిన బడబా +అనల = సముద్రమునుండి వెలుపలికి వచ్చినట్టి ఆఁడు గుఱ్ఱపు మోము గల అగ్ని యొక్క; కీలా కలాపంబు చందంబునన్ = సెగల మొత్తము వలెను; కాలకూట విషవహ్ని జ్వాలా మాలికా + ఆభీలంబై = కాల కూట మనెడి పేరు గల విషపు నిప్పు యొక్క మంటల వరుసలతో, క్రూరమై మిక్కిలి వెఱపుకొల్పునదై; నీ కంఠ నిటల తట నయన శిఖిలశిఖా సహాయంబైన తెఱంగునన్ = శివుని నొసటి చోటనున్న మూడవ కంటి యొక్క అగ్ని జ్వాలలకు సాయ పడు విధమున; మెఱచి = తళుక్కున మెఱయుచు, చఱచినన్ = అన్నిదిక్కులందు వ్యాపించుచుండఁగా; పురంబున్+చొర నేరక = ద్వారకను ప్రవేశించుటకు శక్యముగాక; కృత్య = ఆ పేరుగల దేవత; కృత్యంబు లేక = తాను చేయఁదగిన పనిలేక (ద్వారకను కాల్చి ఆఁకలిని పోగొట్టుకొనుటకు వీలుగాక); మరలి = వెనుదిరిగి; పఱవన్ + చొచ్చినన్ = పలాయనము చేయుచుండఁగా; విచ్చల విడిన్ = తన ఇష్టానుసారము, అడ్డులేని పోకడలతో; తన మయంబుగాన్ = తన తేజస్సు ఎల్లెడలను నిండఁగా, తానే ద్వారకపై అన్ని వైపుల పరిభ్రమించునదై; గగనంబునన్ = ఆకాశమందు; నిగుడు = ముందునకు సాగుచు సంచరించుచున్న; ఆ + చక్రంబున్ = ఆ హరియొక్క సుదర్శన చక్రాయుధమును; కనుంగొని = చూచిన వారై.

తా : ఆ సుదర్శనాయుధము, నూఱు అంచులతో వజ్రాయుధముతో సమానమ్మై, విచిత్రములైన వర్ణములతో అగ్ని తేజము కలదై, వేయి వెలుఁగులలో సూర్యుని వేఁడిమితో నిండినదై, ఎఱ్ఱని వేయి గుండ్రముల నడుమనున్న దేవతయొక్క వేర్వేఱు ఆయుధములను నశింపఁజేయు మెఱపు తీఁగల పోకడలు కలదై, జపించు మంత్రముల యందు ఉంచఁబడిన రక్షించు శక్తియై, నిప్పు సెగలు ఆకాశమును తాఁకు చుండగా, సముద్రమునుండి వెలుపలికి వచ్చిన ఆఁడు గుఱ్ఱపు మోముగల అగ్నియొక్క సెగల మొత్తము వలెను, కాల కూట మనెడి విషాగ్ని యొక్క మంటల వరుసలతో భయంకరమై,

శివుని ఫాలమందున్న మూడవ కంటి యొక్క అగ్ని జ్వాలలకు సాయపడు విధమున అన్ని దిక్కులందును ప్రకాశించుచు వ్యాపించుచు ఆ స్త్రీ రూపిణియైన కృత్య ద్వారకను కాల్చి తన ఆఁకలిని పోగొట్టుకొనఁజాలక వెనుదిరిగి పరుగిడిపోవు చుండెను. అప్పుడు అడ్డులేని పోకడలతో తన తేజస్సే, ఎల్లయెడలను నిండి ఆకాశమందు సాగుచున్న ఆ సుదర్శన చక్రమును సందర్శించిన వారై (మీఁదిపద్యముతో).

అలం : యమకము : శతకోటి, శతకోటి, చిత్రభాను, చిత్రభాను సహస్రకిరణ, సహస్రకిరణ కృత్యకృత్య.

వ్యా. 1. విద్యుత్+లతికా>విద్యుల్లతికా. లకారము పరమగుచో లకారమాదేశమగును. సంస్కృత సంధి.

2. తనమయంబు, మయము, మాత్రము, సంస్కృత మందు మకారాది ప్రత్యయములు. తెలుగు పదములకు చేరవు. సోమన "తన" అనెడి తెలుఁగు పదమునకు దానిని కలిపెను. ఇది వ్యాకరణ విరుద్ధమైనను, ప్రౌఢ వ్యాకరణము సమర్థించినది.

సూ. ప్రాచుర్యార్థమునందు, తెలుఁగు పదముల మీఁదను, మయట్ ప్రత్యయము చూపట్టెడు, తద్ధిత, ప్రౌఢ - 18.

కం. సురగరుడయక్ష విద్యా
ధర కిన్నర దివ్యమునులు తద్దర్శన సం
స్మరణ ప్రణామ పూజా
పరతంత్రతఁ దెరువు దొలఁగి బలసిరి చదలన్. 145

తా : దేవతలు, గరుడుఁడు, యక్షులు, విద్యాధరులు కిన్నరులు దేవలోకమునకు చెందిన మునులు ఆ సుదర్శన చక్రమును దర్శించి ధ్యానము చేసి దానికి నమస్కారము పూజ చేయుచు ఆకాశమందు పోవుటకు దారి నిచ్చుచు గుమిగూడిరి.

కం. పురుహూత ముఖ్య దిక్పా
లురు సేవింపంగ సకల లోకేశ్వరుఁ డం
బురు హాసనుఁడు గని నమ
స్కరించి వినుతించె నిజముఁ గై వారముగాన్. 146

తా : ఇంద్రుఁడు మొదలగు ముఖ్యులగు దిక్కులను పాలించు దేవతలు, చక్రమునకు సేవలు కావించుచుండఁగా సకల లోకములకు ప్రభువైన శివుఁడును పద్మమును ఆసనముగాఁగల బ్రహ్మయును, సుదర్శనచక్రమును దర్శనము చేసికొని భక్తితో నమస్కరించి వాస్తవమును (సత్యమైన) స్తోత్రముగా విశేషముగా పొగడిరి.

సీ. దైతేయ మదవతీ ధమ్మిల్లముల తోడ
విరుల నెత్తావికి వీడుకోలు
దనుజ శుద్ధాంత కాంతా కటాక్షములతోఁ
గలికి కాటుకలకుఁ గాని వావి
దానవ మానినీ స్తన కుంభములతోడఁ
బసుపుఁ బయ్యెదలకుఁ బాయు తెరువు
దైత్యావరోధన దయితాధరములతో
సొబగు వీడెములకుఁ జుక్కయెదురు

గీ. చేసి సుర సుందరీ కరోశీర తాల
వృంత చలి తాంతకుంతల విలస దింద్ర
కుల వధూటీ లలాటికా కుంకుమంబుఁ
బదిల పఱుపఁ జక్రంబ నీ భరమ కాదె. 147

ప్రతి : దైతేయ = రాక్షస;మదవతీ = గర్వించిన వనితల యొక్క ధమ్మిల్లములతోడ = కొప్పులతో; విరుల = వారు ధరించు పూవులయొక్క, నెఱ+తావికిన్ = నిండైన సువాసనలకు; వీడు కొలిపి = ఎడఁబాటు కలిగించి; దనుజ = రాక్షస; శుద్ధాంత = అంతఃపురమందలి; కాంతా కటాక్షములతో = మగువల కడగంటి చూపులతో; కలికి కాటులకున్ = అలంకరించిన అందమైన కాటుకలకు; కాని వావిన్ = కలయికను తొలఁగించి; దానవ= రాక్షస; మానినీ = స్త్రీలయొక్క; స్తన కుంభముల తోడన్ = కుండల వంటి కుచములతో; పసుపు పయ్యెదలకున్ = పసుపులో ముంచిన మేలి వస్త్రములకు (పైటలకు); పాయు తెరువున్ = విడిపోవు; ఉపాయము కలిగించి; దైత్య = రాక్షస; అవరోధన = అంతఃపుర; దయితా + అధరములతో యువతులయొక్క క్రింది పెదవులతో; సొబగు వీడెములకున్ = అందమైన (ఎఱ్ఱని) తాంబూలములకును (వానిని నమలుటకు) చుక్క ఎదురు చేసి = హాని చేసి, (ప్రయాణ సమయమున శుక్ర నక్షత్రము ఎదురగుట కీడును సూచించును); సుర సుందరీ = దేవలోక

మందలి సౌందర్య వతులయొక్క కర+ఔశీర తాలవృంత = చేతిలో ధరించియున్న వట్టి వేరులతో చేయఁబడిన, విసన కఱ్ఱలచే; చలిత+అంత కుంతల = చలింపఁజేయఁబడుచున్న వెండ్రుకల కొనలతో; విలసిత్+ఇంద్ర కుల వధూటీ లలాటికా కుంకుమంబున్ = ప్రకాశించుచున్న ఇంద్రుని ఇల్లాలైన శచీదేవి యొక్క నొసటియందు (ఇంద్రుని రక్షించుటచే మంగళకరమైన) సిందూరమును; పదిల పఱుపన్ = భద్రము చేయుట (కాపాడుట); చక్రంబ = ఓ చక్రమా! నీ భరము+అ, కాదె = నీ బాధ్యతయే కదా!

వివే. దైతేయ, కశ్యపునకు దితికి జనించినవారు

వ్యు. దనుజ, కశ్యపునకు దనువు కలిగినవారు, దానవ = దనువునకు జనించిన వారు,

దైత్య = దితికి జనించిన వారు, అందఱును రాక్షసులు.

మదవతీ, కాంతా, మానినీ, దయితా, సమానార్థకములు.

సీస పద్య రచనలో నాలుగు పాదములలో సమానమైన తూఁగున్నది. పద్యమందు చక్రము యొక్క భారమును స్ఫురింపఁజేయుటకు దీర్ఘ సమాస భూయిష్ఠ పద ప్రయోగము విలక్షణమై ఒప్పారుచున్నది.

వ. అనుచుం జక్రంబు వీడుకొని కడచి పోవుటయు నా సుదర్శనంబు నుద్దేశించి 148

తా: అట్లు ఆకాశగమనులు స్తుతించుచుండఁగా, సుదర్శన చక్రము వారలను వీడి వారి దృష్టినుండి దూరముగా సాగి పోవుచుండఁగా, వారు ఆ చక్రమును ఇట్లు ప్రశంసించిరి.

మ. సతతంబు న్నుతియింతు జంతుమయ సంసార క్రియా రక్షణా
క్షత శౌర్యక్షపి తారిపక్ష మగుటన్ సంగ్రామ భీమ భ్రమా
గత గేహాంతిక దీర్ఘికా తట లుఠత్కంఠ *చ్ఛిదాచ్ఛాదన
క్షతజ క్షాళిత కేలి తామరస రక్షశ్చక్రముం జక్రమున్. 149

ప్రతి : జంతుమయ సంసార క్రియా రక్షణ + అక్షత శౌర్య = జన్మలను పొందు ఆత్మల కర్మ పరంపరల యొక్క పనులను రక్షించుటయందు; తగినట్టి (మొక్కవోని) శౌర్యముచే క్షపిత

* చ్ఛిదా చ్ఛేదన

= వధింపఁబడిన; అరి పక్షమగుటన్ = శత్రువుల యొక్క సమూహమును కలదగుటచే, సంగ్రామ భీమ భ్రమ+ఆగత = యుద్ధము చేయుటకు భయపడి తత్తఱపాటు చెంది, మరలివచ్చిన వారై; గేహ+ అంతిక = ఇండ్ల లోపలి భాగము లందున్న; దీర్ఘికా తట లుఠత్ కంఠ ఛిద+ఆచ్ఛాదన = దిగుడు బావుల గట్టులందు దొర్లుచున్న తలల నఱకుళ్లచే; నిండియున్న (వానిని నుండి స్రవించు); క్షతజ క్షాళిత = రక్తముచే తడుపఁబడినదియు నైన (కడుగఁబడినదియు) తుడువఁబడినదియు నైన; కేలి తామరస రక్షస్+చక్రమున్ = వినోదమునకై పెంపఁబడిన తామర పువ్వులు అనెడి, రాక్షస సమూహముల ఎఱ్ఱని తలలు కలదియు నైన; చక్రమున్ = సుదర్శన చక్రాయుధమును; సతతంబున్ = ఎల్లప్పుడును; నుతింతును = పొగడెదను.

తా : జన్మలను పొందుచున్న ఆత్మల యొక్క ఎడతెగని కర్మ పరంపరల యొక్క వ్యవహారములను రక్షించుటయందు, తగ్గనట్టి శౌర్యముచే వధింపఁబడిన శత్రువుల సమూహము కలదగుటచే యుద్ధములకు భీతిచెంది తత్తఱపాటుతో ఇంటికి మరలివచ్చి ఇండ్లు లోపలిభాగము లందున్న దిగుడు బావులయొక్క గట్టులందు ఖండింపఁబడి దొర్లుచున్న తలలనుండి వెల్వడు రక్తముచే తడుపఁబడిన; వినోదార్థమై పెంచఁబడిన తామరపూవులు అనెడి రాక్షస సమూహము యొక్క ఎఱ్ఱని తలలను కలదియు నైన పావనమైన సుదర్శన మనెడి చక్రాయుధమును ఎల్లప్పుడును కొనియాడెదను.

నానా, పక్షము= పదునైదు దినములు, ఱెక్క, ప్రక్క. బలము, సేన, పగ, చెలికాఁడు, సహాయుఁడు (సామాన్యముగా కేశమను అర్థము నిచ్చు పదములకు పరమైనపుడు సమూహము అను అర్థము. ఇచ్చట తద్భిన్నమైన పదమునకు ఉత్తర పదమై, సమూహార్థము కలిగియున్నది).

వ్యా. కంఠ+ఛిద > కంఠ+త్+ఛిద > కంఠ+చ్+ఛిద > కంఠచ్ఛిద, తుగాగమ శ్చుత్వ సంధి.

2. ఆ+ఛాదనము = ఆచ్+ఛాదనము = ఆచ్ఛాదనము ఇచ్చట "ఆజ్" నకు తుగాగమ శ్చుత్వసంధి.

పాఠాం. ఛిద్+ఆచ్ఛేదన "ఛిద్" అన్నను "ఆచ్ఛేదన" మన్నను, నఱకుట అనియే అర్థము.

కం. అనుచుఁ గొనియాడి వనజా
సనుఁ డేఁగె సుదర్శనంబు సనుచో నెదురం
గని దనుజ రాక్షసులు క్రో
ధను లై తన్నిశితధారఁ దగిలి తునియఁగన్. 150

తా : అనుచు పద్మాసనుఁడు బ్రహ్మ, సుదర్శన చక్రమును కొనియాడి (తన సత్యలోకమునకు) పోయెను. ఆ చక్రము పోవునపుడు ఆకాశమందు ఎదుట చూచి క్రోధముతో ఎదిరించిన రాక్షస వర్గములు వాఁడియైన దాని వాదరలకు తెగి ముక్కలగు చుండఁగా, (మీఁది పద్యముతో).

ఉ. ఆ పరమేశ్వరుండు జగదంబికతోఁ బ్రమథ వ్రజంబుతో
గోపతితోడఁ జక్రమునకుం జవ మెక్కుడు పోద మంచుఁ గా
శీపురి నుండ నొల్ల కతిశీఘ్రగతిన్ శతయోజనంబులం
దాపసయోగ్య మై పరఁగు తాలవనంబున కేఁగె నెమ్మదిన్. 151

తా : ఆ పరమేశ్వరుఁడును, "ఈ సుదర్శన చక్రమునకు వేగమెక్కువ" అని తలంచి కాశీపురములో ఉండుటకు ఇష్టము లేని వాఁడై మిక్కిలి వేగముతో కూడిన గమనముతో నూఱు యోజనముల దూరమం దున్నదియును, తాపసుల నివాసమునకు యోగ్య మైనదియు నైన, తాలవనమునకు జగత్తునకు తల్లియైన విశాలాక్షితోను, శివభటుల సమూహముతోను గోవులకు నాయకుడైన నందీశ్వరునితోను నిశ్చలమైన మనస్సు కలవాఁడై పోయెను.

వ్యా. పోవుదము పోదము, సూ పోవునకు దుజ్ ముత్తులు, ముజ్జుపరంబుగునపుడు 'వు' లోపంబును, పొద పద, లును విభాషనగు. క్రియ, బాల - 98

రూపాం. పొదము. పదము (చూడు, పద్య - 139)

కం. కాశీపతి నగరముపై
నాశాకా శావకాశ హళహళిత హతా
క్రోశ జ్జనజాలం బై
కేశవచక్రంబు కృత్యకృత్యం బయ్యెన్. 152

ప్రతి : కాశీపతి నగరముపైన్; ఆశ+ఆకాశ+అవకాశ =(చక్రాయుధ) అగ్నిచే, ఆకాశమందు అన్ని దిక్కులలో; హాళహాళిత = మారు మ్రోఁగు కలకల ధ్వనులు (ఆక్రమింపఁగా); హర+ఆక్రోశత్ = దాని వేఁడిమియొక్క బాధచే కేకలు పెట్టుచు భయపడుచున్న; జన జాలంబై = పౌరుల సమూహము కలదై; కేశవ చక్రంబు; కృత్య కృత్యంబు+అయ్యెన్ = కృత్యను(ఖండించు) కార్యమునకు పూనుకొనెను.

కృత్త్య పాఠాం. కృత్త్య = (కృత్యను) ఖండింప వలసిన కృత్యంబు + అయ్యెను = కార్యము కలదయ్యెను.

తా : సుదర్శన చక్రము 'కృత్య' అనెడి దేవతను అంతము చేయుటకు కాశీనగరమునకు వచ్చెను. అపుడు చక్రమునుండి అగ్ని ఆకాశమందు అన్ని చోట్లను కలకలధ్వనులతో ఆక్రమించినది. ఆ మంటల వేఁడిమి దుర్భరమగుటచే కాశీపురవాసులు తమకు ఎట్టి విపత్తు విస్తరించునో అని వ్యాకులపాటు చెంది భయపడిరి. ఆ కేశవ చక్రము కృత్యను హరించుటకు ప్రయత్నించెను.

వ్యా. ఆక్రోశత్ +జనజాలంబు = ఆక్రోశజ్జన జాలంబు

వానా. ఆశ శ్చుత్త్వసంధి ఆ, స్త్రీ = ఆస, దిక్కు, అ, (పుం) అగ్ని.

ఉ. ఆపురుషోత్త మాయుధము నంతకము న్గనుఁ గొన్న భీతిఁ గా
శీపతిఁ జేరి యుప్పతిలఁ జేసిన సిద్ధుఁడ వంచుఁ గౌఁగిటం
జేపడఁ బట్టి ముంబరముఁ జేసె దిగంబర వేషఁ గృత్యఁ ద
త్పాప పరాయణ ద్వయముఁ బావకచక్రము నీఱు చేసియున్. 153

అర్థ : అంతకమున్ = అంతకు ముందు, అంతము చేయుదానిని; ఉప్పతిలన్ + చేసిన సిద్ధుఁడవు+ అంచున్ = సృష్టించిన గొప్ప శక్తి గలవాఁడవు అనుచు; చేపడన్ = చిక్కు నట్లు; మంబరమున్ + చేసెన్ = దహించెను; 'చేపడు' 'మంబరము సేయు' ఈ రెంటిని, శ.ర ఉదాహరించినది. శబ్దస్వరూపము ముంబరము కాదని గ్రహింప వలెను. తద్+ పాప పరాయణ ద్వయమున్ = ఆ దుష్కార్యముల చేయుట యందు ఆసక్తులైన ఇరువురిని; పావక చక్రము = పవిత్రమైవ సుదర్శన చక్రము; నీఱు చేసియున్ = (ఇట్లు) బూడిద చేయుటకు కారణమై.

తా : ముందే "కృత్య" అనెడి దిగంబర దేవత, ఆ పురుషోత్తముడైన హరి ఆయుధమును చూచిన దగుటచే భయపడి వెంటనే మరలిపోయి, కాశీపతిని చేరి "నీవే నాకు జన్మ నిచ్చిన మహాసిద్ధుఁడవు" అనుచు అతనిని తన కౌఁగిలి యందు చిక్కు

కొనునట్లు పట్టుకొనెను. అట్లు చేయుటచే ఇరువురు దహింపఁబడిరి. ఈ విధముగా పావనమైన కేశవ చక్రము ఆ పాప కార్యాసక్తులను బూడిద చేసినదై (మీఁది పద్యముతో).

చం. తనియక కాల్చె వెండియును దంతి తురంగ శతాంగ సైనికా
వనిసుర మండ లాధిపతి వైశ్య జఘన్యజ మండ లానులే
పన కుసు మాంశుక స్తబక బంధ వనా చల దుర్గ రౌప్య కాం
చన తృణ దారు గేహ దృఢ సంచల సూక్ష్మ మహా పదార్థముల్. 154

ప్రతి : వెండియును = కృత్యయు, కాశీరాజు ఇరువురు బూడిద కాఁగా పిమ్మట; తనియక = తృప్తి చెందక; దంతితురంగ శతాంగ సైనిక = ఏనుఁగులను, గుఱ్ఱములను, పెద్ద రథములను, కాల్బంటులను; అవని సుర = బ్రాహ్మణులను; మండల +అధిపతి = క్షత్రియులను, వైశ్య = వైశ్యులను జఘన్యజ = శూద్రులను; మండల = మొదలగు వారి సమూహములను; అనులేపన = శరీరమునకు పూసికొను పరిమళద్రవ్యములను; కుసుమ = ధాన్య విశేషమును; అంశుక = సన్నని వస్త్రములను; స్తబక = పూలగుత్తులను; బంధ = చెఱసాల్లను; వన = అడవులను; అచల = కొండలను; దుర్గ = కోటలను; రౌప్య = వెండిని; కాంచన = బంగారును; తృణ = గడ్డివాములను; దారు = దేవదారు చెట్లను; గేహ = ఇండ్లను; దృఢ = కదలని వానిని; సంచల = కదలునట్టి వానిని; సూక్ష్మ = చిన్నవియును; మహా = పెద్ద; పదార్థముల్ = వస్తు సముదాయమును; కాల్చెన్.

తా : సుదర్శనచక్రము, చతురంగ సైన్యమును, చతుర్వర్ణముల జనులను, పరిమళ ద్రవ్యములను ఫలములు వస్త్రములు పుష్పములు బంధనాలయములను, వనములను, గిరులను కోటలను వెండి బంగారు గడ్డి చెట్లను, ఇండ్లను, చరములను అచరములను చిన్న పెద్ద వస్తువులను సమస్తమును దహించెను.

విశే : దహింపఁబడిన వాని పేర్లను దీర్ఘ సమాసములో ఇంపుగ మూడు పాదములలో కూర్చెను.

నానా. మండలము = దేశము, సమూహము, బింబము, నలుబదిదినములు, ఇంద్రుని కత్తి, కుక్క, వ్యూహము మొ.

గీ. ఆఱు యోజనములలోఁతు నందులో స
గంబు నలు సదరముఁ గాలి కాశి గాసి

* మహి సుతేజిత యనంగ

యయ్యె ముప్పదియేండ్లు సిచ్చాఱ దింద్రు
చేత నవిముక్త *మయి చెల్లెఁ జితి యనంగ. 155

అర్థ : గాసి + అయ్యెన్ = నాశమయ్యెను.

తా : ఆఱు ఆమడల లోఁతు, మూడు ఆమడల పొడవు వెడల్పుతో చతురస్రాకారము గల నేల, కాశీపురములో నాశనమయినది. అప్పటినుండి మొదలైన నిప్పు ముప్పదేండ్లు చల్లారలేదు. మహేంద్రుఁడును, మంటలను చల్లార్చుటకు ప్రయత్నింపక పోవుటచే, కాశీ నగరము మంటల నుండి విడుదల పొందక "చితి" అను సార్థక నామమును పొందినది. అదియే దానికి రూఢి అయినది.

వ. ఇట్లు కాశీపురంబు దరికొలిపి కృత్యాసంహరణంబునం గృత కృత్యం బై సుదర్శనంబు దామోదర దేవునకుం బొడసూపి సుఖం బుండె దురోదర పరాయణుం డైన యన్నా రాయణుండు గెలుపు నోటంబును సరిగా నద్దేవీద్వయంబుతో వినోదించుచు మఱియు వివిధాంతఃపుర వనితా విహారంబులం బ్రొద్దు పుచ్చుచు నుండె నచ్చక్రంబు వెండియు. 156

అర్థ : దురోదరపరాయణుఁడు = జూదమందు ఆసక్తి కలవాఁడు.

తా : ఈ విధముగా కాశీ నగరమును దహించి, కృత్యను సంహరించుటచే, సఫలమైన కార్యము కలిగి, పావనమైన సుదర్శన చక్రము హరిని దర్శనము చేసికొని, సుఖముతో నుండెను. సొగటాల ఆటయందు ఆసక్తుఁడైన శ్రీమన్నారాయణుఁడు గెలుపును ఓటమియును సమానముగా, పట్టపుదేవులైన రుక్మిణీ సత్యభామలతో వినోదముతో సంతోషించుచు, మఱియు వేర్వేఱు, అంతఃపురవనితలతో కూడి విహరించుచు, ప్రొద్దు పుచ్చుండెను. ఆ సుదర్శన చక్రము మఱియును (మీఁది పద్యముతో).

కం. దైతేయకామినీ సం
ఘాతము మగ మొలక లైన కడుపులు డిగ సం
కేతించినట్లు చక్రము
పాతాళంబునకు నరుగుఁ బ్రతిషాణ్మాసిన్. 157

అర్థ : దైతేయ కామినీ సంఘాతము = రాక్షస కాంతల సమూహము; మగ మొలకైన కడుపులు = గర్భములోనున్న మగ పిల్లల పిండములను; డిగన్ = నాశము చేయుటకు; సంకేతించినట్లు = నిర్ణయించు కొన్నట్లు; ప్రతిషాణ్మాసిన్ = ఆఱునెలలకు ఒకసారి.

తా : పాతాళములో రాక్షస కాంతలు నివసించు చుండుటచేత, అందు గర్భవతులైన రాక్షస కాంతల గర్భములలో గల, పిండములలో మగ సంతాన మున్నచో దానిని నాశము చేయుటకు నిర్ణయించు కొన్న దేమో అని తలంచునట్లు, క్రమము తప్పక ఆఱునెలలకు ఒకసారి సుదర్శనచక్రము పాతాళమునకు పోయి వారు కడుపులలో గల మగ మొలకలను నాశము చేసి వచ్చుచుండును.

నానా. సంఘాతము = సమూహము, గట్టి దెబ్బ, నరక విశేషము.

కం. నీయెడ నాయెడ నేయెడఁ
బాయఁడు కృష్ణుఁడు విష్ణుపరిచర్యా సం
ధాయకము చక్ర మాత్మం
జేయుము సత్పూజ లిష్టసిద్ధికి ననఘా. 158

ప్రతి : అనఘా = ఓ పుణ్యాత్ముఁడా! నీ +ఎడన్ = నీ యొద్దనుండియు; నా + ఎడన్ = నా యొద్దనుండియు; ఏ+ఎడన్ = ఏ చోటు నుండియును; (ఏ భక్తులహృదయమునుండియు); కృష్ణుఁడు; పాయఁడు = పోఁడు; చక్రము = సుదర్శన చక్రము; విష్ణు పరిచర్యా సంధాయకము = విష్ణుసేవలను చేసినట్టి ఫలములనుకూర్చునట్టిది; ఇష్టసిద్ధికిన్ = నీ కోరికలను ఫలింపఁజేసికొనుటకు; ఆత్మన్ = నీ మనస్సులో (నిలుపుకొని) సత్పూజలు = శ్రేష్ఠములైన ధ్యానము జపము మొదలైనవి చేయుము. వైశంపాయన మునీంద్రుఁడు ఆశ్వాసాంతమున జనమేజయునికి సుదర్శన చక్ర ప్రభావమును వర్ణించుచున్నాఁడు.

తా : ఓ పుణ్యాత్మా! నీ హృదయమునుండియు నా హృదయమునుండియు శ్రీ కృష్ణుఁడు పోఁడు. ఇంత ఎందుకు, అతఁడు, ఏ భక్తుల హృదయములను వదలిపెట్టి పోఁడు (ఎల్లప్పుడును భక్తుల హృదయములలో ఉండును). ఆ సుదర్శన చక్రము విష్ణు సేవల ఫలమును కలుగఁజేయును. మనస్సులో నిలుపుకొని నీ కోరికలను పొందుటకు ఆ పావన చక్రాయుధమును ధ్యానజపాదులతో పూజింపుము.

వ. ఈచక్రప్రభావంబు భావంబునం దలంచిన యతనికిం గార్యసిద్ధియు శరీరరక్షయుం జేకుఱు నిది నీకుఁ జెప్పితి సావధానుండవై యెప్పుడుం

దలంచునది యనుచు నమ్మునీంద్రుండు. 159

తా : "ఈ సుదర్శన చక్రము యొక్క మహిమను మనస్సునందు తలఁచిన వానికి కార్యము సిద్ధించును, అతనికి ఆరోగ్యము ఆయుస్సు శరీర రక్షణము కలుగును. (శత్రువులు బాధింపలేరనుట). ఈ సత్యమును ఓ రాజా! నీకు ఉపదేశించితిని. ఏకాగ్రతతో, శ్రద్ధతో, ఎల్లప్పుడును, చక్రమును ధ్యానింపుము" అనుచు ఆ మునీంద్రుఁడు ఆశ్వాసాంతమున హితవచనమును బోధించెను.

ఉ. భానవ భానుమండల విభాసి విభాకర దివ్యభవ్య సం
ధాన విధాన దక్షిణ సుధా కరుణారసపూర హారి చే
తోనయనా తపోనిధి విధూత తమ స్ఫుర ణాంతరంగ ని
ధ్యాన పరాయణా పరమతత్త్వమయ స్తవ వైభ వోన్నతా. 160

ప్రతి : భానవ = క్రొత్త ప్రకాశముతో కూడిన, పాఠాం. భా+ఆనన = ప్రకాశవంతమగు, ముఖములు గల; భాను = ఆదిత్యుల; మండల = సమూహములో; విభాసి= విశేషముగా భాసించు; విభాకర= సూర్యుఁడా! దివ్య = అతి శ్రేష్ఠమైనదియును (సత్యమైనదియును); భవ్య = శుభకరమైనదియును; (అయిన); సంధాన విధాన = (లోకముల ఉనికిని) అమర్చిన వాఁడా! దక్షిణ సుధా కరుణా రస పూర = అందఱి యెడ సమభావము కలిగి, అమృతమును పోలి, చల్లనైన దయయొక్క ఆర్ద్రతతో నిండిన (ఆర్ద్రత యొక్క వెల్లువగల); హారి = హృదయములను హరించునట్టి; చేతస్ + నయనా = (చల్లఁగా చూచువాఁడు) మానసమే కన్నులైన వాఁడా! తపస్ + నిధి = మునులచే; విధూత = విదల్చి వేయఁబడిన; తమస్ = చీఁకట్లయందు; స్ఫురణ + అంతరంగ = మినుకు మినుకు మని కన్పట్టుచున్న ఆత్మలందు; నిధ్యాన = దర్శన మిచ్చుటకై (ఏకాగ్రత కల ధ్యానమందు); పరాయణా= విశేషమైన ఆసక్తి కలవాఁడా! పరమ తత్త్వమయ = అత్యుత్తమైన పరబ్రహ్మము యొక్క సత్ పదార్థముల (తత్త్వముల) స్వరూపములు, తానే అయి, స్తవ వైభవ = స్తుతుల సంపదచే; ఉన్నతా = శ్రేష్ఠుఁడా!

తా : క్రొత్తదైన ప్రకాశముతోను, ప్రకాశవంతమైన ముఖములతోను, ఆదిత్యమండల సమూహములో విశేషముగా భాసించు (తోఁచు) సూర్యుఁడా! సత్యమైనదియును, మంగళకర మైనదియును, లోకముల ఉనికిని అమర్చిన వాఁడా! అందఱి యెడను శత్రువుల యెడను, ఆశ్రితుల యెడను సమభావము కలిగి చల్లనైన దయారసముతో హృదయములను హరించునట్టి మనస్సుతో చూపులను ప్రసరింపఁజేయువాఁడా! అజ్ఞానము అనెడి చీఁకటిని తొలఁగించుకొన్న ఏకాగ్రత గల మునుల హృదయములందు

దర్శన మిచ్చుటకు విశేషముగా ఉద్యమించువాఁడా! పరబ్రహ్మ తత్త్వములే స్వరూపములై, స్తుతుల ఆధిక్యము యొక్క మహిమ కలవాఁడా! హరిహరనాథా!

విశే. ఆదిత్యులు, పంద్రెడుగురు వారిలో విష్ణువు విశేషముగా ప్రకాశించువాఁడు.

పరమాత్మ తత్త్వములు :

1. ఈశ్వరుఁడు, పరమాత్మ : సంపూర్ణచేతనుఁడు.

2. పురుషుఁడు, జీవాత్మ, చేతనుఁడు

3. ప్రకృతి, అవ్యక్తము : సర్వ సృష్టికి మూలకారణము (ప్రధానము).

4. మహత్తు, బుద్ధి, 5. అహంకారము 6. భూమి, 7. ఉదకము 8. తేజస్సు (అగ్ని) 9.వాయువు10. ఆకాశము (ఇవి అయిదును పంచభూతములు) 11. శబ్దము12. స్పర్శ 13. గంధము 14. రూపము 15. రసము (తన్మాత్రలు. 11 నుండి 15 వఱకు పంచభూతములకు విషయములు).

16 శ్రోత్రము 17 త్వక్కు 18. ఘ్రాణము 19. చక్షువు. 20. జిహ్వ (ఇవి 16 నుండి 20 వఱకు, జ్ఞానేంద్రియములు)

21. పాదము 22పాణి 23. పాయువు (గుదము) 24. వాక్కు 25. ఉపస్థ (ఇవి 21 నుండి 25 వఱకు, కరేంద్రియములు). 26 మనస్సు.

పంచవింశతి తత్త్వములు: కొందఱు పురుషుని తొలఁగించి ఇరువది అయిదు తత్త్వము లని వచింతురు.

చతుర్వింశతి తత్త్వములు : మఱి కొందఱు ఈశ్వరుని, పురుషుని గణింపక మిగిలిన ఇరువది నాలుగు తత్త్వములందురు. ఈ ఇరువది నాలుగు రూపములకు (సత్త్వ రజ స్తమో గుణ స్పర్శ కలవగుటచే) జడములని పేరు.

ఇరువది మూడు తత్త్వములు(4నుండి 26 వఱకు), వ్యక్తములు అనఁబడును. (ఇందు ప్రకృతి చేరదు).

ద్వితీయాశ్వాసములో ఈ సాంఖ్య తత్త్వము 202 - వ, పద్యముతో వివరింపఁబడినది.

కం. కరణ స్వైర విహార

స్ఫుర ణావిర్భూత దోషపుంజ తమః ప్రా
వరణ విలీన స్వజ నో
ద్ధరణ సహస్రాంశు తేజ దైవ సమాజా. 161

ప్రతి : కరణ స్వైర విహార = కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు అనెడి పదునొకండు ఇంద్రియముల యొక్క స్వేచ్ఛా ప్రవర్తనముచే (వానిని అడ్డగింపక వాని 'ఇష్టము వచ్చినట్లు నడచుకొనుటకు అవకాశ మిచ్చుటచే); స్ఫురణ + ఆవిర్భూత = చంచలత్వముచే కలిగిన; దోషపుంజ = పాపముల యొక్కయు తప్పిదముల యొక్కయు కూడిక అనెడి ; తమః ప్రావరణ విలీన = చీఁకటి అనెడి చుట్టు గోడల నడుమ (మఱుఁగులో, అవరోధములో) అణఁగిపోయిన అచటనే కదలక మెదలకున్న; స్వజన+ఉద్ధరణ = తన వారైన వారిని, ఆ చీఁకటి నుండి, లేవ నెత్తుటలో, వెలికి తెచ్చుటలో; సహస్ర+ అంశుతేజ = వేయి కిరణములతో కూడిన, సూర్యుని (గొప్ప ప్రకాశము, ప్రభావము, పరాక్రమము) మహస్సు గలిగిన; దైవ సమాజ = శ్రేష్ఠములైన భావములను,(అట్టి అదృష్టము) కలిగిన భక్తుల మొత్తములను కలవాఁడా!

తా : ఏకాదశేంద్రియములకు వశులై వాని ప్రభావముచే కలిగిన తప్పిదములు అనెడి చీఁకటిలో (అజ్ఞానములో) మునిఁగి బాధపడుచున్న వారిని వెలికి తెచ్చుటలో తన సూర్య తేజముయొక్క తోడ్పాటు కలిగి నట్టియు, ఉన్నత భావములతో నిండినట్టియు అదృష్టవంతులైన భక్తుల బృందములను కలవాఁడా!

వివరణము : ఇంద్రియ భోగములను అనుభవించు వారిని, వారి దోషములు వారిని అజ్ఞాన మనెడి చీఁకటితో ముంచి వేయును. ఆ చీఁకటి మొత్తమును తొలఁగించు సూర్యుఁడు, హరి హరనాథుఁడు.

మాలిని.దురితజన నహన్యా దూరసంచార మాన్యా
పరిమిత గుణధన్యా భక్తిరేఖా వదాన్యా
పరమపదగ ది వ్యాప్సుందిత స్వాంత భవ్యా
నిరుపమతను న వ్యానింది తాక్రాంత భావ్యా. 162

ప్రతి : దురితజన నహన్యా = పాప కర్మలను శిక్షించువాఁడా! (శ్రీ వట్టిపల్లి మల్లినాథశర్మగారి వివరణ) : దురిత జనాః తేషాం నహనం బంధనం, తదేవ శీలం అస్య ఇతి, దురితజన నహన్యః (పాపులను సన్మార్గమందు ప్రవర్తింపఁజేయువాఁడు). దూర సంచార మాన్యా= పరమాత్మను తెలిసికొనుటకై దీర్ఘ మైనట్టి ఆలోచనలు చేయు యోగులచే గౌరవింపఁబడు వాఁడా! పరిమిత

గుణ ధన్యా = పరిమితములైన సద్గుణములచేతనే పవిత్రుఁడా! భక్తి రేఖా వదాన్యా = గాఢమైన భక్తి గల వారి బృందములకు, కోరినవి ఇచ్చు వాఁడా! పరమ పదగదివ్యా = అత్యంతమైన మోక్ష స్థానమునకు సత్యమైన అత్యున్నత్తమైన వాఁడా! స్పందిత స్వాంత భవ్యా = నిషేధింపఁబడిన కర్మలను త్యజించుచు, సత్కర్మలను ఆదరించుచు పరమాత్మను ఎఱుఁగఁగోరు ఆత్మలకు మంగళములను కూర్చువాఁడా! నిరుపమ తను నవ్యా = సాటిలేనిశరీరకాంతిచే నిత్యము నవీనుఁడా! నిందిత + ఆక్రాంత భావ్యా = నిందింపఁబడు కర్మలయందును (దుష్కర్మలను నిషేధించువారిచే) తలంపఁ బడు వాఁడా!

తా : పాపులను శిక్షించువాఁడా! పరమాత్మను తెలిసికొనఁదలచి నిశితముగా పరిశోధనము చేయు యోగులచే గౌరవింపఁబడువాఁడా! పరిమితములైన సద్గుణములచేత పవిత్రుఁడా! గాఢమైన భక్తి భావము గల వారి బృందములకు కోరినవి ఇచ్చు వాఁడా! మోక్ష స్థానమునకు ప్రయత్నించు వారికి సత్యమైనట్టి ఉన్నతుఁడా! పరమాత్మ యెడ పరవశించు ఆత్మలకు శుభములను కూర్చువాఁడా! సాటిలేని శరీరకాంతిచే క్రొంగ్రొత్త వాఁడా! దుష్కర్మలను నిషేధించువారిచే ధ్యానింపఁబడువాఁడా!

ఛం॥ న, న, మ, య, య, 15 అక్షరములు, యతి స్థానము తొమ్మిదవ అక్షరము. ప్రాస నియమున్నది.

**గద్యము :** ఇది శ్రీమదుభయ కవిమిత్ర్త కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున శ్రీమత్సకలభాషా భూషణ సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీన గుణసనాథ నాచన సోమనాథ ప్రణీతం బైన యుత్తరహరి వంశంబునందుఁ దృతీయాశ్వాసము.

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# ఉత్తర హరివంశము

## నాచన సోమనాథ ప్రణీతము

## చతుర్థాశ్వాసము

శ్రీహైమవతీ కలహా
స్నేహవిరామ ప్రణామ సీమంతపద
గ్రాహి సురసింధు కహ్లో
రాహిత సిందూరలాక్ష హరిహరనాథా. 1

ప్రతి: శ్రీ = లక్ష్మి యొక్కయు; హైమవతీ = పార్వతి యొక్కయు; కలహా = కయ్యము యొక్కయు; స్నేహ = నెయ్యము యొక్కయు; విరామ = పొందిక కలిగిన వేళయందు; ప్రణామ = నమస్కరించు సమయమందు; సీమంత = పాపట చేతను; పద = పాదముల చేతను; గ్రాహి = గ్రహింపఁబడిన; సురసింధు = ఆకాశ గంగ యొక్క; కహ్లార+ఆహిత = ఎఱ్ఱకలువలలోఁగల పుప్పొడి; సిందూర = కుంకుమ తిలకముగను; లాక్ష = లక్క గంధముగను కలవాఁడా! హరిహరనాథా = హరిహర రూపుఁడగు భగవానుఁడా! హరి పక్షమున : లక్ష్మీదేవితోడి కలహము విరామము చెందఁగా ఆమె, హరికి ప్రణామము చేసినది. అప్పుడు ఆమె సీమంతమందు తన (హరి) పాదోద్భవ యగు గంగానది యందలి ఎఱ్ఱకలువలలోని పుప్పొడి, లగ్నమైనది. అట్టి ఆమె యందు ప్రీతి కలవాఁడా!

సీమంతమందు సిందూరము దాల్చుట పుణ్యస్త్రీల ఆచారము. కల్హారము అనగా ఎఱ్ఱకలువ. "సౌగంధి కం తు కల్హారం" అమర నిఘంటువు.

1. హరుని పక్షమున : హైమవతి తోడి హరుని ప్రణయమునకు (స్నేహ) విరామము ఏర్పడి ఇరువురికిని ప్రణయ కలహము పొడమినది. అప్పుడు హరుడు తన సతీమణిని ప్రసన్నురాలిని చేసి కొనుటకు, ఆమె పాదములపై ప్రణమిల్లెను. ఆ సమయమున, అతని తలపైనున్న గంగానదిలోని పుప్పొడి, ఆమె పదములయందు లగ్నమై లాక్షారాగముగా చూపట్టెను. అట్టి ప్రియురాలి ప్రేమ సంపాదించిన వాఁడా!

శ్రీముత్య వేంకటసత్య సూర్యనారాయణ గారు.

ఆత్రేయ పురము (533235) తూర్పుగోదావరి జిల్లా.

2. డా. తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు (1926-1981). (పరిశోధన పత్రిక, ఏప్రిల్ మే, 1955 పుట 27)

భావము : లక్ష్మీ దేవి తన పొలయలుక తీరఁగా. విష్ణుదేవునికి సాష్టాంగముగా నమస్కరించినది. అపుడామె సీమంతము, విష్ణుదేవుని పాదములపై నుండగా నామె తన ఫాలమునందు ధరించిన సిందూరము విష్ణుదేవుని పాదముల యందుఁ బుట్టిన ఆకాశ గంగను కలదై పవిత్ర మయినది. అట్టి సిందూరమును గలవాఁడు హరి (విష్ణుదేవుఁడు).

పార్వతికిఁ దన ప్రియుఁడగు పరమేశ్వరుని పైఁబొలయలుక యేర్పడఁగా నపుడామెను దేర్చుటకై, పరమేశ్వరుఁడామెకు సాష్టాంగ పడినాఁడు. అపుడామె పాదములపై బరమేశ్వరుని శిరస్సు మీఁది నెలవంక నెలకొనినది. ఆమె తన పాదములకుఁ బూసికొనిన లత్తుక పరమేశ్వరుని శిరస్సు మీఁది నెలవంకను గలదయినది. అట్టి లత్తుకను గలవాఁడు హరుఁడు (పరమేశ్వరుఁడు).

ఈ పద్యమున 'కలహ-స్నేహ', 'సీమంత-పద', సురసింధు - కహ్లారాహిత, 'సిందూర-లాక్ష', పదములు క్రమముగా హరిపరములు, హరపరములునగు జంటపదములు. ఒక పక్షమున కొకపదము, మఱి యొక్క పక్షమున కొక పదముగ, దీనికి అర్థము చెప్పుకొనవలయు నను టకు నీ జమిలి పదములే సూచించుచున్నవి కదా! ఇందును క్రమాలంకారమే కలదు.

(గమనిక : కల్హారపదమునకు తామర అనునర్థమును గ్రహించి కల్హారమునకు అహితుడు విరోధి, చంద్రుఁడని అర్థమును చెప్పిరి. మఱియును ఇట్లనిరి. ఇంతకంటె సరియయిన సవ్యమయిన యర్థము నాకుఁగుదురుట లేదు. ఎవ్వరైన నట్టి పుణ్యాము గట్టుకొనినచో. దానిని గ్రహించుటకు సర్వదా సిద్ధముగానున్నాను.)

3. బహు భాషాకోవిద, సాహిత్య తత్త్వ విశారద శ్రీయల్లం రాజు శ్రీనివాసరావు గారు వెల్లడించిన అర్థము.

శ్రీదేవివిది కలహవిరామం. అంచేత తానే, భర్త అయిన విష్ణువునకు ప్రణమిల్లినది. అప్పుడావిడ సీమంతానికి ఆయన పాదంలోని గంగ తాలూకు కల్హారరజస్సు అంటి, అది దానికి సిందూర తిలకమయింది.

హైమవతిది ప్రేమ నిరామం. అనగా ప్రణయ కలహం. అంచేత శివుడే ఆమెకు ప్రణమిల్ల వలసి వచ్చింది. అపుడాయన శిరస్సుమీఁది గంగలోని కల్హార రజస్సు ఆవిడ చరణాలకు లత్తుక అయింది.

సిందూర లాక్షాలు రెండు సౌభాగ్య చిహ్నాలు. ఒకరికి సిందూరం, మఱొకరికి లాక్ష, అవి రెండూ గంగలోని కల్హారంలో ఉన్నాయి. ఆ గంగ ఒకరి పాదంలో, మఱొకరి తలమీద ఉంది. భర్త పాదాలకు ప్రణమిల్లితేగాని, లక్ష్మీ దేవికి పుప్పొడి సిందూరం కాదు. భార్యపాదాలకు ప్రణమిల్లితేగాని, పుప్పొడి ఆమె పాదాలకు లత్తుక కాదు. ఇదీ ఇందులోని స్వారస్యం.

4. శ్రీవేదం వేంకట రామన్, పొగతోట నెల్లూరు-1. వారి వ్యాఖ్యానమిట్లున్నది.

తా. ప్రణయ కలహానంతరము, పశ్చాత్తాపముతో లక్ష్మీదేవి సతీధర్మమును నిర్వహించుచు భర్తయైన విష్ణుపాదములకు నమస్కరింపగా ఆమె పాపటలోని సిందూరము (కుంకుమము) ఆయన పాదములను చేరి, అచ్చటనేపుట్టు, ఆకాశగంగలో కలిసి, అందులోనున్న తెల్ల కలువలను చేరుటచే, అవి ఎఱ్ఱనైనవి. అట్టి సిందూరము కలవాడా! (బహువ్రీహి).

ప్రణయము నశించి, కలహము రాగా పార్వతిని అనునయించుటకు శివుడు, ఆమె పాదములకు ప్రణామము చేసెను. అప్పుడు ఆమె పాదములోని ఎఱ్ఱని పారాణి, శివుని తలపై నున్న గంగను చేరి అందే ఉన్న తెల్ల కలువలను ఎఱ్ఱగా చేసినది. అట్లు చేసిన పారాణి కలవాడా! (బహువ్రీహి). సిందూరము లక్ష్మికి సీమంతమున, లాక్ష పార్వతికి పాదమున నున్నవి.

ఈ పద్యమునకు క్రమాలంకార ప్రమేయము లేక ఉభయ పక్షములకు సమమైన అర్థమును చెప్పవచ్చును.

భావము : లక్ష్మి యొక్కయు, పార్వతి యొక్కయు, కలహస్నేహములయందు విశేషముగా రమించువాడా! అనంతరము వారు ప్రణమిల్లునప్పుడు, వారి నల్లని పాపట మీఁద నిగ నిగలాడు తెల్లని వజ్రములు పొదిగిన బంగారు నగ, గంగానది యొక్క చెంగలువల పుప్పొడిని, (సిందూరము) కుంకుమముగా గ్రహించినది. (హరిహరనాథుడు సురనది నుండి పొందఁబడిన చెంగలువల మాలలు ధరించి యున్నాడు.) మఱియును

పాదములకు అలంకారమైన లత్తుక యొక్క అరుణిమను కూడ గ్రహించి రెట్టింపు ఎఱ్ఱదనము కలదైనది. అట్టి ఓ హరిహరనాథా!

సీమంతపదగ్రాహి = సీమంత స్థానము గ్రహించినది. ఆ స్థానమందున్నది పదకము (నగ). ఏఁచు నుపేంద్రుని పదక మిమ్మని అను ఉత్తర హరివంశ పద్యభాగములో'పదక' ప్రయోగమున్నది. (పద్యం, 168- ప్రథమాశ్వాసము). కనుక పదమనగా పదకమని గ్రహింప వచ్చును. లేదా, లక్షణచే పదమనగా అందున్న నగ అనియు గ్రహింపవచ్చును.

సౌభాగ్య సూచకముగా స్త్రీలేగాక, పురుషులును కుంకుమమును గాని, లత్తుకను గాని పాదములకు అలంకారముగా ధరించు ఆచారమున్నది.కనుక హరిహరనాథుని పాదములయందు గల పారాణిలోని అరుణిమను, సీమంత పదమందున్న నగ గ్రహించినదని అర్థము చెప్పవచ్చును.

ఇందు ప్రణమిల్లిన శ్రీదేవి హైమవతుల శిరస్సుపై నున్న నగ ద్విగుణీకృతమైన రాగముతో రంజిల్లుచున్నది. అట్టి అరుణిమ ప్రజ్వలించుటకు హరిహరనాథుడే కారణము. అత డప్పుడు ప్రణయ స్వరూపుడయిన అనురాగ మూర్తి. కనుక సకల శుభముల నొసగునని సారాంశము.

గమనిక : ఉభయ పక్షములకును సమానార్థములను కుదుర్చుటచే పరమశివుడు పార్వతికి ప్రణమిల్లు పరిస్థితి తొలఁగినది.

గీ. హంసడిభకులు లోనుగా నఖిలధరణిఁ
బెరుఁగు కంటకకోటిచేఁ బేద లైన
నరపతుల కీర్తిపటములు సిరుగ కుండ
వెరవుతో నుద్ధరించినవేల్పు శౌరి. 2

ప్రతి: శౌరి = శూరుని వంశములోని వాఁడు, శ్రీకృష్ణుడు; అఖిల ధరణిన్ = భూమియందంతటను; హంస డిభకులు లోనుగాన్ = హంసుఁడును, డిభకుఁడును, మొదలగు రాజకుమారుల చేతను, పెరుగు కంటక కోటి చేన్ = వృద్ధి పొందుచున్న దుష్టుల సమూహము చేతను; పేదలు+ఐన = బలమును కోల్పోయిన; నరపతుల కీర్తి పటములు = రాజుల కీర్తిని ప్రకటించు వస్త్రములతో చేయఁబడిన పతాకములు;చిరుఁగ కుండన్ = చినిగిపోకుండునట్లు; వెరవుతోన్ = ఉపాయముతో; ఉద్ధరించిన వేల్పు = పైకి లేవనెత్తిన, రక్షించిన దైవము. (దీనులైనట్టియు, దుర్బలులైనట్టియు రాజులను సంరక్షించిన దేవుడు శౌరి).

తా. భూమియందు, ఎల్ల ఎడలను, వృద్ధి పొందుచున్న హంసడిభకులు మొదలుగా, పెక్కు దుష్టులచే, బలహీనులైనరాజుల కీర్తి పతాకములను నాశము గానీయక కాపాడిన దేవుడు శ్రీకృష్ణుఁడు.

కం. నావుడు జనమేజయవిభుఁ
డావైశంపాయనుని మహాదేవు మదిన్
నీవు గొనియాడు పలుకుల
భావము దని వోదు చెవుల పండువులయ్యెన్. 3

ప్రతి: నావుడు = వైశంపాయనుఁడు చెప్పఁగా; జనమేజయ విభుఁడు = జనమేజయ మహారాజు; ఆ వైశంపాయనునిన్ = వైశంపాయన మునితో; మహాదేవున్ = ఆ గొప్ప దేవుని, కృష్ణుని; నీవు; కొనియాడు పలుకుల భావము = స్తుతించు మాటల సారము; మదిన్ = మనస్సునందు; తనివోదు = తృప్తిని ఇచ్చుట లేదు; చెవుల పండువులు + అయ్యెన్ = నా చెవులకు, చాల ప్రియము లైనవి.

తా: వైశంపాయనుఁడు చెప్పఁగా, జనమేజయ రాజు ఆతనితో, ఆ గొప్ప దేవుని నీవు నుతించు మాటల సారము నా మనస్సునకు తృప్తిని ఇచ్చుటలేదు. (ఇంకను అతని కథలు వినవలయునని ఉన్నదనుట). ఇంత వఱకు నీ వెఱిగించినందతయు, నా చెవులకు మిక్కిలి ప్రియములై ఉన్నవి.

విశే. చెవుల పండువు : తెలుగు జాతీయము, మిక్కిలి ప్రీతి కరములైన పలుకులను విన్నప్పుడు ఈ జాతీయమును వాడెదరు.

కం. హంసడిభకు లెవ్వరొకో
కంసారికి వారిఁ జంపఁ గారణ మేమో
సంసారసారవచన రి
రంసామతిఁ దత్కథాంతరము విన వలతున్. 4

ప్రతి: హంస డిభకులు; ఎవ్వరొకో = ఎవ్వరోకదా; కంస+అరికి = కంసుని వైరి అయిన కృష్ణునికి; వారిన్ చంపన్ కారణము + ఏమో?; సంసారసార వచన = ప్రపంచమందు, మేలైన మాటలను; రిరంసా మతిన్ = వేడుక గల మనస్సుతో; తద్+కథా+ అంతరము = ఆ తరువాతి కథను; విన వలతున్ = వినుటకు సిద్ధముగా నున్నాను.

తా: ఆ హంస డిభకులు ఎవ్వరోకదా! హరి వారిని వధించుటకు కారణము ఏమి? ఈ పుడమియందు మేలైన మాటలను వినుటకును వారి తరువాతి కథా విషయమును ఎఱుఁగుటకు, నా మనస్సు ఉత్సాహముతో నున్నది.

విశే. విష్ణుకథలు, ధరణిలో, అతి శ్రేష్ఠములైనవి. తరువాతి కథను వినుటకు జనమేజయుఁడు, ఉత్సాహముతో ఉన్నవాఁడు, పై విధముగా అర్థించెను.

కం. అనుటయు వైశంపాయన
మున జనమేజయ నృపాలముఖ్యునితో ని
ట్లనుఁ దత్కథాప్రపంచము
వినిపించెద మొదలుకొని వివేకనిధానా. 5

తా: అని చెప్పఁగా, వైశంపాయన ముని, గొప్పవాఁడైన రాజగు జనమేజయునితో ఇట్లనెను. "మంచి చెడ్డలను అరయఁగల తెలివికి నిలయమైన వాఁడా! ఓ రాజా! ఆ హంస డిభకుల కథను మొత్తమున్ను, మొదటి నుండి వినిపించెదను.

కం. ఎనుఁబదియెనిమిది వేవురు
దనుజుల కాధ్యుండు వక్రదనుజుఁడు దోడై
చను దేర హంసడిభకులు
చెనకిన వెసఁ దునిమె శౌరి చెప్పెద నదియున్. 6

ప్రతి : ఎనుఁబది ఎనిమిది వేవురు = ఎనుబది ఎనిమిది వేల (88,000); దనుజాలకు = రాక్షసుల సైన్యమునకు; ఆధ్యుండు = నాయకుఁడు; వక్రదనుజుఁడు = దుష్టరాక్షసుఁడు విచక్రుఁడు; తోడై చనుదేరన్; హంసడిభకులు; చెనకినన్ = ఎదుర్కొనఁగా; వెసన్ = శీఘ్రముగా; శౌరి = శూరుని వంశము వాఁడు, కృష్ణుఁడు; తునిమెన్; అదియున్ = ఆ కథను కూడ; చెప్పెదను.

తా: ఎనుబది ఎనిమిది వేల సైన్యములో దుష్ట రాక్షసుఁడు విచక్రుఁడు సహాయుఁడై, హంసడిభకులు, తన్ను ఎదుర్కొనఁగా కృష్ణుఁడు శీఘ్రముగా వారిని వధించెను. దానిని కూడ చెప్పెదను.

వ్యా. చనుదేరన్ (చూ. పద్యము - 292)

సీ. సాల్వదేశంబున జనియించె బ్రహ్మద
త్తాభిధానుండు మూర్ధాభిషిక్తుఁ
డఖిలధర్మవిధిజ్ఞుఁ డాత్మభార్యాద్వయం
బునకు బిడ్డలు లేక పొల్ల వోయె
సంసార మనుచు నీశాను నారాధించెఁ
బదియేఁడు లొండుసంభ్రమము లేక
పరమేశుఁ డతనిసద్భక్తికి మది మెచ్చి
కలలోన నొకనాఁడు గదిసి వరము
గీ. వేఁడికొను మన్న నిరువుర వేఁడె సుతుల
శివుఁడు నిచ్చితి నంచు విచ్చేసె నంత
నతనిదేవు లిద్దఱును గర్భాభిరామ
మూర్తు లయి రన్న రేంద్రుండు ముద్దు సేయ. 7

ప్రతి : సాళ్వదేశంబునన్; బ్రహ్మదత్త+ అభిధానుండు = బ్రహ్మదత్తుఁ డనెడి పేరు కలవాఁడు; మూర్ధ + అభిషిక్తుఁడు = రాజు (శిరస్సునకు పవిత్రమైన అభిషేకమును పొందినవాఁడు); అఖిల ధర్మ విధిజ్ఞుఁడు = సర్వ ధర్మ శాస్త్రములను, విధులను ఎఱిఁగిన వాఁడు ఆత్మభార్యాద్వయంబునకున్ = తన యిర్వురు భార్యలకును; బిడ్డలు లేక; సంసారము = భార్యతోను, బిడ్డలతోను జీవించుట; పొల్ల + పోయెన్ = పాడైనది; అనుచున్; పదిఏఁడులు, ఒండు సంభ్రమము లేక = ఎట్టి తొట్రుపాటును లేని వాఁడై; ఈశానున్ = శివుని; ఆరాధించెన్ = పూజించెను; పరమ+ఈశుఁడు = ఆ మహాదేవుఁడు; అతని; సత్ + భక్తికిన్ = శ్రేష్ఠమైన భక్తికి; మదిన్ మెచ్చి = మనస్సున మెచ్చుకొని; కలలోనన్; ఒకనాడు; కదిసి = కన్పట్టి; వరము వేఁడి కొనుము + అన్నన్; సుతులన్ = పుత్రులను ఇరువురన్ = ఇద్దఱిని; వేఁడెన్ = కోరెను; శివుఁడును; ఇచ్చితిన్; అంచు; విచ్చేసెన్ = వెడలిపోయెను; అంత = ఆవల; అతని దేవులు = రాణులు; ఇద్దఱును; ఆ+నర+ ఇంద్రుండు = ఆరాజులకు ప్రభువైన బ్రహ్మదత్తుఁడు; ముద్దుచేయన్ = ప్రీతితో ఆదరింపఁగా; గర్భ+అభిరామ మూర్తులు + అయిరి = గర్భములను ధరించుటచే మనసులను హరించునట్టి అందమైన రూపులు కల వారైరి. అనఁగా గర్భవతులైరి.

తా: సాళ్వ దేశమున, బ్రహ్మదత్తుఁ డనెడి పేరు గల వాఁడొకఁడు జన్మించెను. ఆతఁడు రాజ్య పాలనకై పవిత్ర స్నానాదికముచే 'రాజు' అనెడి (పట్టమును) గౌరవమును

పొంది, సర్వ ధర్మ శాస్త్రములను, విధులను ఎఱిఁగిన వాఁడై యుండెను. తన ఇరువురి సతులకు సంతానము లేకపోవుటచే సంసార జీవితము పాడయినదని తలఁచి, నిశ్చలముగా పది సంవత్సరములు శివుని పూజించెను. అతని మేలైనభక్తికి ఆ మహాదేవుఁడు మనసున మెచ్చి స్వప్నములో గోచరించి వరమును కోరుకొను మనఁగా ఆరాజు, ఇర్వురు సుతులను ఇమ్మని వేఁడెను. శివుఁడు అట్లే ఇచ్చితి నని వెడలి పోయెను. ఆవల అతని రాణులు ఇద్దరు. తమ భర్త ప్రీతితో ఆదరించు చుండఁగా గర్భములను ధరించి, అందమైన రూపులు కలవారైరి.

వ్యా. ఆ+ నరేంద్రుఁడు అన్న రేంద్రుఁడు, అన్నరేంద్రుండు

సూత్రములు. సమాస, బాల - 4, 5, 14, 13.

1. ఆ ఈ ఏ అను సర్వనామంబులు త్రికంబునాఁబడు.
2. కర్మధారయంబు త్రిక, స్త్రీ సమ, ముగంత, ధాతుజ విశేషణ పూర్వ పదంబయి యుండు.
3. త్రికము మీఁది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.
4. ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు ఆచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు.

ఉ. ఆసమయంబు నంద మహితాత్ముఁడు మిత్రసహుండు నాఁగ ధా
త్రీసురుఁ డొక్కరుండు జగతీపతికిన్ సఖుఁడై సుతోదయో
ల్లాసము లేక శ్రీపతిఁ దలంచుచుఁ దప్పక పంచవర్షముల్
చేసినపూజకున్ హరియుఁ జిత్తములోఁ బొడసూపి విప్రుతోన్. 8

ప్రతి : ఆ సమయంబునందు+అ = అప్పుడే; మహిత + ఆత్ముఁడు = గొప్ప మనసు గలవాఁడు; మిత్ర సహుండు; నాఁగ = అనఁగా, అను పేరు గల; ధాత్రీ సురుఁడు = ధరణికి దేవత, బ్రాహ్మణుఁడు; ఒక్కరుండు = ఒక్కఁడు; జగతీపతికిన్ = పుడమి ఱేడునకు, రాజైన బ్రహ్మ దత్తునకు; సఖుఁడై = చెలికాఁడై; సుత+ఉదయ+ఉల్లాసము లేక = పుత్రుఁడు జన్మించుటచే కలుగు సంతోషము లేని వాఁడై; శ్రీ పతిన్ = లక్ష్మి పతియైన విష్ణుని; తలంచుచున్; పంచవర్షముల్ = ఐదేళ్లు; తప్పక = క్రమమును వీడక; చేసిన పూజకున్; హరి; చిత్తములోనన్ = మనసులో; పొడ+ చూపి = గోచరించి; విప్రునితో = మిత్రసహుఁడు అనెడి బ్రాహ్మణునితో.

తా: ఆ సమయమందే గొప్పమనసు కల విప్రుఁడొకఁడు బ్రహ్మదత్తుని మిత్రుఁడు, మిత్రసహుఁడు అనేఁడి వాఁడు తనకును, పుత్రుఁడు జన్మించుటచే కలుగు సంతసము లేని వాఁడై, లక్ష్మీపతి యైన విష్ణుని ధ్యానించుచు, ఐదేళ్లు క్రమమును తప్పక పూజ చేయగా ఆ హరి ఆ బ్రాహ్మణుని మనసులో కన్పట్టి అతనితో (తరువాతి పద్యముతో అన్వయము)

ఉ. మెచ్చితి వేఁడికొమ్మనుడు మిత్రసహుండు కుమారుఁ గోరె నీ
కిచ్చితి నంచు నచ్యుతుఁడు నేఁగె ధరామరుఁ డాత్మకాంతకుం
జెచ్చెరఁ దోఁచు వేవిళులు చెప్పగఁ బల్మఱు వచ్చు బోటితో
ముచ్చట నూనెనల్ల చనుముక్కులు వెల్వెలఁ బాఱుచెక్కులున్. 9

ప్రతి: మెచ్చితిన్ = (నీ పూజను) మెచ్చితిని; వేఁడి కొమ్ము+ అనుఁడున్ = కోరుకొనుము, అనఁగా; మిత్ర సహుండు = కుమారున్ కోరెన్; నీకు ఇచ్చితిన్ అంచున్; అచ్యుతుఁడున్ = (చ్యుతి లేనివాఁడు, స్థిరమైన వాఁడు) హరి; ఏగెన్; ధరా + అమరుఁడు = భూమికి దేవత, విప్రుఁడు; ఆత్మ కాంతకున్ = తన భార్యకు; వేవిళులు = గర్భవతుల లక్షణములు; చెర+చెర = వేగముగా; తోఁచున్ = గోచరించెను; చెప్పగన్ = స్పష్టముగా తెలియునట్లు; పల్మఱు = పెక్కుసార్లు; వచ్చున్ = వచ్చెను; బోటితో = ఆ కాంతతో కూడ; నల్ల చనుముక్కులు = (ఆమె) నల్లనైన స్తనముల పైనుండు భాగములు; ముచ్చటన్ + ఊనెన్ = సొగసుకలవి అయినవి; చెక్కులున్ = చెంపలును; వెల్వెల పాఱున్ = తెల్లఁదనమును వహించినవి, తెల్లనైనవి.

తా: హరి నీపూజను మెచ్చితిని, వరమును కోరుకొమ్ము అని మిత్ర సహునితో చెప్పఁగా అతఁడు ఒక సుతుని వేఁడెను. ఇచ్చితి నని హరి అదృశ మయ్యెను. ఆ విప్రుని భార్యకు, గర్భవతి చిహ్నములు, వేగముగా గోచరించినవి. అవి పలుమార్లు కన్పట్టుటచే, వానిని గుఱించి, ఆమె చెప్పుకొన్నది. ఆమెతో బాటు, ఆమె చనుమొనలు, నల్లఁదనమును పొంది, సొగసు కలవైనవి.

విశే. ఆమెకు సంతానము కలుగఁబోవు సూచనలు స్పష్టముగా పెక్కుసార్లు కన్పట్టినవి. అపుడు ఆమె, అందముతో ఒప్పారెను.

వ్యా. చెచ్చెర; చెర+చెర = చెచ్చెర. అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు. సంధి, బాల - 42

కం. ఈవిధమున గర్భిణు లగు
మూవురలో రాజసతులు మునుమును సుతులన్
శైవాత్ముల( గని రిద్దఱ
నావిప్రవధూటి వైష్ణవాత్ముని( గనియెన్. 10

ప్రతి: ఈ విధముగ గర్భిణులు +అగు; మువ్వురలో, రాజసతులు = ఆ రాజు యొక్క భార్యలు, ఇర్వురు; మునుమును = ముందే; ఇద్దఱన్ = ఇద్దఱిని; శైవ+ఆత్ములన్ = శివాంశలు కలవారిని కనిరి; ఆ విప్ర వధూటి = ఆ బ్రాహ్మణుని భార్య, మిత్ర సహుని సతి; వైష్ణవ + ఆత్ముని = విష్ణు అంశకలవానిని; కని యెన్.

తా: ఈ విధముగ గర్భవతులైన మువ్వరిలో, రాజు భార్యలు ఇర్వరు, ముందే, శివుని అంశకల ఒక్కొక సుతుని కనిరి. ఆ విప్రుని సతి, విష్ణువు యొక్క అంశమున తానొక్కని కనెను.

ఆ.వె. హంస డిభకు లన(గ నన్నయు( దమ్ముండు
నధిప నందనులు జనార్దనుండు
విప్రతనయు( డిట్లు వీ రొక్క ప్రాయంబు
వారు గూడి యాడ వచ్చువారు. 11

తా: రాజ కుమారులు, అన్నదమ్ములు హంసు(డును, డిభకు(డును, విప్రుని సుతు(డు జనార్దను(డు, అను పేర్లు కలవారు, మువ్వరు, ఒకే ప్రాయము కలవారు కలసి మెలసి ఆడుకొను చుండెడివారు.

ఉ. వేదపురాణశాస్త్రపదవిం దిరుగం బదిలంబు గల్గి ధ
న్వాదిసమస్త శస్త్ర వివిధాభ్యసనంబున ధీరులై సదా
సాదినిషాదిరథ్యుచిత సత్కళలందు విదగ్ధులై మనో
మోదము సేయువిద్యలకు మువ్వరు జాణలనంగ నున్న చోన్. 12

ప్రతి: వేద పురాణ శాస్త్ర పదవిన్ + తిరుగన్ = వేదములు (నాలుగు, ఋక్కు, యజుస్సు, సామము, అధర్వము), పురాణములు (పదునెనిమిది), శాస్త్రములు (ఆఱు - తర్కము, వ్యాకరణము ధర్మము మీమాంస వైద్యము జ్యోతిషము) మొదలగు వానిని పఠించుటయందు; పదిలంబు+ కల్గి = స్థిర మగు మనస్సు కలవారై; ధను+ ఆది = విలువిద్య మొదలగు; సమస్త

శస్త్ర వివిధ + అభ్యసనంబునన్ = అన్ని ఆయుధముల యొక్క వేర్వేఱు విద్యలను నేర్పుటచే (ఆయుధములు ముప్పది రెండు); ధీరులై = ధైర్యము కలవారై; సదా = ఎల్లప్పుడు; సాది = గుఱ్ఱమును; నిషాది = ఏనుఁగును; రథ + ఉచిత = రథమును, నడపుటకు తగిన; సత్కళలందు = మేలైన చదువులలో; విదగ్ధులై = నేర్పరులై; మనస్ + మోదము+ చేయు = మనస్సునకు సంతసము నిచ్చు; విద్యలకు = సాహిత్యము నాటకము మొదలైన చదువులందు; ముప్పురున్; జాణలు+అనంగన్ = నిపుణులు; అనునట్లు; ఉన్నచోన్.

తా: వేదములు నాల్గింటిని, పురాణములు పదునెనిమిదిని, ఆఱు శాస్త్రములను, స్థిరమగు చిత్తముతో పఠించిరి. విలువిద్యతో కూడ, ముప్పది రెండు, ఆయుధ ప్రయోగ విద్యలను నేర్చిరి. ధీరతతో, గుఱ్ఱము ఏనుఁగు రథము అనువానిని నడపు నైపుణ్యమును పొందిరి. మనస్సునకు ఆహ్లాదము నిచ్చు సాహిత్య నాటకాది శాస్త్రములందును, ప్రావీణ్యము కలవారైరి.

విశే. పురాణములు పదునెనిమిది. దేవీ భాగవతములో క్రింది శ్లోకమున్నది.

శ్లో. 'మ' ద్వియం, 'భ' ద్వయంచైవ, 'బ్ర' త్రయం, 'వ' చతుష్టయమ్ 'అ, నా, ప, లిం, గ, కూ, స్కా'ని పురాణాని, పృథక్ పృథక్.

1 మకారముతో ప్రారంబమగునవి - 2, మత్స్య, మార్కండేయములు.

2 భకారముతో ప్రారంభమగునవి 2, భవిష్య, భాగవతములు.

3. బ్రకారముతో ప్రారంభమగునవి 3, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్తములు.

4 వకారముతో ప్రారంభమగునవి 4, వరాహ, వామన, వాయు, విష్ణు పురాణములు.

5. 'అ'తో అగ్ని, 'నా' తోనారద, 'ప'తో పద్మ, 'లిం'తో లింగ, 'గ'తో గరుడ, 'కూ' తో, కూర్మ, 'స్కా'తో స్కాంద, మొత్తము (11+7 = 18) పదునెనిమిది పురాణములు.

పద్మ పురాణములో క్రింది రీతిని, విభజన మున్నది.

శివపరములు విష్ణుపరములు బ్రహ్మ పరములు అని ఒక్కొక దానిలో ఆఱు పురాణములున్నవి. మొత్తము 3×6 = 18.

**శివపరములు**

1, మత్స్య 2. కూర్మ 3. లింగ 4. శివ 5. స్కాంద 6. అగ్ని పురాణములు.

**విష్ణు పరములు.**

1. విష్ణు 2. నారద 3. భాగవత 4. గరుడ 5 పద్మ 6. వరాహ పురాణములు.

**బ్రహ్మ పరములు**

1. బ్రహ్మాండ 2. బ్రహ్మవైవర్త 3. మార్కండేయ 4. భవిష్య 5. వామన 6. బ్రహ్మ పురాణములు.

గమనిక : పద్మ పురాణము పేర్కొన్న పేర్లలో వాయు పురాణము కానరాదు. దానికి మాఱుగా శివపురాణమున్నది. శ్రీమద్భాగవతమందు, పురాణములపేర్లు పద్మ పురాణములో నున్నట్లు గలవు. అనఁగా శివ పురాణమున్నది.

విశే. వ్యా. ధను+ఆది = ధన్వాది (యణాదేశసంధి). వైదిక భాషలో, "ధను" శబ్దము ఉకారాంత నపుంసక లింగము. కావ్య భాషలో ఇది అరుదుగా కానవచ్చును. కావ్యభాషలో సకారాంతముగానే (హలంతము) కానంబడుచున్నది.

యణాదేశముచే 'వ'కారమాదేశమై 'ధన్వాది' రూపము సిద్ధించినది.

**-: హంసడిభకులు శివునిఁగూర్చి తపస్సు చేసి వరములు వడయుట :-**

గీ. హంసడిభకులు హిమవన్న గాగ్రమునకుఁ
బార్వతీపతిఁ గోరి తపంబు సేయ
నరిగిరి జనార్దనుండు విద్యావివేక
నిధి మురారి నారాధించె నిజగృహమున. 13

తా: హంస డిభకులు హిమవత్పర్వతము యొక్క ఎత్తైన పై భాగమునకు (అతి శీతల ప్రదేశమునకు) శివునిదర్శనమునకై తపము చేయఁబోయిరి. విద్య, వివేకము అనువానికి నిధియైన జనార్దనుఁడు తనయింటనే, చిత్త శుద్ధితో హరిని పూజించెను.

విశే. హంసడిభకులు, కఠోర నియమములను పాటించుచు తపము చేసిరి. జనార్దనుఁడు అట్లుగాక, నిర్మలభక్తిచే శారీరక క్లేశములకు వశుఁడు గాక, హరిని ఆరాధించెను. నిర్మల భక్తిచే, భగవత్కృపసాధ్యము.

వ్యా. హిమ వన్నగము : హిమవత్+నగము. అనునాసిక సంధి.

కం. వా రిరువురు నై దేఁడులు
నీరును గాలియును ద్రావి నిర్మలతరచే
తోరాజీవ భ్రమరము
గౌరీపతిఁ దలఁచి నిష్ఠ గైకొని యుండన్. 14

తా: ఆ హంస డిభకులు ఇరువురును, ఐదేళ్లు నీరు, గాలి మాత్రమే సేవించి, పరిశుద్ధమైన మనస్సనెడి పద్మమందు విహరించునట్టి తుమ్మెద అయిన పార్వతీపతి శివుని ధ్యానించుచు కఠిన నియమములను పాటించి యుండఁగా (మీఁది పద్యముతో అన్వయము).

వ్యా. చేతస్ + రాజీవ భ్రమరము. విసర్గ సంధి.

కం. సన్నిధిఁ బన్న గహారుఁడు
పెన్నిధిఁ గని పొంగుచున్న పేదలక్రియ న
య్యన్నాదమ్ములఁ గని మీ
కెన్నఁగ నే వరము లిచ్చు యిచ్చెద వానిన్. 15

తా: ఆ హంసడిభకుల ఎదుట శివుఁడు ప్రత్యక్ష్యమై పెద్ద ద్రవ్య నిధిని పొందిన పేదలవలె సంతసించుచున్న ఆ అన్నను తమ్ముని చూచి, "మీకు ఏయే వరములు ఇష్టమో, కోరు కొనుఁడు వానిని ఇచ్చెదను".

వ్యు. పన్నగహారుఁడు : పాములను మాలలుగాఁ గలవాఁడు, శివుఁడు.

వ్యు. పన్నగము: పాదములచే పోఁజాలనిది, పాము.

వ్యా. ఆ+అన్నాదమ్ములు = అయ్యన్నాదమ్ములు.

సూత్రములు : సంధిలేనిచోట యడాగమము. మఱియు త్రిక సమాస సంధులు.

సంధి, బాల -3, సమాస, బాల - 4, 5, 14, 13. (చూ. పద్యము 7, 15).

ద్వంద్వ సమాసము. గసడవాదేశము. సమాస, - బాల - 7, సంధి, బాల - 15. మఱియు, "అన్న" దీర్ఘమగుటకు, "కొన్నియెడల మహద్ద్వంద్వంబున పూర్వ పదాంత్య స్వరంబునకు దీర్ఘంబును చూపట్టెడు. సమాస, ప్రౌఢ - 28.

సీ. అనుడు వా రిరువురు నైకమత్యముతోడ
 నమరాసురాది సైన్యాధిపతుల
కోడ కుండంగ మా కొకవర మీశాన
 రౌద్ర మాహేశ్వర బ్రహ్మశిరము
లను నస్త్రములు నభేద్యకవచములు దివ్య
 చాపములును బరశ్వథవిశేష
ములుఁ గయ్యముల కేము పోవుచోఁ గాపుగాఁ
 బ్రమథద్వయంబు మత్పార్శ్వములను
గీ. వచ్చుటయు నీగి రెండవవరము నాఁగ
హరుఁడు వారికి నడిగినయట్ల యిచ్చి
భృంగిరిటిని గుండోదరుఁ బిలిచి వీరి
సమరములఁ గావుఁ డని పంచి చనియె నంత. 16

ప్రతి: అనుడు; వారు + ఇరువురున్, ఐకమత్యముతోడన్ = ఒకే అభిప్రాయము కలవారై; "ఈశాన!; మాకు+ఒక వరము; అమర + అసుర + ఆది సైన్య + అధిపతులకు = దేవతలు, రాక్షసులు మొదలగు, సైన్యముల యొక్క నాయకులకు; ఓడ కుండంగన్ = ఓడిపోకుండునట్లు; రౌద్ర మాహేశ్వర బ్రహ్మ శిరములు + అను + అస్త్రములును = రౌద్ర, మాహేశ్వర, బ్రహ్మ శిరములు అనెడి పేరుగల, దివ్య మైన ఆయుధములను; అభేద్య కవచములు = చీల్చుటకు వీలుకాని మేని కప్పులును; దివ్య చాపములును = దేవతా సంబంధమైన విండ్లును; పరశ్వథ విశేషములున్ = గొప్ప గండ్ర గొడ్డళ్లును; (మఱియు) రెండవ వరము; కయ్యములకు = యుద్ధములకు; ఏము పోవుచోన్; కాపుగాన్ = రక్షగా; మత్ + పార్శ్వములను = మా ప్రక్కల యందు; ప్రమథ ద్వయంబు = శివ భటులు ఇర్వురు; వచ్చుటయున్ ఈగి = వచ్చునట్లు ఇచ్చుటయు; నాఁగ = అనఁగా, హరుఁడు; వారికిన్, అడిగిన అట్ల ఇచ్చి; భృంగిరిటిని, కుండోదరుని పిలిచి; వీరిన్ (హంస డిభకులను); సమరములన్ = యుద్ధములందు; కావుఁడు = రక్షగా నుండి కాపాడుఁడు; అని; పంచి = ఆజ్ఞాపించి; చనియెన్ + అంత = వెంటనే అదృశ్యమయ్యెను.

తా. హంస డిభకులు ఇరువురు, ఏకాభిప్రాయము కలవారై "ఓ ఈశాన! దేవతలు రాక్షసులు, మొదలగు వారి సైన్యాధికారులకు, ఓడి పోకుండునట్లు రౌద్ర, మాహేశ్వర

బ్రహ్మ శిరములు అనెడి అస్త్రములును, దృఢమైన, చీల్చుటకు శక్యము కాని, మేని కప్పులును, దేవతా సంబంధమైన ధనువులు; గొప్ప గండ్ర గొడ్డళ్లు మొదటి వరముగను; యుద్ధములలో మేము పాల్గొను నప్పుడు మాకు రక్షగా, మాప్రక్కలందు. ప్రమథులు ఇర్వురు వచ్చునట్లు రెండవ వరమును ఇమ్ము" అని అర్థింపఁగా, శివుఁడు వారు అడిగిన విధమున ఆ వరముల నిచ్చి, భృంగిరిటిని, కుండోదరుని (శివ భటులు) రక్షకులుగా నుండుఁడని ఆజ్ఞాపించి, తోడనే మఱుఁగయ్యెను.

చం. వరములు గన్న మోదమున వచ్చి కుమారయుగంబు మున్ను మా,
తరపితృ వందనంబును బదంపడి మిత్రసహాభివాదనా
దరము జనార్దనప్రణయితాపరిరంభము నాచరించి సం
గరమున లేరు హంసడిభక ప్రతివీరు లనంగఁ బొంగుచున్. 17

ప్రతి : కుమార యుగంబు = రాజకుమారులిర్వురు; వరములు కన్న మోదమునన్ = గొప్ప వరములను పొందిన సంతసముచే, మున్ను; మాతర పితృవందనంబును = తల్లికిని, తండ్రికిని; పదంపడి = ఆవల; మిత్ర సహ + అభివాదన + ఆదరమున్ = జనార్దనుని తండ్రి యగు మిత్ర సహునకు నమస్కార పూర్వకమైన మర్యాదను; జనార్దన ప్రణయితా పరిరంభమున్ = మిత్రుఁడైన జనార్దనుని ప్రేమతో కౌగిలించుటయును; ఆచరించి; సంగరమునన్ = యుద్ధ క్రీడలందు; హంస డిభక ప్రతి వీరులు = తమతో సాటియగు పరాక్రమ వంతులైన, పోటికి తలపడు యోధులు; లేరు + అనంగన్; పొంగుచున్ = గర్వించుచు.

తా: రాజకుమారులు, హంసడిభకులు, గొప్ప వర లాభమువలన సంతసమును పొందిన వార్రై, వచ్చి, మొదట తల్లి తండ్రులకు, మిత్ర సహునకు నమస్సులు అర్పించి, గౌరవించి, తర్వాత మిత్రుఁడైన జనార్దనుని ప్రేమతో కౌగిలించుకొనిరి. యుద్ధ ప్రావీణ్యమందు, తమతో సాటియైన వీరు లెవ్వరును లేరని గర్వించుచున్నవార్రై (మీఁది పద్యముతో).

వ్యా. మాతరపితృ : సిద్ధ ద్వంద్వ సమాసము.

1 మాతృ+పితృ, మాత్ర పితృ అగును.

సూ. ద్వంద్వంబునందు 'ఋ'కారంబునకు 'ర' వర్ణంబు విభాషనగు. సమాస, బాల - 24.

2. మాత్రపితృ > మాతర పితృ,

"మాతృ" శబ్దము అజంతము. దీని ద్వితీయైక వచనాంతము, 'మాతరమ్'. అజంత మైనను, హలంతుల్యమై సమసించినది. హలంతము, ద్వితీయైక వచనాంతము, తెలుగులో ప్రాతిపదిక అగును. మఱియు మకారము లోపించును. ఇక "మాతర" మిగిలినది. మాతర+పితృ చేరి 'మాతర పితృ' అయినది ఇది ప్రౌఢ ప్రయోగము. ప్రాస స్థానమందున్నది.

గమనిక : "మాతృ+పితృలో పూర్వపదమునకు 'ఆనఙ్' అదేశమై మాతాపితృ, మఱియు "పితృ" పదమునకు అత్వస్త్రీవద్భావములు వచ్చి 'మాతాపితలు' అగును.

కం. కవచధనురస్త్ర నికరము
నవిరళ రుద్రాక్షమాలి కాభరణములున్
ధవళవిభూతియు హరహర
శివశివ శబ్దములుఁ గలిగి చెలు వయి యున్నన్. 18

ప్రతి: కవచ ధనుస్ + అస్త్ర నికరమున్ = మేనితొడుగు, విండ్లు, ఆయుధముల సమూహమును; అవిరళ = అధికమైన; రుద్రాక్ష మాలికా + ఆభరణములున్ = రుద్రాక్షల పూసలున్న హారములు, నగలును; ధవళ విభూతియున్ = తెల్లని బూడిదయును; 'హరహర' 'శివశివ' - శబ్దములున్, కలిగి; చెలువు+అయి+ఉన్నన్ = సుందరులై ఉండగా.

తా. (హంస డిభకులు), మేని తొడుగులు, విండ్లు, ఆయుధముల మొత్తమును, విరివియైన రుద్రాక్షమాలలను, పెక్కు నగలను ధరించిన వారై, (నొసటి యందు, భుజములపై ఔమ్మున) తెల్లని బూడిదను అలదు కొన్నవారై, మాటి మాటికి హర హర శివశివ అనెడి మహేశ్వర నామమును జపించుచు (శివ రూపులై) సుందర మూర్తులై ఉండగా (తరువాతి పద్యముతో అన్వయము).

వ్యా. ధనుస్ + అస్త్రనికరము రేఫాగమ సంధి.

కం. పొలఁతుల రూపవతులఁ బెం
డిలి చేసిరి దొరలు హంసడిభకుల కమరం
గులపతి జనార్దనునకును
బలియించిరి ముగురు నేకపత్నీ వ్రతముల్. 19

ప్రతి: దొరలు హంస డిభకులకు = ప్రభుకుమారులైన హంసునకు, డిభకునకును; కులపతి = విప్రవంశనాయకుఁడు; జనార్దనునకును; అమరన్ = తగినట్లు, పొలఁతుల రూపవతులన్ =

సౌందర్యవతులైన కన్యలతో; పెండిలి చేసిరి; ముగురున్ = ఆ ముప్పురును; ఏకపత్నీ వ్రతముల్ = ఒక పత్నియందే నియమమైన అనురాగముతో గృహ యజ్ఞములను (గృహస్థ ధర్మములను); పలియించిరి = ఫలవంతములగునట్లు చేసిరి.

తా: ప్రభు కుమారులగు హంస డిభకులకు, విప్రవంశ నాయకుడగు జనార్దనునకు, ఈడు జోడు తగినట్లు సుందర రూపములు కల కన్యలతో (పెద్దలు) పెండ్లి చేసిరి. వారు ముప్పురును. వారి వారి భార్యలందు, స్థిరమైన అనురాగముతో గృహస్థ ధర్మములను, నియమ సంపన్నులై, ఫలవంతము చేసిరి. (పరస్త్రీ వ్యామోహమునకు వశులు కాక యుండిరి)

వ. ఇట్లు వరప్రసాదసమ్మదభరితహృదయు లై నిజజనక రాజ్యవిభవంబు
విలసిల్లం జేయుచు వీరాభిమానవిజృంభితు లై యొక్క నాఁడు
వినోదార్థం బయ్యిరువురు కుమారులుం గూడు కొని. 20

తా: ఈ విధముగా శివుని వరముల అనుగ్రహముచే మిక్కిలి సంతోసముతో నిండిన మనస్సులు కలవారై, తమ తండ్రి రాజ్య సంపదను వికసింపఁ జేయుచు, తమ పరాక్రమము పై గల గర్వముచే పొంగుచు ఒక్క దినము వేడుకకు గాను, ఆ ఇర్వురు రాజ కుమారులును కలసి, (మీది పద్యముతో అన్వయము).

వ్యా. అయ్యిరువురు, ఆ+ఇరువురు.

1. సంధిలేని చోట స్వరంబుకంటె పరంబైన స్వరంబునకు యడాగమంబగు.సంధి, బాల - 3, ఆ+ యిరువురు.

2. సమాస, బాల - 4, 5,14, 13 సూత్రములచే 'అయ్యిరువురు' అగును. చూడుము, పద్యములు - 7, 15.

కం. కరితురగరథపదాతులు
పరివేష్టింపంగఁ గొలుచు ప్రజ ముందఱ గా
సరస జనార్దనుఁడుం జన
నరిగిరి వేఁటాడ ధరణి యల్లల నాడన్. 21

ప్రతి: కరి తురగ రథ పదాతులు = ఏనుగులు, గుఱ్ఱములు రథములు, కాల్బంటులు; పరి వేష్టింపంగన్ = చుట్టు నుండగా; కొలుచు ప్రజ ముందఱ గాన్ = సేవకజనము, ముందు

నుండగా; సరస = సమీపమున; జనార్ధనుఁడున్; చనన్ = రాగా; (రాజకుమారులు) ధరణి అల్లల నాడన్ = భూమి అదరు నట్లు వేఁటాడన్; అరిగిరి.

తా. ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు భటులు, చుట్టు నుండగా, సేవక జనము ముందు నడచు చుండగా, సమీపమందు, జనార్ధనుఁడును, కలిసి వచ్చు చుండగా, (రాజకుమారులు) భూమి అదరునట్లు వేఁటాడుటకై వెడలిరి.

కం. వెలివాఱును గాలురులును
వలలుఁ దెరలు దీమములును వడిఁ దీరిన కు
క్కలు నారెగోలలును మం
డల క్రోవులు వేఁట కారడంబుఁ బెనుపఁగన్. 22

ప్రతి: వెలి వాఱును = వెలుపల చుట్టుటకై త్రాళ్లు; కాలు+ ఉరులు = కాళ్లను బంధించుటకై ఉచ్చులు; (వీని వలన కాళ్లను కదల్చుటకు వీలుండదు); వలలు = జంతువులను పట్టుకొనుటకు నేసిన బలమైన త్రాళ్ళు, (బంధములు); తెరలు = జంతువులను తప్పించుకొని పోనీయ కుండుటకు, అడ్డముగా కట్టునట్టి పెద్ద గుడ్డలు, (ఒక విధమైన అడ్డు వలలు); దీమములు = వేర్వేఱు జాతులకు చెందిన ఆయా పశు పక్ష్యాదులను పట్టుకొనుటకు శిక్ష పొందిన, ఆజాతి పెంపుడు జంతువులు; వడిన్ తీరిన కుక్కలు = వేగమును అలవఱుచుకొనిన వేఁట కుక్కలు, (ఇవి అతి వేగముగా పరుగిడి ఎట్టి జంతువునైన నిరోధించి పట్టుకొను నేర్పు కలవి); ఆరె కోలలును = ఉక్కుతో చేసిన ములుకులు కొనల యందు కల వెదురు కఱ్ఱలును; మండల క్రోవులు = కత్తులు, తుపాకులును, వేఁటకు; ఆరడము = ఉత్సాహమును, తమకమును; పెనుపఁగన్ = ఎక్కువ చేయఁగా.

తా: వెలుపల కట్టుటకు త్రాళ్లు, కాళ్లను బంధించుటకు, తగిన ప్రత్యేకమైన ఉచ్చులు, పెద్ద వలలు, అడ్డు వలలు, జంతువులు పక్షులు మొదలగు వానిని పట్టుటకై శిక్షణ పొందిన ఆయా జాతి జంతువులు, వడిగల వేఁట కుక్కలు, పదునైన ములుకులను కొనలయందు గల వెదురు కఱ్ఱలు, వేఁటకు ఉపయోగపడు కత్తులు, తుపాకులు మొదలైన వానిని ధరించి, వానిని వేఁట యందు వాడ వలెననెడి ఆవేశము అధికమగుచుండగా (తరువాతి గద్యముతో అన్వయము).

వలలు : వివిధములు. అనుకువల, ఎడవల, డొంకవల త్రోపుడు వల, దాటుడు వల మెడవల, సన్నవల అడ్డువల ఎలుకవల, ఏదువల, కుందేటి వల దొడ్డ వల, లేటి వల,

సవదండవల. అను పేర్లు నిఘంటువులతో కలవు. (జంతువులను, పక్షులను చేపలను బంధించుటకు వేర్వేఱు వలలను ఉపయోగింతురు).

వ. ఇట్లు వచ్చునెడ ముందట. 23

తా : పై విధముగా రాజకుమారులు, జనార్దనుఁడు పరిజనముతో వేఁటాడుటకై నడచు చుండగా వారి ఎదుట (అడవి పందుల మంద గోచరించెను).

వ్యా. వచ్చునెడ : వచ్చు + ఎడ.

సూ. ఉదంత మగు తద్ధర్మార్థ విశేషణమునకు అచ్చు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 33.

సీ. ప్రబలదంష్ట్రాగ్రపర్యస్త ముస్తా స్తంబ
 జంబాల శబలవేశంత పంక్తి
ఘనఘనాఘననీలఘనవన ప్రతిఘాత
 ఘన ఘర్ష ణావభుగ్న ద్రుమంబు
ఘురఘురారవ ఘోర ఘోణాప్రఘూణ వి
 ద్రాణ చ్ఛదాచ్ఛన్న తాంతలతము
ఖనఘళాత్కారి ఖరఖురోత్పాత త్రి
 హల్య ధాత్రీధ్వస్త యవసరాజి
గీ. ఖేటభట భాషణోద్భ టాఖేట చటుల
కుటిలకటు కటాక్షేక్షణ క్షోభ బధిర
మతిరభస భాసమాన యానాభిమాన
రౌమ విక్రియాకులము వరాహకులము. 24

ప్రతి : ప్రబల దంష్ట్ర+ అగ్ర = మిక్కిలి బలమైన కోర పళ్ల కొనలచే; పర్యస్త ముస్తాస్తంబ = త్రెంపఁబడిన తుంగ కాడలచే; జంబాల శబల = బురద నీటి యందు చిత్ర వర్ణములు గల; వేశంత పంక్తి = చిన్న (నీటి) గుంటల వరుసలు; ఘన ఘనాఘన = పెద్దవైన, క్రూరములైన ఏనుఁగుల వలెనున్న; నీల = నీలవర్ణము గల; ఘన = వ్యాప్తములైన (పెద్ద బోదెలు గల); వన = చెట్ల యొక్క; ప్రతి ఘాత = అడ్డగింతలు అనెడి; ఘన ఘర్షణ = సమ్మెట పోట్లచే; అవభుగ్న

= విఱిఁగిన; ద్రుమంబు = పెద్ద చెట్లు; ఘుర ఘుర+ ఆరవ = ఘురఘుర అనెడి ధ్వనులతో; ఘోర = భయంకరములైన; ఘోణా = ముట్టెలు (జంతువుల ముక్కులు) అనెడి; ప్రఘాణ = ఇనుపకడ్డీలచే; విద్రాణ + ఛద+ ఆచ్ఛన్న = భిన్నములగుటచే (రాలిన) ఆకులచే బాగుగా కప్పఁబడిన; తాంతలతము = చలించుచున్న తీగెలు;

ఖనన = త్రవ్వునపుడు; ఘళాత్కారి = ఘళ ఘళ అనెడి ధ్వనులను చేయుచున్న; ఖర = వాఁడి యైన; ఖుర = గిట్టలచే; ఉత్పాత = పైకెత్తఁబడిన; త్రిహల్య = మూడు సార్లు త్రవ్వఁబడి ధ్వసంములైన; యవసరాజి = యవస అను పేరుగల గడ్డి వరుసలు;

ఖేట = అధములైన; భట = సేవకుల; భాషణ = మాటలచే; ఉద్భట + ఆ ఖేట = అతిశయమైన (వేఁట కాండ్ర) వేఁట చేతను; చటుల = చలించు; కుటిల = వక్రములైన; కటు = క్రూరములైన; కటాక్ష = క్రేగంటి; ఈక్షణ = చూపుల చేతను, క్షోభ బధిరము = కలఁత చెంది చెవిటి తనము కలవియును; అతి రభస మాన భాసమాన యాన = అధికమైన (గమన) వేగముచే ప్రకాశించు గమనము నందు; అభిమాన = ఆసక్తిని పొందుటచే; రొమ = (శరీరముపై గల) వెంట్రుకల; విక్రియ = (విపరీతమైన కదలికలు) విన్యాసములచే; ఆకులము = మిక్కిలి బెదరు పాటు కలిగినవియు నైన; వరాహకులము = అడవి పందుల మంద; (గోచరించెను).

తా. మిక్కిలి బలమైన కోర పళ్ల కొనలచే కొట్టఁబడిన తుంగ కాడలతో నిండియున్న బురదలో చిత్రవర్ణములున్న నీటి గుంటలు వరుసలు, పెద్దవైన క్రూరములైన ఏనుఁగులవలె కన్పట్టు నీల వర్ణముతో కూడియున్న బోదెలు కల చెట్ల యొక్క అడ్డగింతలు అనెడి సమ్మెట పోట్లచే విఱిగిన పెద్ద చెట్లు, ఘుర ఘుర అనెడి ధ్వనులతో, భయంకరములైన ముట్టెలు అనెడి ఇనుపకడ్డీలచే, చీల్చఁబడుటచే, రాలిన ఆకులతో బాగుగా కప్పఁబడి చలించుచున్న తీగెలు, త్రవ్వునపుడు చేయు ఘళఘళ అనెడి భయంకర శబ్దములతో, వాఁడి యైన గిట్టలతో పైకెత్తఁబడి మూడుసార్లు దున్నిన పొలమట్లు, ధ్వంసములైన యవస గడ్డి వరుసలు, అధములైన సేవకుల అఱపులచేతను, వేఁట గాండ్ర క్రూరములైన చూపులచేతను, కలఁతను చెంది (భయము చే కంపించి) చెవిటి తనమును పొంది నవియునైన, మఱియు మిక్కిలి వేగిర పాటుతో, గమనమందు ఆసక్తి కలవగుటచే, బాగుగా కన్పట్టు తమపైఁగల దీర్ఘములైన వెంట్రుకల తీవ్ర సంచలనముతో, బెదరి యున్నవియునైన, అడవి ఫందుల మంద, రాజకుమారుల ఎదుట గోచరించెను.

విశే. అలం: 1. స్వభావోక్తి : అడవి పందుల బీభత్సము చక్కగా వర్ణింపఁబడినది.

2. వృత్త్యను ప్రాసము : ఒకే అక్షరముగాని, పదముగాని మాటిమాటికిని ఆవృత్తియగుటకు ఈ పద్యము చక్కని యుదాహరణము.

3. యమకము : ఆవృత్తి అయినపదములలో అర్థ భేదమున్నచో, యమకమగును.

విక్రియాకులము, వరాహకులము.

ఇందు ఆకులము, 'కులము', అను పదములుఅర్థ భేదమును కలిగి యున్నవి.

4. రూపకము : ఘోణా ప్రఘాణ విద్రాణ;

5. ఉపమ : ఘన ఘనాఘన నీల ఘనవన.

వ్యా. విద్రాణ + ఛద = విద్రాణ+త్+ఛద (తుగాగమము)

విద్రాణచ్+ఛద = శ్చుత్వసంధి (చకారాదేశము) విద్రాణచ్ఛద.

2. ఛదాచ్ఛన్న = ఛద+ఆనజ్+ఛన్న = ఛద్ + ఆ +త్ + ఛన్న = (తుగాగమము)

ఛదా+చ్+ఛన్న = శ్చుత్వ సంధి (చకారా దేశము) ఛదాచ్ఛన్న.

వ. అప్పుడు పందికదువుల వెనువెంటం దవిలి కొందలింపం
జిందఱవందఱగాఁ జేసి యేసి యట చనఁ జన. 25

తా: ఆ సమయమందు, పందుల గుంపుల వెనుక వెంబడించుచు, వానిని మార్కొని బాగుగా కలఁత పడునట్లు చెల్లాచెదరు చేసి, ఆయుధములను ప్రయోగించి, అచ్చట నుండి ముందునకు పోవుచుండఁగా.

గీ. నల్లసేసపు గుండులు నడచినట్లు
[1]మంపు గొని మే యెఱుంగక మలసి మలసి
[2]నెనరువారికి నుఱుకంగ. నొక్కి మన్ను
బోతు లెడ చొచ్చె దాఁటెడు పొదలువోలె. 26

ప్రతి : నల్ల సేసపు గుండులు = నల్లనైన సాన బెట్టెడి పెద్ద బండలు; నడచినట్లు = నడచి పోవు చున్నట్లు; మంపుగొని = మత్తిల్లి, మత్తు చెంది; మే = శరీరము; ఎఱుంగక = తెలియక, (ఒడలు మఱచినవై); మలసి మలసి = బాగుగా తిరిగి; నెనరువారికిన్ = తమకు మిక్కిలి ప్రియములైన వానిని; ఉఱుకంగన్ = ముందు, తప్పించుకొని పోవుటకు; నొక్కి = (తమ

1. మ్రబ్బుగొని మెయ్యె 2. నెనడువాతికి

చేష్టలచే) ఒత్తిడి చేసి, రాబోవు ఆపదను హెచ్చరించినవై; మన్నుఁ బోతులు = ఈ పేరుగల మృగములు; (ఋశ్యములేక ఋష్యము - అనియు వీనికి పేరు కలదు); దాఁటెడు పొదలు + పోలెన్; ఎడ చొచ్చెన్ = దూరముగా తొలఁగినవి.

తా: నల్లని సానబండలు నడచిపోవుచున్నవో అనునట్లు మత్తుచెంది ఒడలు మఱచి తిరిగి తిరిగి ఆపదను ఊహించినవై తమకు ప్రియములైన వానిని ముందేపోవునట్లు తమ చేష్టలచే ఒత్తిడి చేయుచు ప్రోత్సహించి, మన్నుఁబోతులు దాఁటుచున్న పొదలవలె దూరముగా పరుగిడిపోయినవి.

అలం: ఉత్ప్రేక్ష, ఉపమ.

సోమన జంతు స్వభావజ్ఞత ఇందు వెల్లడి అయినది.

వ్యా. సేసపు గుండులు : సేసము + గుండులు.

1. సూ. కర్మ ధారయంబులందు మువర్ణమునకు పుంపులగును. సంధి, బాల - 32.

2. మన్నుఁబోతులు : మన్ను + పోతులు.

సూ. సమానంబులందు ఉదంత స్త్రీ సమంబులకును, పుంపులకును పరుష సరళంబులు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 25, ద్రుతకార్యము 16,17 సూ.

వ. ఇ ట్లన్నునం గన్ను గానక తిరుగుమన్నుఁ బోతుల నున్న
యునికిన గ న్నంతటం బడ నేసి పోవం బోవ. 27

ప్రతి: ఇట్లు + అన్నునన్ = ఈ విధముగా ఒడలు తెలియక; కన్ను గానక =(తెలుగు జాతీయము) పొగరుఁ బోతుతనముతో వర్తించుచు! అనఁగా గర్వముతో; తిరుగుచున్న మన్నుఁబోతులను; ఉన్న ఉనికిని = వాని నెలవులను, ఉన్న చోట్లను; కన్నంతనే = గమనించిన వెంటనే; పడన్ +ఏసి = నేలపై పడునట్లు ఆయుధములతోకొట్టి; పోవన్ +పోవ = ముందునకు పోవుచుండఁగా.

తా. సులభము. (మీఁది పద్యముతో అన్వయము).

వేఁటగాండ్రు, మత్తుతో ఒడలు మఱచి మిట్ట పల్లములను కానక తిరుగుచున్న మన్నుఁబోతులను అనాయాసముగా వధించిరి.

గీ. నీర ముంచిన సొరకాయ నెగసినట్లు
పేరుకొని వైచు తెల్లంటి చీర వోలె
[1] నుంకు చెండువిధంబున నుత్తరించు
తములపాకు నిక్కెడుక్రియ దాఁటె నిఱ్ఱి. 28

ప్రతి: నీర ముంచిన = నీటిలో ముంచినట్టి; సొరకాయ నెగసినట్లు = (ఎండిన) సొరకాయ బుఱ్ఱ పైకి తటాలున ఎగిరినట్లు; పేరుకొని వైచు = పేరుపొంది పై కెగుర వేయు; తెల్లంటు చీర + పోలెన్ = తెల్లంచు గల వస్త్రమువలె; ఉంకు చెండు విధంబునన్ = ఎగురునట్టి బంతి వలె; ఉత్తరించు = తెగ కొట్టిన; తములపాకు = తములపాకులు కల తీగ, (తీగను వదలిన వెంటనే, అది పైకి తటాలున ఎగిరి పోవును); నిక్కెడు క్రియ = (ఆ తీగ నిటారుగా) పైకి పోవు విధమున; ఇఱ్ఱి = ఒక జింక; దాఁటెన్ = పైకి దూఁకెను.

తా: నీటిలో అదిమి ముంచిన ఎండిన సొరకాయ బుఱ్ఱ పైకి ఎగసినట్లు, మంచి పేరును పొందిన వారు, తమకు బహుమానముగ నిచ్చిన తెల్లంచు గుడ్డను పైకి విసరినట్లు, నేలపైనుండి, పైకి ఎగురు బంతి వలెను, కోయఁబడిన తములపాకులు గల, తీగ వదలిన వెంటనే, తటాలున, నిటారుగా పైకి దుమికిన తీరున, ఒక జింక, పైకి ఎగిరి పోయెను.

అలం : ఉపమ.

వ. ఇవ్విధంబున నెగసినయిఱ్ఱి నాలుగుకాళ్ళునుం ద్రెవ్వ నొక్కమ్మొన నేసి చనునెడ మఱియు నప్పటప్పటికిం జొప్పరుల వలన నుప్పతిల్లిన చప్పుళ్ళకుఁ దెప్పరం బైన దుప్పలం దూఱు దుప్పులును (నిడువేఁటకార్లు) (వేఁటకుం) గడఁగిన నడికి నడికి కడవారికి నెడగాక తొడిగిన యమ్ముననపడి పొరలు పిడుల విడువక చిడిముడి పడు కడఁతులును నీఁటెలకుం బో టబ్బక సూటిమెయి దాఁటియు నేట్లచే విటతాటం బైన లేటి కదుపులును బిఱుంద ఱొప్పు [2]చౌఱిగాఱుకుఁ గాక వెఱచఱచి పఱచునెడఁ దెఱపి నుఱికిన తొఱ్ఱిద్రొక్కునం గుక్కలచేఁ బఱిపఱి యైన యెఱుములును గొందఱు గొందఱు ముందటం గొందలం బంది యందంద సందడిం గ్రింది మీఁదుగా వైచినం జిందఱ

1. నుక్కుచెడక వేగంబున నుత్తరించు 2. చౌఱికాఱుకుంగాక

వందఱులుగా క్రమ్మందిన కుందేళ్లను నేదెసఁ దొలంగినను సూది పిఱింది త్రాడై యెయిదిగొని పొదులవారిచే యాదల కాదలచే మూదలించిన సీదరంబులతోఁ బాదుకొనిన యేదులును నివ్వలవ్వలనుండి యెడ త్రెవ్వకుండఁ ద్రవ్విన యోదంబులం బడి క్రొవ్వఱక మవ్వంబు నివ్వటిల్లం బట్టువడిన చివ్వంగులునుం గలిగినం గనుంగొనుచు వెండియుఁ గ్రేఁగాలి నోలిం జాలుకొలిపిన కాలు వలలకుం బాలువడి లోలోపలం గళవళించియుఁ దోడ్తోడ జోడెంపువలలకు లేటివేడెంబు చేసినం గూడఁబడియును మున్ను పన్నిన కన్నె వలల సన్న సన్నం బోవక యన్నునం గన్ను దిరిగిపడి సన్న సున్నంబుగాఁ దన్నికొనియును నడ్డగించి నించిన యొడ్డు వలలకు సడ్డించి వెడ్డునం బడక గడ్డుఱికియు మృగంబు లనేకంబులు వొలియుటయును వేఁటచాలించి హంసడిభకులు నడవులం దిరిగి పరిశ్రాంతులై సేనాసమేతంబుగా మగుడం దలంచి మధ్యాహ్న సమయంబున. 29

ప్రతి: 1. ఈ+ విధంబునన్, ఎగసిన ఇఱ్ఱి = పైకి ఎగిరిన జింక యొక్క; నాలుగు కాళ్లనున్; త్రెవ్వన్ = తెగునట్లు; ఒక్క అమ్మునన్ + ఏసి = ఒక బాణముతో కొట్టి; చనునెడన్ = పోవునప్పుడు; మఱియున్; అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పుడప్పుడే చొప్పరుల వలనన్ = మృగముల జాడలను కనిపెట్టు వారిచే ఉప్పతిల్లిన చప్పుళ్లకు = చేయఁబడిన శబ్దములకు; దెప్పరంబైన = ప్రవేశించుటకు వీలుకాని; తుప్పలన్ = చిన్నచెట్లుగల పొదలందు; దూఱు = చొచ్చునట్టి; దుప్పులును = చమూరువులును, (ఒక రకమైన చిన్న తోకతో నుండు, తెల్లగానైనను, నల్లగానైనను లేక, పెక్కు వర్ణములు కలది గాను నుండు జంతువు)

తా: పై విధముగా, వేగముతో పైకెగిరిపోవు జింక యొక్క నాలుగు కాళ్లను ఒక బాణముతో తెగవేసి పోవుచుండఁగా మఱియును అప్పుడప్పుడే, జంతువుల నెలవులను, ఎఱుఁగు వారు చేయు శబ్దములకు, చొచ్చుటకు వీలు కాని చిన్న చెట్లు గల పొదలందు దూఱునట్టి చమూరు మృగములును,

వ్యా. అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటికినప్పటికిన్

సూ. అప్పటప్పటికిన్, ఆమ్రేడితము పరమగునపుడు విభక్తికి లోపంబు బహుళంబుగానగు. సంధి, బాల-4.1.

ప్రతి: 2 నిడు వేఁటకార్లు = నిడుపైన వేటగాండ్రు; వేఁటకున్; కడగినన్ = పూనుకొనగా; నడికి నడికి =వడకి వడకి (కంపించి); కడవారికి = వెనుకనున్న వారికి, (వేటగాండ్రకు); ఎడగాక = దూరముగా నుండక పోవుటచే, అనగా, దగ్గఱగానుండుటచే; తొడిగిన అమ్మునన పడి = (వారు) వేసిన బాణముతోనే క్రింద పడి; పొరలు పిడల విడువక = దొర్లుచున్న ఆఁడు జంతువులను విడువక (విడుచుటకు మనసు కలుగక పోవుటచే); చిడిముడిపడు = కలఁత చెందు ; కడఁతులును = గంధర్వమృగములు; కడఁతి, కణఁతి - (రూపములు).

తా. నిడుపైన వేఁటగాండ్రు, వేఁటకు పూనుకొనఁగా బాగుగా వణకుచు, పరుగిడిపోవుటకు శక్తి లేక, వేగము తగ్గుటచే, వెనుకనున్న వేఁటాడు వారికి, దూరముగా లేకపోవుటచే, వారు ప్రయోగించిన బాణముతోనే నేలపై పడి, ద్రొర్లుచున్న తమ ఆఁడుజంతువులను, విడువఁజాలక, కలఁత చెందు గంధర్వ మృగములును,

ప్రతి: 3 ఈఁటెలకున్ + పోటు+ అబ్బక = ఈఁటెల దెబ్బలకు లొంగక; సూటి మెయిన్ = సూటిగా, తిన్నగా; దాఁటియున్ = దాఁటిపోయినప్పటికిని; ఏట్లచే = (తమకు కలిగిన) గాయములచే; విటతాటంబైన = బెదరి పోయిన; లేటి కదుపులును = జింకల మొత్తములును,

తా: ఈఁటెల పోట్లకు వశముగాక తప్పించుకొని పోవుటకు, సూటిగా దుమికి నప్పటికిని, తాము పొందిన దెబ్బలచే (గాయములచే), చెల్లాచెదరైన జింకల మొత్తములును.

ప్రతి : 4. పిఱుందన్ ఊొప్పు = వెనుక నుంచి కూయునట్టి చొఱి గాఱకుగాక = (తఱుముచున్న) వేఁట గాండ్రకు వశముగాక; వెఱచఱచి = భయపడి; పఱచునెడన్ = పరుగిడునప్పుడు; తెఱపిన్ = బయలులో, మైదానములో; ఉఱికినన్ = దుముకుచు పరుగిడగా; తొఱుద్రొక్కనన్ = ఒక దానిపై మఱొకటి పడి తమలో తాము త్రొక్కుకొనుటచే; కుక్కలచే, (వానికి చిక్కి); పఱిపఱి యైన = పీడింపఁబడిన, కఱవఁబడిన; ఉఱుములును = ఉడుములును;

తా: వెనుకనుండి కేకలు వేయుచు తఱుముకొని వచ్చు బోయలకు, వశముగానివై, భయపడుచు తప్పించుకొని పోవునపుడు మైదానమునకు దుమికినట్టివి, ఒక దానిపై, మఱొకటి పడుటచేతను త్రొక్కిళ్లకు లోనగుటచేతను, కుక్కలకు సులభముగా చిక్కి కఱవఁబడిన ఉడుములును.

ప్రతి: 5 కొందలు కొందలు = కొన్ని, (అమహదర్థక బహువచనము); ముందటన్ = ముందు భాగమునందు; కొందలంబంది = కలఁత చెందుటచే; అందంద = ఆయా చోట్లలో సందడిన్ = పరిజనుల ధ్వనులచే, (చేష్టలు ఉడిగి పట్టుబడినవై); క్రిందు మీఁదుగా వైచినన్ = ఇష్టము వచ్చినట్లు, ఒక దానిపై నొకదానిని విసరి వేయగా; చిందఱ వందఱలుగా = ముక్కలు ముక్కలై; ప్రమందిన = ప్రాణములను కోల్పోయిన; కుందేళ్లును;

తా. కొన్ని కలతఁ చెంది, అచ్చటచ్చట, పరిజనుల ధ్వనులకు కదలికలను కోల్పోయి, పట్టుఁబడినవై; వారు ఇష్టము వచ్చినట్లు పాఱవేయఁగా, ఒక దానిపై, మఱొకటి పడి, అవయవములు విఱుగుటచే, ముక్కలై, ప్రాణములను, వదలిన కుందేళ్లును.

ప్రతి : 6. ఏ దెస తొలంగినను = ఏ దిక్కున పోయినప్పటికిని; సూది పిఱింది త్రాడై = సూది వెనుకనే ఉన్న త్రాడు ఉండు విధమున; ఆది కొని = కన్ను వేసి; ఎయిది కొని (పాఠాం) వెంబడించి; పాదులవారి పెంపుడు జంతువులతో వేఁటాడు వారి యొక్క; చే+ఆదలకు = బుజ్జగింతలకు, చేతులతో చేయు ఆదరములకు; ఆదలచే = (అవి ఉండు చోట్లను) ఆధారములచే; మూదలించినన్ = నిరూపించి ఎచ్చరింపఁగా; సీదరంబులతోన్ = భయావేశములతో; పాదుకొనిన = ప్రమాన్పాటు చెంది కదలక మెదలక, నిలిచి పోయిన; ఏదులును = ముళ్ల పందులును,

తా. ఎచటికి పరుగిడి పోయినను, సూది వెనుక త్రాడు అంటుకొని యుండునట్లు, గుఱి చూచి వెంబడించు, పెంపుడు జంతువులతో వేఁటగాండ్రు చేయు బుజ్జగింతలకు ఉత్సాహమును పొందినవై, అవి ఉన్న చోట్లను (ముళ్ల పందులున్న స్థానములను) గుర్తించి, నిరూపించి, ఎచ్చరికచేయఁగా, (అవి) భయావేశములను కలిగి మ్రాన్పాటు చెంది కదలక మెదలక, ఆఁగిన ఏదు పందులును.

వేఁట గాండ్రకు, పెంపుడు జంతువులు అవి దాగి యున్న స్థానములను గుర్తించుటకు తోడ్పడు చుండుటచే ఎటు పోవుటకును వీలుకాక తప్పించుటకొనుట సాధ్యము కాదని, ఎఱిఁగిన ఏదు పంధులు, ఏమియు తోఁచక నిలబడిపోయినవి.

ప్రతి: 7. ఇవ్వల+అవ్వలనుండి = ఈ వైపు, ఆవైపు అనగా అన్ని వైపుల యందు; ఎడ, త్రెవ్వ కుండన్ = ఎడము వదలక, నడుమ చోటు లేనట్లు; త్రవ్విన+ఓదంబులన్ = త్రవ్వినట్టి గుంటలలో; పడి; క్రొవ్వు + అఱక = బలమును కోల్పోవక; మవ్వంబు నివ్వటిల్లన్ = మెత్తఁదనము కలుఁగుటచే (బలము సన్నగిల్లుటచే); పట్టుబడిన; చివ్వంగులునున్ = సివంగులును (సివఁగి, సివ్వఁగి, చివఁగి చివ్వఁగి రూపాంతరములు. ఇదియొకానొక మృగ విశేషము. వ్రాత

ప్రతులందు ఈ పదము పరుషాదిగా కన్పట్టుచున్నది); కలిఁగినన్; కనుంగొనుచు (ఎదుట పడినప్పుడు) చూచుచును.

తా. నడుమ చోటును వదలక అన్ని వైపుల త్రవ్వినట్టి గుంటలలో పడి బలము నశించి, మెత్తఁదనము కలుఁగుటచే పట్టు బడిన సివంగులు, ఎదుట నుండగా, వానిని చూచుచును.

ప్రతి : 8. వెండియున్; క్రిందు+ కాలిన్+ఓలిన్ = వెనుక కాళ్ల యొక్క వరుసలు (ఇచ్చట షష్ఠికి ద్వితీయ) చాలు కొలిపినన్ = వెళ్లిన దారిని సూచించు చుండఁగా; కాలు వలలకున్ = కాళ్లను బంధించు వలలకు; పాలు పడి = చిక్కినవై; లోపలన్ + లోపలన్, లోలోపలన్ =తమ మనస్సులలో; కళ వళించియున్ = కలవరపాటు చెందియును; తోడ్తోడ జోడెంపు వలలకు = వెన్వెంటనే జతలు జతలుగానున్న వలల నుండి; లేటి = ఆఁడు జింకలు; వేడెంబు చేసినను = తప్పించుకొనుటకు, చుట్టును, వలలతో మండలాకారమున తిరిగినప్పటికిని; కూడఁబడియును = అన్ని యొకే సారి గుమిగూడి పడినవై; మున్ను పన్నిన కన్నెవలల = ముందే ఏర్పాటు చేసిన క్రొత్తవైన చిన్న వలల యొక్క; సన్నసన్నన్ = జాడలను(ఎఁటిగి) పోవక; అన్నునన్ = ఒడలు తెలియక కన్ను తిరిగి పడి = (భయముచే) కనులు చెదరి పడుచున్నవై; సన్నన్ = పోయినప్పటికిని, సున్నంబుగాన్ = ప్రయోజనములేక, తన్నికొనియును = తమలోతాము ఒక దానిని మఱి యొకటి తన్ను కొనుచును; అడ్డగించి నించిన ఒడ్డువలలకు = తప్పించుకొని పోకుండుటకై అడ్డముగా ఎక్కువగా పఱచిన వలలను; సడ్డించి = తప్పించుకొని వెడ్డునన్ పడక = వేఁటగాండ్ర మోసమునకు గుఱిగాక; గడ్డు ఉఱికినన్ = వేగముగా దిక్కులు తెలియక పరుగిడినను; మృగంబులు = జంతువులు; అనేకంబులు = పెక్కు; పొలియుటయును = (గమనవేగమువలన గుండె ఆఁగిపోయి) చచ్చుటచేతను; వేఁట చాలించి హంస డిభకులు; అడవులన్; తిరిగి = తిరుగుటచే (క్త్వార్థకము, హేత్వర్థకముననున్నది); పరిశ్రాంతులై = అలసిపోవుటచే; సేనా సమేతముగా = తమ సేనలతో, మగుడన్ తలంచి = మరలుటకు నిశ్చయించుకొని; మధ్యాహ్న సమయంబున;

తా. ముందే జంతువులు పరుగిడుటచే వెనుక కాళ్ల వరుసల గుర్తులు,అవి పోవు జాడలు తెలియఁ జేయుటచే, అచట ఏర్పాటు చేసిన కాలు వలలకు. (కాళ్లను బంధించు వలలకు) చిక్కినవై, ఆఁడు జింకలు కొన్ని ఆవేదన చెందినప్పటికిని, వెన్వెంటనే జతలు జతలుగా నున్న వలలనుండి తప్పించుకొనిపోవుటకు కొన్ని వలలతో కూడ మండలాకారమున తిరిగినప్పటికిని, అన్నియును ఒకే సారి కలిసి గుంపుగా పడిపోయినవి. అయినను కొన్ని క్రొత్త వైన వలల ఉనికిని ఎఱిఁగి వాని కడకు పోవక, కన్నులు

తిరుగుటచే, దిక్కులు తెలియక, కన్నులు చెదరి పడి ముందుకు పోవుటకు ప్రయత్నింపఁగా అది వీలు కాక పోవుటచే తమలో తాము తన్నుకొని, కొన్ని, అడ్డగించుటకు పెట్టిన వలలను, లక్ష్యము చేయక తప్పించుకొని వేఁటగాండ్ర మోసమునకు వశముగాక అతి వేగముగా పరుగిడుటచే గుండెలు ఆఁగి ప్రాణములను వదలినవి. ఈ విధముగా పెక్కుజంతువులు. మడియుటచే హంసడిభకులు వేఁటను విరమించి విపినములలో తిరిగి అలసిపోవుటచే, మరలి పోదలచిరి. అపుడు మధ్యాహ్నమయ్యెను.

వ్యా. 1 లోలోపలన్, లోపలన్ + లోపలన్. సంధి, బాల - 41.

చూడుము, వచనము - 29.

2. క్రేఁగాలు, క్రింది + కాలు. ప్రాతాది సంధి.

సూ. సమాసంబున ప్రాతాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు. సంధి, బాల - 6 36.

సూ. లుప్త శేషంబునగు పరుషములు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 37.

బహుళ గ్రహణముచే, దీర్ఘము, సంధి, బాల - 38 సూ.

ద్రుతకార్యములు, సంధి, బాల - 16, 17 సూ.

చం. కనిరి కుమారు లంత శశికాంత శిలాతల శీతలస్థలీ
వనఘన పాదపాదప నివారిత వారితరంగ రంగ న
ర్తన పరివ ర్తన ద్విరదదాన సదానమ దాళిమాలికా
తను వనజాత నూతనబలాకముఁ బుష్కర మన్ తటాకమున్. 30

ప్రతి: కుమారులు = హంస డిభకులు; అంత = మధ్యాహ్నమంచు; శశికాంత శిలాతల శీతలస్థలీ = చంద్ర కాంత శిలలున్న చల్లనైన చోట్లను; వన = నీటిలోపలి భాగమందు; ఘనపాద = దృఢమైన వ్రేళ్లుగల; పాదప నివారిత = చెట్లచే అడ్డగింపఁబడిన; వారితరంగ = నీటి అలలు అనెడి; రంగ = నాట్య భూమియందు నర్తన పరివర్తన = ఆటల విన్యాసములతో; ద్విరద = (ఊగుచున్న) ఏనుఁగుల యొక్క; దాన = మదజలమున; సదా = ఎల్లప్పుడు; ఆనమత్ = (సువాసనచే) వ్రాలుచున్న; ఆళిమాలికా = తేనేటీఁగల వరుసల యొక్క; తను = శరీరములతో (నిండిన); వనజాత = పద్మములను (నీటిలో పుట్టినవి); నూతన బలాకమున్ = క్రొత్తగా వినోదమునకై వచ్చిన పెద్ద కొంగలును (ఉన్న); పుష్కరము+ అన్ = పుష్కరము అనెడి పేరుగల; తటాకమున్ = పెద్ద సరస్సును; కనిరి.

తా. హంస డిభకులు మధ్యాహ్నమందు, చంద్రకాంత శిలలతో (తీరమందు) చల్లనైన చోట్లను, నీటిలో బలిష్ఠములైన వ్రేళ్ళుగల చెట్లచే అడ్డగింపఁబడుచున్న నీటి అలలు అనెడి నాట్య శాలయందు నృత్య విన్యాసములతో ఇటునటు ఊఁగుచున్న ఏనుఁగుల యొక్క మద జలమందలి సువాసనచే, ఎల్లప్పుడు ఆకర్షింపఁబడి వ్రాలుచు, తర్వాత మకరంద పానమునకై ప్రవేశించిన తుమ్మెదల మొత్తములు కల పద్మములను, క్రొత్తగా వేడుకకై విచ్చేసిన పెద్ద పెద్ద తెల్ల కొంగలును గల పుష్కర మనెడి పేరు గల ఒక పెద్ద సరస్సును చూచిరి.

విశే. అలం : 1. వృత్త్యను ప్రాసము 2. రూపకము - వారి తరంగ రంగ నర్తన పరివర్తన.

వ్యు. పాదపము : పాదముచే (వ్రేళ్లచే) నీళ్ళను త్రాగునది, చెట్టు.

వ్యు ద్విరదము : రెండు దంతములు కలది, ఏనుఁగు.

వి. సున్న. ప్ర. శూన్యము.

కం. కని యాపద్మా కరమునఁ
దను పారెడునీరు ద్రావి తమసేనలుఁ దా
రుమ విశ్రమించి రాసే
చనకము లగు తరులనీడ సైకతములపై. 31

ప్రతి : కని; ఆ పద్మ + ఆకరమునన్ = ఆ తామరలకు నిలయమైన తటాకమందు; తనుపు = ఆరెడు = దప్పిని పోగొట్టు; నీరు + త్రావి; తమ సేనలున్, తారును; ఆసేచనకములు + అగు = చల్లఁదనమును వెదఁజల్లు చున్న (సంతృప్తిని ఇచ్చుచున్న); తరుల నీడ సైకతములపైన్ = చెట్ల నీడలుగల ఇసుక తిన్నెలపై; విశ్రమించిరి.

తా. ఆ పుష్కరమనెడి తటాకమును చూచి, దప్పి తీర్చుకొనుటకై అవసరమైన నీటిని త్రాగి తమ సేనలును, తామును (హంస డిభకులు)మనోహరములగు చెట్ల నీడలున్న ఇసుక తిన్నెలపై విశ్రమించిరి.

వ్యా. తరులనీడ : తరువులనీడ

సూ. వువర్ణ కేతర విభక్తి పరమగుచో ఉకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా 'వు' గాగమంబగు, తత్సమ. బాల - 49.

వ. అట్లున్న యెడ. 32

ప్రతి: అట్లు + ఉన్న + ఏడ = ఆ విధముగా విశ్రాంతిని పొంది యున్న సమయమందు.

కం. మాధ్యందిన సవనధ్వని
విధ్యుక్తస్వరముతోడ విన వచ్చుటయున్
స్వాధ్యాయపరులు గావున
నధ్యాహారంబు పుట్టె నయ్యిరువురకున్. 33

ప్రతి : మాధ్యందిన = మధ్యాహ్న సమయమందు (నిర్వహించు); సవనధ్వని = యజ్ఞ కార్యధ్వనులు; విధి + ఉక్త స్వరముతోడన్ = వేద విధులందు చెప్పఁబడిన రీతులు గల ఉదాత్త అనుదాత్త స్వరిత, ప్లుతములు అనెడి, స్వరములతో కూడ; వినవచ్చుటయున్ = వినఁబడఁగా; ఆ ఇరువురకున్; స్వాధ్యాయ పరులు +కావునన్ = స్వయముగా వేదములను అధ్యయనము చేయు వారగుటచే; అధ్యాహారంబు = ఊహ (వారికి) పుట్టెన్.

తా. మధ్యాహ్న సమయ మందు, మున్యాశ్రమమందు, అచటి వారు నిర్వహించుచున్న యజ్ఞ కార్యముల ధ్వనులు, వేద విధులందుచెప్పఁబడిన విధమున వివిధ స్వరములతో వినఁబడుచుండుటచే ఆ రాజకుమారులు స్వయముగా వేదాధ్యయనము చేసెడి వారగుటచే కోరిక వారికి కలిగెను.

కం. ఊహించి యాశ్రమంబగు
నోహెూ యిం తొప్పునే సముచ్చారణ మం
చా హంసడిభకు లేసం
దేహము లే కందు చనుమతి సముత్థితు లై. 34

ప్రతి : (ఆ హంసడిభకులు) ఊహించి; ఆశ్రమంబగున్ = (సమీపముననే) ఆశ్రమ మున్నట్లున్నది; సముచ్చారణము = వేదమంత్రముల చక్కని స్వర యుతమైన పలుకు తీరు ఇంత+ఒప్పునే! = ఆహా! ఎంతో చక్కగానున్నది కదా!; అంచు; ఏ సందేహము లేక; అందు = ఆ ఆశ్రమములోనికి; చనుమతి = పోవు మనస్సుతో; సముత్థితులై = ప్రయత్నముతో లేచి.

తా. ఆ హంసడిభకులు, ఆలోచించి, సమీపమందే ఆశ్రమమున్నదని ఊహించి, "వేదమంత్రముల స్పష్టమైన ఉచ్చారణము, ఆహా! ఎంతో చక్కగా ఉన్నది కదా!" అని తలంచి ఏ విధమైన సందేహము లేక, సంతసముతో, అచటికి పోవు మనస్సుతో సంసిద్ధులై లేచి (తరువాతి పద్యముతో అన్వయము).

ఉ. అచ్చట సేనల న్నిలిపి యాశ్రమవాసులఁ జూచు వేడుకన్
వచ్చిరి పాదచారు లయి వారు జనార్దనుఁ డే గు దేరఁగా
లచ్చి తనూవిలాసమున లావు ధనుశ్శర ధారణంబుచే
నచ్చుపడంగఁ గాశ్యపమహాముని యజ్ఞ సమీపభూమికిన్. 35

ప్రతి: వారు హంస డిభకులు; అచ్చటన్; సేనలన్ నిలిపి;ఆశ్రమవాసులన్, చూచు; వేడుకన్ = ఉత్సాహముతో, జనార్దనుఁడు + ఏగు దేరఁగా = జనార్దనుఁడును, తమతో కూడి రాఁగా; తనూ విలాసమున = శరీరముయొక్క అమరికలో; లచ్చి = లావణ్యము, నైగ నిగ్యము, శోభ; ధనుః+ శరధారణంబుచేన్ = విల్లు, బాణములు ధరించుటచే; లావు = శూరత్వము; అచ్చు పడంగన్ = ప్రకటమగు చుండఁగా; కాశ్యప మహాముని, యజ్ఞసమీప భూమికిన్ = కశ్యప మహాముని యజ్ఞము చేయు ప్రదేశమునకు దగ్గఱగా నుండు చోటికి; పాదచారులు + అయి కాలి నడకతో వచ్చిరి.

తా. హంస డిభకులు, అచ్చటనే (తటాక ప్రాంతమందే) సేనను నిలిపి, ఆశ్రమమందున్న వారిని చూచు ఉత్సాహముతో, జనార్దనుఁడు కలసి రాఁగా. శరీరము యొక్క అమరికలో, నైగనిగ్యము, విల్లు బాణములు ధరించియుండుటచే, శూరత్వము తెల్ల మగు చుండఁగా కశ్యపముని యజ్ఞము చేయు ప్రదేశమునకు దగ్గఱనున్న చోటికి కాలి నడకతో వచ్చిరి.

వ్యా. ధనుశ్శరధారణ : ధనుః + శరధారణ, విసర్గ సంధి.

కం. అరిగి సభాచార్యులకున్
బరిపాటి నమస్కరించి పదపడి వా రా
దరమునఁ జేయు సపర్యలఁ
బరితోషము నొంది కశ్యప ప్రభృతులతోన్. 36

ప్రతి: అరిగి; సభా+ఆచార్యులకున్ = ఆశ్రమములో నుండు గురువులకు; పరిపాటి = వారి వారి వయస్సు, యోగ్యతలు మొదలగు వానికి తగినట్లు మర్యాదను చూపుచు; నమస్కరించి, పదపడి = ఆవల; వారు; ఆదరమునన్ = ప్రీతితో; చేయు సపర్యలన్ =సేవలచే; పరితోషము + ఒంది = సంతృప్తిని పొంది; కశ్యప ప్రభృతులతోన్ = కశ్యపమహాముని మొదలగు వారితో.

తా. ఆ, కశ్యపమున్యాశ్రమును చేరి, ఆశ్రమములోఁగల గురువరులకు క్రమమును పాటించుచు నమస్కరించి, ఆవల ఆశ్రమ వాసులు, చేయు సేవలచే, సంతృప్తిని చెంది, ఆ కశ్యపముని మొదలగు వారితో (మీఁది వచనముతో అన్వయము).

వ. హంసుం డిట్లనియె. 3

తా : హంసుండు ఇట్లు అనియెన్.

కం. మాతండ్రి రాజసూయముఁ
బ్రీతిం జేయఁగఁ దలంచి పిలువం బనిచెన్
భూతలమునఁ గలనృపతి
వ్రాతంబుల మీరు నరుగ వలయు నచటికిన్. 3

తా. మా తండ్రి బ్రహ్మదత్తుఁడు 'రాజసూయము' అనెడి యాగమును ప్రీతితో చేయుటక సంకల్పించి, ఈ భూమండలమున గల రాజుల సమూహముల నెల్లను పిలువ వలయున మాకు ఆజ్ఞ యిచ్చెను. ఆ యాగమునకు మీరును విచ్చేయవలసి నదిగా కోరుచున్నాము.

మ. క్షితి నాతమ్ముఁడు నేను దిగ్విజయముం జేయంగ డాయం గడున్
బ్రతివీరప్రకరంబు డంబు మెయిఁ గప్పం బొప్పనం బీక యే
కత మాడం గలరే న రేశ్వరశిరోగర్వంబు సర్వంబుఁ బా
పితి మీశానవరప్రసాదమున మా పెం పెల్లెడం జెల్లఁగన్ 39

ప్రతి: క్షితిన్ = ఈ భూమియందు; నాతమ్ముడు; నేను; దిక్ + విజయంబు చేయంగ = దిక్కులలోనున్న రాజుల నెల్లను జయించుటకు; కడున్ డాయన్ = మిక్కిలి చేరువకాఁగా; ప్రతి వీరప్రకరంబు = మాతో సాటియైన వీరులు; డంబు మెయిన్ = గర్వముతో; కప్పంబు + ఒప్పనం బీక = (మాకు లోబడుటకు సూచనగా) కప్పమును అర్పింపక; ఏ కతము + ఆడగలరు! = ఏకారణముచే, మాతో మాట్లాడగలరు! ఈశాన వరప్రసాదమునన్ = శివుని వరము యొక్క అనుగ్రహముచే (దయచే); మా పెంపు = మా యొక్క వృద్ధి (గర్వాతిశయము) ఎల్లెడన్ = అన్ని చోట్లలో; చెల్లఁగన్ = వ్యాపించునట్లు; నర+ఈశ్వర = రాజుల యొక్క (నరులకు ప్రభువుల); శిరోగర్వంబు = తలబిరుసుతనమును పాఁపితిమి = వదలించితిమి.

తా. ఈ ధరణిలో, నా తమ్ముఁడు డిభకుఁడు, నేను.(హంసుఁడు) అన్ని దిక్కుల యందుగల రాజులను జయించుటకై సమీపింపఁగా, మాతో సమానులైన ప్రతిపక్ష వీరులు, గర్వము కలవారైనను, కప్పము మాకు అర్పింపక, ఏ కారణముచే, మాతో మాటాడ గలరు! ఆ ఈశుని వరము యొక్క అనుగ్రహముచే, మా అభివృద్ధి అన్ని చోట్లలో వ్యాపించునట్లు రాజుల తల బిరుసుఁదనమును పూర్తిగా తుడిచివేసితిమి.

విశే. ప్రతి వీరులందఱు, పరాక్రమ హీనులగుటచే, కప్పము అర్పింపక తప్పదని, శివుని వరానుగ్రహముతో, తాము సర్వాధిపత్యమునకు తగిన వారమని దృఢ విశ్వాసముతో హంసుఁడు పల్కుటచే, అతని గర్వాతి శయ మిందు ప్రకటితమైనది.

కం. అనుటయు వా రందఱు హం
సునితో ని ట్లనిరి రాజసూయమునకు మీ
జనకుఁడు దొడఁగినఁ జాలును
మునుముట్టన వత్తు మిందు మోసము గలదే. 40

తా. అట్లు హంసుఁడు చెప్పఁగా, కశ్యపాదిమునులు అతనితో, 'మీ తండ్రి, ప్రయత్నించిన తోడనే, ఆ రాజసూయ యాగమునకు, దానిని మొదలు పెట్టుటకు, ఇంచుక ముందే తప్పక వచ్చెదము. ఈ మాటలలో కపటము లేదు.' (ఇది అసత్య వచనము కాదు).

మును, మున్ను రూపాంతరములు.

మ. అనినం దమ్మునితో జనార్దనునితో హంసుండు సంతోష మొం
ది నిజేచ్ఛం జనుచోటఁ బుష్కరసర స్తీరో త్తరారణ్య పా
వనభూమిం బరమోపదేశమున దుర్వాసో మునీంద్రుండు శి
ష్యనికాయంబుఁ బ్రబోధవీధిఁజనఁజేయన్సాయమై తోఁచినన్. 41

ప్రతి: అనినన్ = అట్లు కశ్యపాదులు చెప్పఁగా; హంసుఁడు; తమ్మునితో జనార్దనునితో; సంతోష మొంది; నిజ+ఇచ్ఛన్ = తన మనస్సునకు తోఁచిన విధమున; చను చోటన్ = పోవు ప్రాంతమందు; పుష్కర సరస్ +తీర = పుష్కర మనెడి సరస్సు యొక్క గట్టునకు; ఉత్తర + అరణ్య పావన భూమిన్ = ఉత్తర దిక్కున కల అడవి యందు, పవిత్రమైన ప్రదేశమున; పరమ+ఉపదేశమునన్= పరబ్రహ్మను గుఱించి ఉపదేశించుచు; దుర్వాసోమునీంద్రుఁడు = దుర్వాసమహాముని; శిష్యనికాయమున్=శిష్యుల మొత్తమును; ప్రబోధవీధిన్= జ్ఞానమార్గమందు; చనన్ చేయన్ = ప్రవర్తింపఁజేయుటకు వేదాంత విజ్ఞానమును మథించుటకు; సాయమై తోఁచినన్ = సాయపడుచుండఁగా.

తా.అట్లు కశ్యపాదిమునులు వచింపఁగనే, హంసుఁడు తమ్మునితో, జనార్దనునితో, సంతసమంది, తనకు తోఁచినట్లు పోవుచుండఁగా ఆ పుష్కర మనెడి పేరు కల సరస్సు యొక్క ఉత్తర దిక్కునందున్న అరణ్యమందు, పవిత్రమైన స్థలమున, దుర్వాసమహాముని,

తన శిష్యులకెల్లన్ పరబ్రహ్మమును గుఱించి, జ్ఞానోదయము కలిగించుచు, జ్ఞానమార్గమందు ప్రవర్తింపఁ జేయుటకు సాయ పడుచుండఁగా (తరువాతి పద్యముతో అన్వయము).

విశే. దూర్వాస, దుర్వాస - వ్యాకరణ దుష్టములు. అయినను వాడుకలో ఉన్నవి. తిక్కన మహాకవి ఆనుశాసనిక పర్వము 5 ఆ - 3 89 పద్యమందు, దుర్వాసుఁడు అని ప్రయోగించెను. కనుక పెద్దలు వ్యవహరించిన మాట గ్రాహ్యము.

"దుర్వాసోమహర్షి" - సాధు రూపము; ఈ మహాముని అనసూయ అత్రిమహర్షులకు, శివాంశమున జన్మించెను. తమోగుణోద్రేకము కలిగిన రుద్రుఁడే దుర్వాసోమునీంద్రుఁడు.

## - : హంస డిభకులు దుర్వాసుని అవమానించుట : -

ఆ.వె. కావిచీరముసుఁగు కచ్చడంబును జూచి
బోడతలయు నిడుదబొట్టుఁ జూచి
గోచికోక వెదురుఁగోలయుఁ జిక్కంబుఁ
గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి. 42

ప్రతి: కావి చీర = ఎఱ్ఱని (కాషాయ) వస్త్రమును; ముసుగు = తలకు కప్పుగొనునది; కచ్చడంబును = గోచిని; చూచి; బోడ తలయున్ = వెంట్రుకలు లేని తలను; నిడుద బొట్టున్ = నిలువుగా నున్న (నొసటి యందు కల) తిలకమును; చూచి; గోచికోక = విడిగా నొక గోచి గుడ్డ; వెదురు+కోలయున్ = వెదురు కఱ్ఱయును; చిక్కంబును = మడఁచుటకు వీలైన సంచియును; కట్టియున్న; బుఱ్ఱకాయన్ = కమండలువును.

తా. ఎఱ్ఱని వర్ణము గల తలకున్న ముసుగు గుడ్డను, ధరించియున్న అదే రంగుకల గోచిని, బోడిగానున్న తలను, నొసటి యందు నిలువైన తిలకమును, విడిగానుండు గోచి ముక్కనొక దానిని, వెదురు కఱ్ఱను, మడ సంచిని, కట్టియున్న కమండలువును, అన్నింటిని ఒక దాని తరువాత ప్రత్యేకముగా చూచి (మీఁది వచనముతో అన్వయము).

విశే. హంసడిభకులకు, దుర్వాసోముని ఆకారము హేయముగా గోచరించెను. కనుక సోమన ఆ యతి ధరించిన వస్తువులను విడివిడిగా చెప్పుచు మాటి మాటికిని చూచి ఓరిమిని కోల్పోయిరని ధ్వనింపఁ జేసెను. "చూచి" అను పదమును మూడు సార్లు వాడెను. ఇట్లు చేయుటచే, హేళన గర్భితముగా నున్నది.

వ. డాయం బోయి హంసడిభకు లతనితో ని ట్లనిరి. 43

తా. (దుర్వాసోముని ఆకారమును సహింపక, ఓరిమిని వదలి) రాజకుమారులు, అతనిని సమీపించి అతనితో ఈ విధముగా చెప్పిరి.

కం. మిడికెదు పెదవులు వ్రేళులు
మడిచెదు కనుదోయి మొగిడి మాయెదరఁ గడున్
వెడవీఁక యొడలు చేసెదు
కడపల జపమునకు నేఁడు గలదో లేదో. 44

ప్రతి : పెదవులు; మిడికెదు = పైకి క్రిందికి కదల్చుచున్నావు;వ్రేళులు = (నీ చేతి) వ్రేళ్లను; మడిచెదు = (మాటిమాటికి) మడుఁచు చున్నావు; కనుదోయి = కనుల జంటను; మొగిడి = మూసివేసి; మా ఎదురన్; కడున్ = మిక్కిలి; వెడ వీఁకన్ = వ్యర్థమైన (ఉపయోగములేని) గర్వముతో; ఒడలు చేసెదు = నీ శరీరమును చూపు చున్నావు; జపమునకు = (నీవు కావించు (కృత్రిమమైన) జపమునకు; నేఁడు, కడపల = తుది; కలదో; లేదో!.

తా. పెదవులను పైకి క్రిందికి కదలించుచున్నావు. వ్రేళ్లను మడుఁచు చున్నావు. కన్నుల జంటను మూసికొని మా ఎదుట, వ్యర్థమైన గర్వముతో, శరీరమును ప్రదర్శించు చున్నావు. నేఁడు నీ (దొంగ) జపమునకు, అంతమున్నదా లేదా?

విశే. దుర్వాసుఁడు, పద్మాసనస్థుఁడై జపచర్యయందున్నాఁడు. స్థిరమైన చిత్తముతో ఆ మహాముని కావించు యోగానుష్ఠానమును, శివభక్తులైన ఆ యిర్వురు ఆదరింపక అతని హేళన, చేయుటకు సిద్ధపడుట, చూడగా, వారు మదోన్మత్తులగుటచే అట్లు ప్రవర్తించిరని తలంపవలెను.

వ. అని పలికి యతఁడు పలుక కుండం దమలోన. 45

తా. అని హేళనను చేసినను, ఆముని వరుఁడు మౌనముగా నుండుటను గమనించి రాజకుమారులు తమలో (ఇట్లు తలఁచిరి).

చం. తిరిసినకూడు దెచ్చి నలుదిక్కుల బోడలు తిండి పెట్టఁగాఁ
బెరిఁగిన పొట్టతోడ నొకపీఁటపయిం దొర వోలె నెవ్వరో
సరకు గొనండు పట్టుకొని చాఁగఱ గొన్న బలే యెఱుంగుఁ డ
క్కరి బలుమోపు మోచు నయగారితనం [1]బది యుట్టిగట్టిన్. 46

1. బిరువుట్టి

ప్రతి: బోడలు = బోడి తలలు కలవారు, సన్న్యాసులు; నలు దిక్కులన్ = నాలుగు దిక్కులయందు; తిరిసిన కూడు = బిచ్చమెత్తి తెచ్చిన అన్నమును; తిండి పెట్టఁగాన్ = తినుటకు ఆహారముగా నియ్యఁగా; పెరిగిన పొట్ట తోడన్= బాగుగా పెద్దదైన పొట్ట కలిఁగిన వాఁడై; ఒక పేఁట (పాఠాం - పీఁట) పయిన్ = ఒక ఊరికి; దొర పోలెన్ = అధికారివలె; ఎవ్వరిన్ = ఎవరిని కూడ; సరకు కొనండు = లక్ష్యము చేయఁడు; పట్టుకొని = బలవంతముగా పట్టి; చాఁగఱ + కొన్నన్ = బాగుగా కొట్టినచో; బలే ఎఱుంగున్ = చక్కగా తెలిసికొనఁ గలఁడు; టక్కరి = మోసగాఁడు; ఉట్టి కట్టినన్ = (వంచనచే) అతిశయించినప్పుడు; బలుమోపు మోచు = ఆ అధికమైన మోసమును మోయునట్టి (అనఁగా, దానిని ఇతరులకు కాననీయక); నయగారితనంబు +అది = మృదుత్వ ప్రదర్శనమే, ఆజపచర్య.

తా. శిష్యులైన బోడితలలు గల, సన్న్యాసులు. నాలుగు దిక్కులందున్న వేర్వేఱు పల్లెలకు (ఒక్క ఊరును వదలక అన్నింటికి) పోయి, బిచ్చమెత్తి తెచ్చిన అన్నమును. తిండిగా పెట్టఁగా అట్లు శ్రమలేక ఉచితముగా లభించిన దానిని అమితముగా ఆరగించి, పెంచుకొన్న పెద్ద పొట్టతో లానొక ఊరికి అధికారి వలె ఎవరిని లక్ష్యము చేయుట లేదు. గట్టిగా పట్టుకొని, బాదినట్లైన తానెంతటివాఁడో ఎఱుఁగును. (అతని మోసము బయట పడును). మోసగాఁడు, తన వంచన మించినప్పుడు, ఇతరులు ఆ మోసమును గ్రహింపకుండుటకు దానిని కప్పిపుచ్చుటకై శ్రమపడి, పైకి ప్రకటించు మృదుత్వమే ఈ జపచర్య. జపము నెపముతో, తన టక్కరితనమును గోచరము కాకుండునట్లు చేయుచున్నాఁడనుట.

విశే. హంస డిభకులు తాము జపవృత్తిని అవలంబించి, శివుని మెప్పించి, వరములను పొందిన శైవాచార సంపన్నులు, మహర్షి అయిన దుర్వాసుని జపమును కృత్రిమ ప్రక్రియగా భావించుటచే, వారు అపరిపక్వమైన మేధా సంపత్తి గలిగిన భుజబలయుతులని గ్రహింపవలెను. అవివేకులైన వారు మహాత్ములను ధిక్కరించుటను చూడఁగా మృత్యువు నాహ్వానించుట యగును. వినాశకాలము ఆసన్నమయినపుడు, విపరీతమైన బుద్ధి కలుగును గదా!

వ్యా. నలుదిక్కులు : నాలుగు + దిక్కులు.

సూ. ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. ప్రకీర్ణ, బాల - 12. నలుగు + దిక్కులు

సూ. ఆచ్ఛిక సమాసంబులం దఱచుగ వర్ణలోప, ఆగమ ఆదేశ వికారంబులు, నిత్య వైకల్పికంబులుగా పెక్కులు కానంబడియెడి. సమాస, ప్రౌఢ - 36. నలు దిక్కులు.

గీ. బాంధవులఁ బాసి తమ యిల్లుపట్టు విడిచి
తల్లిదండ్రులు వగవఁ గైతవముతోడ
బోడతలలు గాఁ బడసిరి పొడువ లెల్ల
వీని మాటలచేఁ గదా వెఱ్ఱు లైరి. 47

ప్రతి: బాంధవులన్ + పాసి = తల్లి దండ్రులను, అన్నదమ్ములను, అప్ప చెల్లెండ్రను, మొదలగు బంధువులనెల్లరను వదలివేసి; తమ ఇల్లు పట్టువిడిచి = తమ యింటి యొక్క ఉనికిని (నివాసము) విడిచి వేసి; తల్లి దండ్రులు; వగవన్ = (కనిపెంచి పెద్ద చేసిన తల్లియు, తండ్రియును) శోకమును చెందు చుండఁగా; కైతవము తోడన్ = మోసముచే; పొడువలు + ఎల్లన్ = దుర్మార్గులు అందఱును; బోడ తలలుగా పడసిరి = తలపై నున్న వెండ్రుకలు తొలగించుకొని బోడియైన తలలు కలవారైరి; వీని మాటల చేన్ + కదా = ఇట్టి మాయ గాఁడైన దుర్వాసుని (తియ్యని) పలుకులచే కదా; వెఱ్ఱులు+ఐరి = (ఆశిష్యులు అందఱు) తెలివి లేనివారై పోయిరి.

తా. బంధు సమూహమును వదలి పెట్టి ఇంటి యొక్క ఉనికిని, ఆ భారమును, దూరము చేసికొని, తల్లి దండ్రులు, విలపించుచుండఁగా, దుర్మార్గులందఱును, ఆలోచనలేక, వివేకమును వీడి, వెండ్రుకలను తొలగించుకొని, బోడి తలలు కలవారైరి. ఈ టక్కరి యైన వాని మాయ మాటలచే, ఈ శిష్య నికాయమంతము వంచితులై వెఱ్ఱి వారైరి కదా!

విశే. ఆశ్రమములో నాల్గవది ముని వృత్తి. దానిని దిగ్విజయ కాంక్షగల మదోన్మత్తులు, ఉత్తమ పదాభిలాషిని గర్హించుటచ్చే వారి మత్తత పరాకాష్ఠ చెందిన దన వచ్చును.

చం. ఎఱుఁగరు గాక లోకమున నెవ్వరి కైనను మేలు సేయఁగా
నొఱపగు నాశ్రమంబున సమున్నత మైన గృహస్థధర్మముం
బఱగడ వైచి గోచిగొని పాఱెడు పొల్లకు ముక్తి గల్గునే
పఱిగల నేఱినం గొలుచు పాఁతటికిం గలవే తలంపఁగన్. 48

ప్రతి: (ఈ వంచకులైన సన్న్యాసులు) లోకమునన్; ఎవ్వరికి + ఐనన్ = ఎవరికైనను; మేలు చేయఁగాన్; ఎఱుఁగరు గాక = ఎఱుఁగరు కదా! ఒఱపు+అగు ఆశ్రమంబునన్= (నాల్గు ఆశ్రమములలో) మేలైన ఆశ్రమమందు, గొప్పదైన ఈ ఆశ్రమమునకు చెందిన; గృహస్థ ధర్మమున్ = కుటుంబ నియమములను; పఱగడ వైచి = ప్రక్కకు నెట్టి వేసి; గోచికొని = వస్త్ర

ధారణమును విడిచి, కేవలము, గోచి ముక్కను మాత్రమే పెట్టుకొని; పాఱెడు పొల్లకు = (సంసారమునుండి దూరముగా తొలఁగు) దుర్బలునకు, చేతగాని వానికి; ముక్తి కల్గునే! = మోక్షము లభించునా!; (సంసారమును రోయువాఁడు ముక్తికి అనర్హుఁడని భావము); పఱిగలన్ = పొలములో రాలిన ధాన్యమును; ఏఱినన్ = ఒక్కొక్కటిగా సేకరించి, ప్రోగు చేసినను; కొలుచు = ఆ గింజలు, ధాన్యమంతయు; ప్రాతటికిన్ + కలవే = భూమిలో పాతి పెట్టి, నిలువ చేయుటకు అవసరమైనంత పరిమాణము కలవి అగునా!; తలంపగన్.

తా. ఈ సన్న్యాసులు లోకమున ఎవ్వరికిని మేలు చేయఁజాలరు. నాల్గింటిలో గొప్పదైన ఆశ్రమమందుఁగల సంసార నియమములను వదలివేసి, వస్త్రహీనులై, గోచి మాత్రము ధరించి, పరుగిడి పోవు అసమర్థునకు మోక్షము చేకూరునా? రాలిన ధాన్యమునుఎంత శ్రమ పడి ఏఱినను అది, పాఁతఱలో పెట్టి నిలువ చేయుటకు అవసరమైనంత కాఁజాలదు. ఎంత కష్టించినను ఫల మల్పమనుట. సన్న్యాసముచే ముక్తి దుర్లభమని, కర్మలను వదలిన వారికి, అది సాధ్యము కాదనియు, సత్కర్మలను కావించు గృహస్థునకు ముక్తి సులభ సాధ్యమని హంస డిభకుల అభిప్రాయము.

అలం. అర్థాంతరన్యాసము.

వ. అని పలుకుచు నయ్యిరువురు నమ్మహాముని కి ట్లనిరి. 49

తా. పై విధముగా పలుకుచు ఆ ఇరువురును ఆ మహామునికి ఇట్లు చెప్పిరి.

వ్యా. అయ్యిరువురు : ఆ + ఇరువురు. త్రిక సమాసంధి (చూడుము 7,15 పద్యములు)

సీ. [1]అలకువ యెఱుకతో నాశ్రమం బిది మెచ్చి
తిదిగాక గృహమేధ మేల యొల్ల
వేపదంబునఁ బొందె దిందు మూఢుండవ
కాక సంసారసౌఖ్యంబు మాని
కఱపె ది ట్లున్న కొందఱకు నారక పాత
శీలంబుఁ దగునె తాఁ జెడ్డవాఁడు
వెనకయ్య చేతికి వెస లిచ్చె నసుమాట
నిజముగా నిచ్చోట నిన్ను వంప

1. అఱుకువ

గీ. నొరులు లే రని తలఁ తేని నున్న వార
మేము గృహివి గాఁ బంచయజ్ఞేచ్ఛఁ గలిగి
నాకసుఖ మొందు మిపుడు ప్రాణాన నుండ
దలఁచె దేని నావుడు జనార్దనుఁడు గలఁగి. 50

ప్రతి: అలకువ ఎఱుకతోన్ = తక్కువ తెలివితో; ఆశ్రమంబు + ఇది = ఈ సన్న్యాసము అనెడి ఆశ్రమమును; మెచ్చితి = మెచ్చితివి, ఇష్టపడితివి; ఇదిగాక = దీనిని విడిచి; గృహమేధము = కుటుంబము అనెడి యజ్ఞమును, గృహస్థ ధర్మమును; ఏల+ఒల్లవు? = ఏ కారణముచే, ఇష్టపడవు?; ఇందు = ఈ సన్న్యాసమందు, (నీరసమైన వైరాగ్యముతో నిండిన దీని యందు, నిస్సంగుఁడవై); ఏ పదంబునన్ = ఏ స్థానమును; పొందెదు? = పొందఁగలవు? (సుఖములు లభింపవనుట); మూఢుండవ కాక! = నీవు తప్పక తెలివిలేని వాఁడవే! సంసార సౌఖ్యంబు మాని = కుటుంబములో పొందు, సుఖ సంతోషాదులను వదలి; ఇట్లు + ఉన్న కొందఱకు = నీవలె సంసారమును వదలిన అందఱికి; తాన్ చెడ్డవాఁడు; ఆర్థికముగా హీన స్థితిలో నున్న వాఁడు; వెనకయ్య చేతికి = వినాయకునకు; వెసలు = ఏమియు లేని కుండలను (పండుగనాఁడు, పిండి వంటలను నైవేద్యముగా సమర్పింపక, ఉత్తకుండలను ఇచ్చుట) ఇచ్చెను అనునట్టి సామెత, ఉక్తి; నిజముగాన్ = నిజమగునట్లు, నారక పాత శీలంబున్ = నరక మను భవించునట్టి గుణమును, (యమలోకములో పడి నరక ప్రాప్తి అనెడి దుఃఖమును పొందు గుణమును); కఱపెదు = నేర్పుచున్నావు; తగునె? = ఇది సరియైనదా? ఈ +చోటన్ నిన్ను వంపన్ + ఒరులు లేరు + అని తలఁతు+ఏనిన్ = నిన్ను సవరించుటకు (శిక్షించుటకు) ఇతరులు లేరని భావించినచో; ఉన్న వారము + ఏము; ఇపుడు ప్రాణానన్+ ఉండన్ +తలఁచెదు + ఏనిన్; గృహివిగాన్ = పెండ్లి చేసికొని, గృహస్థుఁడవై; పంచయజ్ఞ+ ఇచ్ఛన్ = ఐదు విధములైన సత్కర్మలను, చేయు కోరికతో; నాక సుఖము + ఒందుము = స్వర్గలోక మందలి సుఖములను అనుభవింపుము; నావుడున్ = అనఁగా; జనార్దనుఁడు; కలఁగి = మిక్కిలి వెత చెందిన వాఁడై. పాఠాం. అఱుకువ = అపక్వము, అల్పము.

తా. తక్కువ తెలివితో, ఈ యత్యాశ్రమమును మెచ్చితివి. దీనిని విడిచి గృహస్థాశ్రమమును ఏల అంగీకరింపవు? ఈ సన్న్యాసముచే ఏ సుఖ స్థానమును పొందఁగలవు? నీవు, తెలివి లేని వాఁడవగుట చేతనే, చక్కని సంసార జీవితమును విడిచి, నీవలె అల్పమైన జ్ఞానులకు, 'తాను చెడినవాఁడు, గణపతిదేవునకు, రిక్తమైన కుండలను నైవేద్యముగా నిచ్చెను' అను నీతి వాక్యము నిజమగునట్లు, నరకలోక దుఃఖమును పొందు గుణమును నేర్పుచున్నావు. ఇది సరియైనదా? ఇచట నిన్ను శిక్షించుటకు ఎవరును లేరని

తలఁచినచో, అది పొరబాటు. మేము ఉన్నాము. నీవు నీ ప్రాణాలను కాపాడు కొనఁదలఁచి నట్లయిన, పెండ్లి చేసికొని, పంచ యాగములందు కోరిక కలవాఁడవై స్వర్గలోక సుఖములను పొందుము" అని దుర్వాసునితో చెప్పఁగా జనార్దనుఁడు మిక్కిలి వ్యధ చెందినవాఁడై (మీఁది పద్యముతో అన్వయము).

విశే : హంసడిభకులు క్షత్రియులు ,రజోగుణప్రధానులు. ఉత్కృష్టమైన పరమ పదప్రాప్తి యెడ వారి చిత్తము అల్పాల్పము.

పంచయజ్ఞములు :

1. దేవయజ్ఞము : దీనికి వైశ్యదేవమని పేరు. విశ్వదేవతలను ఆరాధించు హోమాదిక మైన పూజలు.

2. పితృయజ్ఞము : పర్వదినములందు పితృ పితామహాదులను స్మరించుచు వారిని తృప్తి పఱచుటకు చేయు తర్పణము మొదలైనవి.

3. భూతయజ్ఞము : ప్రపంచము, పంచ భూతాత్మకము. వానికి ఆహారము, నైవేద్యముగా నిచ్చుట, బలి అనఁబడును. ఇదియే భూతయజ్ఞము.

4. బ్రహ్మయజ్ఞము : వేదమును క్రమము తప్పక పఠించుట, శిష్యాదికముచే, పఠింపఁజేయుట:

5. మనుష్యయజ్ఞము : గృహస్థులకు అతి ముఖ్యమైనది. పెళ్లి చేసికొని పురుషార్థములకై నిత్య నైమిత్తిక విశేషకర్మలను ఆచరించుచు అతిథి అభ్యాగతులను అర్ఘ్య పాద్యాదులతో అర్చించుట.

వ్యా. 'పొందెదు, కఱపెదు, తలఁతు తలఁచెదు, పొందెదవు, కఱపెదవు, తలతువు తలఁచెదవు' అను ఈ పదములలో, వకారములోపించినది.

సూ. లిట్ లాట్టుల వకారంబువకు లోపంబు. విభాషనగు. క్రియ, బాల - 24.

కం. భాస్కర నిభుఁ డగు మునికి న
మస్కారము చేసి నృపకుమారులతోఁ దే
జస్కరము లగునె మాన్యా
వస్కంద శ్రుతికఠోరవచనము లనుచున్. 51

ప్రతి: (జనార్దనుఁడు) భాస్కర నిభుఁడు+అగు = సూర్యునితో సమానమైన తేజస్సుగల; మునికి; నమస్కారము చేసి; నృపకుమారులతోన్= హంసడిభకులతో; మాన్య+అవస్కంద శ్రుతి కఠోర వచనములు = గౌరవింపఁ దగిన వారిని, అవమానించెడి, చెవులకు కటువైన పలుకులు; తేజ స్కరములు + అగునె! = పరాక్రమమును పెంచునా!; అనుచున్;

తా. (జనార్దనుఁడు) సూర్యునితో సాటియగు దుర్వాసునకు నమస్కరించి, రాజకుమారులతో, "గౌరవనీయులను అవమానించెడి, చెవులకు వినరాని మాటలు మీ పరాక్రమమును పెంచునా?" అనుచు (మీఁది పద్యముతో అన్వయము). మాన్యులను నిందించుట ఉచితచర్య కాదని హెచ్చరిక.

కం. న్యాయము దప్పకుఁడీ పురు
షాయుషజీవికయుఁ గోర్కి యాచారము ని
శ్శ్రేయస సిద్ధియుఁ జెడు యతి
నాయక దూషణము చేసిన్ మనుజులకున్. 52

ప్రతి: న్యాయము = ధర్మము; తప్పకుఁడీ = తప్పరాదు సుమా! పురుషాయుష జీవికయు = జీవాత్మకూడిన బ్రతుకు తెరువు (మానవ జీవితము); కోర్కి = కోరికలు (సంతానము, గౌరవము కీర్తి, లాభము మొదలగు సుఖములు); ఆచారము = వేదములు విధించిన నడత (విధ్యుక్త కర్మలు); నిశ్శ్రేయస సిద్ధియున్ = మోక్ష ప్రాప్తియును, యతి నాయక దూషణము చేసినన్; చెడున్.

తా. ధర్మమార్గమును తప్ప రాదు సుమా! మానవ జీవితము, ఇహపరలోక సుఖములు, మోక్షప్రాప్తి సర్వమును యతివరులను నిందించినచో నాశమగును.

శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారి గృహి వానప్రస్థ యత్యాశ్రమం
బు ల్కైవల్య వివక్షు లు త్తమపదంబుం జేరువా రిట్టి వీ
ర ల్కోపించిన నంతకుండుఁ జెడు మీరా యోర్చువా రిమ్మెయిన్
మే ల్గీ డాడక వీరిఁ జేరి మనుఁడీ మీమీ శుభప్రా ప్తికిన్. 53

ప్రతి : బ్రహ్మచారి, గృహి, వాన ప్రస్థ యతి + ఆశ్రమంబులు = బ్రహ్మచర్యము, గృహస్థము వానప్రస్థము, సన్న్యాసము అనెడి పెద్దలు ఏర్పాటు చేసిన జీవితపద్ధతులు; నాల్గున్ + చెల్లెడిన్ = నాలుగును ప్రసిద్ధములై ఉన్నవి. కైవల్య వివక్షులు = మోక్షమును కోరువారు; ఉత్తమ పదంబున్ చేరువారు = అతి శ్రేష్ఠమైన స్థానమునే చేరెదరు; ఇట్టి వీరల్ + కోపించిన = ఈ

విధమైన సదాచార సంపన్నులు కోపము చెందినచో; అంతకుండున్ = సర్వమును లయము చేయఁగల యముఁడే; చెడున్ = అంతమగును; మీరా! ఓర్చువారు = మీ వంటి దుర్బలులు ఆ దుర్వాసుని కోపమును సహింపఁగలరా? (నిందతో కూడిన ఆక్షేపము); ఈ మెయిన్ = ఇట్లు; మేల్ కీడు + ఆడక = ఆశ్రమముల యొక్క మంచి చెడ్డలను గూర్చి ప్రలాపములు చేయక; వీరిన్ = ఈ ఉత్తమ మార్గమును అవలంబించు వారిని; చేరి = ఆశ్రయించి (ఆశీస్సులను కోరి) మీమీ ప్రాప్తికిన్ = మీ యొక్క శుభ పరంపరల కొఱకై; మనుఁడీ = జీవింపుఁడు.

తా. బ్రహ్మచర్యాది నాల్గు ఆశ్రమములు ప్రసిద్ధములు. మోక్షమును కోరు యతులు. ఉత్తమస్థానమునే చేరుదురు. (ఇందు సందేహములేదు). వీరిని నిందించిన యముఁడే చెడును. కనుక మీ వంటి దుర్బలులు దూషించినచో ఆతని కోపమును సహింపలేరు. ఆశ్రమముల మంచి చెడ్డల పరిశీలనకు ప్రయత్నింపక మీమీ భవిష్యత్ సుఖములను ఆశించి, యతీశ్వరులను ఆశ్రయించి, వారి ఆశీస్సులను అందుకొని. మీమీ జీవితమును రక్షించుకొనుఁడు. (లేనిచో నాశము తప్పదని సూచన).

వ్యా. వీరల్గోపించిన: వీరల్ + కోపించిన, 'వీరల్' తెలుగు పదము. కోపించిన, సంస్కృతసమము. సూ. తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు 'గసడదవ'లు రావు. సంధి, బాల - 14. కనుక, 'కోపించిన' లో, గాదేశము, నిషేధము. సోమన ప్రాసస్థానములో 'గ' కారమవసరమై ఈ ఆదేశమును కావించెను. మహాకవి కావించిన ఈ ప్రయోగమును ప్రౌఢ వ్యాకర్త సమర్థించిరి. సూ. కొన్ని యెడలఁ దెనుఁగుల మీఁది సాంస్కృతిక 'కతప' లకు 'గదవ'లు గానంబడియెడి. సంధి, ప్రౌఢ - 5.

గీ. చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము
దానఁ గీ డెంత పుట్టినఁ దగిలె నాకు
ననుభవింపక పోవునే యక్కటకట
వరుగుతో దాఁగరయు నెండ వలసినట్టు. 54

ప్రతి: చెలిమి, మీతోడ చేయుట; చెడ్డతనము = చెడ్డపని; దానన్ = చెడ్డవారితో స్నేహము చేయుటచే; కీడు+ఎంత పుట్టినన్ = చెఱుపు ఎంత కలుఁగునో; నాకు; తగిలెన్ = (అంతయు) కలిఁగినది; అక్కట + అకట = అయ్యో!(ఇదెంత విచారకరమో!); వరుగుతో =నిలువ యుంచుటకై పెట్టినట్టి వరుగుతో; దాఁగరయున్ = వరుగు కల పాత్రయును; వాడవలసినట్లు; అనుభవింపక పోవునే! = చెడ్డ వారితో చెలిమి వలన కలిఁగిన పాపఫలమును (శిక్షను) పొందవలసినదే కదా!.

తా. మీతో చెలిమి చేయుటయే దోషము. ఆ కారణముగా, కలుఁగ వలసిన కీడంతయు నాకు చేరినది. అక్కటా! ఇదెంతయు చింతింపఁదగినది. దుర్జనుల సాంగత్యముచే, వరుగుతో కూడ పాత్ర మాఁడునట్లు నేనును పాపఫల మనుభవింపవలసినదే!

దుర్జనులతో చెలిమి దుష్ఫలముల నిచ్చునని జనార్దనుఁడు వ్యథ చెందెను.

చం. గురువులు చెప్పరే చదువుఁ గొంతవివేకము మిమ్ముఁ జేరదే!
తెరువునఁ బోక నేఁ డిది మదీయ మనోవ్యథఁ జేసెఁ బిమ్మటన్
హరుఁ డుపదేశ మిచ్చినది యంతయుఁ గాలబలంబునన్ మహా
పురుషుల కెగ్గు సేయఁదలపోయఁగఁ బాయమె! పోయెఁబాపమై. 55

ప్రతి: గురువులు; చదువు; చెప్పరే! = చెప్పిరికదా!; కొంత వివేకము, మిమ్మున్ + చేరదే! = కొంతవఱకు, తెలివి తేటలు, మీరే స్వయముగా పొందలేదా!; తెరువునన్ + పోక = సరియైన త్రోవలో పోవుట మాని; నేఁడు; ఇది = ఇట్టి నడవడిక; మదీయ = నా యొక్క మనో వ్యథన్ = మనస్సునకు తీవ్రమైన వేదనను; చేసెను = కలిగించినది; పిమ్మటన్ = (అది అట్లుండగా అంతమాత్రమే కాదు), ఆవల; హరుఁడు; ఉపదేశము + ఇచ్చినది + అంతయున్ = తపముచే పొందిన వరలాభమంతయును; కాలబలంబునన్ = చెడ్డ కాలమువచ్చుటచే; మహాపురుషులకు = గొప్ప పుణ్యులైన మునులకు; ఎగ్గు చేయన్ = కీడు చేయుటకు; తల పోయఁగన్ = తలంచుటచే; పాయమె! = పోగొట్టు కొనమా!; పాపమై పోయెన్ = (అంతయు) పాపమయమైనది కదా! (తలఁపు, పలుకు, చేఁత అంతయు, పాపముతో నిండిపోయెను కదా);

తా. ఆచార్యులు చదువు చెప్పినారు. కొంత స్వయముగా మీరు తెలివి తేటలను పొందినారు. మీరు సన్మార్గమున పోకుండుట నా మనస్సునకు తీవ్రమైన వెతను, కలిగించినది. అది అట్లుండగా, ఆవల హరుఁడు ఉపదేశించిన వరలాభమంతయు మీ దుష్కాలము యొక్క ప్రభావమై మీరు గొప్ప వారికి కీడు చేయుటకు తలపెట్టఁగా, వ్యర్థమైనది. సర్వము పాపమయ మైనది.

తపస్సుచే ఆర్జించిన, శివ శక్తి అంతయు నిరుపయోగమైనదని, వారి తలఁపు,పలుకు, చేఁతల యొక్క పాపఫల మను భవింపక తప్పదని జనార్దనుఁడు విశదపఱచెను.

గీ. పాయఁ దగు మిమ్ముఁ గనుమారిఁ బడఁ బొసంగు
విషము ద్రావుట యోగ్యంబు వెల్లిలోన

మునుఁగు టుచితంబు మీ రెల్లఁ గనుఁగొనంగ
నాత్మ విడుచుట చను నాకు ననుచు నడలి. 56

ప్రతి : మిమ్మున్; పాయన్ తగున్ = వీడుట మంచిపని అగును; కనుమారిన్ పడన్ పొసంగున్ = (మీ దుష్కార్యములు చూడకుండుటకై) నేత్ర రోగమును పొంది గ్రుడ్డి వాడగుట, ఒప్పును; మీరు + ఎల్లన్ = మీరు అందఱును; కనుకొనంగన్ = చూచు చుండఁగా; (మీ ఎదుటనే), విషము త్రావుట; యోగ్యంబు = తగినపని; (అది కాదేని) వెల్లిలోన = వెల్లువలో; మునుగుట = (దుమికి) మునిగి పోవుట; ఉచితంబు = మంచిది; (ఇట్లు) ఆత్మ = ప్రాణమును; విడుచుట చను = వీడుటయే తగును కదా!;అనుచున్; అడలి = చింత చెందిరి.

తా. మిమ్ము వెంటనే వీడుట మంచి పని. నేత్ర రోగమును పొందుట ఒప్పును. లేదా, మీరందఱును చూచుచుండఁగా, మీ ఎదుటనే, విషపానము చేయుట తగినది; కాదేని వెల్లువలో దుమికి మునిగిపోవుట మేలు. ఈ రెండింటిలో ఏదో విధముగా, నా ప్రాణమును వీడుట తగును కదా! అనుచు చింత చెందిన వాఁడై.

కం. అలవడునే రాజులకుం
దులువతనము వినుము యతులతో నతులమతుల్
గలుషించుట చిత్తము నోఁ
బలుకుట బాంధవులుఁ దారు బ్రదుకుతలంపే. 57

ప్రతి: రాజులకున్ = (ధర్మ రక్షకులైన) రాజ్య పాలకులైన వారికి; తులువ తనము = చెడ్డ పనులు చేయు స్వభావము; అలవడునే! = ఉండునా?; వినుము = (శ్రద్ధగా) వినుము; అతులముమల్ యతులతో = గణించుటకు (స్తుతించుటకు అతీతమైన) వీలుకాని, గొప్పమనస్సులు కల తాపసులతో; కలుషించుట = కలహించి, కీడు చేయుటయును; చిత్తము నోన్ + పలుకుట = మనస్సులకు బాధ కలుగునటుల, పరుషవచనములను ప్రయోగించుటయు, బాంధవులున్ + తారు = బంధువులును తామును, బ్రదుకు తలంపే! = (ఇట్లు పాపము చేసి) బ్రదుకుటకు తగిన ఆలోచనయా ఇది?

తా. ధర్మ రక్షకులైన రాజులు. ధర్మభక్షకులు కారాదు; దుష్కార్యములు వర్జింపవలయును. శ్రద్ధగా వినుము, గణనకు అతీతమైన చిత్తములు కల మునులతో కలహించి వారికి కీడు చేయుట, వారి మనస్సులకు బాధ కలుగునట్లు పరుషములు పలుకుట, బంధువులును తామును బ్రదుకుటకు కోరిక గల ఆలోచనయా?

విశే. జనార్దనుఁడు, మహాత్ములైన యతులకు కీడు చేయుట నొప్పించుట కావించినచో, అట్లు చేసినవారు, తామే గాక, తమ బంధువర్గ మంతయు నాశమగుటకు కారకులగుదురని కుమతులైన రాజకుమారులను హెచ్చరించెను.

వ. అనుచుండ నమ్మునీంద్రుండు. 58

తా. పై విధముగా జనార్దనుఁడు, రాజకుమారులకు ప్రభుధర్మమును తేఁట పఱచు చుండఁగా, ఆ యతి వరుఁడు దుర్వాసోముని.

కం. కరుణయుఁ గోపముఁ గనుఁగవ
నొరయఁగ నొకచంటఁ బాలు నొకచంటను నె
త్తురుఁ గురియుగతి జనార్దను
ధరణీశ సుతద్వయంబుఁ దప్పక చూచెన్. 59

తా: కన్నుల జంటలో ఒక కంటి యందు దయ, మఱొక కంటి యందు కోపము ఉత్పన్నమగు చుండఁగా, ఒక దానిచే పాలను మరొక దానిచే రక్తమును వర్షించు విధమున క్రమముగా జనార్దనుని (కరుణతో), ఇర్వురు రాకుమారులను (కోపముతో) నిశ్చలముగాఁ జూచెను.

పాఠాం: చంటఁబాలు నొకచంటను నెత్తురు.

వ్యా. కనుఁగవ : కన్ను+కవ, సూ. సమాసంబుల ఉదంత స్త్రీ సమంబులకు..." సంధి, బాల -25 చే నుగాగమము వచ్చును.

సూ. సంధి, బాల - 16, 17 చేద్రుతకార్యము. కన్నుఁగవ లేదా కన్నుంగవ. 'కన్ను' పదములో నకార ద్విత్వలోపము. ప్రకీర్ణ, బాల - 7 చే, షష్ఠీ విభక్తి ప్రత్యయ లోపము సమాస, బాల -25 సూ. చే, కలిగినది.

అలం : ఉపమ.

గీ. చూచి యి ట్లను భూపాలసుతులతోడ
నన్నుఁ గనలించి బ్రదుకఁ గన్నారు లేరు
పొలిసితిరి పొలిసితిరి వే పొండు తొలఁగి
మిమ్ము దరికొనుకోపంబు మ్రింగికొంటి. 60

తా: దుర్వాసుఁడు రాజకుమారులతో ఇట్లనెను. "నాకు కోపము కలుగఁజేసి బ్రదుక తలఁచినవారు ఎవ్వరులేరు. మీరు మరణించితిరి, మరణించితిరి. (తప్పక చచ్చెదరనుట), వేగముగా దూరముగా పొండు మిమ్ము (ఇప్పుడే) కాల్చి వేయునట్టి కోపమును నాలోనే అణచుకొన్నాను.

వ్యా. కన్నారు: కన్న+వారు ఉన్న, కల, న వర్ణకంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు. క్రియ, బాల - 117. 'ఉన్న' వర్తమానార్థకము,'కల' భవిష్యదర్థకము. 'న', భూతార్థకము. వీని మీఁద నుండు తత్ శబ్దము యొక్క వకారమునకు లోపము వికల్పముగా నగును. కన్నారు లేదా కన్నవారు.

వ. అది యె ట్లనిన. 61

తా: మీకు చావెట్లు కలుగునో చెప్పెదను.

ఆ.వె. చక్ర ధరుఁడు బారి సమర నున్నాఁడు మి
మ్మింక వేఱె కోప మేల నాకు
తెలుఁగు మాలి తవుడు దిని చచ్చువానికి
విషము వెట్టువాఁడు వెట్టివాఁడు. 62

ప్రతి: చక్రధరుఁడు = చక్రమును ధరించిన వాఁడు, కృష్ణుఁడు; బారి = నిర్బంధముగ, (తప్పక); మిమ్ము = మీతో; సమర నున్నాఁడు = యుద్ధము చేయుటకు, సిద్ధముగ నున్నాఁడు. ఇంక వేఱె = వేఱుగా, విడిగా నాకు కోపము + ఏల? నేను, ఏల కోపము చెంది మిమ్ము శపించి నాశము చేయవలెను?; తెలుఁగు మాలి = తెలివి లేని వాఁడై; తవుడు (వడ్లు దంచగా వచ్చిన మెత్తని వడ్ల పొట్టు (ఇది పశువులకు తిండి); తిని, చచ్చువానికి, స్వయముగా, తవుడు తిని మరణింప పోవువానికి; విషము + పెట్టువాఁడు = అతని చంపుటకై, విషమును పెట్టువాఁడు; వెట్టివాఁడు = వివేకము లేని వాఁడు, తెలివి లేని వాఁడు;

తా: చక్రాయుధుఁడు కృష్ణుఁడు తప్పక, యుద్ధములో మిమ్ము వధింపఁగలఁడు. కనుక వేఱుగా ఏల నేను మీ యెడ కోపముచెంది, నాశము చేయుటకు ప్రయత్నింపవలెను? స్వయముగా తవుడు తిని చావనున్న వానికి విషమును పెట్టి చంపుటకు యత్నించువాడు, వెట్టివాఁడే!

విశే. మునులకు శాంతము క్షమ, ముఖ్య గుణములు. దుర్వాసుఁడు ఈ పట్టున,

హంస డిభకులు శివభక్తులగుటచే హరి సంహరింపనుండగా తన శాపాస్త్రమును వృథా చేయనేల అని ఉపశమించె నన వచ్చును.

అలం. అర్థాంతరన్యాసము.

కం. అనుచుఁ గదలి పో వచ్చిన
నసుమానము మాని హంసుఁ డమ్మునిఁ జే ప
ట్టినచంద మేమి చెప్పుదుఁ
బనికిన కాలోరగంబుఁ బట్టుట దోఁచెే. 63

అర్థ : పనికిన = కోపించిన; కాల+ఉరగంబున్ = నల్లత్రాచు పామును; పట్టుట = పట్టుకొన్నట్లు.

తా. అట్లు మందలించుచు, దుర్వాసుఁడు, వెడలి పోవుటకు ప్రయత్నింపఁగా హంసుఁడు, (దుష్టబుద్ధి అగుటచే, మునిని అవమానించుట తగదు అనెడి) అనుమానమును వీడి, మునిని చేత పట్టుకొనిన విధమును ఏమని చెప్పఁగలను? (వైశంపాయనుఁడు జనమేజయునితో చెప్పిన మాటలు ఇవి).

అదెట్లున్న దనఁగా కోపముతోనున్న నల్ల త్రాచును పట్టుకొన్నట్లున్నది.

విశే. కోపించిన త్రాచును పట్టుకొన్నచో అది కాటు వేయక మానదని ధ్వని.

అలం. ఉపమ.

వ. ఇట్లు పట్టికొని. 64

తా : సులభము

శా. తాను న్నిక్కమ పెద్దవాఁడు బలె నీతం డిత్తఱి న్నక్కఁ బ
గ్గానం బట్టిన యట్లు బిఱ్ఱ బిగియంగా నెంతసే పైన ని
చ్చో నుండెన్ సమకూడునే మనకు నంచుం జించె నమ్మౌని కో
పీనంబున్ నృపుఁ డా జనార్ద నుఁడు దప్పింపంగఁ గ్రౌర్యంబునన్. 65

ప్రతి: తానున్ = తాను (దుర్వాసుఁడు); నిక్కమ = నిజముగా, పెద్దవాఁడు; బలె = వలెన్; ఈ + తఱిన్ = ఈ సమయమందు (రాజులమైన మేము వచ్చినప్పుడు); నక్కన్ = నక్కను; పగ్గానన్ = మెడ త్రాటితో; పట్టినయట్లు = కట్టి బంధించి నట్లు; బిఱ్ఱ బిగియంగన్ = (బిగియు

+ బిగియు, బిఱ్ఱబిగియు); బాగుగా బిగిసి కొనఁగా; ఎంత సేపు + ఐనన్ = ఎంత కాలమైనను, చాల సేపు; ఈ+చోన్ = ఈచోట; ఉండన్ = ఉండుటకు, మనకు; సమకూరునే! = వీలగునా!; అంచున్; ఆ + మౌని; కౌపీనంబున్ = గోఁచిని; నృపుడు = రాజు (హంసుఁడు); జనార్దనుఁడు తప్పింపంగన్ = అడ్డు పడుచుండఁగా; క్రౌర్యంబునన్ = క్రోధముతో; చించెన్ = లాగి చించి వేసెను.

తా. (ఈతఁడు) "తాను నిజముగా పెద్ద వాఁడుగా భావించి, మెడకు పగ్గమును కట్టిన నక్కవలె, బిగిసి కొని పోవుచు మా మాటలను వినక పోవుటయే గాక గర్వముచే మండి పడుచు మమ్ము దూషించు చున్నాఁడు. ఈతఁడు ఇట్లు బిరుసుతో రెచ్చిపోవుచుండగా ఎంత కాలమైనను ఇచ్చట మనకు ఉండుటకు సాధ్యమా?" అనుచు హంసుఁడు ఆ దుర్వాసుని యొక్క గోఁచిని, మిత్రుఁడు జనార్దనుఁడు అడ్డుపడు చుండఁగా క్రోధముతో లాగి చించి వేసెను.

వ్యా. బిగియు+బిగియు, ఆమ్రేడిత సంధి. (చూడుము, పద్యము - 9)

అలం. ఉపమ

ఆ.వె. కలఁగి కన్నవారు కన్న ది క్కునఁ బాఱి
పోయి రెల్లయతులు పొంగు మిగిలి
కినుక యడర సన్న గిల్లిన యెలుఁగుతో
నమ్మునీంద్రుఁ డిట్టు లనియె మఱియు. 66

ప్రతి: ఎల్లయతులు; కన్నవారు = (హంసుని చర్యను చూచినవారు); కలఁగి = కలఁత చెంది; కన్న దిక్కునన్ = కన్పట్టిన దిశలో పాఱి పోయిరి; ఆ + మునీంద్రుఁడు; పొందు మిగిలి = నిలుకడ లేక, కినుక అడర = కోపముఎక్కువకాఁగా; సన్న గిల్లిన ఎలుఁగుతో = మందమైన గొంతుతో (స్వరముతో); మఱియు; (వారలతో) ఇట్టులు + అనియెన్.

తా. యతులందఱు, హంసుని విపరీతమైన దుశ్చర్యనుచూచిన వారు తమకు కన్పట్టిన దిక్కున, ఏమియు తోఁచక, వెంటనే పాఱిపోయిరి. ఆ అవమానమునకు, దుర్వాసుఁడు నిలుకడ తప్పిన వాఁడై, కోపము అతిశయింపఁగా సన్నగిల్లిన గొంతుతో (గద్గద స్వరముతో ఆ రాజకుమారులతో) ఇట్లు చెప్పెను.

సీ. చేయఁ దగని కీ డెల్లఁ జేసితిరి మీరు
చెఱుప నోపుదు శాపంబుచేత మిమ్ము

నయిన యతి నైన నాకేల యాగ్రహంబు
దానవాంతకుఁ డిటమీఁదఁ దాన చెఱుచు. 67

తా: మీరు చేయదగని కీడంతయు చేసితిరి. మిమ్ము శపించి, నాశము చేయఁగలను. యతి నయిన నేను కోపమును చూపరాదు. కనుక ఇఁక మీఁద మీ పాపములకు గాను, ఆ కృష్ణుఁడు మిమ్ము శిక్షించును.

మ. సకలోద్యోగకృతానుబంధుఁడు జరాసంధుండు బంధుండు మీ
కకలంకుం డతఁ డాశ్రమస్థులను నౌదాసీన్యముం జేయఁ డూ
రక పాయంగలవాఁడు నేఁడు మిము దుర్వ్యాపారులం జూచి కొం
కక మీకింకిరికిం జెలంగినఁ దొలంగం బాఱుఁ దద్ధర్మముల్. 68

ప్రతి: జరాసంధుండు; సకల+ఉద్యోగ+కృత+అనుబంధుఁ డు + సమస్తమైన. సత్కర్మలతో, సన్నిహిత సంబంధము కలవాఁడు (అన్ని పుణ్యకార్యముల యెడ శ్రద్ధ కలవాఁడనుట); మీకు బంధుండు; అకలంకుండు = దోషము లేని వాఁడు; అతఁడు; ఆశ్రమస్థులను = మున్యాశ్రమములో నివసించువారిని; ఔదాసీన్యమున్ + చేయఁడు = అనాదరభావముతో చూడఁడు; నేఁడు; మిము; దుర్వ్యాపారులన్ = దుష్టకార్యములలో ప్రవర్తించు వారిని; చూచి; ఊరక = మీకు తోడ్పడక; పాయన్ + కలవాఁడు = తొలఁగి పోవును; కొంకక = సంకోచములేక మీ కింకిరికిన్ = మీ యొక్క నీచ కార్యము లందు; చెలంగినన్ = వర్తించినచో, తద్ + ధర్మముల్ = యత్యాశ్రమధర్మములు, క్రతుకార్యములు మొదలైనవి; తొలంగఁ బాఱున్ = పవిత్ర కర్మానుష్ఠానము) స్తంభించి పోవును, నిలిచిపోవును.

తా. సమస్తమైన పుణ్యకార్యములను చేయుటలో నిమగ్నుఁడు జరాసంధుఁడు,మీకు చుట్టము. ఆతడు దోషము లేనివాఁడు. ఆశ్రమ వాసులైన మునుల యెడ మర్యాద కలవాడు. చెడ్డపనులు చేయునట్టి మిమ్ము చూచి, అసహ్యించుకొని దూరముగా తొలఁగును. మీరు సంకోచములేక దుశ్చేష్టలను కావించినచో యతుల ఆశ్రమ కార్యములన్నింటికి అంతరాయము కలుఁగును.

విశే. మోక్షపద మాశించువారికి హాని చేయరాదనియు, జరాసంధుని వలె ఆశ్రమవాసులైన యతులను ఆదరించుచు ప్రవర్తింప వలయుననియు సూచించెను.

కం. 'పో పో' మ్మని పలుమాఱుం
గోపమ్మున హంసుఁ బలికి కొనియాడుటయుం

జేపట్టుట మెఱయఁ గృపా
నూపాపాంగుఁడు జనార్దనుని దీవించెన్. 69

ప్రతి: (దుర్వాసోముని) 'పోపొమ్ము'+అని, పలుమాఱున్ + కోపమ్మునన్; హంసున్ + పలికి; కొనియాడుటయున్ = ఆదరించుటయును; చేపట్టుట = అనుగ్రహించుటయు మెఱయన్ = బయలు పఱచుచు; కృపా + అనూప + అపాంగుఁడు = దయయనెడి సరస్సు నుండి కడగంటి చూపులు గలవాఁడు (దయతో నిండిన చూపులతో); జనార్దనుని దీవించెన్. (అనూపము అనఁగా, నీళ్లు తఱచుఁగా గల ప్రదేశము).

తా: దుర్వాసుఁడు హంసుని "దూరముగా తొలఁగిపో" అని పలుసారులు, కోపముతో గద్దించి పలికి, తనయొక్క కృపయనెడి సరస్సునుండి వెల్వడు ఆర్ద్రమైన కడగంటి చూపులతో, ఆదరించుటయు అనుగ్రహించుటయు ప్రకటము కాగా జనార్దనునికి దీవెనల నిచ్చెను.

కం. శ్రీవల్లభుతో సంగతి
గావుత నేఁడెల్లి నీకుఁ గలుగు సుజన సం
భావితలోకద్వయసుఖ
మీవృత్తాంతంబుఁ జెప్పు మీ జకునకున్. 70

ప్రతి: నీకు; నేఁడు + ఎల్లి = ఈ దినమో, రేపో; శ్రీ వల్లభుతోన్ = లక్ష్మీపతితో, శ్రీ కృష్ణునితో; సంగతి = కలయిక, చేరిక; కావుతన్! = అగుగాక!; (మఱియు) సుజన సంభావిత లోక ద్వయ సుఖము = సజ్జనులచే ఆశింపఁబడు రెండు లోకముల సుఖము; కలుఁగున్; మీ జనకునకున్ = మీ తండ్రి, మిత్రసహునకు; ఈ వృత్తాంతంబున్ = ఈ నా ఆశీర్వాద విషయమును; చెప్పు = తెలియఁ జేయుమా!

తా: నీకు నేఁడో రేపో, లక్ష్మీపతితో, కలయిక కలుగును గాక! సజ్జనులు వాంఛించు ఇహపరలోక సుఖములు రెండును నీకు సమకూరఁగలవు. మీ తండ్రి మిత్ర సహునకు, ఈ నా ఆశీర్వాద విషయమును, చెప్పుమా!

విశే : "శ్రీ వల్లభుతో" అనుటచే సర్వ సంపదలు లభ్యమగును అను ఆశీస్సు ర్భితమై యున్నది.

అలం. కావ్యలింగము.

చం. అనువెడఁ గ్రమ్మఱం గినిసి హంసుఁడు నాడిభకుండుఁ దోడి దు
ర్మనుజులఁ గూడి దండముఁ గమండలముం బిదలంబుఁ జిక్కమున్
మునుకొని వెండియున్ యతుల ముంపగు సొమ్ములు గాల్చి క్రొవ్వునన్
గనుకుటు [1]లయ్యెడం జవులుగా గొనిపోయిరి వేడ్కనూరికిన్. 71

ప్రతి: అను+ఎడన్ = అనుచుండఁగా; క్రమ్మఱన్ = మరల; హంసుఁడున్; కినిసి = కోపించి; ఆ డిభకుండున్; తోడి దుర్మనుజులన్ కూడి; దండమున్ = యోగ దండమును; కమండలమున్ = కమండలమును; పిటకంబున్ = చిన్న బుట్టను; చిక్కమున్ = సంచిని; మునుకొని = మొదలైన వానిని; వెండియున్ = మఱియును; యతుల; ముంపు+ అగు = ప్రోగులుగా నున్న; సొమ్ములు = పరికరములు (జపమాలలు చర్మాసనములు గోధనములు); కాల్చి; క్రొవ్వునన్ = మదముతో; కనుకుటులు = ఓర్వ లేని తనమును; వేడ్కన్; ఊరికిన్; ఆ + ఎడన్ = ఆ సమయమందు; చవులుగాన్ = ఇంపుఁగా, ప్రియముగా; కొనిపోయిరి.

వ్యా. అయ్యెడన్ : ఆ + ఎడన్. త్రిక సమాస సంధి (చూడుము, పద్యములు - 7, 15)

తా. అని దుర్వాసుఁడు వచింపఁగా మరల కోపించి ఆ డిభకుఁడును తనతోనున్న దుర్జనులతో కూడ, యతుల యొక్క యోగ దండము కమండలము చిన్న (వెదురు) బుట్ట సంచి ప్రోగులుగా నున్న జపమాలలు చర్మాసనములు, గోధనములు దహించి, మదముతో, వారియెడఁగల ఓర్వలేని తనమును ప్రదర్శించి ఉత్సాహముతో, తమ ఊరికి ఆ పాపమునే ప్రియముగా సంపాదించు కొని పోయిరి.

"పిదలము" అను రూపము కానరాదు, పిటకము కానోవును.

వ్యా. అయ్యెడన్ : ఆ + ఎడన్. త్రిక సమాస సంధి (చూడుము, పద్యములు - 7, 15)

కం. వారివెనుక నంతంతం
జేరి జనార్దనుఁడు వోయెఁ జెడి రకటకటా
వీ రనుచు విధివినోదము
వారింపఁగ మనుజకోటి వశమే యనుచున్. 72

ప్రతి: జనార్దనుఁడు; వారి వెనుకన్; అంతంతన్ = ఇంచుక దూరమున; చేరి; "అకటకటా! = అయ్యో పాపము!; వీరు చెడిపోయిరి కదా! విధి వినోదము = విధి (దైవము) యొక్క లీల, (వింతలు): మనుజకోటికిన్ = మనుజుల సమూహమునకు, వారింపఁగ = నిరోధించుటకు వశమే = సాధ్యమా!" అనుచున్; పోయెన్.

1. లయ్యెడఁజవుల్

తా. జనార్దనుఁడు, రాజ కుమారుల వెంబడి, ఇంచుకంత దూరమున చేరి, "అయ్యయ్యో! వీరు చెడిపోయిరి కదా! విధి యొక్క వింతలు, మనుజులకు నిరోధించుటకు సాధ్యమా" అనుచున్, వారితో వెడలి పోయెను.

వ. ఇట్లు పోయిన యనంతరంబ. 73

తా. ఈ విధముగా రాజ కుమారులు మునుల కెల్ల తీవ్రమైన మనఃక్లేశమును కలిగించి తమ నగరమునకు చనిన పిమ్మట.

శా. దుర్వారోద్గమ రోషపోషణము లై ధూ ర్తప్రలాపంబు లం
తర్విద్యామహిమం గలంప యతు లంతం జేర నేతేర నీ
నిర్వేదం బుడిగింప నచ్యుతుఁడ పో నిర్వాహకుం డంచు నా
దుర్వాసో మునిపుంగవుండు గదలెన్ దుఃఖాకులస్వాంతుఁడై. 74

ప్రతి: దుర్వార = వారించుటకు వీలుకాని; ఉద్గమ = పైకి ఉబుకుచున్న; రోష పోషణములై = క్రోధమును పెంచుచున్నవై; ధూర్త ప్రలాపంబులు = ఆ దుర్జనుల పోటు మాటలు; అంతర్ +విద్యామహిమన్ = అంతరంగమందు, జ్ఞాన యోగముచే పొందు సమాధి స్థితిని; కలంపన్ = కలవర పఱచగా, మనోవికారమును కలుగఁజేయఁగా; యతులు. అంతన్ = త్వరలోనే; చేరన్ +ఏతేరన్ = గుమిగూడుటకు వచ్చిన వారు, కాగా; "ఈ నిర్వేదంబు = ఈ శోకమును; ఉడిగింపన్ = తొలఁగించుటకు; అచ్యుతుఁడ, పో = ఆ కృష్ణుఁడొక్కడే కదా;' నిర్వాహకుండు' అంచున్ = చేయఁగల సమర్థుఁడు అనుచు; దుర్వాసోముని పుంగవుఁడు = దుర్వాసముని శ్రేష్ఠుఁడు; దుఃఖ + ఆకుల స్వాంతుఁడై = శోకముచే చలించిన చిత్తము కలవాఁడై; కదలెన్.

తా. అణచుటకు వీలు లేనట్లు ఉప్పొంగుచున్న క్రోధమును, పెంచుచున్నవై ఆదుర్జనుల పోటు మాటలు, ఆంతరంగికమైన యోగవిద్యచే పొందిన సమాధిని (నిశ్చలత్వమును)కదలి వేయఁగా యతులు-అందఱు త్వరలోనే గుమిగూడగా, "ఈ శోకమును తొలఁగింప, ఆ కృష్ణుఁడే కదా! సమర్థుఁడు" అనుచు, దుర్వాసముని శ్రేష్ఠుఁడు, శోకముచే నిండిన చిత్తము కలవాఁడై పయన మయ్యెను.

విశే: నిర్వికారతకు నిలయులు మునులు. జపమాలలు, చర్మాసనములు మొదలగునవి అన్నియు నాశమగుటచే, వారి స్వాస్థ్యము చెడినది. కనుక సామాన్య జనులవలె ప్రవర్తించిరి.

కం. మండఁగ మండఁగ నార్చిన
ఖండిత బిదలములుఁ ద్రుటిత కౌపీనములున్
దండముల తుండములును గ
మండలు శకలములుఁ జూచి మఱకువ దోఁపన్. 75

ప్రతి: మండఁగ మండఁగన్ = మండి మండి; ఆర్చిన ఖండిత పిటకములున్ = ఆరిపోయిన ముక్కలైన వెదురు బుట్టలును; (పాఠాంతరము: పిదలములు) త్రుటిత కౌపీనములున్ = చినిగిన గోచులును; దండముల తుండములును = యోగ దండముల తుంటలును; కమండలు శకలములున్ = చేతిపాత్రల తునుకలును; చూచి; మఱకువ = తెలివి తప్పుట; తోఁపన్ = వహింపగా,

తా. మండి మండి ఆరిపోయిన ముక్కలైన వెదురు బుట్టలున్న చినిగిన గోచులును, యోగదండముల తుంటలును, చేతి పాత్రల తునుకలును చూచి, తెలివి తప్పుట ఆవహింపఁగా (మీఁది పద్యముతో అన్వయము).

గీ. మురవిరోధి ముందట నిడ మోపు గట్టి
తేరఁ బంచి సహస్రయతి ప్రవరులు
తోడ రా నెండ దాఁకిన నీడచోట
నిలిచి నిలిచి యహోరాత్ర నిర్గమమున. 76

ప్రతి: (శిథిలములైన వస్తువులను); మురవిరోధి = మురుని వైరియైన కృష్ణుని; ముందటన్; ఇడన్ = ఉంచి, చూపుటకు, (వానిని) మోపుకట్టి తేరన్ + పంచి = వాని నంతటిని మోపులుగా కట్టి తెచ్చుటకు ఆజ్ఞ యిచ్చి; సహస్రయతి ప్రవరులు = వేయి మంది, మిక్కిలి శ్రేష్ఠులైన యతులు, తోడ రాన్ = తనతో కూడ రాగా; ఎండ తాఁకినన్; నీడ చోట నిలిచి నిలిచి; అహన్ + రాత్ర= పగలు రాత్రియు కావించు; నిర్గమమున = ప్రయాణముచే.

తా. శ్రీకృష్ణుని ఎదుట ఉంచి చూపుటకై ముక్కలైన ఉపకరణము లన్నింటిని మోపులు మోపులుగా కట్టి తెచ్చుటకు ఆజ్ఞాపించి, అతి శ్రేష్ఠులైన యతులు వేయిమంది తనతో కూడ రాఁగా, పగలు రాత్రియు ప్రయాణముచేయుచు.

విశే : ఖండిత వస్తు సంచయమును, మోపులుగా కట్టి అతి దూరము మోసికొనిపోయి, శ్రీ కృష్ణునకు చూపుటకు యతులు కావించు ప్రయత్నము విపరీత చర్యగా తోఁచును.

పవలును రాత్రులును పయనించుచు వానిని కొనిపోవుట చూడ, వారిలో అజ్ఞానము ఆవేశించెనని చెప్పక తప్పదు. కనుక సోమన, "మఱకువ తోపన్" అని, చింతా క్రాంతులైన యతులను గుఱించి, సానుభూతిని ప్రకటించెను.

వ. రేప కడ. 77

తా: సూర్యోదయము అగుచుండఁగా.

గీ. ద్వారకోపశల్యం బటు చేరి యొక్క
కొలన వార్చి దుర్వాసుఁడు గూడ వచ్చు
యతుల ముందట నరుదెంచి యాదవేంద్రుఁ
డాడుచున్న సుధర్మా సభాంతికమున. 78

ప్రతి: దుర్వాసుఁడు; అటు = ఆవిధముగా పయనించుచు; ద్వారకా + ఉపశల్యంబు = ద్వారకా నగరము యొక్క సమీపమును; చేరి; ఒక్క కొలనన్ = కోనేటిలో; వార్చి = ప్రాత: సంధ్యావందనమును ఆచరించి; కూడవచ్చు యతుల (కంటె); ముందటన్ = ముందే; యాదవ+ ఇంద్రుఁడు = గొల్లలలో శ్రేష్ఠుఁడైన, కృష్ణుఁడు; ఆడుచున్న = "బంతి" ఆట ఆడుచున్న; సుధర్మాసభా + అంతికమునన్ = సుధర్మ అనెడి పేరు కల పెద్ద భవన సముదాయమందు, లోపలి భాగమునకు; అరుగు దెంచి = వచ్చి.

తా. దుర్వాసుఁడు ఆ విధముగా పయనించుచు ద్వారక యొక్క సమీపప్రదేశమును చేరి ఒక కోనేటిలో ప్రాత:సంధ్యను కావించి, తనతో వచ్చుచున్న మునుల కంటె ముందే, యాదవులలో ఉన్నతుఁడైన శ్రీకృష్ణుఁడు, బంతి ఆట ఆడు చున్న "సుధర్మ" అనెడి భవన సముదాయమందు, లోపలి భాగమును ప్రవేశించి, (మీఁది పద్యముతో అన్వయము).

కం. అఱువుడు గావి ముసుంగును
విఱిగిన దండంబుఁ దునిసి వ్రేలెడు గోచిం
బఱి యయిన కమండలమును
చుఱ చుఱ యై వేఁడి తెఱఁగు చూపుల తోడన్ 79

ప్రతి: అఱువుడు = తెగిన ; కావిముసుంగును = ఎఱ్ఱని తలపై గల ముసుగు బట్టను; విఱిగిన దండంబున్ = విఱిగి పోయిన యోగ దండమును; తునిసి వ్రేలెడు గోచిన్ = చినిగి, వ్రేలాడు గోచిగుడ్డను; పఱి అయిన కమండలమును = పగిలిన చేతి పాత్రయును; (కలవాఁడై)

చుఱచుఱయై = "చుఱచుఱ" దహించుచున్న తీవ్రమైన మనస్తాపముకలిగిన; వేఁడి తెఱగు = వేఁడిమి యొక్క తీరును, కన్పట్టఁ జేయుచున్న; చూపులతోడన్.

తా. తెగిన ఎఱ్ఱని తలముసుగును, విఱిగిన యోగ దండమును, చినిగి వ్రేలాడు గోఁచియు, పగిలిన చేతి పాత్రయును దహించుచున్న మనఃక్లేశముతో వేఁడి నిట్టూర్పులతో కూడిన చూపులతో (మీఁది పద్యముతో అన్వయము).

ఉ. వాకిట నిల్చె లోన యదువల్లభుఁ డాడుచు నుండె గోళముం
గైకొని సాత్యకిం గడవఁ గాలను గేల నమర్చి చిమ్ముచున్
లోకులునుం గుమారులును లోనుగ నుద్దుల కుద్దు లై వినో
దైకపరాయణుండును ననేకవిధంబులఁ జుట్టి యాడఁగన్. 80

ప్రతి: లోన = భవనములోపల; యదు వల్లభుఁడు = యాదవులకు ప్రభువు; కృష్ణుఁడు; వినోద+ఏక పరాయణుండు = వినోదమందే ప్రధానమైన, ఆసక్తి కలవాఁడు; లోకులునున్ కుమారులును లోనుగన్ = పౌరులు ఒకవైపు, రాజకుమారులు మొదలగువారు మఱొక వైపు; ఉద్దులై = సమానమైన సంఖ్య, బలము కలవారై పోటీ పడుచుండఁగా; గోళమున్ కైకొని = (కృష్ణుఁడు) బంతిని చేతిలో పట్టుకొని; సాత్యకిన్ కడవన్ = సాత్యకిని దాఁటుచు;కాలను కేలనున్ అమర్చి =కాళ్ళను చేతులను చక్కఁగా అమర్చి కొనుచు; చిమ్ముచున్ = (బంతిని) విసరివేయుచు; అనేక విధంబులన్ = పెక్కు రీతులుగా; చుట్టి ఆడగన్ = తిరుగుచు, ఆడుచుండఁగా; (దుర్వాసుఁడు) వాకిటన్; నిల్చెన్.

తా. భవనములోపల, యాదవ ప్రభువు, వినోదమందే ప్రధానమైన ఆసక్తి గలవాఁడు కృష్ణుడు, లోకులును, రాజకుమారులును ఇరుపక్షములుగా సమాన బలముతో పోటీపడుచుండగా, బంతిని చేత పట్టుకొని సాత్యకిని అతిక్రమించుచు, కాళ్లను చేతులను చక్కఁగా అమర్చి కొనుచు (బంతి) విసరి వేయుచు, పెక్కు రీతులుగా చుట్టి ఆడు చుండఁగా (దుర్వాసుఁడు) వాకిటిలో (వేఁడి ఊర్పులతో) నిల్చెను. చేతి బంతి ఆటను నేఁడును పాశ్చాత్యులు ప్రోత్సహించుచున్నారు.

చం. అవసర మైన వచ్చి పణిహారులు దోడ్కొని పోవఁజొచ్చి యా
దవకులపారిజాతము నుదంచితగోళ వినోదమోదితున్
నవవిక చారవింద నయనద్యుతిశీతలుఁ గాంచి రాయతి
ప్రవరులు పూర్వజన్మకృతభాగ్యఫలంబునుఁ బోలె నుండఁగన్. 81

ప్రతి: (ఆట ముగిసిన వెంటనే) పణిహారులు = సేవకులు; అవసరమైనన్ = (కృష్ణుఁడున్న చోటునకు వారిని) కొనిపోవుటకు సమయమగుటచే వచ్చి; తోడ్కొనిపోవన్ = లోపలికి ప్రవేశము కల్గింపఁగా; యతి ప్రవరులు = ముని శ్రేష్ఠులు; చొచ్చి = కృష్ణుడున్న చోటునుచేరి; ఉదంచిత గోళ వినోద మోదితున్ = కన్ను పండువగు బంతి ఆట యొక్క వేడుకచే సంతసమొందిన వాఁడును; నవవికచ+ అరవింద నయన ద్యుతి శీతలున్ = క్రొత్తగా వికసించిన కమలముల వంటి కన్నుల నుండి వెలువడు కాంతుల చల్లఁదనము గలవాఁడును (వెడల్పైన కన్నులతో, ఆదరాభిమానములతో చల్లనిచూపులను ప్రసరించువాఁడు); యాదవ కుల పారిజాతమున్ = గొల్ల జాతికి చెందిన వారి కందఱకును కోరికల తీర్చెడి (దేవతావృక్షమైన) పారిజాత మైన వాఁడును; పూర్వజన్మకృత భాగ్యఫలంబున్ + పోలెన్ + ఉండఁగన్ = ఇంతకు ముందు జన్మలో తాము చేసిన మంచి పనుల ఫలమేమో అన్నట్లున్న వాఁడును. (పరమాత్మ) అయిన వానిని; కాంచిరి = చూచిరి.

తా. ఆట ముగియుటచే, యతులను లోనికి కొనిపోవుటకు సమయమగుటచే, సేవకులు వచ్చి వారి నెల్లరను కృష్ణుఁడు ఆసీనుఁడై ఉన్నచోటికి కొని పోయిరి. బంతి ఆటచే సంతస మొందిన వాఁడును, క్రొత్తగా వికసించిన కమలముల వంటి కన్నుల కాంతుల చల్లఁదనమును వెదఁజల్లు వాఁడును, గొల్ల వారికెల్ల దేవతా వృక్షమై పూర్వజన్మలలో తాము కావించిన సత్కర్మల ఫలరూపమై ఎదుట కన్పట్టు చున్న వానిని, (ఆ పరమాత్మను) దర్శించిరి.

అలం. ఉపమ.

మ. వసు దేవాత్మజుఁడుం గనుంగొనియె దుర్వాసఃపరివ్రాడ్విభున్
రసనారూపకలాప శాపవచన ప్రారంభ సంభావితున్
వ్యసనవ్యా ప్త రిరంస హంస డిభక వ్యాళ వ్యధా వ్యాకు లో
ల్లసనున్ వేషవి శేష రోష విషయోల్లా సాద్భుతభ్రూకుటిన్. 82

ప్రతి: వసుదేవ+ ఆత్మజుఁడున్ = వసుదేవుని సుతుఁడు, కృష్ణుఁడును; రసనారూపకలాప శాపవచన ప్రారంభ సంభావితున్ = నాలుక రూపమున నున్న ఆయుధమనెడి శాపవాక్కు యొక్క ప్రారంభముచే, గౌరవింపఁబడు వాఁడును, (ఏ మాత్రము దోషము కన్పట్టినంతనే కోపము చెంది శపించుటకు మొదలిడు స్వభావము కలవాఁడు. కనుకనే, ఇతరులు, భయము చేతను భక్తి చేతను దుర్వాసుని గౌరవింతురు); వ్యసన వ్యాప్త = దుర్వ్యసనముల వ్యాప్తిలో రిరంస = క్రీడించు కోరిక గలిగినట్టి; హంసడిభక వ్యాళ = హంసడిభకులు అనెడి క్రూరులు

కారణముగా;వ్యధా వ్యాకుల + ఉల్లసనున్ = అధికమైన ఆవేదనచే మిక్కిలి కలఁత చెందిన స్వరూపముతో నున్నవాఁడును; వేష విశేష రోష విషయ+ ఉల్లాస + అద్భుత భ్రూకుటిన్ = తీవ్ర క్రోధముతో కూడిన తలంపుల పొంగుచే, భయంకరమైన అచ్చెరువు కొల్పు, కనుబొమల ముడుతలతో, విపరీతమైన ఆకారము కలవాఁడును (అగు) దుర్వాసః పరివ్రాట్ + విభున్ = దుర్వాసుఁడు అనెడి మునులకు ప్రభువైన వానిని; కనుంగొనియెన్.

తా. కృష్ణుఁడు శాపాయుధముచే గౌరవింపఁబడు వాఁడును. వాక్పా రుష్యము, దండపారుష్యము, వేఁట అను వ్యసనములకు లోనై, వాని యందు క్రీడించు క్రూరులైన హంసడిభకులవలన కలిగిన కలఁతతోను, అచ్చెరువు కొల్పు క్రోధముతో నిండిన తలంపులు గల భయంకరాకారుఁడును అయిన సన్న్యాసుల నాయకుఁడగు, దుర్వాస మహామునిని, తన ఎదుట కాంచెను.

విశే. అలం: 1 స్వభావోక్తి - క్రోధము మూర్తీ భవించి నట్లున్న దుర్వాసుని వర్ణన. "వేషవిశేషరోషవిష యోల్లా సాద్భుత భ్రూకుటిన్".

2. రూపకము : 'రసనా రూప కలాప శాపవచన'.

3. పరికరాంకురము : వసుదేవాత్మజుఁడు, కృష్ణుఁడు, తండ్రి కష్టములను నివారించినట్లు, మునుల వ్యధను పరిష్కరించునను అభిప్రాయమున్నది.

సప్త వ్యసనములు : వాక్పారుష్యము 2. దండపారుష్యము 3. స్త్రీ 4. జూదము 5. పానము 6. వేఁట 7. ఇట్టి వ్యసన పరులతో చెలిమి.

ఉ. అంతకు మున్న యాదవు లపాయభయంబున నాసనాదిపూ
జాంతర మాచరింపు మని యంతట నంతట రా మురారి య
త్యంతవినీతుఁ డై యతికి నయ్యుపచారము లెల్లఁ జేసి వి
శ్రాంతి యొనర్చె నర్ఘ్యపరిచర్యలఁ దక్కిన భిక్షుకోటికిన్. 83

ప్రతి: (కృష్ణుఁడు) అంతకు మున్న = దుర్వాసుఁడు తన్ను కలసి కొనుటకు ముందే; యాదవుల్ = యాదవులను (ద్వితీయకు ప్రథమ వచ్చినది); అపాయ భయంబునన్ = హాని కలుఁగు నేమో అను భయముచే (మర్యాదలో లోపమున్నచో); ఆసన + ఆది పూజా+ అంతరము = కూర్చుండుటకు పీఁటను అమర్చుట మొదలగు, వేర్వేఱు అర్చనలు; ఆచరింపుము + అని = చేయవలసినదిగా నియోగించి; అంతటన్ = ఆ ఏర్పాట్లన్నియును పూర్తి అయిన పిమ్మట; రాన్ = (దుర్వాసుఁడు మెల్లఁగా) లోనికి రాగా; మురారి; అత్యంత వినీతుఁడై =

మిక్కిలి వినయము కలవాఁడై; యతికిన్ = ఆ దుర్వాసునికి; ఆ + ఉపచారములు +ఎల్లన్ = చేయఁదగిన సేవలు అన్నియును (క్రమమున); చేసి; తక్కిన భిక్షుకోటికిన్ = ఆ మునీశ్వరునితో వచ్చిన సన్న్యాసుల సమూహమునకును; అర్హ పరిచర్యలన్ = తగినట్టి పనులతో (పూజలతో) ఆదరించుచు; విశ్రాంతిఒనర్చెను = విశ్రమించునట్లు చేసెను.

తా: దుర్వాసోమునీంద్రుఁడు తన్ను కలిసి కొనుటకు ముందే మురభంజకుఁడైన కృష్ణుఁడు, సన్న్యాసుల కొఱకు, వివిధములైన సేవలను చేయుటకు నియోగించి, ఆ ఏర్పాట్లన్నియును అయినవెంటనే ఆ మునివరుఁడు లోపలికి ప్రవేశింపగా, వినయముతో ఆతనికి పూజలన్నియు కావించి, తర్వాత ఆతని పరిజన వ్రాతమును తగిన సేవలతో ఆదరించి, ఎల్లరకు విశ్రాంతిని సమకూర్చెను.

వ్యా. 1. భిక్షుకోటి : షష్ఠీ తత్పురుష సమాసము.

2. ఆ + ఉపచారములు - త్రిక సమాస సంధి.

బాల. సంధి 3, సమా. 4,5, 14, 13 సూ. (చూడుము, పద్యములు 7, 15)

వ. అట్లు సకలయతి ప్రతతికిని యథోచితోపచారంబు లాచరించి వాసు
దేవుండు దుర్వాసునితో నిట్లనియె. 84

ప్రతి: అట్లు = ఆ విధముగా; యతి ప్రతతికిని= మునులసమూహమునకును; యథా + ఉచిత + ఉపచారంబులు = ఏవి తగినవో అట్టి సేవలు; ఆచరించి; వాసుదేవుండు = వసుదేవుని సుతుఁడు, కృష్ణుఁడు, దుర్వాసునితోన్ + ఇట్లు + అనియె.

తా. ఆ విధముగా యతుల కెల్ల ఏయే సేవలు యోగ్యములో వానినన్నింటిని, వారికి కావించి, కృష్ణుఁడు, దుర్వాసునితో ఈ క్రిందివిధముగా వచించెను.

వ్యా. యథా + ఉచిత - గుణసంధి.

శా. ఈరూపంబున సంసృతిం దొఱఁగి మీ [1]రీవంత నే చింతలం
జేరం గోరక యూర కున్న నిట విచ్చేయంగఁ జేయం గడుం
బారం బేదిన వంతయుం గలిగెనే బాలార్కబింబంబులో
నారం గూరిన యంధకార మన నాహా సాహసం బెట్టిదో. 85

ప్రతి: ఈ రూపంబునన్ = ఈ విధమైన ఆకృతితో, (బోడితల, కావిబట్ట ముసుగు, గోచి, యోగదండము, కమండలము మొదలగు వానిని ధరించి) సంసృతిన్ = సంసారమును,

1. రేచింతలం జెంతలం.

కుటుంబ జీవితమును; తొఱఁగి = వదలివేసి;మీరు; ఈ వంతన్ = ఈ మార్గమందు; (నిస్సంగులై); ఏ చింతలన్ చేరన్ కోరక = ఏ ఆలోచనలను, దరి చేరనీయక కోరికలు లేక; ఊరకున్నన్ = మౌనులై ఉండఁగా; ఇటన్ = ఈ నగరమునకు; విచ్చేయంగన్ చేయన్ = వచ్చునట్లు చేసినట్టి; కడున్ పారంబు + ఏదిన = మిక్కిలి మితి మీఱిన; వంతయున్, కలిగెనే = ఆవేదన కలిగెనా ఏమి?; బాల + అర్కబింబంబులోన్ = లేఁత సూర్యుని మండలములో; ఆరన్ కూరిన = నిండించిన, (మెత్తిన); అంధకారమనన్ = చీకటియో అనునట్లు, ఆహా! = ఆశ్చర్యము!; సాహసంబు + ఎట్టిదో = (మీ వంటి ఉత్తములకు చీకటిని కలిగించిన అనఁగా కీడు చేసిన వారి) ఆ తెగువ, మైమఱచిన ప్రవర్తన, ఎట్టి ధైర్యము కలదో?

తా: ముండిత శిరస్సు, కావిబట్ట ముసుగు, గోచి గుడ్డ మొదలగు వానితో, మునివృత్తిని అవలంబించి, ఈ మార్గమందు, కోరికలు లేక, జపచర్యలో నుండు మీరు, ఈ ద్వారకకు వచ్చుటకు, లేఁత సూర్యమండలములో మెత్తిన అంధకారమో అనునట్లు, మీకు ఏదైన మితి మీఱిన దుఃఖము కలిగినదా ఏమి? ఆహా! ఆశ్చర్యము! మీ వంటి విరాగులకు హాని చేసిన వారి తెగువ, వారి ప్రవృత్తి వర్ణనకు అతీతము.

విశే. అధమాధములైన వారి ప్రవర్తన హేయము. వారు శిక్షార్హులని ధ్వని.

అలం: ఉత్ప్రేక్ష. బాలార్క బింబంబులో నారం గూరిన అంధకారమనన్.

ఉ. ఆసలఁ ద్రంపివెట్టి హృదయం బను కాఁ గున యోగవాసనా
భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి యా
యాస విహారమత్కుణ గణైహిక శయ్యకుఁ దజ్జలంబు పైఁ
బోసిన నీశరీర మది పొందియుఁ బొందనియట్లు యూఱడున్. 86

ప్రతి: ఆసలన్ = ఆశలు అనెడి; త్రంపి = దాలి, పిడకల ప్రోగును పెట్టి = అమర్చి; హృదయంబు + అను = హృదయము అనెడి; కాఁగునన్ = కాచుటకు ఉపయోగించు పెద్ద పాత్ర, బానలో; యోగ వాసనా+అభ్యాసము + నీరు = చిత్త వృత్తి నిరోధము యొక్క అనుభూతిని అభ్యసించుట అనెడి నీటిని; కాఁచుటకున్ = వేఁడి చేయుటకై; ఆగమపావకమున్ + తగిల్చి = పూజ అనెడి అగ్నిని రగిల్చి, (నిష్కామమైన కర్మచే చిత్త శుద్ధిని పొంది); ఆయాస విహార మత్కుణగణ = కుటుంబ నిర్వహణ భారమునకై త్రిప్పట అనెడి చీరపేలు గుంపుగల; ఐహిక శయ్యకున్ ఇహలోకమనెడి పాన్పునకు; తద్ + జలంబు = ఆకాఁచిన నీటిని, పైన్ + పోసినన్; ఈ శరీరము + అది పొందియున్ = (వేఁడి నీటిచే) కడుఁగబడియును; పొందని + అట్లు = ఎట్టి లోకసంబంధమైన అనుభూతికి వశముగాక (అనంతర సమాధి స్థితిలో - అనఁగా

జీవాత్మ పరమాత్మలు ఏకమైన దశలో); ఊఱడున్ = శాంతించును (బ్రహ్మానందమును పొందును).

తా: ఆశలనెడి పిడకలను ప్రోగు చేసి, హృదయమనెడి కాఁగులో యోగానుభవాభ్యాసమనెడి నీటిని పోసి, నిష్కామమైన పూజ (కర్మ) అనెడి అగ్నిని రగిల్చి, కుటుంబ భరణ ప్రయాస మనెడి చీరపేలు గుంపులుగల, ఇహలోక సుఖమనెడి పాన్పుపై. ఆ కాఁచిన పరిశుద్ధమైన జలమును పోయఁగా, శరీరము ఆవేఁడి నీటిచే కడుఁగబడి, సంసార తాపత్రయ చింత తొలఁగి, చిత్తము నిర్మలమై, పూర్వ వాసనలు లేక, పారలౌకిక ప్రశాంతతను బొంది, బ్రహ్మానంద స్థితిలో నుండును.

విశే. అలం: రూపకము. 1. ఆసలనెడి త్రంపి. 2. హృదయమనెడి కాఁగు 3. యోగాభ్యాసమనెడి నీరు 4. ఆగమపావకము 5. ఆయాస విహారమత్కుణగణ 6. ఐహిక శయ్య

చిత్తశుద్ధికి మనోవృత్తి లయము మొదటి మెట్టు. అనంతరము, సమాధి స్థితిలో, నిశ్చల ప్రశాంతత సమకూరును. సాధకునకు ఈ బ్రహ్మానంద[మ]యానుభూతిలో శరీరముపై నెట్టి స్పృహయు నుండదు. అదొక వర్ణనాతీతమైన పారలౌకిక ప్రశాంతత. అల్పాక్షరములతో అనల్పమైన బ్రహ్మానందానుభూతిని, సోమన యీ పద్యములో అభివ్యక్తము చేసెను. "శరీరమది పొందియు పొందని యట్లు ఊఱడున్" అను పద్యభాగము, గంభీర భావ సమన్వితము.

ఛం. యాస... గణైహిక. పదవఅక్షరము యతిస్థానము. ఇదొక విశిష్టమైన యతి మైత్రి.

చం. మఱకువఁ గత్తరించి మదమానములం జుఱవుచ్చి మెచ్చుఁజాఁ
గఱ గొని క్రోధకామముల గం డడఁగించి పరోపకారముఁ
జఱఁ బడఁ ద్రోచి వాచవుల చట్టలు వాపి తొలంగి చిత్తముం
జఱపడి యున్న నీకు నొక చక్కటి నెక్కటి వేఁడఁ గల్గెనే. 87

ప్రతి: మఱకువన్ = తెలివి లేనితనమును; కత్తిరించి = పూర్తిగా దూరము చేసికొని; మద మానములన్ = పొగరును అభిమానమును రెండిటిని; చుఱవుచ్చి = మాడ్చి; మెచ్చున్ = పొగడ్తను; చాఁగఱగొని = కొట్టి వేసి, లక్ష్యము చేయక; క్రోధ కామముల గండు + అడఁగించి = క్రోధము, కామము యొక్క బలమును, అణచివేసి; పర+ఉపకారమున్ = ఇతరులు చేయు

సాయమును; చఱన్ పడన్ ద్రోఁచి = కొట్టి పడవైచి, దానిని గ్రహింపక; వాచవుల చట్టలు + పాపి = నోటిరుచులను నాశము చేసి; చిత్తమున్ తొలంగి = మనసును లయము చేసి, మనో వ్యాపారమును నిరోధించి; చఱపడియున్న = యోగాభ్యాసము కావించు, అంతర్యాగ క్రమమునందు నిమగ్నుఁడై యున్న; నీకున్; ఒక చక్కటిన్ ఎక్కటిన్ = ఏదైన ఒక చక్కని పనిని; వేఁడన్ = కోరవలసి; కల్గెనే = వచ్చెనా ఏమి?

తా. తెలివిలేని తనము, పొగరును అభిమానమును, అహంకారమమకారములు ను స్తుతి, క్రోధ కామములు మొదలైన వానిని తొలఁగించి, ఇతరులసాయమును అంగీకరింపక, నోటి రుచులను వదలివేసి, చిత్తవృత్తిని పూర్తిగా నాశము చేసి, యోగానుభూతిని పొందుచున్న నీకు నన్ను, ఏదైన ఒక మంచి పనిని కోరవలసి వచ్చెనా ఏమి?

గీ. కలుగుటకు మీరు విచ్చేయు కారణమున
సందియము లేదు మీయట్టి సంయములకు
నేమి కార్యంబు గలిగెనో యెఱుఁగ రాదు
తెలుపవే నాకు నిర్మల ధీనిధాన. 88

ప్రతి: కలుగుటకు = ఒక మంచి పనిని కోరవలసి వచ్చుటకు; (పూర్వ పద్యముతో అన్వయము), మీరు విచ్చేయు కారణమునన్ = మీరు ఇచ్చటికి వచ్చు కారణమును బట్టి; సందియము లేదు; మీ అట్టి సంయమములకున్ = మీ వంటి వీతరాగులైన గొప్పమునులకును; ఏమి కార్యంబు కలిగెనో ఎఱుఁగ రాదు; నాకు తెలుపవే; నిర్మల ధీనిధాన = మలినములేని బుద్ధికి నిధియైనవాఁడా!, నిర్మల మైన బుద్ధి వైభవము కలవాఁడా!;

తా. నిర్మలమైన బుద్ధి వైభవము కలవాఁడా! మీరు విచ్చేయు కారణముచే ఏదో ఒక మంచి పనిని కోరుటకై వచ్చి యుందు రనుటలో సందేహములేదు. మీవంటి రాగ రహితులైన మహామునులకు ఏమి పని కలిగెనో, తెలియరాదు. అది ఏదియో దయతో తెలుపవే!

కం. అనుటయు భగభగ మండెడు
కనుఁగవతో నొడల నడరు కంపముతో నె
ట్టిన నిట్టూర్పులతో మొగ
మునఁ దనికిన కెంపుతోడ మునిపతి యుండెన్. 89

అర్థ: ఒడలన్ = శరీరమందు; నిడు + ఊర్పులు = నిట్టూర్పులు; తనికిన = జ్వలించుచున్న, వెలుఁగు చున్న.

తా. అని కృష్ణుఁడు వచింపఁగా "భగభగ" మండుచున్న కన్నుల జంటతో, శరీరమున అతిశయించు కదలికలతో ఎక్కువగు చున్న దీర్ఘ శ్వాసలతో (నిడుపైన ఊర్పులతో) ముఖమందు వెలుఁగు చున్న అరుణ వర్ణముతో దుర్వాసుఁడు కన్పట్టెను.

వ్యా. . నిట్టూర్పు: నిడు + ఊర్పు. సూ. కుఱు, చిఱు కడు, నడు, నిడు శబ్దంబుల - ఱడల కచ్చుపరంబగునపుడు ద్విరుక్త టకారంబగు. సంధి, బాల - 12

2. కనుఁగవ : కన్ను+కవ. (చూడుము, పద్యము - 59)

వ. తదనంతరంబ యంతరంగంబు కొంత సంతరించికొని యతం
డు నారాయణున కి ట్లనియె. 90

తా. కొంతసేపైన పిమ్మట దుర్వాసుఁడు తన మనస్సును స్తిమిత పఱచుకొని ఆ మునిపతి, నారాయణునకు, ఇట్లు చెప్పెను.

**- : దుర్వాసుఁడు హంసడిభకుల దుర్నయంబు కృష్ణున కెఱింగించుట :-**

మ. తగునే యింత మురాంతకా తలఁపవే త్రైలోక్యముం గావ నీ
వు గదా దానవవైరి వై పొడమి లావుం జేవయుం జూప రూ
పగు దైవంబు గదాధరుండ వఖిలవ్యాపారపారంగ మా
ధ్వగ! మావృత్త మెఱుంగ నేర వనఁ జిత్తం బుత్తలం బంద దే. 91

ప్రతి: మురాంతకా! = మురుని సంహరించిన వాఁడా! కృష్ణా!; ఇంత తగునా? = ఇట్లు నీవు ప్రశ్నించుట సరియా?; తలఁపవే = ఆలోచింపుమా!; నీవు కదా; త్రైలోక్యమున్ కావన్ దానవ వైరివై; పొడమి = అవతారమెత్తి; లావున్ చేవయున్, చూపన్ = శారీరక బలమును, మానసిక శక్తిని చూపుటకు; రూపు+ అగు దైవంబు = రూపమును. పొందిన దేవుఁడవు; గదా ధరుండవు = (శత్రు సంహారమునకై) కౌమోదకి అనెడి గదను కూడ ధరించియున్నావు; అఖిల వ్యాపార పారంగమ + అధ్వగ! = మూడు లోకములందు, అన్ని వ్యవహారములను ఒడ్డునకు చేర్చుటకు, మార్గమైన వాఁడా!; మా వృత్తము = మేము వచ్చిన పని, విషయము; ఎఱుంగ నేరవు అనన్ = నీవు ఎఱుఁగ వనఁగా; చిత్తంబు = మనస్సు; ఉత్తలంబు + అందదే! = చింతకు వశము కాదా!;

తా: మురుని వధించిన కృష్ణా! నీ ప్రశ్న సరియైనదా? కొంచె మాలోచింపుమా? నీవు మూడు లోకములను రక్షించుటకు రాక్షసులకు పగవాఁడవై, శారీరక బలము మానసిక శక్తి చూపుటకు అవతరించిన దేవదేవుఁడవు! గదను కూడ ధరించి యున్నావు! సర్వవ్యవహారములను నిర్వహింప, తుద ముట్టన్ చేయుటకు మార్గ మైన వాఁడా! మా వృత్తాంతము, తెలియ దనఁగా నా మనస్సుచింత చెందదా ఏమి?

శా. ఏఁ గాదే నడతుం జతుర్ముఖునితో నింద్రాది దిక్పాలకుల్
మూఁగం బాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ లేకున్న చో
నాఁగ న్వచ్చియు నాఁగ జాలని ప్రతీహారు న్విడంబించుచున్
దాఁగం బోయి తలారివాని యెదురన్ దాఁగంగ నీ కేటికిన్. 92

ప్రతి: చతుర్ముఖునితోన్ = నాలుగు ముఖములు కల సృష్టికర్త, బ్రహ్మతో కూడ (సృష్ట్యాదియందు); ఇంద్రాది దిక్పాలకుల్ = ఇంద్రుడు మొదలైన దిక్కులను పాలించు వారందఱు; మూగన్ + పాఱి = నీ చుట్టు ముట్టినవారై; భవత్ పద + అబ్జములకున్ = నీయొక్క పద్మములవంటి పాదములను సమీపించి, వానికి మ్రొక్కంగ లేకున్న చోన్ = నమస్కరించుటకు వీలులేనప్పుడు; ఏన్+కాదే = నేను కదా!; నడతున్ = (నీ వెంట చనవుతో) వ్యవహరింతును; ఆఁగన్ వచ్చియున్ = అడ్డగించుటకు వచ్చియు; ఆఁగఁజాలని = ఆఁపుటకు శక్తిలేని; ప్రతీహారున్ = (ద్వారపాలకుని) సేవకుని; విడంబించుచున్ = అనుకరించుచు, (వానివలె ప్రవర్తించుచు); దాఁగన్ + పోయి = దాఁగు కొనుటకు యత్నించి; తలారి వాని ఎదురన్ = పట్టు కొనుటకై ఉన్న సేవకుని ఎదుటనే; దాగంగన్ నీకు ఏటికిన్ = నీవు దాఁగు కొనుటకు ప్రయత్నించి ప్రయోజనమేమి? (తెలియదనుట నమ్మఁజాలని మాట).

తా. సృష్టి యొక్క ప్రారంభమందు, బ్రహ్మ ఇంద్రుడు మొదలగు వారందఱు నిన్ను చుట్టుకొని యుండియు, నిన్ను సమీపించి నమస్కరించుటకు వీలులేని సమయమందు, నేను, నీ సమీపముననే యుందును కదా! అడ్డగించుటకు వచ్చిన సేవకుడు, ఆఁప లేనట్లు, దాఁగుకొనుటకు ప్రయత్నించి, తలారివాని యెదుటనే దాఁగుకొన్నచో, ప్రయోజనమేమి? అట్లేల నీవు చేయుచున్నావు?

విశే. తాము వచ్చిన పని కృష్ణుఁడు ఎఱుఁగడను మాట, దుర్వాసునికి ఆశ్చర్యమును కలిఁగించినది. కృష్ణుఁడు పరమాత్మ. సర్వమును ఎఱిఁగినవాడు. అట్లు మాట్లాడుట, వింతగా, తోఁచెను. ఆ దేవునితోఁ గల చనవును తెలిపి ఆమునీంద్రుఁడు వగచుచున్నాఁడు.

ఉ. ప్రాఁతల మేము నీకుఁ బలు బాములఁ బొందక యున్న నాఁటి నీ
చేఁతలు గంటి మిందఱకుఁ జిత్తముల న్వెలిఁదోఁచు నూఁతలుం
బూఁతలు నీవ యొండు దలపోఁతలు లేఁతలు మమ్ము నెమ్మెయిన్
లాఁతులఁ గాఁ దలంపకు నలంపకు చాల నలంగి యుండఁగన్. 93

ప్రతి: ఏము; నీకున్; ప్రాఁతలము = అతి పురాతన కాలమునకు చెందిన వారము (నీకు తొలినుండియు సేవకులము); పలు బాములు = పలుజన్మలు; పొందక యున్న; నాఁటి; నీ చేఁతలు = నీవు కావించిన పనులు; కంటిమి; ఇందఱకున్ = ఇంతమందికి; చిత్తములన్ = మనస్సులందును; వెలిన్ = వెలుపలను; తోఁచు = నిండియున్న; ఊఁతలున్ = ఉపాధులును; పూఁతలును = పూనికలును, అవతారములును (దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఇత్యాదికృత్యములును); నీవ = నీవేకదా! (అన్నియు నీ రూపములే); ఒండు తలపోఁతలు = (నిన్ను గుఱించి) వేఱు విధముగా తలంచుట, లేఁతలు= తేలిక యైనవి (సారహీనములు, నిరుపయోగములు. అవి నీ నిజస్వరూపమును చెప్పఁజాలవు) మమ్ము; ఏ+మెయిన్= ఏ కారణముచే నైనను; లాఁతులన్‌గా = నీకు దూరమైన వారుగా (పరులనుగా; తలంపకు; చాల నలంగి ఉండఁగన్ = పెక్కిలి వెతతో నిట్లుండఁగా; నలంపకు = బాధింపకుము.

తా: మేము పురాణపురుషులము. నీ సేవకులము. కృతయుగమందును, నీవు పెక్కు జన్మల నెత్తుటకు ముందే, నీవు కావించిన కృత్యములను కనియున్నాము. అందఱి మనస్సులందును, సమస్తమందును నీవే వసించియున్నావు. నీవు కానిది, లేనిది, ఏదియును లేదు. నిన్ను గుఱించి అన్యముగా ఆలోచించుట వ్యర్థము. మమ్ము పరులనుగా తలంపకుము. ఇప్పటికే పెక్కు వ్యథలకు గురియై బాధ చెంది యున్న మమ్ము ఇంక నెంత మాత్రము కలఁత పెట్టకుమా!

వ్యా. 1 ఎమ్మెయిన్. ఏ + మెయిన్ (చూడుము పద్యము - 7)

2. తలంపకు, అలంపకు : తలంపకుము, అలంపకుము.

సూ. మధ్యమ పురుష ము వర్ణకమునకు హలవసానంబులు పరంబులగునపుడు, లోపము విభాషనగు. సంధి, బాల - 47.

అలం :వృత్త్యను ప్రాసము : 'త' కారము అవృత్తమైనది. మునుల వెతలను వ్యక్తీకరించుటకు ఇది పోషకముగా నున్నది.

వ. అని మఱియును. 94

తా. సులభము.

సీ. ఏ నెఱుంగుదు నిన్ను నేల నాతోడనే
వెడమాయములు బ్రహ్మవేత్త లెఱుఁగు
రూపు రూపులలోనిరూపుఁ దోరపురూపు
చూపనిరూపు నీ రూపు సూపి
వేదాంతముల నైన వెదక నందనిరూపు
విజ్ఞానరూప మై వెలయురూపు
తేజ మైశ్వర్యంబుఁ దెలుపఁ జాలెడు రూపు
ప్రణవ రూపంబు గాఁ బరఁగు రూపు
గీ. పంచభూతసుధాకరభాస్కరాత్మ
రూప మగు రూవు నీరూపు రుచిర రూప!
మొఱఁ గెదవె మాకు వ్రేళ్ళతో మొదలు చూచి
చె ట్టెఱుఁగు వారి కాకులు చిదుమ నేల. 95

ప్రతి: నిన్నున్; ఏను + ఎఱుంగుదు; నాతోడనే; ఏల వెడమ్యాయములు? = వ్యర్థమైన (ఉపయోగపడని) జిత్తులు, (మోసపు మాటలు) ఏల? బ్రహ్మవేత్తలు + ఎఱుఁగు రూపు = బ్రహ్మమును ఎఱిఁగిన వారు తెలిసికొను రూపము; రూపులలోని రూపు = ఆకారము ధరించియున్నవానిలోని చైతన్యాంశరూపము; తోరపు రూపు = స్థూలమైన రూపము;చూపని రూపు = కనఁబడని రూపము (సూక్ష్మరూపము); నీరూపు సూపి = (అయిన) కారణరూపమును గ్రహింపఁజేసి, (సర్వము లయమైనను, పరమాత్మయొక్క చైతన్యాంశము, మరల, సృష్టికి కారణమగుచున్నది. అట్లు పరమాత్మ తన ఉనికిని చూపును.) వేదాంతములను + ఐన = ఉపనిషత్తులను కూడ;వెదకన్; అందని = తెలియని; రూపు; విజ్ఞాన రూపమై వెలయు రూపు = వేదములు వేదాంగములు శాస్త్రములు, పురాణములు మొదలగు విశిష్టములైన జ్ఞానమే రూపమై ప్రకాశించు రూపము; తేజము + ఐశ్వరంబున్ = నీ మహోజ్జ్వలమైన ప్రకాశమును, అణిమాది విభూతులను (ఎనిమ్మిది సంపదలను); తెలుపఁజాలెడు రూపు; ప్రణవరూపంబుగాన్ = ప్రణవము అనెడి (అకారఉకారమకార సమాహారాక్షరముగా) ఓంకార మాకృతిగా; పరఁగురూపు = వెలయు రూపము; పంచభూత = పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనెడి

అయిదును; సుధాకర భాస్కర = చంద్ర సూర్యులును; ఆత్మరూపమగు = తన రూపముగానున్న ; రూపు; (మఱియును) నీరూపు = రూపములేని రూపు కలవాఁడవై (నిరాకారుఁడవు నిర్గుఁణుఁడవు); రుచిరరూప! = ఓ సౌందర్యమూర్తీ!; మొఱఁగెదవె = వంచింతువా ఏమి? (ఏల వంచించుట కీ ప్రయత్నము?); వ్రేళ్లతో మొదలు చెట్టుఎఱుఁగు వారికి ఆకులు + చిదుమనేల? = వ్రేళ్లు మొదలుకొని చెట్టంతయును తెలిసిన వారు, ఆచెట్టును గురించి తెలిసికొనుటకు, పై నుండు, ఆకులను కోయవలెనా ఏమి?

తా: ఓ సుందరరూపుఁడా! నిన్ను బాగుగా ఎఱుఁగుదును. నా తోడనా నీ జిత్తులు. బ్రహ్మవేత్తలు మాత్రమే ఎఱుఁగునది, సర్వమునందు, వసించునది, స్థూలమును, సూక్ష్మమును, కారణమును, అయినది. అట్టి నీ రూపమును సృష్ట్యాదిలో చూపెదవు. అది ఉపనిషత్తులను పరిశీలించినను తెలియనిది (అనగా నీరూపమును అవి వర్ణింపఁ జాల వనుట); విశిష్ట జ్ఞాన రూపముగా నుండునది. నీ తేజస్సు నీ ఎనిమిది విభూతులను తెలియఁజేయునట్టిది. ప్రణవమే నీ స్వరూపమైనది. పంచ భూతములు చంద్రసూర్యులు నీ రూపమైనది. ఇట్లు వైవిధ్యమున్నను రూపములేని దివ్య రూపుఁడా! మమ్ము ఏల వంచించెదవు? (నీవే పరబ్రహ్మమని మాకు తెలియదా?) వ్రేళ్లతో కూడ, ప్రారంభమునుండి, చెట్టు పుట్టుకను ఎఱిఁగిన వారికి, దానిని తెలిసికొనుటకు పై నుండు ఆకులను కోసి పరిశీలింప వలెనా?

అలం: అర్థాంతర న్యాసము

"వ్రేళ్లతో మొదలు చూచి చెట్టెంఱుఁగు వారి కాకులు చిదుమ నేల" అనుసామాన్య వాక్యము, "ఏ నెఱుంగదు నిన్ను" అను విశేషవాక్యమును, సమర్థించుచున్నది.

విశే : పరబ్రహ్మము, అన్నింట నుండి తాను వేఱుగా నుండును. సర్వశక్తి సంపన్నము, నిరాకారము, నిర్గుణము అని పద్యభావము.

కం. మాకుం బుణ్యము చాలమిఁ
గా కేమి జగత్త్రయంబు గావం బ్రోవం
గైకొన్న నీవు సకల వి
వేకివి మాదుఃఖ మెఱుఁగవే మధుమథనా. 96

ప్రతి: మధుమథ నా! = మధువను రాక్షసుని మథించినవాఁడా! కృష్ణా!; మాకున్ పుణ్యము చాలమిన్ + కాక! = మేము కావించిన పవిత్ర కార్యముల ఫలము అల్పమగుటచేతనే కదా!;

జగత్+త్రయంబున్+కావన్ = మూఁడు లోకములను రక్షించుటకు; ప్రోవన్ = పోషించుటకు; కైకొన్న నీవు = పూనుకొన్న నీవు; సకల వివేకివి = అన్నింటి యొక్క మంచి చెడ్డలను గురించి ఎఱిఁగిన వాఁడవు; మాదుఃఖ మెఱుఁగవు+ఏ? = మా శోకమును గుఱించి తెలియక పోవుట ఏమి?

తా. ఓ కృష్ణా! మేము చేసిన పుణ్యఫలములు అల్పమగుట చేతనే (ఇన్ని కష్టములను అనుభవించితిమి. మఱియు నీవు ఇట్లు మాట్లాడుచున్నావు.) ముల్లోకములను రక్షించు పోషించు నీవు, సర్వజ్ఞుఁడైన వివేకివి మా దుఃఖమును గుఱించి ఎఱుఁగ వను చున్నావు. ఇది ఆశ్చర్యము.

మొదట దుర్వాసుఁడు 'వెడమాయములు నా తోడనే ఏల' అన్నవాఁడు వెంటనే కృష్ణుఁడు పరబ్రహ్మమని గుర్తించి స్తుతించి ఇంచుక తేఱుకొని, నిశ్చలత్వమును పొంది "సకల వివేవికి" అని మధుమథనా" అనియు, వినయము, భక్తి, విజ్ఞానము ముప్పిరి కొనునట్లు తన బాధను వివరించెను.

దుర్వాసుఁడు : అనసూయకు అత్రి మహామునికి శివాంశమున జన్మించిన తనయుఁడు. త్రిపురములను దహించుటకు శరమైన వాఁడితఁడే!

అలం: పరికరాంకురము - "మధుమథనా" అను సంబోధన మందు, మధువును సంహరించినట్లు హంసడిభకులను అంతమొందింపఁ గలఁడను అభిప్రాయము గర్భితమై యున్నది.

కం. అంభోజనాభ! నరపతి
డింభులు భువనమున హంసడిభకు లనంగా
జృంభితు లయి యిరువు రుపా
లంభించిరి కానలోఁ జలంబున మమ్మున్. 97

తా. కమలమును నాభియందుకలవాఁడా! కృష్ణా నరపతి సుతులు, హంసడిభకులనెడి పేరుగలవారు. భూలోకమందు మిక్కిలి గర్వించి మునివృత్తిలో, కానలలోనున్న మమ్మె నిందించి అవమాన పఱచిరి.

ఛం: బిందు పూర్వక 'భ' కారము దుష్కరప్రాసము.

ఆ.వె. హంస పరమహంసు లగు నీయతీంద్రుల
పేరు సైఁప లేక పెచ్చు పెరిఁగి

హంసుఁ డాత్మనామ హరు లని కానోపుఁ
బట్టి మమ్ముఁ జాల భంగ పఱిచె. 98

తా. 'హంస' "పరమహంస" అనెడి పేర్లు మునులకు వర్తించుటచే, దానిని సహింపలేక హంసుఁడు, అసూయ చెంది, అతిశయించి, మమ్ము పట్టుకొని చెప్పరాని విధముగ ఎక్కువగా అవమాన పఱచెను.

విశే. జీవుఁడు "హం" అనుచు వెలుపలికి, 'స' అనుచు లోనికి ప్రవేశించును. సర్వద 'హంస' మంత్రమును జపించునట. "హంస" పదములో "హం" పురుషరూపము. 'స' ప్రకృతి రూపము. "హంస" అనఁగా ప్రకృతి పురుషసంయోగము. ఈ ఐక్యమెఱిఁగినవాఁడు యోగి. "సో హం" మంత్రములో సకారహకారములు లోపింపఁగా, నేర్పడు సమాహార వర్ణమే ఓంకారము. ఇదియే ప్రణవము.

కం. సరకుగొనరు సురవరులను
గురుశక్తిని భీష్మ బాహ్లికులఁ గైకొన రు
ద్ధురత జరాసంధుని వెర
వరి గా మెచ్చరు మహేశవరగర్వమునన్. 99

తా. మహేశుఁడిచ్చిన వరము వలన పొందిన గర్వముచే, శ్రేష్ఠులైన దేవతలను, లెక్క పెట్టరు. ద్రోణాచార్యుని సామర్థ్యమును, గురువీరులైన భీష్ముని బాహ్లికుని కూడ గుర్తింపరు. గర్వించిన వారై (ఉద్ధురతన్) మై మఱచి, మహావీరుఁడైన జరా సంధుని కూడ నేర్పరిగా శ్లాఘింపరు.

గీ. హంసడిభకులచేత నీయతులు నేముఁ
బడినపాటులు వేఱ చెప్పంగ నేల
కమలలోచన! ముంజేతి కంకణమున
కద్ద మేటికి నీసొమ్ము లరయ రాదె. 100

తా. కమలముల వంటి కన్నులు కలవాఁడా, కృష్ణా! ఈ వచ్చిన యతులు మేము, హంస డిభకులచే పొందిన భంగపాట్లు (కష్టములు) వేఱుగా ఏల చెప్పవలెను? ఎదుట, చేతిలో ...

అద్దమును ఉపయోగింతురా? మేము పడిన పాట్లను ఎఱుఁగుటకు, మేము తెచ్చిన శిథిల వస్తు సముదాయమును చూడ రాదా! అవియే మా భంగపాట్లను తెలియఁజేయఁగలవు.

"ముంజేతి కంకణమునకు అద్దమేటికి?" లోకోక్తి.

వ. అనుచుం బుండరీకాక్షు ముందటం దమతెచ్చిన భగ్నవస్తు
సముదయభారంబు విచ్చి చూపి యి ట్లనిరి. 101

తా. అని చెప్పుచు కమలనయనుని ఎదుట, తాము తెచ్చిన విఱిగిన వస్తువుల మొత్తము గల, మూటను విప్పి చూపి, ఇట్లు వచించిరి.

సీ. ఈకమండలుప జ్క్తి నెటు చూతు నిట్ల త
త్పాప మ స్తంబులు వగుల కున్న
నీదండనివహంబు నెటు చూతు నిట్ల త
ద్ధూర్త హస్తంబులు దునియ కున్న
నీవల్కలవ్రాత మెటు చూతు నిట్ల త
త్కపట చర్మంబులు గాల కున్న
నీశిక్యసముదాయ మెటు చూతు నిట్ల త
ద్ద్వేష ణాంత్రంబులు ద్రెవ్వ కున్న
గీ. నకట మోమోట లేక తా రంత చేసి
బ్రదికి పోయిరె పులి పేదవడినఁ బసుల
వాఁడె లెక్కాఁడె నను కత వచ్చె నాకు
మునులలోపల నాలుక ముల్లు విఱిగె 102

ప్రతి: ఈ కమండలు పంక్తిన్ = ఈ (విఱిఁగిన) చేతి పాత్రల వరుసను, ఇట్లు+అ = ఈ విధముగా; తద్+పాపమస్తంబులు = ఆ పాపుల తలలును; పగుల కున్నన్ = పగులకపోయినచో; ఎటు చూతున్ = ఏ కారణముచే, ఎట్లు చూడఁగలను? ఈ దండనివహంబున్ = ఈ (ముక్కలైన) యోగ దండముల మొత్తమును, ఇట్ల, తద్+ధూర్త హస్తంబులు = ఆ దుష్టులైన చేతులు; తునియకున్నన్ = ముక్కలు గాక పోయినచో, ఎటు చూతున్?

ఈ వల్కల వ్రాతము = ఈ (చినిగిన) కాలి గుడ్డల ప్రోఁగును; ఇట్లు; తద్ + కపట

చర్మంబులు = ఆ మోసగాళ్ల యొక్క శరీరము పైఁగల చర్మమంతయును; కాలకున్నన్ = మండి పోకపోయినచో; ఎటు చూతున్?

ఈ (తుంటలైన) శిక్యసముదాయము = ఈ సంచుల నెల్లను; ఇట్ల = ఈవిధముగా; తద్+ద్వేషణ + ఆంత్రంబులున్ = ఆ ద్వేషింపఁదగిన వారి ప్రేగులును; త్రెవ్వ కున్నన్ = తెగక పోయినచో, ఎటు చూతున్?;

అకట! మోమోటలేక = అయ్యో! సంకోచములేక; తారు = తాము; అంతచేసి = అట్టి క్రూర కార్యములు చేసియును; బ్రదికి పోయిరి; పులి; పేదవడినన్ = భయంకరమై, బలహీనమై = వేఁటాడఁ జాలనిచో; పసులవాఁడె = పసులకాపరియే లెక్కాడెన్ = హేళన చేసెను; అనుకత = అనుదశ; నాకు వచ్చెన్; మునుల లోపల, నాలుక ముల్లు విఱిగెన్ = మునుల సముహములో, నా ప్రాధాన్యమును, (ఉన్నతిని) కోల్పోయితిని కదా!

తా. ఈ (విఱిగిన) కమండలముల వరుసను, ఈ విధముగా ఆపాపులైన (హంసడిభకుల) తలలు పగులక పోయినచో, ఏ విధముగా చూడగలను? (వారి తలలు పగిలినపుడే తనకు మనశ్శాంతి కలుగునని భావము - ఇట్లే తక్కిన మూడు పాదములకును భావమును ఊహింప వలెను). ఈ (ముక్కలైన) యోగ దండముల మొత్తమును, ఈ విధముగా, ఆ చెడ్డ వారి చేతులు ముక్కలు కాకపోయినచో ఎట్లు చూఁడ గలను) ఈ (చినిగిన) కావిగుడ్డల (ప్రోగును.) ఇట్లు ఆ మోసగాళ్ళ చర్మములు కాలిపోకపోయినచో ఎట్లు చూఁడగలను? ఈ (తుంటలైన) సంచుల నెల్లను, ఇట్లు, ఆ ద్వేషింపఁదగిన వారి ప్రేగులు తెగకపోయినచో ఎట్లు చూఁడఁగలన? అయ్యో! సంకోచములేక వారు మితిమీఱిన క్రూరములు చేసి బ్రదికి పోయిరి కదా! భయంకరమైన పులి, దుర్బలమైనచో, పశువుల కాపరియే, హేళన చేయు నను విధమున, ఈ యతులలో నా (ఉన్నతి) ప్రాధాన్యము నశించినది.

"నాలుక ముల్లు విఱుగుట"తెలుగు జాతీయము.

"లోకోక్తి:"పులి పేదవడిన.

వ్యా. పసులు : పసువులు, సూ. బహువచనంబు పరంబగునపుడు ఆవు ప్రభృతుల తుది అక్షరంబునకు లోపంబు విభాషనగు. ఆచ్ఛిక, బాల - 22

గీ. వలదు బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్ర
జాతు లాతఁ కులోచి తాచార పథము

నడప నాహంసడిభకు లేనాఁట నేది
నడపి రది చెల్లుఁ గాక వర్ణముల కెట్లు. 103

ప్రతి: బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులు; ఆత్మ కుల + ఉచిత + ఆచార పథమున్ = తమ తమ కులములకు (విధింపఁబడిన) తగిన సంప్రదాయ మార్గమును; నడపవలదు = నిర్వహించు కొనుటకు వీలు కాదు; ఆ హంస డిభకులు; ఏ నాఁటన్ = ఏదిన మందు; ఏది? = (పాటింపవలసిన) ఆచార పద్ధతి దేనిని; నడపిరో = నిర్ణయించి ఆదరించెదరో; అది = ఆ మార్గమే; వర్ణములకు = బ్రాహ్మణ క్షత్రియ వైశ శూద్రులకు; ఎట్లు = ఏ విధముగా నైనను; చెల్లుఁగాక = గ్రహింపఁదగినదే యగును.

తా. నాలుగు వర్ణముల వారును, తమ తమ కులములకు ఏర్పడిన సంప్రదాయ పద్ధతులను అనుసరించుటకు అంతరాయ మేర్పడినది. హంస డిభకులు, ఏయే మార్గములను, యోగ్యములని ఏ దినమందు నిర్ణయించిరో అప్పటి నుండి అవియే, ఆచరింపఁదగినవిగా ఏర్పడినవి. వారి ఆజ్ఞలను, అన్ని కులాల వారు. తప్పక పాటింప వలసినదే!

విశే : హంస డిభకులు వర్ణాచారములను రద్దు చేసి, తామే వానిని విధించు చున్నారనుటచే, యతి ధర్మములకు వారి చర్యలు ప్రతి బంధకము లయ్యెనని దుర్వాసుని అభిప్రాయము.

కం. మా కేది దిక్కుఁ దెరువో
లోకంబులు మూఁడు నింతలో నే మగునో
నీ కడపఁట సర్వంబును
జేకొనవే దుష్టశిక్ష చేసి మురారీ. 104

ప్రతి: ముర+అరీ = ఓ మురాసురుని పగ వాఁడా, కృష్ణా!; మాకు+ఏది దిక్కున్ = మాకు రక్ష ఎవరు? (దిక్కు జాతీయము); (ఏది) తెరువో = మార్గమేదియో? (ఎట్లు ప్రవర్తింపవలయునో); లోకంబులు మూ డున్ + ఇంతలోన్; ఏమగునో = వారి ఆగడములను నిరోధించి, నివారింప కున్నచో మూ డులోకములును, అతి త్వరలో, ఎట్టి కష్టముల పాలగునో! ప్రజలు ఎట్టి బాధలను అనుభవింతురో!; సర్వంబును = అన్నియును; నీ కడపు + అఁట = నీచే నాశమగు ననుట నిశ్చయము. (అఁట నిశ్చయార్థము); దుష్టశిక్ష చేసి; చేకొనవే = సాయపడుమా, అనుగ్రహింపుమా (చే యూతనిమ్ము).

తా. ఓ కృష్ణా! మమ్ము రక్షించు వారెవరు? మమ్ము రక్షించుకొనుటకు మార్గమేది?
రులైన హంసడిభకుల దుష్ట కార్యములను నిరోధించి, నివారించి, వారిని నాశము
ంపనిచో, అతి త్వరలో ఈ మూ డు లోకములకును ఎట్టి ఉపద్రవములు సంభవించునో
! సర్వమును నాశము చేయఁగలవాఁడవు. నీవు దుష్ట శిక్ష చేసి దీనులైన మాకు
యపడుమా!

). అనిన యతిం గనుంగొని ముఠాంతకుఁ డిట్లనుఁ దప్పుచేసితిం
గినియకుమయ్య మి మ్మొకఁడు కీడునఁ బెట్టెడు వాఁడు లేఁడ యెం
దని పరికింప నైతి విను మాధరణీశ కుమార ధూర్తులం
దునిమెద నింతలో వగలఁ దూలకు సాత్యకితోడు సంయమీ! 105

ప్రతి: అనినన్ ; యతిన్ కనుగొని; ముర + అంతకుఁడు + ఇట్లు + అనున్; సంయమీ
మునివరా!; తప్పు చేసితిన్; కినియకుము + అయ్య! = కోపింపవలదయ్యా!; ఎందును =
టను; ఒకఁడు = ఎవఁడైనను; మిమ్ము = మీకు (షష్ఠికి ద్వితీయ); కీడునన్ పెట్టెడివాఁడు
హాని చేయఁదలపెట్టువాఁడు; లేఁడు + అని; పరికింపన్ + ఐతి = గమనింపక పోయితిని;
ము; సాత్యకి తోడు = నా తమ్ముఁడైన సాత్యకి పేరుమీఁద ఒట్టు పెట్టుకొని; ఆధరణీశ
మార ధూర్తులన్ = ఆ దుర్జనులైన రాజకుమారులను; ఇంతలో = అతి త్వరలో, తునిమెదన్;
లన్ + తూలకు = చింతతో నిలుకడను పోగొట్టుకొనవలదు (నిశ్చలముగా వంతలు మాని
ండుఁడు).

తా. అనఁగా, యతిని చూచి, కృష్ణుఁడు ఇట్లనెను. "ఓ మునివరా! తప్పు చేసితిని.
ంపకుమయ్యా! మీకు ఎవఁడును కీడు చేయఁడని, మీ క్షేమమును గుఱించి
శీలింపఁ జాలక పోయితిని. నా తమ్ముఁడైన సాత్యకి మీఁద ఒట్టు సుమా! ఆ
జకుమారులైన హంసడిభకులను అతి త్వరలో వధించెదను. చింతతో, నిశ్చలత్వమును
గొట్టు కొనవలదు.

విశే. సానుభూతితో, దయామయుఁడై కృష్ణుఁడు 'శాంతింపుఁడు. కొంతకాలము
ప్పు వహింపుఁడు' అని మృదువుగా, తాను తప్పు చేసినట్లు అంగీకరించుచు మునుల
మ, ఓదార్చెను.

). ఎఱిఁగి యెఱిఁగి నీముందఱ
నఱగొడెము చేసి పోయి రది గెకొన నీ

తెఱఁ గయిన హంసడిభకులు
కొఱవిం దల బరికికొన్న [1]కొఱఁడులు గారే. 106

ప్రతి: నీ ముందఱ = నీ ఎదుటనే; ఎఱిఁగి, ఎఱిఁగి = బాగుగా నిన్ను గుఱించి తెలిసియు; అఱగొడ్డెములు = చెడ్డ పనులు; చేసిపోయిరి; ఈ తెఱఁగు + అయి = ఇట్టి పాపకర్ములైన; హంస డిభకులు; అది = ఆ దుష్కర్మల ఫలమును; కైకొనన్ = అనుభవించు విషయమందు; కొఱవిన్ = మండుచున్న కొయ్య మొద్దులతో తల బరికి కొన్న = తలను రాచుకొన్న; కొఱఁడులు = మూఢులు; కారే!

తా. నీ ఎదుటనే! నీ శక్తిసామర్థ్యములు, స్వభావము, బాగుగా తెలిసియే, చెడ్డపనులను చేసి వెళ్ళిపోయిరి కదా! ఈ విధమైన పాపకర్ములగు హంస డిభకులు, ఆ దుష్కర్మఫలమను భవించుటకు, మండు కట్టెలతో తలను రాచుకొన్న మూఢులు కదా!

మండుచున్న కట్టెతో తలను రాచుకొన్న తల, కాలిపోవును. అట్లే, మునులను బాధించిన ఆ పాపులు, ఆపాప ఫలమను భవించుటకు, నాశము కాక తప్పదని, తాను తప్పక, వారిని వధించెదనని, వారు కావించిన దుష్కృత్యములకు తగిన శిక్ష మరణమని తన హృదయమును, విప్పి చెప్పెను.

అలం : లోకోక్తి.

కం. హరుఁడు వర మిచ్చె వాణీ
వర వరుణ కుబేర సురప వైవస్వతు లి
త్తురు గాక నీవు గినిసిన
వరముల గిరములను బ్రదుకువారే కుమతుల్. 107

ప్రతి: హరుఁడు = శివుఁడు; వరమిచ్చెన్ = వరములను ఇచ్చియున్నాఁడు; వాణీవర = సరస్వతి పతి, బ్రహ్మ; వరుణకుబేర = వరుణుఁడును, కుబేరుడును; సురప = దేవతలకు ప్రభువు, మహేంద్రుఁడు; వైవస్వతులు = వివస్వంతుని పుత్రుఁడు, యముఁడు మొదలైన వారును; ఇత్తురు గాక = (మరికొన్ని) వరములను ఇచ్చెదరు గాక; నీవు; కినిసినన్ = కోపించినచో; వరముల గిరములను = అల్పములైన్నరక్షింపఁజాలని, వరములచే; కుమతుల్ = దుష్టబుద్ధులు అయిన రాకుమారులు; బ్రదుకు వారే = బ్రదుకఁ గలరా?.

తా. పరమ శివుఁడు వరముల నిచ్చి యున్నాఁడు. బ్రహ్మ, వరుణ కుబేర మహేంద్ర

1. కొడుకులు

యములును మఱికొన్ని వరములను ఇచ్చెదరుగాక! నీవు కోపము చెందినచో, ఆ దుర్బలములైన వరములు వారిని రక్షింపఁగలవా? వారు ప్రాణములతోనుండఁగలరా?

వ్యా. వరములను గిరములను.

సూ. నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘములకు 'గి గీ'లగు. ప్రకీర్ణ, బాల - 22.

'వ' లో హ్రస్వమున్నది కనుక 'గి' హ్రస్వమే, ఆదేశమైనది. వివస్వంతుడు = సూర్యుఁడు. వైవస్వతుఁడు : సూర్యుని పుత్రుఁడు యముఁడు.

కం. కలఁడు జరాసంధుఁడు వా
రలకుం జెలికాఁడు నిష్ఠురభుజాపరిఘుం
డలఘు బలుఁడు సేనలతోఁ
గలయక మును వారిఁ జంపఁ గలవాఁడు జామీ 108

తా. జరాసంధుఁడనెడి రాజు, హంస డిభకులకు మిత్రుఁడొకఁడు ఉన్నాడు. అతఁడు కఠినములైన గడియల వంటి భుజములు కలవాఁడు. అపరిమితమైన బలుఁడు. అతఁడు తన సేనలతో, హంసడిభకులను కలియుటకు ముందే, ఆ ఇరువురిని చంపఁగలవాఁడను చూడుమా!

చం. ఎద్రిచిన కాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధ వల్లికం
బద్రిచినవారు మన్ని శిత బాణపరంపర వైవ మిణ్గురుల్
విద్రుపఁగఁ దత్ఫలంబుల చవిం జరితార్థులుగా శరీరపుం
జిద్రుపలు చేరుఁ దత్సుతుల చేతులఁ గాకకులంబు వాతులన్. 109

ప్రతి:ఎద్రిచిన కాలపాకమునన్ = ప్రతికూలమైన కాలము పక్వమగుటచే (పాపఫలము అనుభవింప వలసిన సమయము కలుగుటచే); ఈ గతిన్ = ఇట్లు; నీమదిన్; క్రోధ వల్లికన్ = తీవ్రమైన కోపమనెడి త్రాటిచే; పద్రిచిన వారు = నీకు మనస్తాపమును కలిగించిరి. మత్+నిశిత బాణ పరంపర వైవన్ = నా వాఁడియైన బాణముల వరుసలము, వారిపై ప్రయోగింపగా; (అవి) మిణ్గురుల్ = నిప్పుకణములను; విద్రుపఁగన్ = వెదఁజల్లగా; తద్ + ఫలంబుల చవిన్ = ఆ పూర్వ పాప ఫలముల యొక్క రుచితో; చరిత+అర్థులు గాన్ = నడవడికను (గుణపాఠమును)

నేర్చుకొన్న విధమున; శరీరము+చిద్రుపల్ = వారి శరీరము యొక్క తెగిన ముక్కలు; తద్ + సతుల చేతులన్ = వారి భార్యలచేతులందు; కాకకులంబుల వాతులన్ = కాకుల గుంపు యొక్క నోళ్లయందు; చేరున్.

తా. కాలము ఎదురైనది. వారి పాపములు పండి వాని ఫలములు అనుభవింపవలసిన సమయము వచ్చినది. కనుక నీ మనస్సునకు వారు తాపమును కలిఁగించిరి. నా వాఁడియైన బాణముల మొత్తము, అవి నిప్పుకణములను విదలింపఁగా, పూర్వ పాపఫలముల రుచిని చూచి, వారు గుణపాఠము నేర్చుకొన్న వారను విధముగా, వారి మేని ముక్కలు వారి సతుల చేతులయందును, కాకి గుంపుల నోళ్ల యందును పడును. నీతి: సత్పురుషులకు ఎగ్గు చేయువారు, నీచమైన నాశమును చవి చూచెదరు.

వ్యా. శరీరపుఁజిద్రుపల్. శరీరము+చిద్రుపల్. పుంప్వాదేశసంధి, నుగాగమము. (చూడుము పద్యము -26)

చం. అనిన మునీంద్రుఁ డెంతయుఁ బ్రియంబున నచ్యుత! పుండరీకలో
చన! కమలాసనాది సురసంఘశరణ్య! పదాంబుజా! జనా
ర్దన! దనుజాంతకా! కొలిచెదం బ్రణమిల్లెద సంస్తుతించెద్
నిను ననిశంబు నన్నుఁ గృప నెక్కొని కావుము దేవ! నావుడున్. 110

తా. అని వచింపఁగనే దుర్వాసుఁడు ఉప్పొంగి, ప్రీతితో'అచ్యుత! (చ్యుతిలేనివాఁడు); పుండరీక లోచన! (తెల్లని పద్మములవంటి కన్నులు కలవాఁడా!); కమలాసనుఁడు (బ్రహ్మ) మొదలైన సురల సమూహముచే శరణుపొందిన పాదపద్మములు కలవాఁడా! జనార్దన! నిన్ను ఎల్లప్పుడును సేవించెదను. నీకు నమస్కరించెదను. నిన్ను బాగుగా పొగడెదను. ఓ దేవా! నన్ను కృపాతిశయముతో రక్షింపుము! అని ప్రార్థన చేయఁగా (తరువాతి వచనముతో).

వ. అద్దేవ దేవుం డిట్లనియె. 111

తా : సులభము.

కం. ఏమే నేమే నొడివిన
నామాటల కెగ్గుగా మనంబున యతి చూ

డామణివి నీవు దలఁపకు
స్వామీ మన్నింప వలయు సైరణతోడన్.

ప్రతి: స్వామీ! ఏమేన్+ఏమేన్ = ఏమైనను (నిన్ను నొప్పించునట్టి పలుకులు); నొడివిః
లియక) చెప్పి యున్నచో; నీవు; యతి చూడామణివి = యతులలో మిక్కిలి శ్రేష్ఠుఁడ
టలకు = అట్టి మాటలకు; మనంబున ఎగ్గుగాన్ = తప్పుగా; తలఁపకు; సైరణతోడ
ర్పుతో; మన్నింపవలయున్.

తా: స్వామీ! నేను నిన్ను నొప్పించు విధమున ఏమైనను తెలియక చెప్పిన మా
వేని, యతులలో శ్రేష్ఠుఁడవైన నీవు ఓర్పుతో ఉదారుఁడవై ఆ మాటలను తప
ఁపక ఓర్పుతో నన్ను క్షమింప వలయును.

దానము ధర్మముఁ దత్త్వ
జ్ఞానము సత్యంబు యశము శతమఖ పుర సో
పానము లయినవి సయిరణ
దాన కదా యతుల కది ప్రధానము దలఁపన్. 1

ప్రతి: సైరణన్ = క్షమచేతగదా!; దానము = ఇతరులకు ఇచ్చుట; ధర్మము = చేయవల
లు, సత్కర్మలు; తత్త్వజ్ఞానము = బ్రహ్మమును గూర్చి తెలిసికొనుట; సత్యము = నిజ
ట; యశము = (సాధుసేవచే వచ్చు) కీర్తి; మొదలగు గుణములన్నియును; శతమఖ
ంద్రుని పురమగు అమరావతి చేరుటకు (శతమఖుఁడు = నూఱు యజ్ఞములు చేసినవాఁ
నములు + అయినవి = మెట్లయినవి; దానకదా = ఆ కారణముచే, గదా!; అది =
గుణము; తలపఁన్ = ఆలోచింపఁగా; యతులకు; అతి ప్రధానము = చాలముఖ్యమ

తా: దానము ధర్మము, తత్త్వజ్ఞానము, సత్యము యశము మొద
ములన్నియును, క్షమాగుణము చేతనే స్వర్గలోక ప్రాప్తికి సాధనములగును. కన
సుఖ మాశించు యతులకది చాల ముఖ్యము.

శ్యపమహర్షి క్షమాగుణమును ఇట్లు ప్రశంసించెను. "క్షమయందే, వేదములు య
బ్రహ్మవిదులు, పడయునట్టి పుణ్యగతులను క్షమావంతులు, పొందఁగలరు"
అభిప్రాయము కశ్యపగీత యందున్నది.

ం. 'జా' కును 'శీ' కును సంయుక్త...

కం. అని వేఁడికొని యతీంద్రులఁ
దన గృహమున నారగింప దామోదరుఁ డిం
పునఁ బ్రార్థించిన నేమియు
ననుమానము లేక వారు నొఁ గా కనినన్. 114

తా. అని, కృష్ణుడు యతివరులను ప్రార్థించి, తన యింట భుజింపుఁడని ప్రీతితో కోరఁగా, ఆ మునులు హంసది భక్తుల వధ విషయమున, సందేహములేనివారై, విశ్వాసముతో ఆతిథ్యమునకు సమ్మతించిరి.

వ్యు. దామోదరుఁడు : దామ+ఉదరుఁడు - తులసిమాల ఉదరమున కలవాఁడు, విష్ణువు.

గీ. అలవరించి చతుర్విధాహారములను
దుష్టి చేసి దుకూలముల్ [1]దుంచి తుంచి
కట్ట నిచ్చిన యతులును గమలనాభు
వీడుకొని మున్ను వచ్చిన జాడఁ జనిరి. 115

ప్రతి: చతుస్+ విధ ఆహారములను - 1. భక్ష్యములు, (నమలితినఁదగినవి) 2. లేహ్యములు (నాకఁదగినవి), 3. చోష్యములు (పీల్చుటకుఁదగినవి) 4. పానీయములు (త్రాగుటకుఁ దగినవి) అనునాలుగు విధములైన భోజనములను; అలవరించి = సిద్ధముచేసి; తుష్టి చేసి = (వారిని) తృప్తి పఱచి; దుకూలముల్ = మేలైన సన్నని వస్త్రములను; తుంచి తుంచి; కట్టనిచ్చిన = కట్టుకొనుటకు స్వయముగా ఇయ్యఁగా యతులును; కమలనాభున్ = కమలమును నాభి యందు కలవానిని, (కృష్ణుని); వీడుకొని = పోయి వచ్చెదము అని అనుమతి పుచ్చుకొని; మున్నువచ్చిన జాడన్ = ముందు వచ్చిన దారినే, అనుసరించి; చనిరి.

తా : భక్ష్యములు (గారెలు) లేహ్యములు (తేనె), చోష్యములు (ఫలములు), పానీయములు (పాయసము) అనెడి నాలుగు విధములైన ఆహారములను సిద్ధము చేసి, వానిచే వారిని సంతృప్తి పఱచి, కొత్తవైన సన్నని వస్త్రములను స్వయముగా జతగానున్న వానిని వేఱు చేయుచు, కట్టుటకు ఇయ్యగా, యతులు అందఱును తృప్తిచెంది కృష్ణుని అనుమతి పుచ్చుకొని ముందు వచ్చిన మార్గముననే తమ ఆశ్రమమునకు మరలిపోయిరి.

---

1. ద్రుంచి త్రుంచి

కం. విచ్చలవిడి దుర్వాసుం
డచ్చోటన నిల్చె సంతతానంద పదం
బిచ్చఁ దలంచుచు నారదుఁ
డచ్చపుఁ జెలికాఁడు గా మురాంతకుఁ డంతన్. 116

ప్రతి : దుర్వాసుండు; విచ్చలవిడి = తన ఇష్టమును అనుసరించి; సంతత+ఆనంద పదంబు = నిత్య మైన బ్రహ్మానంద స్థితిని, మనస్సున తలఁచుచు నారదుఁడు; అచ్చము+చెలికాఁడుగా = దోషములేని మిత్రుఁడుగా నుండఁగా; ఆ + చోటున = అచ్చటనే, ద్వారక యందే; నిల్చెన్; మురాంతకుఁడు; అంతన్ = పిమ్మట.

తా : దుర్వాసుఁడు మనఃశాంతిని బొంది, తన యిష్టమును అనుసరించి శాశ్వతమైన బ్రహ్మానంద పదమును తలఁచుచు. నారదుఁడు స్వచ్ఛమైన మిత్రుఁడు అచట నుండఁగా, కొంత కాలము ద్వారకయందే విడిసెను. పిమ్మట కృష్ణుఁడు (తర్వాతి వచనముతో).

ఆనందపదము; వరమానసమునందు, స్వస్వరూపముతో ఆత్మ చైతన్యము అనుభూతమైనప్పుడు యోగి పొందుస్థితియే ఆనందము. బ్రహ్మరంధ్ర మందున్న సహస్రారచక్ర మధ్యమునందు, అమృతనాడీ స్పందనముచే, తద్గతమగు చంద్రమండలము నుండి అమృతము ప్రసవణము జరిగినపుడు పరమేశ్వర ధ్యానముచే యోగి ఆ అమృత పానమును కావించుచు, అనిర్వచనీ యానుభూతిని పొందును. దీనినే బ్రహ్మానంద మని పచింతురు. సాధనచే యోగులు ఈ అనుభూతిని అలవఱుచుకొందురు.

వ్యా. అచ్చపుఁజెలికాఁడు, అచ్చము+చెలికాఁడు. పుంప్వాదేశ నుగాగమసంధి (చూడు పద్య - 26)

వ. హంసడిభకుల వధింపం జింతించుచుండెఁ దదనంతరంబ. 117

తా : శ్రీకృష్ణుఁడు హంసడిభకులను వధింపవలెనని ఆలోచించుచుండెను. తర్వాత.

ఉ. క్రూరతఁ గ్రొవ్వి హంసడిభకుల్ సభకుం జని రాజ్యగౌరవో
దారుని బ్రహ్మదత్తుఁ దమతండ్రిఁ గనుంగొని రాజసూయమున్
ధీరతం జేయు మెయ్యెడల దిగ్విజయం బొనరించి యజ్ఞ సం
భారము లెల్లఁ దెత్తు మని బాహుబలంబుఁ జలంబుఁ జెప్పినన్. 118

ప్రతి: హంసడిభకుల్; క్రూరతన్ = నొప్పించుచు భయమును కలిగించు స్వభావముచే; క్రొవ్వి = మదించి ఒడలు తెలియక; సభకున్ + చని; రాజ్య+గౌరవ+ఉదారునిన్ = రాజ్యమును పాలించుచుండుటచే గౌరవనీయుఁడై, - ఔదార్యముగల; తమ తండ్రిన్; బ్రహ్మదత్తున్; కనుంగొని; రాజసూయమున్; ధీరతన్ = ధైర్యముతో; చేయుము; ఏ+ఎడలన్ = ఎచట నైనను, ఎచటనున్న రాజ్యమునైనను; దిక్+విజయంబు+ఒనరించి = అన్ని దిక్కులకు దండయాత్రచేసి, జయమును పొందినవారమై; యజ్ఞ సంభారములన్ + ఎల్లన్ = యజ్ఞమునకు వలయు వస్తుసముదాయమును అంతయు; తెత్తుము = తేఁగలము; అని; బాహుబలంబున్ = భుజబలమును; చలంబున్ = స్పర్ధను, పట్టుదలను; చెప్పినన్.

తా: క్రౌర్య మధికమగుటచే, మైమఱచి, హంసడిభకులు, సభకు చని, రాజ్యగౌరవమును ఔదార్యమును కల తమ తండ్రియైన బ్రహ్మదత్తుని చూచి "రాజసూయము అనెడి (రాజులను వధించు) యాగమును చేయుము, భూమండలమందలి రాజ్యములను అన్నింటిని జయించి యజ్ఞ కార్యమునకు వలయు వస్తుసముదాయముల నెల్ల తెచ్చెదము" అని తమ భుజబలమును, పట్టుదలను తెలియఁజేయఁగా, (మీఁది పద్యముతో).

విశే. హంస డిభకులు, క్రౌర్యము మాత్సర్యము కలవారు. సజ్జనులయెడ ద్వేషము కలవారు. క్రౌర్యమాత్సర్యములు అతిశయించుటచే మైమఱచి తమ శక్తి యెంతో గణింపక దిగ్విజయ మొనరింప సంకల్పించిరి. వినాశకాలమందు బుద్ధి మాంద్యము కలుగును కదా!.

వ్యా. ఏ+ఎడలన్ = ఎయ్యెడలన్, త్రికసమాసంధి. (చూడు పద్య, 7, 15)

కం. అతఁ డౌఁ గా కనుటయు స
న్నుతమతి యగు నాజనార్దనుండు ధరిత్రీ
పతి సుతులకు నతిహితముగఁ
జతురతతోఁ బలికె సహజ సౌజన్యమునన్. 119

తా. బ్రహ్మదత్తుఁడు "ఔఁగాక" అని, రాజసూయమును నిర్వహించుటకు సమ్మతిని తెలియఁజేయఁగా సత్పురుషులచే స్తుతింపఁబడు జనార్దనుఁడు తన సహజమైన మంచితనముతో నేర్పుతో సదుపదేశము జేసెను.

గీ. రాజసూయంబు చేయ నేరాజు దలఁచు
నాతనికి రాజు లరిగాఁపు లయినఁ గాని

నిర్వహింపదు మన మెల్లి నేఁడుఁ జేయు
లావు మెఱయునె ధర యింగలాలపుట్ట. 120

తా: ఏ రాజు, రాజసూయమును చేయఁదలఁచునో, అతనికి ఇతర రాజు లందఱును కప్పమును చెల్లించి నప్పుడే, అది జరుగును. లేనిచో అది జరుగదు. మనము రేపో నేఁడో చూపునట్టి పరాక్రమము ప్రకాశింపదు. భూమండలము నిప్పులప్రోవు.

విశే. హంసడిభకులకంటె అతిశయించిన పరాక్రమము ప్రభావము, ప్రతాపము కల రాజులున్నారని, వారందఱును శత్రువులను కాల్చివేయు దహన శీలురని జనార్దనుఁడు రాజకుమారులకు సూచించి, మఱియును హితబోధ చేయుచున్నాఁడు.

వ. అది యె ట్లనిన. 121

తా : సులభము.

చం. ఇరువదియొక్క మాఱు ధరణీశ్వరులం బరిమార్చి పేర్చి దు
ర్ధరతర సారుఁ డైన జమదగ్ని తనూజుఁడు సంగరంబులో
సరిసరిఁ బోరియుం బిదపఁ జాలక యెవ్వని కోహటించె నా
పరబల భీష్ము భీష్ముఁ బెఱపార్థివు లే మనువారు పోరులన్. 122

అర్థ: దుర్ధరతర సారుఁడు = ఎదిరించుటకు వీలుకాని బలము కలవాఁడు; ఓహటించెన్ = వెనుకాఁడెనో; ఆ పరబల భీష్మున్ = ఆ శత్రు సైన్యములకు, భయంకరుఁడైన భీష్ముని విషయమున; పెఱ పార్థివులు = సామాన్యులైన, ఇతర రాజులు; పోరులన్ = యుద్ధములలో; ఏమి+అనువారు? = ఏమి చెప్పఁగలరు?

తా: ఇరువది యొక్కసారులు రాజులను, వధించి, అతిశయించి, ఎదిరించుటకు వీలులేని బలముకల జమదగ్ని పుత్రుఁడైన పరశురాముఁడు యుద్ధములో సమమైన సామర్థ్యముతో భీష్మునితో యుద్ధముచేసి అంతమున తన శక్తి సన్నగిల్లుటచే, ఆ వీరునితో పోరాడఁజాలక వెనుకంజ వేసెను. అట్టి భయంకరుఁడైన భీష్ముని విషయమున, సామాన్యులైన రాజులు ఏమి చేయఁగలరు? (భీష్ముని గురువైన పరశురాముఁడే పరాజయము చవి చూడఁగా మీ వంటి వారు లెక్కకు వత్తురా? మీ రతనిని జయింపఁజాలరు అని భావము).

మ. కురువీరాగ్రణి బాహ్లికుం డలిగినం గోదండ పాండిత్య మె
వ్వరుఁ జూపంగ వలంతులే పవనజుో వైరిక్ష్మాపాల భీ
కరు భీముం గదలించువారుఁ గలరే కంసారితోఁ బోరిలో
సరివాఁ డై యరి మీకుఁ బెట్టుట జరాసంధుండు సైరించునే. 123

ప్రతి: కురువీర+అగ్రణి = కురువీరులలో మొదటివాఁడు; బాహ్లికుండు (శంతనుని తమ్ముఁడు) అలిగినన్ = కోపము చెందినచో; కోదండపాండిత్యము = విలువిద్యయందు గల నైపుణ్యమును; ఎవ్వరును = ఎవరైనను; చూపంగన్; వలంతులే! = సమర్థులే! యోగ్యులా! పవనుజున్ = వాయుదేవుని సుతుఁడును; వైరిక్ష్మాపాలభీకరున్ = పగవారైన భూపాలకులకు, భయమును కలిగించు వాఁడైన; భీమున్ = (ధర్మజుని తమ్ముఁడైన) భీముని, కదలించు వారున్,కలరే? = ఉన్నారా? కంస+అరితో = కంసుని శత్రువైన ఆ కృష్ణునితో; పోరిలోన్ = యుద్ధమందు; సరివాఁడై = సమానమైవ వాఁడై ఉండియును; జరాసంధుండు; మీకున్; అరిపెట్టుటన్ = కప్పమిచ్చుటకు; సైరించునే = సహించునా (సమ్మతించునా)!

తా: కురువీరులలో అత్యున్నతుఁడు, శంతనుని తమ్ముఁడు బాహ్లికుఁడు, కోపించినచో, తమ విలువిద్యా విజ్ఞానమును ప్రకటించు యోగ్యు లెవరున్నారు? శత్రురాజులకు భీకరుఁడునగు భీముని చలింపఁజేయు వారున్నారా? శ్రీ కృష్ణునితో యుద్ధమందు సమానుఁడైనవాఁడు, జరాసంధుఁడు, మీకు కప్పమిచ్చుటకు సమ్మతించునా?

జరాసంధుఁడు: మగధ దేశమునకు రాజు. జన్మించినప్పుడు "జర" అను రాక్షసి చేత శరీరమందలి రెండు భాగములును సంధింపఁబడుటచే అతనికి, జరాసంధుఁడను పేరు కలిగెను. గిరివ్రజ పురము అతని రాజధాని, దీని చుట్టును మూడు పర్వతములు పెట్టని గోడలై యుండును. కనుక శత్రువులకు లోపలికి చొచ్చుటకు శక్యము కాదు. కంసుఁడు అతని అల్లుఁడు. ఆయుధములచే మరణము లేనివాఁడు, అతఁడు అవని పతులను చెఱపట్టి, తన నగరమున బంధించి, భైరవ పూజకై ఒక్కొక్కని బలి ఇచ్చెడి వాఁడు. అతఁడు భీమునితో పదునాల్గుదినములు మల్లయుద్ధము చేసి తుదకు అతని చేతిలో అసువులను పాసెను.

వ్యు. క్ష్మాపాలుఁడు, భూమిని పాలించువాఁడు రాజు.

సీ. నరకాసుర ప్రాణనాళోత్తరణ కేళి
రణ కేళి వల కేలి రమణఁ జూపెఁ

గంసదానవ శిరఃకమల [1]కర్తన మేలు
తనమేలుచేయి పెద్దలకు నొసఁగెఁ
జాణూర ముష్టిక క్షతజకీలాలంబు
నాలంబులో నెల్ల నలవు వఱపె
మురహయగ్రీ వాంత్రమూల ఫేనావలి
నావ[2]లి దలఁగఁ జీకాకు పఱచె

గీ. వీరరససార [3]సాకారవిహరణంబు
విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ వెంపళ్ళు తమ కెంతబంటి యనుట. 124

ప్రతి: నరక+ అసుర ప్రాణనాళ = నరకుఁడనెడి రక్కసునియొక్క జీవము (ప్రాణము) అనెడి తామరకాడను; ఉత్తరణకేళిన్ = పైకి లాఁగి వేయు ఆటయైన; రణకేళిన్ = యుద్ధ క్రియలో; వలకేలి = కుడిచేతియొక్క; రమణాన్ = నేర్పును; చూపెన్; కంసదానవ = కంసుఁడనెడి రాక్షసుని; శిరఃకమల = శిరస్సు అనెడి తమ్మిపువ్వును; కర్తనము + ఏలు = త్రుంచి వేయు పనియందు; తన మేలు చేయు = తనయొక్క సాయపడు చేతిని; పెద్దలకున్ = వసుదేవుఁడు (కృష్ణుని తండ్రి), ఉగ్రసేనుఁడు (మాతామహుఁడు), మొదలగు పెద్దలకు; ఒసఁగెను = ఇచ్చెను; చాణూర ముష్టిక = కంసుని మల్లుఁడైన చాణూరుఁడనెడి (నీటిలోఁగల) తామరగడ్డయొక్క; క్షతజ = పోట్లచే వెలువడిన సారమును రక్తమును ఆలంబులోన్ + ఎల్లన్ = పోరాటములో అన్ని వైపులను; అలవు పఱపెన్= విలాసముగా ప్రసరింపఁజేసెను;మురహయగ్రీవ = అసురులైన మురహయగ్రీవుల యొక్క ప్రేవులు అనెడి వేర్లలోఁగల నురుగుల మొత్తమును; ఆవలితలఁగన్ = ఉపద్రవము తొలఁగు నట్లు; చీకాకు పఱచెన్; వీరరస కాసార విహరణంబు = వీర భావమనెడి సరస్సులో చక్కని సంచారము; విష్ణువునకున్ = (వీనుఁగువంటి) కృష్ణునకే; ఒప్పును = తగును. అతనితో = అట్టి పరాక్రమశాలితో; విగ్రహింపన్ దొరకొనినన్ = కలహించుటకు పూనుకొన్నచో; మనకు; (అదెట్లుండుననఁగా) మద్దులు మునిఁగి పాఱన్ = దృఢమైన మద్ది చెట్లు, ప్రవాహములో కొట్టుకొనిపోవుచుండఁగా; వెంపళ్ళు = చిన్న వెంపటి మొక్కలు; తమకు ఎంత బంటియనుట = ఆప్రవాహము, మనకు ఒక లెక్కయా అనుట.

తా: నరకుని ప్రాణమనెడి తామరకాడను, లాఁగి వేయుటలో తనకుడిచేతి నేర్పును చూపెను. కంసుని యొక్క తలయనెడి తమ్మిపువ్వును త్రుంచి వేయుటకు వాడిన తన

1. కృంతనమగు 2. లీవలఁగ 3. కాసార.

కరమును, పెద్దలకు ఊఁతగా నిచ్చెను. చాణూరుఁడనెడి తామరగడ్డ యొక్క పోట్లనుండి వెలువడు సారమును పోరాటములో అన్నివైపుల విలాసముగా పఱపెను.

అసురులైన మురహయ గ్రీవుల యొక్క ప్రేవులు అనెడి మూలమందలి నురుగులను ఆపద తొలఁగు నట్లు చిందఱవందఱచేసెను. (తామర గడ్డకు, సన్ననివేర్లు తెల్లగా నురుగువలెనుండును)

వీరత్వమనెడి సరస్సులో విహారము (ఏనుఁగునకుసాటియైన) కృష్ణునకే తగును. అట్టి బలశాలిని ఎదుర్కొనుట, ఎట్లుండుననఁగా, వడిగల ప్రవాహములో పెద్ద మద్ది చెట్లు, కొట్టుకొని పోవుచుండఁగా, బలములేని, చిన్న వెంపటి మొక్కలు, తమకు, ఆ ప్రవాహము ఒక లెక్కయా? అని ఆక్షేపించి, హేళన చేసినట్లుండును.

అలం: రూపకము నరక, కంస, చాణూర, మురహయగ్రీవులు, వరుసగా, తామరకాడ, తమ్మిపువ్వు, తామరగడ్డ, మూలము అని తామరతో అభేదముగా వర్ణింపఁబడిరి. ఏనుఁగు స్వేచ్ఛగా కాసారములో విహరించి తామర లను అనాయాసముగా నాశము చేయు విధమున విష్ణువు క్రూర దైత్యులను వధించెను. అట్టి ఆతనితో యుద్ధమును తలపెట్టవలదని హెచ్చరిక.

ఛం. "ఆవలిఁదలఁగ జీకాకు పఱచె" - సీసపద్యపు నాల్గవపాదమందు ద్వితీయార్థములో ఆద్యక్షరమైన 'ఆ'కును, "చీకాకు" లో 'కా' అను అక్షరమునకు యతిమైత్రి. ఇది శకంధ్వాదుల వలె ఉభయవళికి ఉదాహరణము.

మ. నిలువం జాలుదురే రణాంగణములో నీలాంబరాడంబరో
జ్జ్వలవేషంబు హలాహలస్థలహలవ్యాపార దోస్సారముం
బ్రళయాంభోధర సోదరారవము నొప్పన్ దర్ప మేర్పాటుగా
బలభద్రుం డతిరౌద్రుఁ డై కదిసినం బ్రత్యర్థి భూపాలకుల్. 125

ప్రతి: బలభద్రుండు = బలరాముఁడు; రణ+అంగణములో = యుద్ధరంగమందు, నీల + అంబర+ఆడంబర = నీలి వస్త్రముధరించి, అతిశయమైన; ఉజ్జ్వలవేషంబు = నిగనిగలాడు ఆకృతితో; హలాహలస్థల హల వ్యాపార దోఃసారమున్ = దున్ను నట్టి పొలములోవలె, నాఁగేటి ప్రయోగముతో (తన) భుజబలమును; ప్రళయ+ అంబోధర సోదర + ఆరవమున్ = లయకాలమందలి, మేఘములతో సమానమగు, (సింహ) గర్జనలతో; దర్పము+ ఏర్పాటు గాన్

= గర్వము గట్టిపడునట్లు; ఒప్పన్ = (ఆటోపముతో) తగిన విధమున; అతిరౌద్రుఁడై = తీవ్రమైన క్రోధభావముతో; కదిసినన్ = సమీపింపగా; ప్రత్యర్థి భూపాలకుల్ = శత్రురాజులు; నిలువన్ + చాలుదురే = ఎదుర్కొనుటకు నిలుతురా?

తా : బలరాముఁడు నీలవస్త్రధారియై, పరాక్రమముతో నాగేఁటిని ధరించి, లయ కాలమేఘముల వంటిగర్జనలతో యుద్ధ రంగమందు చలింపని గర్వాతిశయముతో, రౌద్రమూర్తియై శత్రురాజులను ఎదిర్చిన, వారతని ఎదుట నిలుతురా?

(అర్థాంతరము) : హలాహలస్థల హల వ్యాపార = హాలాహల మనెడి విషమువలె చెదర గొట్టుపనితో.

అలం : 1. స్వభావోక్తి 2. ఉపమ హలాహలస్థల హలవ్యాపారము, ప్రళయాంభోధర సోద రారవము.

రసము : రౌద్రము.

మ. వికటవ్యూహవిధా విహ స్త భట మై విధ్వస్త మాతంగ మై
శకలీభూత శతాంగ మై శరఘటాశల్యాయమా నాశ్వ మై
సికతాసేతువు నిమ్నగారయముచేఁ జిం దైన చందాన సా
త్యకిచేతం బడుశత్రుసంఘము దశాదైన్యంబు సైన్యంబునన్. 126

ప్రతి: సాత్యకిచేతన్; శత్రు సంఘము = పగవారి మొత్తము; వికట వ్యూహవిధావిహస్తభటమై = విరివియైన యుద్ధ విన్యాసము యొక్క ఏర్పాటుచే కలఁత చెందిన భటులు కలదై; విధ్వస్తమాతంగమై = తెగిపడిన ఏనుఁగులు కలదై; శకలీభూత శతాంగమై = ముక్కలైన అరదములు కలదై; శరఘటా శల్యాయామానాశ్వమై = బాణముల మొత్తముచే, ఎముకలుగా రూపొందిన గుఱ్ఱములు కలదై; సికతాసేతువు = ఇసుకవంతెన; నిమ్నగా రయముచే = నదీ ప్రవాహవేగముచే; చిందైన చందానన్ = చెదరిపోయిన విధమున; సైన్యంబునన్ = సేనలయందు (నాల్గింటియందు); దిశాదైన్యంబున్ = దిక్కులేని దశను, హీనస్థితిని పొంది; పడున్ = కూలిపోవును.

తా: సాత్యకిచే శత్రుసేన ఆతని యుద్ధ వ్యూహము వలన, వన్నె చెడిన భటులును, తెగిన ఏనుఁగులును, ముక్కలైన పెద్ద తేరులుమ, బాణములచే ఎముకలు మాత్రము

మిగిలిన గుల్మములును కలదై, ఇసుకవంతెన, నదియందలి నీటి వేగముచే చెదరినట్లు కూలిపోవును.

విశే. అలం : ఉపమ, రసము : బీభత్సము

వ. అదియునుం గాక. 127

తా : సులభము

ఉ. చేసినవారు మీరు గడుఁ జెట్టతనం బది యోర్వ లేక దు
ర్వాసుఁడు వాసుదేవుఁగని వైరము తోరము చేసినాఁడు స
న్న్యాసులఁ గూడికొంచుఁ జని యంతకుము న్గడిఁద్రెవ్వి మీ యెడన్
గాసిలియుండు యాదవనికాయము సైఁపదు రాజ సూయమున్. 128

అర్థ : చెట్టతనము = కడు; తోరము చేసినాఁడు = గట్టి చేసెను; గడిఁద్రెవ్వి = హద్దు మీఱి; సైఁపదు = ఇష్టపడదు, (నిరోధించును).

తా: మీరు మొదట చాల కీడు చేసినారు. ఆ బాధలను సహింపక దుర్వాసుఁడు యతులను కొనిపోయి, కృష్ణుని చూచి మీ యెడ పగను గట్టి చేసెను. అంతకు ముందే హద్దు మీఱి మిక్కిలి కోపముతో నున్న గొల్లలు మీ రాజసూయ యాగమును అడ్డగింతురు.

కం. మును చేసిన వైరంబును
ముని చేసిన వైరమును మిముం దడవక పో
వునె వై దేశికుఁ డగు వి
ప్రునిచే నివ్వార్త వింటి భోజనవేళన్. 129

తా: ముందు, మీరు కావించిన పగ (గొల్లలకు చేసిన కీడు), తర్వాత దుర్వాసముని, మీరు కలిగించిన భంగ పాట్లను కృష్ణునకు చెప్పి ఆ పగను పెంచగా, ఆ దుష్కార్యఫలములు అంతయును మీరు అనుభవింపక తప్పువా? ఈ వృత్తాంతమును అతిథియై మాయింటికి వచ్చిన విదేశీయుఁడగు విప్రుని వలన వింటిని.

కం. ఒప్పగునో తప్పగునో
యిప్పటికిం దోఁచుకార్య మిది నృపతులకుం
జెప్ప వలె నాప్త మంత్రులు
చొప్పగునే మనకు రాజసూయము చేయన్. 130

తా: ఒప్పో! తప్పో! ఇప్పుడు నేనిట్లు తలంచుచున్నాను. ఇదియే సరియైన కార్యము. అభిమానించి, మేలుకోరెడు చెలికాండ్రు, రాజులకు, హితమును బోధింపవలెను. మనకు, రాజసూయము చేయుట తగునా? (రాజసూయయాగమునకు ప్రయత్నించినచో నాశము తప్పదనుట).

చం. అనుటయు హంసుఁ డిట్లను జనార్దనుతో ముదిజోదు భీష్మ [1]నొ
డ్డనఁ బనిలేదు బాహ్లికుఁడు నాతని కంటెను బంకు వీరు మ
ద్ఘనభుజశక్తికిం దరము గారు దలంకక వచ్చి భీముఁడుం
గనుఁగొన లేఁడు మద్ధనురకాండ రవిచ్ఛవి చండకాండముల్. 131

ప్రతి: అనుటయున్; హంసుఁడు +ఇట్లు+అనున్; జనార్దనుతో; ముదిజోఁదున్ = ముసలివాఁడైన, యోధుని గుఱించి; ఒండు + అనన్ + పనిలేదు = వేఱుగా చెప్పవలసినది లేదు (ముదుసలికదా అని చులుకన); బాహ్లికుఁడున్, అతని కంటెన్ బంకు = భీష్ముని కంటె (పిన తండ్రియైన బాహ్లికుఁడు వయసులో పెద్ద అగుటచే) దుర్బలుఁడు; వీరు (ఇరువురు); మత్ఘన భుజశక్తికిన్ + తరముగారు = నాభుజబలమునకు సరిరారు; భీముఁడున్; తలంకక వచ్చి = సంకోచములేక వచ్చినట్టైన మత్ + ధనుః+అకాండరవి+ఛవి చండకాండముల్ = నా వింటినుండి వెలువడు అకాల మందు (సమయము కానప్పుడు సూర్యకాంతిని పోలిన తీక్ష్ణములైన నా బాణములను; కనుఁగొనలేఁడు = తన కంటితో కానఁజాలఁడు.

తా: జనార్దనునితో హంసుఁడిట్లనెను. 'భీష్ముఁడు ముసలివాఁడు. అతని పినతండ్రి ఇంకను పెద్దవాడు. వారిరువురును వృద్ధులగుటచే నా భుజబలమునకు, సరిరారు. భీముఁడొక వేళ, జంకు లేక నన్నెదుర్కొన్నచో, అకాలమున వెలువడు సూర్యుని తేజః ప్రసారములు గలిగిన నా బాణముల కాంతినే కన్నెత్తి చూడఁజాలఁడు.'

విశే. భీష్ముఁడు , బాహ్లికుఁడు భీముఁడు (ధర్మజుని తమ్ముఁడు) తనకంటె, తక్కువ వారనుట.

---

1. నొండనఁ

మ. కలుద్రావం బని పూని యాదవులు ఖడ్గాఖడ్గి వాదింతురే
కలఁగం బాఱుట గాక పంతములకుం గంసారి సైరించినం
గలనం బ్రాణముతోన పట్టు వడు నింకన్ సాత్యకిం గీత్యకిన్
బలభద్రున్ గిలభద్రు నా యెదురఁ జెప్పంజొప్పు దప్పుం జుమీ. 132

తా: మద్యపానమందే ఆసక్తులయిన గొల్లలు, ఖడ్గములతో ద్వంద్వయుద్ధమును చేయుదురా? యుద్ధమన్నవారు కలఁత చెంది పాఱిపోవుట తప్పదు. కంసవిరోధి కృష్ణుఁడు, మాతో పోటికి సిద్ధమైనను, ప్రాణములతో మాకు చిక్కును. ఈతనికి ఇట్టి దుర్గతి ప్రాప్తింప నుండఁగా, సాత్యకి బలరాముల గుఱించి నీవు మా ఎదుట వచించుట మర్యాద కాదు సుమా!

విశే. ఖడ్గాఖడ్గి : పరస్పరము, కత్తులతో చేయు యుద్ధము.

వ్యా. సాత్యకిన్ గీత్యకిన్, బల భద్రున్ గిలభద్రున్ (చూడు, పద్యము - 107)

క. మనకు జరాసంధునకును
మనసులు గలసినవి ధర్మమయుఁ డాతం డీ
పని గా దనఁ డింక జనా
ర్దన యాదవనగరమునకుఁ దడయక చనుమీ. 133

తా: మనయొక్క జరాసంధుని యొక్క ఆలోచనలు (మనసులు) ఒకే విధమైనవి. అతఁడు ధర్మకార్యములు చేయువాఁడు. మా క్షత్రియోచిత ధర్మకార్యమును వ్యతిరేకింపఁడు. ఓ జనార్దన! నీవు ఆలస్యము చేయక వెంటనే ద్వారకకు పొమ్ము.

## -: హంస డిభకులు జనార్దనుని యాదవనగరమునకుఁబంచుట :-

కం. చని యాజనార్దనునిచే
ఘన మగు లవణంబు మనకుఁ గప్ప మడుగు మే
ధనములును సరకు గా విటఁ
జనుదెమ్మను మతని యజ్ఞ సమయంబునకున్. 134

తా: ద్వారకకు వెడలి ఆ కృష్ణుని మనకు కప్పముగా లవణమును కోరుము. మనకు

ఇతరములగు సొమ్ములు లెక్కకు రావు (అవసరములేదు). యజ్ఞసమయమునకు ఇక్కడికి రమ్మని పిలువుము.

కం. ఏయుత్తరంబు చెప్పిన
నీయానయ నీకుఁ జెలిమి నీతో మిగులం
జేయుట నొండన నేర న
సూయ తలంపునకు రాదు సూ నినుఁ గనినన్. 135

తా: నీవు, ఏ సమాధానము చెప్పినప్పటికిని, (ఈ ఆనయ) నీకు ఇదియే ఆజ్ఞ. (యాదవ నగరమునకు తడయక పొమ్మనుట). నీతో స్నేహమెక్కువగా చేసియున్నందున మఱేమియు చెప్పఁజాలము. నిన్ను కఠినముగా దూషింప మనసురాదు. నీ యెడ ద్వేషభావము మా మనస్సులలో కలుఁగదు. దీనిని నీవు గుర్తింపవలెను

మ. అనుడు న్వేడుకతోడ వీడుకొని యశ్వారోహకుం డై జనా
ర్దనుఁ డేతేరఁ దదంతరంగము మునీంద్రత్రాణు శ్రీవత్సలాం
ఛను నేఁడెల్లి కనుంగొనం గలిగినం జాలుం గృతార్థుండఁ బొ
మ్మని చింతింపఁ గ నాకు నేఁడొదవె నాహా తీర్థముక్ స్వార్థమున్. 136

తా: అట్లు హంసుఁడు ఆనతియ్యగా జనార్దనుఁడు ఉత్సాహముతో వారలను వీడుకొని గుఱ్ఱము నెక్కినవాఁడై, ద్వారకకు చనుచుండఁగా, అతని మనస్సు "మునివరుల రక్షకుఁడును, శ్రీవత్సమనెడి పేరుగల ఱొమ్మున పుట్టుమచ్చ గలవాఁడును అయిన ఆకృష్ణుని నేఁడో! రేపో దర్శింతును గదా! అదియే చాలు, నేను ధన్యుఁడను అగుదును (నా జన్మ ధన్యమగును). ఆహా! ఎంత భాగ్యము, ఇష్టములేని దైనను ప్రభుకార్యముతో, పుణ్యక్షేత్రమైన ద్వారకానగర దర్శనము అందలి దేవుఁడైన గోపాలస్వామి సందర్శనము లభించెను గదా" అని తలంచు చుండఁగా (మీఁది పద్యముతో అన్వయము).

విశే. స్వార్థము ఇచట ప్రభుకార్యము. దానిని కాదన్న రాజద్రోహము. ప్రభుభక్తి పరాయణుఁడైన జనార్దనుఁడు, విష్ణుభక్తి ప్రవణుఁ డగుటచే, శ్రీకృష్ణ దర్శనము తీర్థమగును. ఇట ప్రభుకార్యమందు, తీర్థదర్శనము స్వార్థమైనది. శ్రీకృష్ణ దర్శనముచే పునర్జన్మ తొలఁగునని, జనార్ధనుఁడు తద్దర్శనమునకై ఉవ్విళ్లూరు చుండెను.

సీ. యదుకులాంబుధిచంద్రు నానందమునఁ జూచు
రామాదిహిత చకోరములలోన
దనుజారి పారిజాతముఁ జేరి పాదిగొన్న
రాజన్య రాజకీరములలోన
వసుదేవసుత సరోవరములో నోలాడు
సనకాది దివ్యహంసములలోన
గోపాల నవపుష్పగుచ్ఛంబు మూఁగిన
పరిచారికా ద్విరేఫములలోనఁ
గీ. గలయఁ దొలు బాము నోములు గలవు గాన
సెలవు లేక జన్మంబులు చెడియె నాకు
మీఁద జన్మంబు గలుగ నిర్మించె నేని
కమలజుని పేర దాపటి కాలిబొమ్మ. 137

ప్రతి: యదుకుల+అంబుధిచంద్రున్ = యదుకుల మనెడి సముద్రమునకు ఉల్లాసము నిచ్చు కృష్ణుఁడనెడి చంద్రుని; ఆనందమునన్ + చూచు; రామ+ఆది, హితచకోరములలోనన్ = బలరాముఁడు సాత్యకి గదుఁడు సాంబుఁడు మొదలగు మేలు కోరువారు అనెడి చకోరపక్షులలో (ఒకఁడుగా); దనుజ+అరి పారిజాతమున్ = రాక్షసవిరోధియైన కృష్ణుఁడనెడి దేవతావృక్షమైన పారిజాతమును; చేరి ఆశ్రయించి; పాదిగొన్న = చుట్టునుండు; రాజన్యరాజకీరములలోనన్ = రాజులు అనెడి శ్రేష్ఠములైన, చిలుకలలో (ఒకఁడుగా); వసుదేవసుత సరోవరములోన్ = వసుదేవనందనుఁడైన కృష్ణుఁడనెడి సరస్సునందు; ఓలాడు = ఆటలాఁడు; సనక+ఆది దివ్యహంసముల లోనన్ = సనక, సనందన, సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు అనెడి దేవలోకమున నుండు హంసలలో (ఒకఁడుగా); గోపాల నవపుష్పగుచ్ఛంబున్ = గోవులను పాలించు, కృష్ణుఁడనెడి క్రొత్తదైన పూలగుత్తిలో; మూఁగిన పరిచారికా ద్విరేఫముల లోనన్ = ముసురుకొన్న సేవికాజనమనెడి తుమ్మెదలలో (ఒకఁడుగా);కలయన్=కలియుటకు; తొలుబాము నోములు + కలవు =తొలిపుట్టుకలలో చేసిన సత్కర్మలున్నవి. కానన్ = అయినను; సెలవులేక జన్మంబుల్ చెడియెన్ = (ఆ పుట్టుకలలో) స్వామి దర్శనమునకు అవకాశములేక, అవి వ్యర్థములైనవి; మీఁద జన్మంబు కలుఁగన్ నిర్మించెన్ + ఏని = ఇదిగాక మఱొక జన్మను (బ్రహ్మ) కలిఁగించినచో; కమలజుని పేరన్ = ఆ బ్రహ్మ పేరుతో; దాపటి కాలి బొమ్మ = ఎడమ కాలి యందు అతని బొమ్మను (నిందాసూచకముగా) ధరింతును.

తా: శ్రీకృష్ణుని దర్శించు, బలరామ సాత్యకి మొదలైన వారిలోను, ఆశ్రయించు రారాజులలోను, ఆరాధించు సనకాదులలోను, సేవించు సేవికాజనములోను, ఒకఁడుగా కలిసిపోవుటకు తొలిపుట్టుకలలో కావించిన సత్కర్మలున్నను. స్వామిదర్శనమునకు అవకాశము లభింపలేదు. కనుక ఆ జన్మలన్నియు నష్టములయినవి. ఈ జన్మలో ఇప్పుడు గోపాలస్వామి దర్శనము లభించుచున్నది. ఇంక మఱుజన్మకలుగరాదు. ఇదియే కడదిగనుండవలెను. అట్లుగాక మఱొక జన్మను బ్రహ్మ విధించినచో అతని పేర ఎడమ కాలియందు, ఆతని బొమ్మను ధరింతును.

అలం: రూపకము : నాలుగు పాదములలో కలదు. యదుకులము (అంబుధి) (చంద్రుఁడు) కృష్ణుఁడు, బలరామాదులు (చకోరములు) దనుజారి (పారిజాతము), రాజన్యులు (రాచిలుకలు) వసుదేవసుతుఁడు (సరోవరము) సనకాదులు (దివ్యహంసములు) గోపాలుఁడు (నవ పుష్పగుచ్ఛము) పరిచారికలు (ద్విరేఫములు).

సీ. వెలిదమ్ములో లేఁతవెన్నెలో యమృతమో
కన్నులో చిఱునవ్వొ కనికరంబొ
గగనమో చుక్కలో గ్రహరాజ బింబమో
వక్షంబొ మౌక్తికావళియొ మణియొ
తరఁగలో ఫేనమో తరణిమండలమొ హ
స్తములొ శంఖంబొ సుదర్శనంబొ
తలిరులో కరికరంబులొ కుంకుమ ప్రభయొ
పదములొ యూరులో పచ్చఁబట్టొ
ఆ.వె. యనుచుఁ గన్నులార నా జగన్నాథునిఁ
గను గొనంగ నేఁడు గలుగుఁ గాన
తలఁపులోన మున్ను దలఁచిన రూపంబు
పట్టువడుట జన్మఫలము గాదె. 138

వివరణ: సీసపద్య పాద ప్రథమార్ధములో ఉపమానములు, ద్వితీయార్ధములో ఉపమేయములు క్రమముగాఁ జెప్పఁబడినవి.

ప్రథమ : వెలిదమ్ములో= తెల్ల దామరలా! (కన్నులో), లేఁత వెన్నెలో (చిఱునవ్వొ), అమృతమో (కనికరంబొ= కరుణయా);

ద్వితీయ : గగనమో = ఆకాశమో (వక్షంబో = ఱొమ్మో); చుక్కలో = నక్షత్రములా (మౌక్తికావళియొ = ముత్యముల మొత్తమా); గ్రహరాజ బింబమా = సూర్యుఁడా (మణియొ = కౌస్తుభరత్నమా);

తృతీయ : తరఁగలో = అలలా! (హస్తములొ = చేతులా), ఫేనమో = నురుగా (శంఖంబొ), తరణి మండలమొ = సూర్యుని గుడియా (సుదర్శనంబొ = ఈ పేరుగల చక్రాయుధమా);

చతుర్థ : తలిరులో = లేఁతచిగుళ్ళా (పదములొ = ఎఱ్ఱనిపాదములా) కరికరంబులొ = ఏనుఁగు తొండములా (ఊరులో = తొడలా), కుంకుము ప్రభయొ = కుంకుమ వర్ణశోభయా (పచ్చఁబట్టా = పీతాంబర మనెడి పసుపు ఎఱుపు వన్నెగల బట్టయా)

తా: అనుచు కృష్ణుని గుఱించి ఊహించుచు, ఆ లోక నాయకుని కన్నులపండువుగా నేఁడు చూడఁగలను గాన, మనసులో ముందు తలఁచిన రూపము కన్నుల యెదుట గోచరించుట జన్మఫలము కదా!

అలం : యథా సంఖ్య సందేహములు. సోమన సీసముల సొగసులో ఇది యొక సొంపైన సోయఁగము.

వ. అని వర్ణించుచుం జని ద్వారకానగర ప్రవేశంబు చేసి యదు వల్లభు నగరివాకిట హయావతరణంబు చేసి తనరాక యెఱింగించి పుచ్చి యద్దేవ దేవుని యనుమతంబున సభామండపంబు నకుం జని జనార్దనుండు. 139

తా: (జనార్దనుండు మంత్రి పుత్రుఁడు) పై విధముగా శ్రీకృష్ణుని వర్ణించుచు ద్వారకను ప్రవేశించి నగరి వాకిటియందు, గుఱ్ఱమును దిగి తాను వచ్చిన విషయమును తెలియఁజేసి అచటనున్న సేవకులను లోనికి పంపినవాఁడై, ఆ దేవతలకు దేవుఁడైన కృష్ణుని అనుమతితో కొలువు కూటమునకు పోయి (మీఁది పద్యముతో).

మ. కనియెం గౌస్తుభరత్నభూషణు వలత్కర్పూర హారావళీ
వనితాచాలిత తాళవృంత పవనవ్యాధూత చేలాంచలున్
మనుజాధీశ కిరీటకోటి పరిషన్మధ్యస్థ సింహాస నాం
కునిఁ దేజఃప్రసర ప్రభాతతరణిన్ గోపాలచూడామణిన్. 140

ప్రతి: కౌస్తుభ రత్నభూషణున్ = కౌస్తుభమణిని ఆభరణముగాఁ గలవాఁడును;వలత్ కర్పూర హార + ఆవళీ = పెనగొనుచున్న కప్పురము వలె తెల్లనైన దండల వరుసలను గలవాఁడును; వనితా చాలిత = ఉత్తమ కాంతులచే వీవఁబడిన; తాళవృంత పవన వ్యాధూత = విసన కఱ్ఱల యొక్క గాలిచే ఎగురఁజేయుచున్న; చేల + అంచలున్ = అంగ వస్త్రము యొక్క అంచులు గల వాఁడును; మనుజ +అధీశ = కిరీటముల యొక్క కోటితో (పెక్కు కిరీటములతో) ప్రకాశించు; పరిషత్ + మధ్యస్థ = సభయొక్క మధ్యనున్న; సింహాసన + అంకున్ = పెద్ద పీఠముపై కూర్చున్నవాఁడును (సింహాసనము యొక్క ఒడి కలవాఁడు); తేజఃప్రసర = శరీరకాంతి ప్రసరణముచే; ప్రభాత తరణిన్ = ఉదయకాల సూర్యుని వంటి వాఁడును; గోపాల చూడామణిన్ = నందాదులైన గొల్లవారిలో శిరోరత్నమును (శ్రేష్ఠుఁడును) అయిన కృష్ణుని; కనియెన్.

తా: వక్షమున కౌస్తుభమణి, కంఠసీమయందు పెనగొను ముత్యాల హారములు, వనితలు వీచు విసన కఱ్ఱల గాలిచే అటునిటు కదలుచున్న అంగవస్త్రపుటంచులు కలవాఁడునై, లెక్కకు మించి రాజుల కిరీటములతో నిండి ప్రకాశమానమైన సభామధ్య యందు సింహాసనముపై కూర్చున్నవాఁడై, ఉదయకాల భాస్కరుని వంటి తేజః ప్రసరణము కలిగిన గొల్లలలో అత్యున్నతుఁడైన కృష్ణుని గాంచెను.

విశే : కృష్ణుఁడు సాక్షాద్విష్ణువే. కనుక కౌస్తుభ మణిని ధరించియున్నాఁడు. ఆ మణి క్షీరసాగరమందు ఉద్భవించినది.

అలం: 1. ఉపమ - తేజః ప్రసర ప్రభాత తరణిన్.

2 వృత్త్యనుప్రాసము వనితా చాలిత... చేలాంచలున్.

వ్యా. కిరీట కోటి - షష్ఠీ తత్పురుష సమాసము.

నానా: అంకము = చిహ్నము, ఒడి, చోటు, నాటక భేదము మొ.

సీ. బలభద్రుఁడును దాను భద్రపీఠంబునఁ
గదియ శైనేయుఁ డగ్రమున మెఱయ
దుర్వాసుఁడును నారదుండును రెండు ది
క్కులఁ దన కింపుగా గోష్ఠి చేయ
నుగ్రసేనుఁడు గౌరవోన్నతిఁ దనుఁ జేర
గంధర్వగానంబు గలసి పొలయ

నప్సరోగణ నర్తనాడంబరముఁ జూచు
తనచేత నభినవ ధనము లడరఁ

గీ. దనకునై వందిమాగధ స్తవము నిగుడ
సామవేదులు దనయందు సార మెఱుఁగఁ
దనవలన లోకు లానందధారఁ దేల
లీలఁ బేరోలగం బున్న నీలవర్ణు. 141

ప్రతి: బలభద్రుఁడును = బలరాముఁడును; తాను = శ్రీకృష్ణుఁడు; భద్ర పీఠంబునన్ = శుభకరమైన సింహాసనముపై; కదియన్ = దగ్గఱనే యుండఁగా; శైనేయుఁడు = శినిమనుమఁడు సాత్యకి; అగ్రమునన్ = ముందు; మెఱయన్ = గోచరమగు చుండఁగా; దుర్వాసుఁడును; నారదుండును; రెండు దిక్కులన్ = ఇరుప్రక్కలందు; తనకున్ = కృష్ణునకు; ఇంపుగాన్ = ప్రియముగా; గోష్ఠి చేయన్ = చక్కగా మాటలాడు చుండఁగా; ఉగ్రసేనుఁడు (కంసుని తండ్రి); గౌరవ + ఉన్నతిన్ = (తాతయును, ప్రభువును అగుటచే) గొప్ప తనము యొక్క అతిశయముతో తనున్ = తన్ను (కృష్ణుని); చేరన్ = కలిసి యుండఁగా; గంధర్వ గానంబు = దేవగాయకులైన గంధర్వుల గీతములు; కలసి పొలయన్ = అంతటను వ్యాపింపఁగా; అప్సరస్ + గణ నర్తన + ఆడంబరమున్ = అచ్చర లేమల సమూహ నృత్యము యొక్క అతిశయమును; చూచు = కనుచున్న; తనచేతన్ = తన చేతిలో; అభినవ ధనములు + అడరన్ = ఆశ్రితులకు అర్పించుటకు క్రొంగ్రొత్త వస్త్రములు, భూషణములు, కానుకలు, మాల్యములు మొదలగు సొమ్ములు అమరియుండఁగా; తనకునై = తనకొఱకై; వంది మాగధ స్తవము, నిగుడన్ = స్తుతిపాఠకులు, వంశావళి చదువు వారు, పొగడ్తలను వినిపించు చుండఁగా; సామవేదులు; తనయందు = తనలోఁగల; సారము = తత్త్వమున్న (పారమ్యము లేదా శ్రేష్ఠత్వమును); ఎఱుఁగన్ = గ్రహించుచుండఁగా; ("వేదానామ్ సామవేద్ఽస్మి" - అని శ్రుతి). తనవలనన్ = తాను కారణముగా; లోకులు + ఆనందధారన్ = ప్రజలు ఆనందమనెడి జల్లులో మునిఁగి తేలఁగా; లీలన్ = విలాసముతో, పేరోలంగబున్న = పెద్ద కొలువు కూటములోనున్న; నీలవర్ణు = శ్యామవర్ణముఁగల కృష్ణుని.

తా: శ్రీకృష్ణుని సమీపమున, అన్న బలరాముఁడు, తమ్ముఁడు సాత్యకియు, కుడియెడమ ప్రక్కలలో సరససల్లాపములను కావించుచు దుర్వాసుఁడు నారదుఁడును, దగ్గఱనే తాతయు ప్రభులైన ఉగ్రసేనుఁడు ఉండఁగా, సభయంతయు గంధర్వగీతములతో మనోహరముగ నుండెను. అచ్చర లేమ లెందఱో, తమనృత్య విశేషములను అతిశయముగ నభినయించుచుండిరి. అందఱిని తిలకించుచు శ్రీకృష్ణుడు, ఆశ్రితులకు అర్పించుటకు

క్రొంగ్రొత్త సొమ్ములను చేతిలో సిద్ధముగా నుంచుకొని యుండెను. వందిమాగధుల స్తుతి చెలంగుచుండెను. సామవేదులు కృష్ణుని మహిమ నెఱుంగుచుండిరి. తన్ను దర్శించిన లోకులు ఆనందమనెడి జల్లులో మునిగి పరవశులగు చుండిరి. ఇట్టి పెద్ద కొలువు కూటములో నీల వర్ణుఁడైన శ్రీ కృష్ణుని (మీఁది వచనముతో).

విశే. జనార్దనుఁడును మహావిభూతితో ప్రకాశించు కృష్ణునిఁగాంచి ఆనందామృత ధారలలో మునిఁగి తేలుచు పరవశుఁడయ్యెను.

వ. కని కదియం బోయి తనపేరు చెప్పి నమస్కారంబు చేసి బలదేవునకు
నట్ల ప్రణమిల్లి యథోచితస్థానంబునం గూర్చున్న యనంతరంబ
మురాంతకుం డతనితో నిట్లనియె. 142

తా: కృష్ణుని సమీపించి, తన పేరు చెప్పి నమస్కరించి, బలరామునకు ప్రణామము కావించి, తగిన చోట కూర్చున్న పిమ్మట, (జనార్దనుఁడు) కృష్ణునితో ఇట్లు పలికెను.

గీ. అనఘ మీరాజు బ్రహ్మదత్తునకుఁ గుశల
మా నరేంద్రకుమారులు హంసడిభకు
లధిక భవ్యులె వరములు హరునిచేతఁ
గొన్న వారఁట కుశలంబు గొఱఁత గలదె. 143

తా: పాపము లేనివాఁడా! మీరాజైన బ్రహ్మ దత్తుఁడు క్షేమముగా నున్నాఁడా? ఆ రాజకుమారులు హంసడిభకులు ఎక్కువ సుఖముతో (శుభముతో) నున్నారా? శివుని వరములు పొందిన వాఁట గదా! వారి క్షేమమునకు ఏమియు లోటు లేదు గదా?

కం. మీజనకుఁడు శుభయుతుఁడే
రాజులు మిము గారవింతురా సుఖకరులే
భూజనులకు నిచ్చోటఁ బ్ర
యోజనమా నీవు వచ్చు నుద్యోగమునన్. 144

తా: మీ తండ్రి మిత్ర సహుఁడు శుభసంపన్నుఁడు గదా! మీ రాజులు మిమ్ము గౌరవించుచున్నారా? మీ పాలనలోఁగల ప్రజలకు సుఖములను కలిగించు చున్నారా? నీవు ఇచ్చటికి వచ్చినట్టి ఉద్యోగ ధర్మము వలన ఏదైన ఉద్దేశమున్నదా? (ఆ పనియేమి?)

వ. అనుటయు నాజనార్దనుం డి ట్లనియె. 145

తా : సులభము.

కం. అందఱకుం గుశలమ మా
కుం దగు మన్ననల ప్రజలకుం బరిణామం
బిం దే వచ్చినపని గో
విందయెఱింగింప కెఱుఁగవే విశ్వపతీ. 146

తా: ఓ లోకనాయకా! అందఱు కుశలమే. మాకెల్ల తగిన గౌరవమున్నది. ప్రజలందఱు క్షేమము. నేను వచ్చిన పని ఏదో, నేను చెప్పక పోయినను నీకు తెలియదా?

నానా: పరిణామము = క్షేమము, మార్పు. రెండవ అర్థముచే ప్రజలకు మార్పు కలుగునని ధ్వని. హంసడిభకుల వధ సూచింపఁబడినది.

వ్యు. గోవిందుఁడు, వాక్కులచే (వేదాంతముచే) పొందఁదగినవాఁడు, హరి.

వ్యా. కుశలము+అ, మన్ననలు +అ = కుశలమ, మన్ననల, 'అ' అవధారణార్థకము.

కం. లోపల వెలుపల వెలుపల
లోపలఁ గా నుండు నఖిలలోకంబులకున్
నీ పరతత్త్వము చిత్రము
రూపము నై నీవు లేనిరూపము గలదే. 147

తా: సృష్టికి ముందు బ్రహ్మాండమందు సూక్ష్మ రూపములో నుండెదవు. ఈ విధముగా 'లోపల' నున్న నీవు సృష్టి జరుగునపుడు, 'వెలుపల' వేర్వేఱు నామరూపములు కలిగి స్థూల రూపమును వహింతువు. మఱియు భూలోకము మొదలు, 'వెలుపల' సత్యలోకము వఱకును, భూమికి దిగువ భాగమున 'లోపల' అతలము మొదలు, పాతాళము వఱకును సమస్తమైన పదునాలుగు లోకములును, నీవే గదా! నీవే ఆధారము, కారణరూపము. నీ పరమాత్మ భావము, అచ్చెరువు కొల్పును. రూపమును దాల్చిన సర్వమందు, నీవు అధివసించి యున్నావు. నీవు లేని రూపము ఏదియైన కలదా?

విశే : కల్పాంతమందు, సర్వము, పరమాత్మలో, సూక్ష్మరూపమున లీనమగును.

మరల అవి స్థూలరూపమున జనించుచున్నవి. ఈ కార్యములకు కారణము పరమాత్మయే. ఈ కారణరూపము నశించునది కాదు. పదునాలుగు లోకములు, విరాట్ పురుషుని అవయవములు.

ఊర్ధ్వలోకములు : భూలోకము (నాభి) 2. భువర్లోకము (జఠరము) 3. స్వర్లోకము (వక్షము) 4. మహర్లోకము (కంఠము) 5. జనలోకము (ముఖము) 6. తపోలోకము (భ్రూమధ్యము) 7. సత్యలోకము (శిరస్సు) 8. అతలము (పాదములు) 9.వితలము (మడమలు) 10. సుతలము (జంఘలు) 11. రసాతలము (జానువులు) 12. మహాతలము (ఊరువులు) 13. తలాతలము (కటి) 14. పాతాళము (నాభి అధో భాగము).

ఉ. ఉండుట తప్పు వారియెడ నుండమి తప్పిట రాక తప్పు రా
కుండుట తప్పు తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ యే
నొం డొకరుండనే పలుక కూరక నేరక యుండఁ జేయు వీ
ఱిండితనంబుచేత నిసిఱింతలు పాఱెడిఁ జిత్త [1]మిప్పుడున్. 148

ప్రతి: వారికడన్ = హంసడిభకుల యొద్ద; ఉండుట తప్పు; ఉండమి తప్పు = ఉండకపోవుటయు తప్పే!; ఇటరాక తప్పు = ఇచటికి వచ్చుటయు తప్పు; దేవ! = ఓ దేవా! తప్పులకున్, ఒప్పులకున్; గతి = శరణ్యము, రక్ష; నీవ = నీవే; (ఏది తప్పో ఏది ఒప్పో! ఏమి చేయవలెనో కర్తవ్యము తెలియదని శరణు వేడుచున్నాఁడు); ఏనుఒండు + ఒక రుండనే? = నేను ఒకే ఒక్కఁడనేనా? పదుగురితో, సేవాధర్మముచే సంబంధము కలవాఁడను; పలుకక, ఊరక ఉండన్+ చేయు, వీఱిండి తనంబుచేత = నా కర్తవ్య ము ఏదియో తెలియని నిస్సహాయ స్థితిలో, పలుకలేక ఊరకుండవలసిన అవివేకముచే; ఇప్పుడున్ = ఈ సమయమందు; చిత్తము, ఇసిఱింతలు = మిక్కిలి వ్యాకులపాటు; పాఱెడిన్ = చెందుచున్నది.

తా: కృష్ణా! వారి కడ ఉండుట దోషము. ఉండకపోవుటయు దోషమే. దుర్జనులగుటచే అచట నుండుట తప్పు. ఏలికలగుటచే వారిని వీడుటయు తప్పే. ద్వారకకు, దుష్ట కార్యమున వచ్చుట తప్పు. రాజ కార్యమును నిరాకరించి, రాకపోవుటయు అపరాధమే. ఓ దేవా! తప్పులు ఒప్పులు నేను, ఎఱుఁగను. ఎటు తోఁచని స్థితి ఇది. అసహాయుఁడను. రాజసేవలో పదిమందితో సంబంధము కలవాఁడను. నా మనస్సు నీయందే నిలిచియున్నది. నిన్నే శరణు వేఁడుచున్నాను. నీవే కరుణించి రక్షింపవలెను. ఇది నా ప్రార్థన. ఇప్పుడు పలుకలేక తెలియని వాని వలె, ఉపేక్షతో నుండఁజేయు అవివేకము నన్ను ఆవరించినది. ఆ కారణముచే నామనస్సంతయు వ్యాకుల పాటు చెందియున్నది.

1. మెప్పుడున్

అహంకార రహితుఁడై జనార్దనుఁడు సంకటస్థితిలో ప్రాన్పాటు చెంది భగవానుఁడు గీతలో ఆదేశించినట్లు "మామేకం శరణ వ్రజ" అను బోధనను పాటించి ఆ పరమాత్మను శరణువేడెను. (భగవద్గీత - 18అ - శ్లో. 6)

వ్యా : రాక, కృత్ప్రత్యయాంతము, వచ్చుట, అని అర్థము. రాక వ్యతిరేకార్థక అసమాపక క్రియ, రాకపోవుట, అని అర్థము.

చం. అనుడు జనార్దనుం డను జనార్దనుతో విను దూత కృత్యముం
బనివడి పూని యేలికల ప్రల్లద మైనను జెప్పఁ జెల్లుఁ ద
ప్పనిపలు కైనఁ బోలు వినఁ బంతము చల్లకు వచ్చి ముంత దాఁ
చినగతి నింత మాఁటువడఁ జెప్పిన కార్యము గాన వచ్చునే. 149

ప్రతి: అనుడున్ = అనినంతనే; జనార్దనుండు; జనార్దనుతో; అను = అనెను; విను; దూతకృత్యమున్ = దూత చేయవలసిన పనిని; పనివడి = పూనుకొని; ఏలికల ప్రల్లదము + ఐనన్ = పాలకుల కఠినమైన మాటల నైనను; చెప్పన్+చెల్లున్ = పలుకఁదగును; తప్పని పలుకైనన్ = తప్పకుండ చెప్పవలసిన మాటను దూత నివేదించినచో; వినన్ + పోలున్ = విన వలసినదే!; పంతము = ఇదియే సరియైన విధము (పద్ధతి); చల్లకు వచ్చి ముంత దాఁచిన గతిన్ = మజ్జిగకై వచ్చి అద్దానిని కొనిపోవుటకు తెచ్చిన పాత్రను, దాఁచి పెట్టినట్లు; ఇంత = ఇంతవఱకు; మాటువడన్ = కప్పి పుచ్చుచు (చెప్పవలసిన సందేశమును తెలియఁజేయక); చెప్పినన్; కార్యము + కానవచ్చునే = నీవు, ఏ పనికై వచ్చితివో, దానిని మేము తెలిసికొనఁగలమా?

తా: కృష్ణుడు జనార్దనునితో ఇట్లనెను "దూతయై వచ్చినవాఁడు కఠినమైన మాటలనైనను, చెప్పవలసినదే! ఆ సందేశమును మేము వినవలసినదే. ఇది సరియైన పద్ధతి. మజ్జిగకై వచ్చి ముంతను దాఁచి పెట్టినట్లు, నీవు చెప్పవలసిన మాటలను చెప్పక పోయినచో నీవు వచ్చిన పనిని మేమెట్లు తెలిసికొందుము?

విశే. అలం: లోకోక్తి.

కం. రా వలదే పంచినపని
సేవకులకుఁ బాముకాటు చీరఁ దుడిచినం
బోవునె వా రే మనిరో
నీ వేలా దాఁచె దేమినేరము నీకున్. 150

తా: రాజసేవకులు తమ ఏలిక ఆనతిచ్చిన పనిని చేయుటకు పోవలెను గదా! పాము వేసిన కాటును గుడ్డతో తుడిచిన యెడల; అందున్న విషము తొలఁగునా? వారు ఏమనిరో నీవు ఏల దాఁచుటకు ప్రయత్నించుచున్నావు? నీవు దూతగా వారు చెప్పి పంపిన ఆ మాటలను వచించినచో అది నీ దోషము కాదు.

అలం: దృష్టాంతము. అప్రియమైన తమ ప్రభువుల సందేశమును కప్పి పుచ్చుటకై జనార్దనుఁడు మృదువైన మాటలతో ప్రయత్నించుచున్నాఁడు. అట్లు చేయవలదని సూచన. పాము కాటువేసినచోట విషము శరీరములోనికి పోవును. అప్పుడు గాయమును మెత్తని గుడ్డతో తుడిచినను లోనున్న విషము వెలుపలికి రాదు. ఫలము శూన్యము. అట్లే, జనార్దనుఁడు అప్రియ వాక్కులలో ఎంత ప్రయత్నించినను, వాని యందు గల తీవ్రతను (కాలుష్యము) తొలఁగింపఁజాలఁ డనుట. కనుక, సందేశము విషతుల్యమైనను సంకోచమును వదలి నివేదింప వలసినదిగా, శ్రీకృష్ణుఁడు జనార్దనుని కోరెను.

లక్షణము : భిన్న ధర్మములను బింబ ప్రతిబింబములుగా చెప్పుట.

వా. దాఁచెదు. దాఁచెదవు. ఇందు 'వ' కారలోపము (చూ. పద్యము 50).

చం. అనుడు నతండు హంసడిభకానుమతంబున రాజసూయమున్
జనపతి సేయఁ బూని భుజసారమునన్ సడిసన్న రాజులన్
ధనములు చాలఁ దెం డని పదంపడి దేవర యున్న చోటికిన్
ననుఁ బనివంపె నిన్ను యజనంబున మున్నిడిచేయు వాఁడుగాన్. 151

తా: అని చెప్పఁగనే, జనార్దనుఁడు, హంసడిభకుల అనుమతితో బ్రహ్మదత్తుఁడు రాజసూయమును చేయుటకు పూని, బాహుబలముచే కీర్తి వహించిన రాజులను, ధనము, కనకము, వాహనములు విలువైన వస్తువులు (ఇవన్నియును ధనములు - బహువచన ప్రయోగముచే సూచితములు) యాగము కొఱకు కొని తెండని దూతలను పంపి, దేవర కడకు (తమ యొద్దకు - దేవర మర్యాదా సూచకము) తమ్ము యాగ మందు అగ్రస్థానమందుంచి, నిర్వహింపఁ దలఁచి నన్ను పొమ్మని ఆనతిచ్చెను.

వ్యా. తెండు, "తెచ్చు" ధాతువు మధ్యమ పురుష బహువచనమందు - "తెండు" అగును. సూ. క్రియ, బాల - 93, 61.

గీ. అప్పు డాహంసడిభకు లి ట్లనిరి మనకు
లవణ మెం తేని నడుగు యాదవులచేత
వేగ ర మ్మను శౌరి నియ్యాగమునకు
నావుడుం బని పూనితి దేవదేవ. 152

తా: దేవ దేవ! "యాదవులను, మనకు ఎంత లవణము కావలెనో అంత తెండని కోరుము. మఱియు కృష్ణుని ఈ యాగమునకు వేగముగా రమ్మనుము." అని హంసడిభకులు అప్పుడు నాతో పలికిరి. కనుక ఆ పనికై వచ్చితిని.

వ్యా. అడుగు రమ్మను, అడుగుము, రమ్మనుము. మధ్యమపురుష మువర్ణలోపము (చూడు. పద్యము 93)

వ. అనుటయు వాసుదేవుండు రోసంబునకు మూలం బైన హాసంబు చేసి
యి ట్లనియె. 153

తా: వెంటనే, కృష్ణుఁడు రోషమునకు నెలవైన చిఱునవ్వుతో హేళనతో ఇట్లనెను.

(వి) రోసము (ప్ర) రోషము

ఆ.వె. రాజసూయకర్త బ్రహ్మదత్తుం డట్టె
రభస మెసఁగ హంసడిభకు లట్టె
చేయఁ బంచువారు చెల్లఁబో లవణంబు
మోచువాఁడ కాక మురవిరోధి. 154

తా: ఔరా! ఆశ్చర్యము. బ్రహ్మదత్తుఁడు రాజసూయము చేయుచున్నాఁడా? అయ్యో! హంస డిభకులు, ఆటోపము అతిశయింపఁగా యాగకార్యమునకు నిన్ను పంపినారు. అది వారికే తగును. కాని మురుని వధించిన కృష్ణుఁడు (తాను) ఉప్పు మోయ వాఁడగును గాక!

విశే. కృష్ణుఁడు తాను తప్పక పగతో వారిని వధింపఁ గలఁడను హేళన ఇందున్నది.

ఉ. అప్పన మెంత గావలె నహంకరణంబు దొఱంగి యిచ్చినం
గప్పము పేర నేఁడు నొడికారితనంబున మోస పుచ్చఁగా

నుప్పులు దెత్తురే సమరయోగ్యతలంబున వైరికోటితో
నుప్పనఁబట్టె లాడునెడ నుప్పులు దెత్తురు గాక యాదవుల్. 155

ప్రతి: అహంకరణంబు తొఱంగి ఇచ్చినన్ = గర్వమును వదలి ఇచ్చుటకు ఇష్టపడినచో; అప్పనము + ఎంత కావలెను = కానుకగా ఎంత వారు కోరెదరో? నేఁడు; నొడి కారితనంబునన్ = మాటల చమత్కారముచే; కప్పము పేరన్ = (లవణమును) పన్ను పేరుతో కోరి; మోస పుచ్చఁగాన్ = మోసము చేయ యత్నించినచో; ఉప్పులు తెత్తురే = తెచ్చెదరా?; సమర యోగ్య తలంబునన్ = యుద్ధమునకు తగిన చోట; వైరికోటితో = శత్రువుల సమూహముతో; ఉప్పనఁబట్టెలు = రెండు జట్టులుగా నుండి ఉప్పుమూటను లాఁగి కొనుటకు పెనగులాడు నప్పుడు; యాదవుల్ ఉప్పులు; తెత్తురు గాక = తప్పక తెచ్చెదరు.

తా: గర్వమువీడి ఇచ్చుటకు సిద్ధమైన, లవణము ఎంత కావలెను? మాటల నేర్పుతో పన్ను నెపముగా మోసపుచ్చుటకు ప్రయత్నించినచో, లవణమును తెచ్చెదరా! యాదవులు యుద్ధరంగమందు శత్రువుల మొత్తముతో ఉప్పనఁబట్టెలు ఆడునపుడు, లవణమును తీసికొని పోఁగలరు.

విశే : యుద్ధమందు యాదవులు తమ శౌర్యమును ప్రదర్శింతురే గాని, లవణము నియ్యరని సూచన.

వ్యా. తెత్తురు; తెచ్చుదురు సూ. చు వర్ణంబుతోడ దుగ్ధకారంబు

తకారంబగు. క్రియ, బాల - 108.'చ్చుద్'నకు తకార ద్విత్వము.

వ. అని పలికి యాదవలోకంబు నాలోకించి. 156

తా : సులభము.

మ. కలరా యింతకుమున్ను యాదవులచే గప్పంబు దెప్పింపఁగాఁ
గల రారాజులు గాజులం దొడవుగాఁ గల్పించిరా కాకులం
గలకంఠంబులఁ జేసెనా కటకటా గౌరీశ్వరుం డేమిగాఁ
గలవారో యిటమీఁద హంసడిభకుల్ గర్వాంధకారంబునన్. 157

తా: ఇంతకు ముందు యాదవుల నుంచి కప్పమును తెప్పించుకొనిన చక్రవర్తులు ఎవరైనను ఉండిరా? యాదవులు, గాజులను ఆభరణములుగా ధరించి యున్నారా? (శక్తి

హీనులుగా తలంచిరా?) అకటా! ఆ పరమ శివుఁడు కాకులను నెమిళ్ళుగా విఱ్ఱవీగునట్లు సృష్టించెనే? (అల్పులు, బలవంతులుగా భావించుచున్నారు అనుట). వారు పొగరు అనెడి చీఁకటిలో కన్ను గానక ప్రవర్తించి కర్తవ్యము తెలియక ఇంక మీఁద ఎట్టి దుర్దశను ఎదుర్కొందురో కదా!

అలం: 1. వక్రోక్తి - కలరా రారాజులు. స్వరవిశేషముచే మఱియొక అర్థమును కల్పించుట.

2. భ్రాంతిమంతము : గాజులం దొడవుగాఁ గల్పించిరా!

3. వ్యాజస్తుతి : కాకులం గల కంఠంబులఁ జేసెనా! స్తుతిచే నిందగాని, నిందచే స్తుతిగానితెల్పుట.

4. రూపకము : గర్వాంధకారము

వ. అనుటయు యాదవులు దమలోన. 158

తా : సులభము

గీ. హంసడిభకులు రాజసూయంబు చేయ
మనము గప్పంబుఁ గొనిపోక మంచిమాట
నేఁడు [1]సారెసత్తుల మొనల్ వాఁడి చేసి
నోరి చొరవ భూతేశుండు వారిఁ జెఱిచె. 159

అర్థ: సారి = యుద్ధయాత్ర; సత్తి = శక్తి, ఆయుధము;నోరి చొరవ = నోటిపొగరు.

తా : హంసడిభకులు రాజసూయము చేయఁగా మనము వారికి కప్పమును కొని పోవుట మంచిదేనా? నేఁడు యుద్ధమునకు వలయు ఆయుధ సామగ్రికి పదును పెట్టు కొని నోటి తీఁటచే, ఆ భూతనాథుఁడు వారిని వర గర్వముచే చెడునట్లు చేసెను గదా!

ఉ. యాదవు లుప్పుమోవఁగ మురారికి సోలలు మోవకింక బో
రాదు హలాయుధుం గొలువ రమ్మన రైరటుగాని యాగముం
గాదట చేయ హంసడిభక క్షితిపాలకుమారు లంచు నా
బీదల కేల బోగుబడి పెద్దఱికంబునుఁ బెట్టబీరమున్. 160

1. సారి

అర్థ: సోల = కొలఁత పాత్ర; బీదలు = లోన భీతిపొందుచు, పైకి భీకరముగ నుండువారు; బోగుబడి = దూబఱదిండి, అత్యాశాపరుఁడు; పెట్ట = ఆఁడుకోడి, పశుపక్షిస్త్రీజాతి; (అర్థాంతరము, - పెట్టన్ ఏల)

తా: "యాదవులు, యాగమునకై ఉప్పును మోసికొని పోవఁగా, వారితో కూడ, కృష్ణుఁడు కొలఁత పాత్రలను (సోలలను) మోసికొని రావలసినదేనా! (తప్పుదాఏమి?) మఱి బలరాముని, ఉప్పును కొలుచుటకు రమ్మన లేదు. మనము ఉప్పు మోసికొని పోనియెడల, ఆ రాజకుమారులు, యాగము చేయలేరటనా? ఆ సారహీనులకు దూబఱదిండి పెత్తనమును, పరాక్రమమును ఆరోపించుట ఏల?" (అర్థాంతరము : ఆ చేవలేని వారికి, అత్యాశ గల పెద్దతనము, డాంబికమైన (పైకి అతిశయముగా కన్పట్టు) వీరావేశము ఏల? దాని వలన ప్రయోజనము శూన్యమనుట.

గీ. అనుచు నొండొరు చెయి వ్రేసి యపహసింప
హరియు గలకల నవ్వి జనార్దనుండు
వినగ నిట్లను నొండేల వీరవరుల
నలుఁగు మొన గాక కప్పంబు లడుగ నగునె. 161

అర్థ : వీరవరులన్ + అలుఁగు మొనన్ = వీరవరుల యొక్క బాణాదుల ఉగ్రమైన ఉక్కుతునుకల చివఱలను,

తా: పై విధముగా పలుకుచు యాదవులు ఒక్కొక్కరు చప్పట్లు కొట్టుచు హేళన చేయఁగా హరియును పకపక నవ్వి, జనార్దనుఁడు వినునట్లు ప్రకటముగా ఇట్లనెను. "హంసడిభకులు యాదవ వీరులను వేఱేల కోరవలెను? యుద్ధమందు ప్రయోగించు వీరుల వాఁడియైన బాణముల కొనలను కోరుట తగును. కాని లవణమును తెండనుట తగునా?

వ్యా. వీరవరుల నలుఁగుమొన, వీరవరులన్ + అలుఁగు మొన, ఇచ్చట ద్వితీయావిభక్తి ప్రత్యయము, షష్ఠ్యర్థమున నున్నది. కనుక క్రియాన్వయంబున షష్ఠికి ద్వితీయ వచ్చినది. సూ. కారక, ప్రౌఢ -23.

కం. అరి కరమున నేఁదాల్చిన
నరి కరము నగేంద్రధీరుడయినం జెడఁడే

యరి దిరమై న న్నడుగుట
యరిది రమైకాభిలాషు లగు నృపతులకున్. 162

ప్రతి: అరి = చక్రమును; నేను; కరమునన్ = చేతిలో; తాల్చినన్ = పట్టుకొనఁగా; అరి = పగవాఁడు; కరము = మిక్కిలి; నగ+ఇంద్ర ధీరుఁడు + ఐనన్ = కొండలలో మేలైనదైన గట్టిది, చలింపనిది,మేరువు వంటి ధైర్యము కలవాఁడైనను; చెడఁడే! అరి = కప్పమును; తిరమై = నిలుకడతో (భయములేక); రమా+ఏక+అభిలాషులగు = రాజ్య వైభవమందు (లక్ష్మియందు) కోరిక కలవారగు? నృపతులకున్ = రాజులు; (ఇచ్చట షష్ఠికి ప్రథమ వచ్చినది); నన్ను +అడుగుట; అరిది = శక్యమగునా? వీలగునా! (అది అరుదు, అట్లుచేయువారు లేరనుట).

తా: సుదర్శన చక్రమును నేను చేతిలో ధరింపగా ఎట్టి ధీరుఁడైనను రాజ్య సుఖములను కోరువాఁడు నన్ను కప్పమడుగుట అవివేకము. అట్లు కోరువారు లేరు. (అట్లు కోరినచో వారు నాశమగుట తప్పదని భావము).

అలం: యమకము "అరి" "కరము" అను పదములు వేర్వేఱు అర్థములలో ఆవృత్తమైనవి.

మ. వెదకం బోయినతీవ కాల ఁదవిలె వే యేల దుర్వాసు చే
మొదల్ సంచకరంబు హంసడిభ కో న్మూల క్రియా కేలికిం
గుదురై యున్నది సాటిగాక యిట మత్కోదండ కాండోదర
ప్రదర ప్రావరణాంబుద ప్రకట శంపాకంప శాత్కారముల్. 163

అర్థ : ఉన్మూలన క్రియాకేళికిన్ = వధించు కార్యమనెడి క్రీడకై; సంచకరంబు = (వస్తువులను కొనఁదలచినపుడు అంగీకార సూచకముగా ముందే ఇచ్చెడికొంత సొమ్ము) ఆలోచన; సాటిగాక = పరివర్తనము చెందక (మార్పు చెందక); మత్కోదండ = నా పెద్ద వింటి యొక్క; కాండ+ఉదర = వింటి బద్ద నడిమి భాగమునుండి; ప్రదర = (వెల్వడు) బాణములనెడి; ప్రావరణ + అంబుద = చుట్టు ముట్టిన మేఘముల యొక్క; ప్రకట = స్పష్టమైన; శంపా కంప శాత్కారముల్ = మెఱుపుతీఁగల మిఱుమిట్లు, 'శాత్' 'శాత్' అను ధ్వనులతో; కుదురై యున్నది = (సంకల్పము) సిద్ధముగా నున్నది.

తా: తీఁగకై వెదకుటకు ప్రయత్నింపఁగా అదియే శ్రమలేక కాలికి తగిలి సులభముగా లభించినట్లు, మొదటనే హంసడిభకులు దుర్వాసునికి కావించిన అవమానముచే వారిని వధింప వలయు ననెడి క్రీడకై నా సంకల్పము (నిర్ణయము) స్థిరమై, నాధనుస్సునుండి

వెల్వడు బాణములు అనెడి చుట్టు ముట్టునట్టి మేఘముల యొక్క స్పష్టమైన మెఱుపుతీఁగల మిఱుమిట్లు శాత్కార ధ్వనులతో సిద్ధముగా నున్నది.

అలం: 1. దృష్టాంతము.

2. రూపకము : మత్కోదండ కాండోదర ప్రదర శాత్కారముల్.

వ. వారలతో ని ట్లనుము. 164

తా : సులభము.

ఆ.వె. ఈశు వరము చేత నెవ్వఁడే నిప్పాట
శూరుఁ డైన దువ్వుఁ జూచి నక్క
యొడలు గాల్చికొన్న వడువున మీ రింత
లావు మాట లాడ లజ్జ గాదె. 165

అర్థ: ఇప్పాట ఈ + పాట = ఇట్లు; దువ్వు = పులి; వడువునన్ = విధమున; లావుమాటలు = వీరవచనములు.

తా: శివుని వరములచే ఎవ్వడైనను ఇట్లు తాను శూరుఁడని తలంచినచో, చారలు గల పులినిచూచి నక్క దాని వలె తన శరీరమును కాల్చుకొని వాఁతలు కలదై నట్లుండును. (సహజమైన చారలు లేని నక్క వాఁతలను విధించుకొన్నను, దానికి పులి యొక్క బలిమి రాదు). (సహజశౌర్యము లేని) మీరు ఈ విధముగా వీర వచనములు వల్లించి గర్వించుట సిగ్గు గదా! అట్టి వాక్కులు వ్యర్థములు.

అలం: లోకోక్తి.

ఆ.వె. హరి గ దావిహార మల్లంత దోచిన
వరము మిమ్ము గావ వలఁతి యగునె
వెఱ్ఱివార పిడుగు వ్రేసిన ఁదలటొప్పి
యాఁగునే వివేకమైన వలదె. 166

తా: హరియొక్క కౌమోదకి అనెడి పేరుగల గదయొక్క విలాసముతో కూడిన సంచారము, కన్పట్టినంతనే శివుని వరములు మిమ్ము రక్షించుటకు సమర్థములగునా?

ఓ వెఱ్ఱులారా! పిడుగుపడినపుడు తలమీఁదగల కుచ్చుల పాఁగా, (టోపీ) దెబ్బను ఆఁపఁగలదా? (టోపితో తలయు ముక్కలగును) మీకు మంచి చెడ్డలను ఆలోచించు తెలివి అవసరము.

అలం: దృష్టాంతము.

కం. అగునో కావో వరములు
డిగ విడువగ రాదు హంసడిభకుల నంచున్
మొగరించిన హరు నయినను
ఁగ మెఱుఁగగ ఁదోలి తమ్ముఁ ఁజంపెద ననుమీ. 167

తా: శివుఁడిచ్చిన వరముల ప్రభావ మెట్టిదో! (అవి ఫలించునో ఫలింపవో) హంసడిభకులను వదలిపెట్టకూడదు. నన్ను హరుఁడు ఎదుర్కొన్నను, అతనిని తఱిమివేసి, లోకమంతయు ఎఱుఁగునట్లు వారిని వధించెదను. ఈ మాటలను వారితో చెప్పుమా!

కం. పర పగు మోహర మేర్పను
వెర వగుచో నెల్లి నేఁడు విడిసెద మధురా
పురమునఁ బ్రయాగమునఁ బు
ష్కరమున దా రేర్చికొన్న కల నగు మాకున్. 168

అర్థ : పరపు+అగు = విస్తరించునట్టి; మోహరము = సైన్యముల అమరిక; ఏర్పను = ఏర్పాటు చేయుటకు; వెరవు = తగినచో; తారు = తాము; కలను = యుద్ధము.

తా : విరివిగా సేనలను అమర్చుటకు తగినదైనచో రేపో, లేదా నేఁడో, మధుర ప్రయాస, పుష్కరము అను వానిలో వారు దేనిని కోరినను, అచ్చట మాకును వారికిని యుద్ధము జరుగును.

(త్వరలో యుద్ధమునకు రావలసినదిగా కృష్ణుఁడు కోరెను).

మ. మొగమోటంబున నీవు వారి యెదురన్ ముఖ్యంబు యుద్ధం బకాఁ
దెగనాడన్ వెఱతేని సాత్యకి సమిద్ధీరుండు నీతోన్వయే
గి గుణగ్రాహులు గాని తద్ధరణిభృత్కూటాంతరంగంబులం
బగుల న్వైచుఁ గఠోర వీర వచన ప్రాసప్రసారోద్ధతిన్. 169

ర్థ: మొగమోటంబునన్ = ముఖప్రీతికై; యుద్ధంబు+అ, కాన్ = యుద్ధమే, అగునని; + ఆడన్ = ఖండితముగా చెప్పుటకు; వెఱతు+ఏని = భయపడినచో; సమిత్ + ధీరుండు ద్ధములో ధైర్యశాలి; గుణగ్రాహులు = మంచి గుణములను తెలిసికొనలేని; తద్+ధరణిభృత్ + అంతరంగంబులన్ = ఆ రాజులనెడి పురుగుల యొక్క హృదయములను; కఠోర చన = పరుషములైన శౌర్యమును ప్రకటించు వాక్కులు అనెడి; ప్రాస ప్రసార + ఉద్ధతిన్ ఈఁటెల ప్రయోగము యొక్క తీవ్రతచే (పొడిచి); పగులన్, వైచున్ = పగులఁగొట్టును.

ా: రాజకుమారుల ఎదుట వారిముఖప్రీతికై యుద్ధము ముఖ్యమై అత్యంతా మై ఉన్నదని పలుకుటకు భయపడిన వాఁడ వగుదువేని, యుద్ధమునకు దంజవైచు, దిట్ట, ధీరుఁడు, నా తమ్ముఁడు, సాత్యకి నీ తోడనే వచ్చి గుణములను పలేని ఆ మీ రాజకుమారులు అనెడి పురుగుల హృదయములను తన వీరాలాపములు ఈఁటెల పోటుల తీవ్రతతో, పగులఁగొట్టఁ గలఁడు.

శే : "వీరరచన ప్రాస ప్రసారోద్ధతిన్" అనుటచే 'ప్రాస' అనఁగా ఈఁటె అనియు, సామ్యమనియు అర్థము. ఇట శ్లేషచే, మాటలచేతను పోటుల చేతను, శత్రువుల రంగంబులను పగులగొట్టఁ గలఁడనుట.

లం: 1. పరికరము - గుణగ్రాహులు కాని వారు కీటకతుల్యులు. సాభిప్రాయ ణమున్నది.

. రూపకము - ధరణిభృత్కీట, వీరవచన ప్రాస ప్రసార.

్యా. 1. యుద్ధంబు + అకాన్; 'అ' అవధారణార్థకము (నిశ్చయమును తెలుపును). ' ధాతువు యొక్క నుజ్యంత రూపము కాన్, కాన్=అని' అర్థము.

ూ. అకానిత్యర్థకంబగు. క్రియ, ప్రౌఢ - 33.

. వెఱతు+ఏని, వెఱతువు+ఏని, ఇందు వకారలోపము (చూడు, పద్యము - 50).

అని పలికి సాత్యకిం గను గొని నీవితని తోడ సాల్వనగరంబునకు హయారోహణుండ వై సన్నాహంబు మెఱసి యొక్కరుండవ చని మదీయ వచనంబు లన్నియుఁ దద్రాజడింభ కుల యెదుర ఁబలికి కలను చెపి రము ని వీడుకొలిన. 170

తా: అని పలికి, సాత్యకితో గుఱ్ఱము నెక్కి, యుద్ధ ప్రయత్నము గోచరమగుచుండఁగా జనార్దనునితో కూడ సాళ్వనగరమునకు పోయి, హంస డిభకులను కలసికొని, యుద్ధమునకు పిలువుము అని అతనిని వీడుకొల్పఁగా (మీఁది పద్యముతో).

## -: సాత్యకి సాల్వ నగరమునకుఁ బోవుట :-

ఉ. వేడ్కఁ బ్రణామపూర్వముగ విశ్వజగజ్జనకున్ జనార్దనున్
వీడ్కొని యాజనార్దనుఁడు వేగమ కూడఁగ రా నరాతు లీ
మాడ్కి మహోద్ధతిం జెనయ మావశమా యన జోడుఁగైదువుం
జూడ్కికిఁ దోఁప శౌరి యనుజుం డరిగెం దుర గాధిరూఢుఁడై. 171

ప్రతి: శౌరి అనుజుండు = కృష్ణుని తమ్ముఁడు సాత్యకి; వేడ్కన్ = కుతూహలముతో; ప్రణామ పూర్వకముగన్ = నమస్కారము ముందే చేసినవాఁడై; విశ్వ జగత్ +జనకున్ = సమస్త లోకములకు పితయైన; జనార్దనున్ = శ్రీకృష్ణుని; వీడ్కొని = సెలవు కైకొని; ఆ జనార్దనుఁడు (మంత్రి కుమారుఁడు); వేగమ కూడఁగరాన్ = తనతో కలిసి వచ్చుచుండఁగా అరాతులు = శత్రువులు; ఈమాడ్కిన్ = ఇట్లు; మహా+ ఉద్ధతిన్ = ఎక్కువ గర్వముతో; చెనయ మావశమా! = ఎదుర్కొనుటకు మా వలన అగునా? ; అనన్; జోడున్, కైదువున్ = కవచము, కత్తి; చూడ్కికిన్ = పరుల చూపులకు; తోఁపన్ =ప్రకటముగా కన్పట్టుచుండఁగా; తురగ + అధిరూఢుఁడై = అశ్వమును అధిరోహించిన వాఁడై; అరిగెన్ = పోయెను.

తా: కుతూహలముతో సాత్యకి కృష్ణునకు నమస్కరించి, వీడ్కొని వేగముగా తనతో జనార్దనుఁడు కూడి రాగా, విరోధులు అధిక గర్వముతో, "యాదవులను ఎదిరించుటకు మాకు వశమగునా!" అనునట్లు అతఁడు పరులదృష్టికి భయంకరముగా కన్పట్టుచు కవచము, కత్తి ధరించిన వాఁడై గుఱ్ఱమునెక్కి సాళ్వనగరమునకు ఏతెంచెను.

వ్యు. జనార్దనుఁడు, ప్రళయకాలమున సర్వజనులను నాశము చేయువాఁడు.

వ్యా. జగత్ + జనకున్ = శ్చుత్వసంధి.

సీ. చని సాళ్వ పురము చొచ్చి నరేంద్ర నందన
మందిర ద్వారంబునందు హయము
నవతరించి జనార్దనాంతఃప్రవేశంబు
మున్ను గా వారికిఁ దన్ను శౌరి

పుత్తెంచుటయుఁ జెప్పి పుచ్చె నాతండట్ల
చేసి యర్ఘాస నాసీనుఁ డైన
పిదప రప్పించిన ఁబెంపుతో సాత్యకి
యాజనార్దను ఁడున్న యాసనంబు
నందు గూర్చున్నఁ దప్పక హంసుఁ డతని
యాననంబు విలోకించి యా మనోజ్ఞ
భీషణం బగు వేషంబు బింబి తావ
హిత్థరోషంబుఁ గనుఁగొని యిట్టు లనియె. 1!

అర్థ: అర్హ+ఆసీనుఁడు = తగిన ఆసనమందు కూర్చున్న వాఁడు; తప్పక = చూపు మరల
బిత + అవహిత్థ రోషంబునన్ = పైకి తోఁచుచు, లోపల దాఁగియున్న కోపముతో; కనుఁగ
ాగుగా గమనించి.

తా: సాత్యకి సాళ్వనగరము ప్రవేశించి, రాజకుమారుల మందిర ద్వారమం
థ్రమును దిగి జనార్దనుఁడు ముందే లోపలికి పోఁగా; అతనిచే, హంసడిభకుల
న్ల కృష్ణుఁడు దూతగా పంపిన వార్తను చెప్పి పంపెను. జనార్దనుఁ డా విధ మాచరిం
ర పీఠమందు కూర్చుండి తన్ను పిమ్మట రప్పింపఁగా, సాత్యకి ఠీవితో లోనికి చ
ర్దనుఁడు కూర్చున్న ఆసనము నలంకరింపఁగా, హంసుఁడు అతని ముఖము
పు మరల్పక చూచి మనస్సును హరించునట్టియు భయంకరమైనదియును
ద్యలంకారములు ఆయుధధారణాదులు కల అతని ఆకృతిని అంతరంగము
ఁగియున్న కోపమును గమనించి, ఈ విధముగా పలికెను.

అలం : 1. విషమము.మనోజ్ఞ భీషణవేషంబు.

అసమరూపము. విరుద్ధములైనవి యొకచో నుండుట.

2. విభావనము : ఆకారగోపనము చేసినను రోషము ప్రకటిత మగుచున్నది.

వ్యా. పుచ్చు + తెంచు = పుత్తెంచు.

. సూ. 'తెంచు' ధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగు, నగుచో నుత్వంబు పయి
తకరాంబు దకారంబగు. క్రియ, బాల -110.

. అయ్యది పరంబగు నపుడు 'చు'వర్ణంబు లోపించు. క్రియ బాల - 112.

(పోవునకు, పుచ్చు, పుత్తెంచు - ప్రేరణార్థకములు. ఇచ్చుటద్విత్వచకారలోపమును, తకారాగమమును కలిఁగినవి).

మ. "ఇతఁడే సాత్యకి యిమ్మహాభుజాబలం బెల్లప్పుడుం జెప్పఁగా
శ్రుతిపర్వం బగు నేఁడు గంటిమి గదా శూరుండు ధీరుండు సు
వ్రతుఁ డౌదార్య సమన్వితుం డఖిలశాస్త్రజ్ఞుండు శస్త్రక్రమా
ర్జిత సారుం డను మాటలన్ని యుఁ దగుం జిత్తం బుదాత్తంబగున్." 173

అర్థ: శ్రుతిపర్వంబు + అగున్ = వినుటకు ఇంపుగా నుండును; సువ్రతుఁడు = నియమవంతుఁడు; ఔదార్య సమన్వితుండు = శీఘ్రముగా ఇతరులకు సాయము చేయు గుణము కలవాఁడు; శస్త్రక్రమ + ఆర్జిత సారుండు = ఆయుధ ప్రయోగ విధమెఱిఁగిన వాఁడు.

తా: సాత్యకి అనఁగా ఇతఁడే కదా! ఈతని భుజబలమును గుఱించి ఇతరులు చెప్పుచుండగా, వీనుల విందుగా నుండును. నేఁడతనిని చూడఁగలిఁగితిమి గదా! శూరుఁడు ధీరుఁడు, నియమవంతుఁడు, సర్వశాస్త్రవేత్త శస్త్ర ప్రయోగ విధమెఱిగిన నిపుణుఁడు; ఇట్లు అతని స్తుతించు మాటలు, తగినవే! అతని మనస్సును గొప్పదే!

విశే: అఖిల శాస్త్రజ్ఞుఁడు - అష్టాదశ విద్యల నెఱిఁగిన వాఁడు. 1. ఋగ్వేదము 2. యజుర్వేదము 3. సామవేదము 4. అధర్వణవేదము 5. శిక్ష 6. వ్యాకరణము 7. ఛందస్సు 8. నిరుక్తము 9. జ్యోతిషము 10. కల్పము 11. మీమాంస 12. న్యాయము 13. పురాణము 14. ధర్మశాస్త్రము (ఇవి చతుర్దశవిద్యలు) మఱియును, 15. ఆయుర్వేదము 16. ధనుర్వేదము 17. గాంధర్వము. 18. అర్థశాస్త్రము (మొత్తము 18).

అలం: వ్యాజస్తుతి మనస్సునందొకటి, వాక్కునందొకటి, వర్ణనలో నున్నది. (చూడు, పద్యం - 157)

వ. అనుటయు జనార్దనుండు. 174

తా : సులభము.

కం. "హరి దక్షిణభుజము సమి
ద్ధురంధరుఁడు నయవిహారదోహలి హలికిం
బరమాప్తుఁడు సకలకళా
పరిణతుఁ డీతం డలంతిపని వచ్చునటే."

అర్థ : సమిత్ +ధురంధరుఁడు = యుద్ధ క్రియానిపుణుఁడు; నయ విహారదోహలి = నీతి శాస్త్రమెఱిఁగినవాఁడు; హలికిన్ = బలరామునకు; పరమ + ఆప్తుఁడు = మిక్కిలి ఁడు; సకలకళా పరిణతుఁడు = అన్ని కళలయందు పరిపక్వమైన జ్ఞాని; అలంతి పని = మైన పని.

తా: ఈ సాత్యకి కృష్ణునకు కుడిభుజము (ముఖ్యుఁడు). యుద్ధ క్రియా నిపుణుఁడు. నీతి శాస్త్రకోవిదుఁడు. బలరామునకు ఇష్టుఁడు. సర్వకళల యందు, పరిపక్వమైన నము కలవాఁడు. అల్పమైన పనికై మన కడకు వచ్చునా?

అనుటయు హంసుండు సాత్యకితో నిట్లనియె. 176

తా : సులభము

"కంసవైరికి గుశలమే కామపాలు
నకుఁ బ్రమోదంబె యాదవులకు సుఖంబె
యుగ్ర సేనుండు మొదలుగా నున్న సాత్వ
తులకు నెల్లను సేమమే దురితదూర!" 177

తా: పాపమునకు దూరమైనవాఁడా! కంసవైరికి (కృష్ణునకు) క్షేమమా! కామపాలునకు రామునకు) సంతోషము కలదా? (సుఖుఁడే కదా); యాదవులు సుఖులై ఉన్నారా? సేనుఁడు మొదలగు అచట నున్న సాత్వతి వంశీయుల కెల్ల క్షేమమేకదా?

ఉగ్రసేనుఁడు : కంసుని తండ్రి

సాత్వతి : శిశుపాలుని తల్లి. కృష్ణునకు మేనత్త.

సాత్వతులనఁగా, సాత్వతి వంశము వారు.

వివరణ : ఇందలి పదములన్నియు క్రింది విధముగా సాభిప్రాయ విశేషణ గర్భితములై వవులను పరోక్షముగా నిందించునవిగా నున్నవి.

. దురితదూర : నీవైనను పాపవృత్తికి పాల్పడవలదు. 2. కంసవైరి : తన వారినే చువాఁడు, కృష్ణుఁడు. 3. కామ పాలుఁడు: కామమునకు వశుఁడు, బలరాముఁడు యాది సుఖలోలత కలవాఁడు, సురాపాన మత్తుఁడు. 4. సాత్వతులు : సాత్వతి ఁడు శిశుపాలుఁడు. అతనిని వధించినవాఁడు కృష్ణుఁడు.

అనవుడు సాత్యకి మోమున
గొనసాగని తెలివి దోఁపఁ గుశలమ నీ చె
ప్పినవారి కెల్ల ననుటయు
ననియె జనార్దనునితోడ హంసుఁడు పిదపన్. 178

ర్థ: కొనసాగని తెలివి = తొలఁగిన ప్రసన్నత; తోఁపన్ = కన్పట్టఁగా.

తా : అని నిందాగర్భితముగా క్షేమము ప్రశ్నించిన విధము, సాత్యకి మోమున
ృతను తొలఁగించినది. సంక్షేపముగా "నీవడిగిన వారికి అందఱికిని క్షేమమే" అని
ధానమిచ్చెను. వేర్వేఱుగా క్షేమ సమాచారమడుఁగఁగా, ఇట్లు సాత్యకి పలుకుటలో
అతని కినుకను గుర్తించిన హంసుఁడు, అతనితో మఱొక మాటను వచింపక
ర్దనునితో సంభాషించెను.

"కంటే శౌరి నతండు నీ పలుకు లాకర్ణించెనే క్రమ్మఱన్
వింటే తద్వజనంబు చెప్పు", మనుడు న్విప్రో త్తముం డిట్లనున్
"గంటిన్ గంటి దయానిధిన్ గుణనిధిన్ గారుణ్య పాథోనిధిం
గంటి న్నమ్మికఁ దమ్మి కంటిఁ గొలువం గంటిం గృతార్థుండనై. 179

ప్రతి: శౌరి = శూరుని వంశములోని వాఁడైన కృష్ణుని, కంటే = కంటివా? (చూచితివా?);
ండు నీపలుకులు; ఆకర్ణించెనే? = ఆలకించెనా? చెప్పుము + అనుడున్; విప్ర+ఉత్తముండు
ట్ల + అనున్; కంటిన్ + కంటిన్ = ఈ కంటితోనే (ఆ మహాభాగ్యమును) అనుభవించితిని;
ానిధిన్ = దయకు గనియైన వానిని (సర్వభూతముల యెడ సమానమైన ఆదరము
ానిని); గుణనిధిన్ = శాంతి క్షమ మొదలగు కళ్యాణ గుణములకు నిలయుఁడైన వానిని;
ణ్య పాథస్ + నిధిన్ = కరుణా సముద్రుని (కరుణ అనెడి సముద్రుని, కరుణను మెండుగా
, తన్ను సేవించు వారినేగాక, తన్ను ద్వేషించువారిని సైతము అనుగ్రహించువానిని);
మ్మికన్ =విశ్వాసముతో; కంటిన్ = తెలిసికొంటిని; తమ్మికంటిన్ = కమలనేత్రుని;
+అర్థుండనై = ధన్యుఁడనై; కొలువన్ + కంటిన్ = సేవింపఁగల్గితిని.

తా: "నీవు ఆశౌరిని కాంచితివా? అతఁడు నీ పలుకులను వినెనా? మరల ఆతని
ఖమాటలను శ్రద్ధగా విన్నావా? చెప్పుము" అని హంసుఁడు కోరఁగా, ఆ బ్రాహ్మణ
ుఁడు ఇటనెను.

"ఈ కళ్లతోనే, దయానిధి, గుణనిధి కరుణా సముద్రుండైన ఆ దేవ దేవుని చూచెడి
ేభాగ్యమును అనుభవించితిని. విశ్వాసముతో ఆతండే పరమాత్మ అని గ్రహించితిని."

విశే : రాజకార్యమును గుఱించి, హంసుండు ప్రశ్నింపంగా జనార్దనుండు, ఆ
ంగమును వదలివేసి, శ్రీకృష్ణపరమాత్మ దర్శన భాగ్యము యొక్క అనుభూతిని
ని యెడగల భక్త్యావేశముతో వర్ణించుటకు మొదలిడెను. అపు డతని మానసిక స్థితి
)త్యమును ఎఱుంగని దయ్యెను. దూతకిది అధిక ప్రసంగము.

అలం. 1. యమకము, "కంటి" అను పదము వేర్వేఱు అర్థములలో ఆవృత్తమైనది.

2. ఉల్లేఖము, కృష్ణుండు పలువిధములుగా వర్ణింపంబడెను.

3. వృత్త్యను ప్రాసము, 'నిధి'మూడు సార్లు ఆవృత్తమైనది.

వ్యా. పాథోనిధి, పాథస్+నిధి. విసర్గ సంధి.

ఛం. బిందు పూర్వక 'ట' వర్ణము దుష్కర ప్రాసము.

"అవిరళరత్న నూత్న కన కాసన పూర్వ మహీధరంబుపై
నవవిక చారవింద రుచి నవ్వెడు కన్నులచాయ చుక్కలన్
దివియల మాయం జేయ నలుదిక్కుల మ్రొక్కుల పేర మోడ్పు యా
దవ కరకైరవంబులకతంబునం గంటి మురారి భాస్కరున్. 180

ప్రతి: అవిరళ = దట్టమైన; రత్న = మణులతోం గూర్పంబడిన; నూత్న కనక+ఆసన =
దైన పసిడి గద్దియ అనెడి; పూర్వ మహీధరంబుపై = ఉదయ పర్వతముపై (తూర్పుకొండ);
కచ + అరవింద రుచిన్ = క్రొత్తగా వికసించిన తెల్ల దామరల కాంతిని; నవ్వెడు కన్నుల
ు = హేళన చేయు నేత్రముల ప్రకాశముచే; చుక్కలన్ = నక్షత్రములు అనెడి దివియలన్
పములను; మాయన్ + చేయన్ = కాంతి తొలంగునట్లు చేయుచు (తొలంగించుచు)
ిక్కుల మ్రొక్కుల పేర = నాలుగు దిక్కుల యొక్క నమస్కార రూపమనెడి (నాలుగు
.లు, వచ్చి మ్రొక్కుచున్న వేమో అనునట్లు); మోడ్పు యాదవ కర కైరవంబుల కతంబునన్
ుయిలించు, (ముకుళించు) యాదవుల చేతులు అనెడి తెల్ల కలువల గుఱుతులుగా
ణముగా); మురారి భాస్కరున్ = కృష్ణుండు అనెడి, ఉదయ కాలపు సూర్యుని; కంటిన్.

ా: అధికముగా రత్నములు గల క్రొంగ్రొత్త పసిడిగద్దియ అనెడి తూర్పు కొండపై,
డే వికసించిన తెల్ల దామరల కాంతిని అతిశయించు కన్నుల నుండి వెల్వడు

కిరణములచే (ప్రకాశముచే), నక్షత్రములు అనెడి దీపములను, తొలఁగించుచు (కాంతి హీనము చేయుచు), నాలుగు దిక్కులు నమస్కార నెపముతో, మ్రొక్కుచున్నవేమో అనునట్లు ముకుళించిన యాదవుల హస్తములు అనెడి తెల్లకలువలు గుఱుతులు గల శ్రీకృష్ణుఁడు అనెడి ప్రభాతకాల సూర్యుని కాంచితిని.

విశే. శ్రీకృష్ణుని జనార్దనుఁడు, ప్రభాతసమయమున కొలువుదీరి యుండగా సందర్శించెను. ఆ సమయమందు సేవార్థము యాదవు లెల్లరు సభ నలంకరించి యుండిరి. ఆకసములో చుక్కలు వెలుగుచుండినవి. యాదవులు, కరములను, మోడ్చి నమస్కరించుచుండిరి. ఆ దృశ్యమును, సోమన ఈ పద్యములో వర్ణించెను.

అలం: 1. సావయవరూపకము:

ఉపమేయములు . ఉపమానములు .

1. నూత్నకనకాసనము 1. పూర్వమహీధరము

2. చుక్కలు 2. దివియలు

3. యాదవ కరములు 3. కైరవములు

4. శ్రీకృష్ణుఁడు 4. భాస్కరుఁడు

(ఉపమేయమందు ఉపమానము ఆరోపింపఁబడినది.

2. ఉత్ప్రేక్ష - 'నలుదిక్కుల మ్రొక్కులపేర' మోడ్చిన యాదవుల కరములు, నలుదిక్కుల యందు నిండియుండుటచే, నలుదిక్కులే రూపు దాల్చి నమస్కరించి నట్లు ఊహింపఁబడినది.

వ్యా. నలుదిక్కులు (చూడు పద్యము - 46).

సీ. "ఉరము కౌస్తుభరత్న ముదయాద్రితటమున
బొడతెంచు కలువల [1]బోటుబోటు
శిరము కిరీటంబు సురగిరి నెత్తాన
రాజిల్లు పగలింటిరాజు రాజు
కటి పచ్చఁబట్టు దిగ్దంతికుంభస్థలిఁ
జూపట్టు రే యెండ జోడు జోడు

1. బోఁటి.బోఁటి

చేతి శంఖంబు గర్జిత గ జేంద్రము కేలఁ
బరఁగు వెన్నెల పూవుబంతి బంతి
గీ. యై కొలువులోనఁ దేజోమయంబు సేయ
మౌక్తి క వితానమయ సభామండపమున
సత్యభామా సఖీకటాక్షముల గములు
చూఱ గొనుచున్న దేవకీసుతునిఁ గంటి. 181

ప్రతి: ఉరము కౌస్తుభరత్నము = ఱొమ్మునయున్న కౌస్తుభమణి; ఉదయ+అద్రి తటమునన్ = తూర్పు కొండయొక్క గట్టున, పొడ తెంచు = ఉదయించు; పొలాం(బోఁటి బోఁటి) కలువల బోటు = కలువల శత్రువు, సూర్యునకు; బోటు = శత్రువు; శిరము కిరీటంబు = తలపై నున్న కిరీటము; సురగిరి నెత్తాన = మేరుపర్వత మైదానమందు; రాజిల్లు = గోచరించు (ప్రకాశించు); పగలింటిరాజు = సూర్యునకు; రాజు = రాజు; కటి పచ్చఁబట్టు = నడుమున కట్టుకొన్న పసుపుపచ్చని పట్టువస్త్రము; దిక్ దంతి = దిగ్గజముల యొక్క; కుంభస్థలిన్ = చెక్కిళ్ళ యందు; చూపట్టు రేయెండ = కన్పించు లేఁత ఎండతో; జోడు జోడు = చెలిమి చేయు నెచ్చెలి; చేతి శంఖంబు = చేతఁగల శంఖము; గర్జిత గజేంద్రము కేలన్ = ఘీంకారము చేయుచున్న మత్తగజము యొక్కతొండముపై; పరఁగు వెన్నెల పూవుబంతి = ఉన్న వెన్నెల కాంతి గల పూలగుత్తికి; బంతి = మేలు బంతి (మేలైన కాంతి కలది); ఐ = ఈ విధముగా వెలుఁగుచు; కొలువు లోనన్ = ఆ నిండు సభయందు; తేజస్ + మయంబు + చేయన్ = కౌస్తుభము, కిరీటము పచ్చఁబట్టు, శంఖము, ఇవి నాలుగును తమతమ తేజస్సును, ఎల్లెడలను ప్రసరింపఁజేయుచుండఁగా, మౌక్తికవితానమయ సభామండపమున = ముత్యముల వరుసలను గల చాందినీలు విరివియైన సభామందిరములో (వివిధాలంకరణములు గల సభయందు); సత్యభామా సఖీ = ప్రియురాలగు సత్యా దేవిని యొక్క; కటాక్షముల గముల = క్రేఁగంటి చూపుల సమూహమును; చూఱగొను = ఆకర్షించుచున్న; దేవకీ సుతునిన్ =దేవకి సుతుఁడైన కృష్ణుని; కంటిన్.

తా: ఱొమ్మునకెంపు వర్ణముగల కౌస్తుభమణి, తూర్పు కాంత యొక్క మైదానము లందు గోచరించు సూర్యుని అరుణకాంతులను మించినది గాను, శిరస్సునఁ గల తెల్లని వజ్రకిరీటకాంతులు, మేరు పర్వత సానువులలో ప్రసరించు సూర్యుని కిరణములను అతిశయించినదిగాను, నడుమునఁ గల పసుపు పట్టు గుడ్డ, దిగ్గజముల చెక్కిళయందుఁగల పసిమి గల లేఁత ఎండతో చెలిమి చేయునది గాను, చేతనున్న తళతళలాడు మిక్కిలి ధవళ వర్ణముఁగల శంఖము, మదించిన గజము యొక్క తొండముపై నుండు పూలగుత్తి

మించిన మిసిమి గలదిగాను, సభయందు మెఱుఁగులు చిమ్ముచుండఁగా, ముత్యముల వరుసలతో నిండిన వస్త్రాద్యలంకారములు గల ఆ పెద్ద మందిరములో, ప్రియసఖియగు సత్యాదేవియొక్క చూపులను తన మనోహరమైన రూపముతో ఆకర్షించుచున్న శ్రీకృష్ణుని చూచితిని.

విశే. 180 వ, పద్యమందు, అరుణోదయ ప్రభాత సూర్యవర్ణనము, 181 వ పద్యమందు భాస్కరుని క్రమాభివృద్ధి వర్ణింపఁబడినవి. తొలుత రవి అరుణబింబము మెలమెల్లగా గోచరమయి మైదానములపై వ్యాపించును. అనంతరము దూర ప్రదేశములందు నిడుపై తెల్లని తీఁగెలవలె సాగుచు కన్పట్టును. తర్వాత పసిమితో స్వర్ణకాంతుల వెదఁజల్లును. పిమ్మట, స్వచ్ఛమైన ధవళమైన తేజః ప్రసారమును ఎల్లెడల వ్యాపింపఁ జేయును.

అలం: 1. ఉపమ, కౌస్తుభమణి, వజ్రకిరీటము, పచ్చఁబట్టు, చేతఁగల శంఖము, సూర్యుని వంటి కాంతి ప్రసారము గలిగియున్నవి.

2. యమకము - బోటుబోటు, రాజురాజు, జోడుజోడు, బంతి బంతి - వేర్వేఱు అర్థములలో ప్రయోగింపఁబడినది. భావోద్దీపకమైన 'జంట' పదముల కూర్పు వింతయైన చెలువముతో నొప్పుచున్నది.

మ. "కని యద్దేవునితోడ వేడబమునం గప్పంబు గార్యంబు గా
నను బుత్తెంచుట జెప్ప నోడితి జగన్నాథుండు నీ విప్డు వ
చ్చిన కార్యం బెఱిఁగింపు మన్న పిదపం జెప్పంగ నో రాడె న
వ్వనివా రెవ్వరు లేరు నా పలుకులన్ వా క్రువ్వ నిం కేటికిన్. 182

అర్థ: వేడబమునన్ = వంచనతో (వచ్చినవిషయమును చెప్పక కప్పి పుచ్చుచు); ఓడితిని = జంకితిని; నోరు + ఆడెన్ = నోటిలో మాటలు వెలువడినవి; వాక్రువ్వన్ + ఇంక+ ఏటికిన్ = మరల ఏల ఇచట చెప్పవలెను?

తా: కృష్ణుని చూచి, కప్పమడుగుటకై నన్ను పంపిన వార్తను చెప్పుటకు, జంకినవాఁడనై, వంచనతో కప్పిపుచ్చితిని. ఆ లోకనాయకుఁడు 'నీవు వచ్చిన పనిని ఎఱిఁగింపు'మని కోరఁగా, కప్పమడుగుటకై వచ్చిన వార్తను నివేదించితిని. ఆ మాటలు విన్న వారందఱు నవ్విరి. ఊరక యున్న వారెవ్వరు లేరు. నేను వారితో చెప్పిన పరిహాసపాత్రములైన

పలుకులను, మరల ఏల చెప్పవలెను? జనార్దనుఁడు తాను అనుభవించిన పరిభ తిరస్కారముల వలన కలిఁగిన వేదన నిట్లు వివరించెను.

నోరాడు : జాతీయము.

వ. "ఏ నప్పురుషోత్తము నుప్పు గప్పం బడిగిన నప్పుడతం డెప్పు డెప
డప్పార్థివ డింభద్వయంబుఁ జూతునో యెచటం దెగ జూతుఁ
యనుచుండి వెండియుం గొండొక నవ్వు నవ్వి యవ్విభుంఁ
నారదుతోడ మాట లాడుచు నా మాటల యెడ ననాదరంబు చే
నవ్వాసు దేవుండు దుర్వాసుతో వినోదంబుగాఁ గొందఱు యతీశ్వరులక
వాదు చేయించి బ్రహ్మ తత్త్వ నిర్ణయంబునకు వెఱవక వారి చేఁ
నుత్తరంబు లిప్పించుచు నుండె నట్టియెడ నాతలంపున. 183

తా: నేను కప్పమడుగఁగా కృష్ణుఁడు,ఆ మూర్ఖులగు రాజకుమారుల నెప్పుఁ మాడఁగలనో, ఎచ్చుట వధింపఁగలనో అనుచు, హేళనతో నవ్వి, నారదునితో మాటలాడుచ నా మాటలను, ఆదరింప లేదు. ఆతఁడు, దుర్వాసునితో, యతీశ్వరులకు, బ్రహ్మతత్త్వ నిర్ణయవిషయమున, వినోదమునకై వాదము నేర్పాటు చేసి, వారిచేత, నిర్భయముగ సమాధానములు ఇప్పించుచుండెను. ఆ సమయమందు (తర్వాతి పద్యముతో).

జనార్దనుఁడు కృష్ణుని పురుషోత్తముఁడని వర్ణించుటచే హంసుఁడు మండిపడెన అయినను విప్రతనయుఁడు శస్త్ర తుల్యములైన మాటల పోటులచే క్రింది విధముగ అప్రియమైన ప్రసంగము చేసి హంసుని రెచ్చఁగొట్టెను.

వ్యా. చూతును + ఓ, చూచుదును +ఓ, 'చుద్'నకు 'త' కారాదేశము. (వి) వాద (ప్ర) వాదము (చూడుము, పద్యము 155)

. "అకట నేరని వా రైరి హంసడిభకు
లేమిగా నిందుఁ బుత్తెంచి రెలమి నేను
వచ్చి వీఱిఁడి నైతి నివ్వాసు దేవుఁ
దేఱి చూడంగ రా దని దిగులు గుడిచి. 184

తా: అకటా! హంసడిభకులు తెలివి లేని వారైరి గదా! ఏమగుటకో, ఇచ్చుటకు

సంతసముతో పంపినారు. నేను వచ్చి వెట్టి వాఁడనయితిని. (పాఠాం. రి+ఏను+ఇది+ఏల - నేనిట్లు ఎందులకు వచ్చి వెట్టివాఁడనయితిని) అహో! ఈ వసుదేవతనయుని చక్కగా దృష్టించి చూడఁజాలనని భయము చెందితిని. ఈ వాసుదేవుఁడనుటలో వసుదేవుని కష్టములనుండి సంరక్షించిన భగవానుఁడను భావము గర్భితము. అట్టి దేవునకు, అప్రియమును వచింప వెనుకాడుటకు కారణమును చెప్పెను.

వ్యా. పుత్తెంచు, (చూడుము, పద్యము - 155)

కం. "మానితిఁ బని యామాటలు
మాని తిరుగుఁ డింక మీరు మన మాటలకుం
బూని మఱుమాట లాడఁగ
శైనేయుండు వచ్చెఁ దాన చాలుఁ బనికిన్." 185

తా: వచ్చినపని గుఱించి చెప్పుటకు విరమించితిని. మీరు, ఇక మీఁదట కప్పుమడుగు మాటలు మాని ప్రవర్తింపుఁడు. మనము అచ్చట నివేదించిన మాటలకు సమాధాన మిచ్చుటకు, శిని మనుమఁడు సాత్యకి నాతో వచ్చినాఁడు. తానే ఆ పనికి తగినవాఁడు.

కం. అనుటయు హంసుడు గమగమఁ
గనలి 'మదిం జెఱువు విడిచి కాలువఁ బొగడం
జనునే వీనికి' నని యి
ట్లను ననుమానింప కా జనార్దనుతోడన్. 186

తా: అనఁగా హంసుఁడు మనస్సులో గమగమ (ధ్వన్యనుకరణము) అని మండిపడుచు "వీఁడు, నీటితో నిండిన చెఱువును నుతింపక, నీటిని తెచ్చు కాలువను పొగడుచున్నాఁడు? ఇదితగునా?" అని, తలంచుచు, ఆతని హితవచనములను పరిశీలింపక, జనార్దనునితో ఇట్లు పలికెను.

విశే: 'గమ గమ' - సువాసనను వర్ణించు, ధ్వన్యనుకరణమైన జంటపదము. ఇచట కోపమును సూచించు సందర్భములో ప్రయోగింపఁబడినది.

అలం: దృష్టాంతము. కృష్ణుఁడు కాలువ, తాము జలాశయము. అల్పుఁడైన కృష్ణుఁడు, తేజోవంతులైన తమతో తుల్యుఁడుగాఁడనుట.

వ్యా. వీనికిన్, ఇచట వీఁడు అని అర్థము, ప్రథమకు షష్ఠి.

శా. "ఓరీ బ్రాహ్మణధూర్త! నా యెదుర నోహో సాహసం బెట్టిదో
వైరిం గోరి నుతించు మాట లెటుగా వచ్చెం గృతఘ్నా! యిదిన్
నోరే యెవ్వరి కెవ్వ రయ్యెదరు నిన్నుం బెంచి మన్నించినన్
గారామై యిటుచేసితే తొలఁగు మింకం జాలు నీ కార్యముల్. 187

తా: ఓరి! విప్రవంచకుఁడా! ఔరా! నా ఎదుట నావిరోధిని వలచి నుతించు పలుకులు వచించు నీ తెగువ ఎట్టిదో తెలియరాదు. ఈ మాటలను ఏల వదరుచున్నావు? చేసిన మేలు మఱచిన వాఁడా! ఇదియును నోరేనా? నిక్కముగా ఎవరికి ఎవరు సహాయపడు సంబంధము కలిఁగి యుందురో ముందే తెలిసికొనుట కష్టము. నిన్ను ప్రేమతో పెద్ద చేసి ఆదరించినను, మా పగవానిని పొగడి మాకు ద్రోహము చేసితివే! ఇంక నీ సేవలు మాని ఇక్కడ నుండి తొలఁగి పో!

అలం. అప్రస్తుత ప్రశంస, - ఎవ్వరి కెవ్వ రయ్యెదరు.

వ్యా. ఇదిన్, ఇదియున్.

ఇది సర్వనామము దీనికి 'యు' వర్ణక పూర్వకమైన 'ను' శబ్దము (సముచ్చయము) విభాషగా అనుప్రయుక్తమైనది. కనుక ఇదియున్ లేదా ఇదిన్ అను రూపములు ఏర్పడును. 'ఇది' అనుదంతమైన కళ. (శబ్ద, ప్రౌఢ - 116)

మ. "నిను రప్పింపక మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గకౌమోదకీ
వనమాలాంబుజ చక్రభూమికలు గైవారంబు చేయించె నే
లిన నాగారులచేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁ గాఁ
బనిచెం గేశవుఁ డైంద్రజాలికు గతిం [1]బ్రాఁతయ్యె నీకంతటన్. 188

అర్థ: శార్ఙ్గ = ఆపేరుగల విల్లు; కౌమోదకీ = ఆపేరుగల గద; వనమాల = ఆకులు, పళ్ళు కట్టిన నిడుపైన హారము; అంబుజము = కమలము; చక్రభూమికలు = సుదర్శనచక్రము మొదలగు వేషములు; కైవారంబులు = పొగడ్తలు; ఏలిన నాగారుల చేత = తన పాలనలోనున్న గరుత్మంతుఁడు మొదలగు వారిచేత (నాగులకు వైరి గరుడుఁడు); కేశవుఁడు = (నిందార్థకము) వెంట్రుకలు గలవాఁడు; ఐంద్రజాలికుఁడు = గారడిచేయువాఁడు. బ్రాఁత + అయ్యెన్ = గొప్పదయ్యెను. బ్రాఁతి = అధికము (శర) (పాఠాంతరము : భ్రాంతి+ అయ్యెన్)

తా: నిన్ను రప్పింపక ముందే, త్వరపడి కృష్ణుఁడు, ధనుస్సు, గద, వనమాల,

1. భ్రాంతయ్యె

కమలము చక్రము మొదలగు వానిని, ధరించెను. గరుడుఁడు మొదలగువారిచే స్తోత్రపాఠములు చెప్పించెను. మఱియును యాదవులను క్రమముతో కూర్చుండ బెట్టి సేవలు పొందెను. ఆ కేశవుఁడు (చక్కని వెంట్రుకలు గలవాఁడు) గొప్ప గారడి వాఁడు సుమా! ఆ సభయంతయు నీ కొఱకై చక్కగా కల్పింపఁబడినది. అది మోసము. అది అంతయు చూచి నీవు యాదవుని గొప్పగా తలఁచితివి. (ఆ సభ నీకు భ్రాంతిని కల్గించినది. ఆ దృశ్యము వాస్తవముగాదు).

చం. "పిఱికివి గాక నీవు నొక ప్రెగ్గడవే సభ లుండు భంగి ము
న్నెఱుఁగని వాఁడవై బ్రమసి యెవ్వరి ముందర నేమి మాటలో
యఱచితి వారి జంకెనల కచ్చుటఁ ద్రోపడి వచ్చి తిచ్చటం
[1]గఱవఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్. 189

అర్థ : జంకెనలు = బెదరింపులు; త్రోపడి = త్రోయఁబడి; గరిమము (పాఠాంతరము)

తా: నీ వొక మంత్రివేనా? పిఱికి వాఁడవే! ఇంతకు ముందు సభలుండు విధానము నెఱుఁగని వాఁడ వగుటచే మతిచెడి ఎవ్వరి ముందరో, ఏమేమో ప్రేలితివి. వారి బెదరింపులకు భయపడి వారిచే గెంటి వేయఁబడి అవమానముతో ఇచటికి మరలివచ్చితివి. బలవంతముగా గాడిదకు పులి చర్మమును కప్పినను, అది యితరులను ఎదుర్కొని కఱవఁ గలదా? (పాఠాం : అధికముగా పులి తోలు కప్పినను, గాడిదకు గొప్పతనము చేకూరునా?)

అలం: దృష్టాంతము "అసమర్థుఁడు, పిఱికి వాఁడవు, అయిన నీవు నీ కార్యమందు ఫలము సాధింప లేకపోయితివి గదా! సాధువైన గాడిద,పులితోలు ధరించినను అది క్రౌర్యమును ప్రదర్శింపఁజాలదు. చేతగాని వానికి మంత్రి పదవి యిచ్చినను వివేకి కాఁజాలఁడనుట.

శా. "నా కీతమ్ముఁడు ఖడ్గముం గలుగఁగా నాకేశుఁడున్ సాటియే
లోకంబు ల్పదు నాలుగున్ గెలుతుఁ గల్లో లాని లాలోల వే
లాకూపారము పారముం గదియఁ జేయం జాలినన్ ద్వారకం
గైకొందున్ యదువృష్ణిభోజనృప సంఘ ధ్వంస నాపాది నై. 190

1. గరిమము

అర్థ : నాక+ఈశుడున్ = నాకమునకు ప్రభువు, ఇంద్రుడు; ఆ కేశుఁడున్ = ఆ హరియును (అర్థాంతరము); కల్లోల + అనిల + ఆలోల= పెద్ద అలల చేతను, గాలిచేతను కదలుచున్న వేలా+అకూపారము, పారమున్ = చెలియలి కట్ట గల సముద్రపు ఆవలి గట్టును; ధ్వంసన + ఆపాదినై = నాశము చేసి.

తా : నాకు ఈ తమ్ముఁడు డిభకుఁడును, కత్తియు నుండఁగా. ఇంద్రుఁడు లేదా ఆ హరియు గాని నాకు సరిగాడు. పదునాలుగు లోకములను గెలువఁగలను. అలలతో వాయువుచే చలించుచున్న చెలియలి కట్టగల సముద్రము యొక్క ఆవలి గట్టు వఱకు నన్ను సమీపించునట్లు చేసినప్పటికి, యదు వృష్ణి భోజ వంశములకు చెందిన రాజుల నెల్లను నాశము చేసి ద్వారకను స్వాధీనము చేసికొందును.

వ్యు. అకూపారము - ఆవలి దరి యందు భూమి లేనిది, సముద్రము.

అలం: వక్రోక్తి : అకేశుఁడున్ (వెంట్రుకలు గలవాఁడు,వేషధారి అని హేళన). లక్షణము: స్వరవిశేషముచేగాని, శ్లేషచేగాని వేఱర్థము తోఁచినచో అది వక్రోక్తి అగును.

ద్వారక : ద్వారకానగరమునకు నలువైపుల సముద్రమున్నది. అది యొక ద్వీపము. ఆత్మరక్షణకై, సముద్రపు ఆవలిగట్టునకు పరుగిడిపోయినను అందఱిని నిర్మూలించి నిశ్శేషము చేసి) ద్వారకను గై కొందునని హంసుని ప్రతిజ్ఞ.

కం. "మా పట్టణమున నుండక
పో పో నినుఁ జంప రాదు పొత్తున వాఁడై
భూ పాలకు సిరి ఁ మ్రింగితి
పాపాత్మా!చుట్ట మైతి పగ వారలకున్." 191

తా: పాపబుద్ధి కలవాఁడా! ఇంక ఏ మాత్రము మా పట్టణమున నుండక ఎక్కడికైనను వెంటనే వెళ్లిపో. నిన్ను చంపరాదు. ఇరుపక్షములకు చెందిన వాఁడై, మా రాజ్యలక్ష్మికి ద్రోహము చేసితివి. పగవారలకు చుట్టమైతివిగదా!

వ. అని పలికి సాత్యకిం గనుంగొని. 192

తా : సులభము

"ఓరి యాదవ!కష్టాత్మ!యొక్కరుండ

మే మనియె నందసుతుఁడు న న్నెఱిఁగి యెఱిఁగి
కప్ప మిప్పుడు నా కీని కారణంబు." 193

తా: ఓరీ గొల్లా! దుష్టబుద్ధీ! నీవు ఒక్కఁడవే ఇచ్చటికి వచ్చుటలో నీ ఉద్దేశమేమి? నందుని సుతుఁడు, మీ అన్న, కృష్ణుఁడు, నన్ను బాగుగా ఎఱిఁగినవాఁడు, నాకు కప్పమియ్యక పోవుటకు కారణమేమి?

విశే. "యాదవ" అనెడి సంబోధనము, "నందసుతుఁడు" అనుట, హంసుని పరిహాస ప్రియత్వము ప్రకటితమగుచున్నది.

వ్యా. "ఈని" - ఇయ్యని, ఇచ్చునకు సర్వంబునకు 'ఈ' యగు. వ్యతిరేక తృవర్ణకార్థంబున 'నిజ్ 'యగు. క్రియ, బాల - 92, 47. 'ఈని' వ్యతిరేకార్థక ధాతుజ విశేషణము.

వ. అనుటయు సాత్యకి యి ట్లనియె. 194

తా : సులభము

శా. "ఆలోకించెదు శార్ఙ్గ ము క్త పటు బాణౌ ఘంబుచే నీ మొనల్
నేలం గూల (గపాలపాలికలలో నిండారు రక్తంబులం
గ్రోలం గేల బిశాచ బాలికలు గైకొన్న న్మణి శ్రేణితోఁ
గ్రాలం బెట్టిన వెండికోరల గతిం గప్పంబు లొప్పంబు గాన్. 195

ప్రతి: శార్ఙ్గముక్త పటు బాణ+ఓఘంబుచే = శార్ఙ్గము నుండి వెలువడిన బాణముల సమూహముచే; నీ మొనల్ = నీ సైన్యములు; నేలన్ = నేలపై పడఁగా; కపాల మాలికలలో = తల పుఱ్ఱెల వరుసలలో (పాఠాం. పాలికలలో = గిన్నెలలో); నిండారు రక్తంబులన్ = నిండిన రక్త ప్రవాహమును (రక్తమునకు - బహువచన ప్రయోగము); క్రోలన్ = త్రాగుటకై; కేలన్ = చేతిలో; పిశాచ బాలికలు; మణి శ్రేణితోన్ = ఎఱ్ఱని మణుల వరుసలతో; (అవి) క్రాలన్ = ప్రకాశించు చుండఁగా; పెట్టిన = చేతిలో పెట్టుకొన్న (పాఠాం. పట్టిన = పట్టుకొన్న); వెండికోరలగతిన్ = వెండి గిన్నెల వలె (ఆ పుఱ్ఱెలను); కైకొన్నన్ = తీసికొనఁగా;కప్పంబులు = నీవు కోరిన లవణ రూపమైన కప్పములను; ఒప్పంబుగాన్ = ఒప్పిదముగా, ముచ్చటగా; ఆలోకించెదు = చూచెదవు.

తా : హరి శార్ఙ్గమను వింటినుండి బాణపరంపర వెలువడి, వానిచే నీ సేనలన్నియు

న మొందినపుడు, ఆ సమయ మందు, తెల్లని పుత్తైలలో క్రొత్తదైన ఎఱ్ఱని రక్త
గుటకు పిశాచ బాలికలు, ఎఱ్ఱని మణులు పొదిగిన వెండి పాత్రల వలె పట్టుకొ
ప్పుడు నీవు కోరిన లవణ రూపమైన కప్పములను ముచ్చటగా చూడఁగలవు.

వ్యా. ఆలోకించెదు; వకారలోపము. (చూడుము, పద్యము - 50)

2. బాణ+ఓఘము = బాణౌఘము వృద్ధి సంధి

ఛం: ఆలోకించెదు... బాణౌఘము. "ఆ" కును సంధిలోవచ్చిన "ఔ" కును
తి. దీనికి అఖండయతియని పేరు. యతిస్థానము 13వ అక్షరము.

రూపాం. ఒప్పు, ఒప్పము, ఒప్పంబు.

సాత్యకి, ధీరోద్ధతుఁడు, ఆతని ఉద్రేక స్వభావమునకు తగిన విధమున, హంస
వచన మిచ్చెను.

అలం : ఉపమ. వెండి కోరలగతిన్.

"తెచ్చెద రెల్లి నేఁడు మముదెం డని పంచిన యుప్పు డాకినుల్
మచ్చరికంబునం జవు లమర్చుటకై డిభకుండు నీవునుం
జొచ్చిన చోటుసొచ్చి రణశూరుఁడు శౌరి కరాసి ధారచేఁ
బచ్చడి చేయఁగా జముని బానసముం బురుడించు చోటికిన్.

అర్థ: మచ్చరికంబునన్ = పోటీపడి (చలముతో); చవులు = రుచులు; కర+అ
ధారచే; బానసము = వంటఇల్లు; పురుడించు = పోలిన.

తా: రేపో, నేఁడో, కృష్ణుఁడు యుద్ధ వీరుఁడు, నీ తమ్ముఁడు డిభకుఁడును, నీ
కి పోయినను, అచటికి వచ్చి తన కత్తి అంచుచే, మిమ్ము ముక్కలను చేస్నిప
టకు, యముని వంటఇంటికి సరియగు ప్రదేశమునకు అచటికి, డాకిను
మమ్మ తెండని కోరిన ఉప్పు, మాకు బదులు వారు ఆ పచ్చడికి రుచ
ప్పుటకు పోటీపడి తెచ్చెదరు.

అలం: ఉపమ. "జముని బానసముం బురుడించు చోటికిన్"
యముని వంట శాలవలెనున్న రణభూమి అని భావము)

నా : మచ్చరికము = చలము. దేషము. కోపము ...

శా. "ఆ కంసాసుర భంజనుం గినియఁ జేయం జాలు నీజిహ్వ హం
సా కోయం గలవాఁడ నిత్తు నది హస్త ప్రాప్తిగా భూవరా
నీకం బెల్ల గనుంగొనంగ నిచటన్ నీసొమ్ము నీ కిచ్చెదం
గా కేనంతటి వాఁడ నేతలఁ చినం గప్పంబు దెప్పింపఁ గాన్. 197

అర్థ : కంస+అసుర భంజనున్ = ఆ కంసుడను పేరు గల రాక్షసుని వధించిన కృష్ణుని; కినియన్ +చేయన్ +చాలు = కోపింపఁజేయునట్టి; నీ జిహ్వన్ = నాలుకను; హస్తప్రాప్తిగా = నా చేతి కందిన వస్తువుగా; భూవర+అనీకంబు = రాజుల సమూహము.

తా: ఓరీ! హంసా! కంసదానవ మర్దనునకు కోపము తెప్పించు నట్టి మాటలను వదరుచున్న నీ నాలుకను కోయఁగలను. దానిని, చేతికి లభించిన కానుకగా, రాజవరులందఱును చూచు చుండఁగా, నీ వస్తువును నీకే ఇచ్చెదను. నీవు మా యొద్దమండి కప్పమును తెప్పించుటకు యత్నించినచో నేను తప్పక అంతటి పని చేయగల వాఁడనే. (నీ నాలుకను కోయఁగలననుట).

ఇచట "కంసాసురభంజనున్" అనుటచే బంధువులైనను దుష్టులైన వధించు శీలము గలవాఁడు, కృష్ణుఁడని వ్యంగ్యము. ఇంక, దుష్టులైన శత్రువుల యెడ దాక్షిణ్యము ఏ మాత్రము ఉండదని హెచ్చరిక.

ఉ. "మేద్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు గాక చిచ్చునుం
గాడ్పును గూడినట్టు మురఘస్మరు చేతుల శంఖ శార్ఙ్గముల్
వీడ్పడి మ్రోయ డాయఁబది వేవురు జోదుల సింహనాదముల్
దోడ్పడవే రసాతలము దూఱిన మిన్నుల మీఁద బాఱినన్. 198

ప్రతి: రాజ్యగర్వమునన్; మేద్పడి = తెలివిని పోగొట్టుకొని; మీఁదు = రాఁగల ముప్పును; తలంపవుగాక!; చిచ్చునున్ = నిప్పును; గాడ్పును = గాలియును; కూడినట్టు = కలసినట్లు; మురఘస్మరు = మురుని వధించిన కృష్ణుని; చేతుల = చేతులలో; శంఖ శార్ఙ్గముల్; వీడ్పడి = వేర్వేఱుగా, మ్రోయన్ = మ్రోయు చుండఁగా; పదివేవురు; డాయన్ = సమీపింపఁగా; జోదుల సింహనాదములు = (యాదవ వీరుల) యుద్ధ గర్జనలు; రసాతలము = అధోలోకములలో నొకటి; తూఱినన్ = ప్రాణ భయముచే, (రక్షణకై) ప్రవేశించినను: మిన్నుల మీఁదన్ = ఆకాశమార్గమందు; పాఱినన్ = పరుగెత్తుకొని పోయినను; తోడ్పడవే = సాయ పడును గదా!

తా : అజ్ఞానివై రాఁగల ఆపదను రాజ్య గర్వముచే తలంపవు గదా! మురవైరి (కృష్ణుని)

చేతులలో శంఖము శార్ఙ్గ మనెడి ధనువు, అగ్ని వాయువులు కలసి నట్లు విడివిడిగా ధ్వనులను వెల్వారించు చుండఁగా, ప్రసిద్ధులైన పదివేవురు యుద్ధనాయకులు సమరమందు పాల్గొనుచు నిన్ను సమీపింపఁగా, యాదవ సైనికుల సింహగర్జనలు నిన్ను వధించుటకై ఆ పాంచజన్య శార్ఙ్గ ధ్వనులకు (నీవు రసాతలమును గాని ఆకాశమార్గమును గాని ప్రవేశించినచో) తోడ్పడఁగలవు.

విశే. 169 వ, పద్యములో కృష్ణుఁడు, సాత్యకి "కఠోర వీరవచన ప్రాస ప్రసారోద్ధతిన్" శత్రువుల అంతరంగంబులను పగులన్ వైచున్ అనెను. ఆ విధముగా సాత్యకి పరుష వాక్యములతో హంసునితో, సంభాషించెను.

కృష్ణుఁడు చతుర్భుజుఁడు. సుదర్శనము శార్ఙ్గము, కౌమోదకి, నందకము అను వానిని ధరించును. పాంచ జన్య మతనిశంఖము.

ఛం. 'డకారపకార' సంయుక్తాక్షరము ప్రాస స్థానముననున్నది. ఇది దుష్కరప్రాసము.

మిన్నులు : మిన్ను (ఏ) మిన్నులు (బ) ఇది ప్రౌఢప్రయోగము.

వ. "వా రెవ్వరంటేని వినుము 199

తా : 198వ పద్యములో, "పదివేవురు" డాయన్ అని యున్నది. వారిలో అగ్రనాయకుల పేర్లను ఈ క్రింది పద్యములో తెలియఁజేయుచున్నాఁడు.

సీ. "హలపాణి ప్రథముఁ డాహవశాలి సాత్యకి
నేను రెండవ వాఁడ నిట్టివాఁడ
మొగజోదు కృతవర్మ మూఁడవ వాఁడు నా
లవ వాఁడు నిశరుఁ డుల్లఅపు బిరుదు
కంహు డేనవవాఁడు ఘన విక్రమాఢ్యుండు
వివిధుఁ డాఅవవాఁడు విజయధనుఁడు
వివిధా స్త్ర నిపుణుఁ డేడవ వాఁడు ప్రథుఁ డ
ష్టముఁడు సారంగుఁ డుత్సాహ శీలి,
గీ. నవముఁడు విదూరదుండు సన్నాహ మహితుఁ
డుద్ధవుండు దశముఁ డింక నున్న వారి

వెన్నఁ గొలఁది గా ది ట్లౌట యెఱిఁగి కృష్ణు
వెదకి[1] తి ప్పుడు పులిఁ గోల వ్రేసినట్లు. 200

ప్రతి: ప్రథముఁడు = మొదటివాఁడు; హలపాణి = నాఁగలిని ధరించినవాఁడు; బలరాముఁడు, ఆహవశాలి = యుద్ధమందు ఒప్పినవాఁడు; 2. సాత్యకి నేను; రెండవ వాఁడన్; ఇట్టి వాఁడన్ = ఈ విధమైన యుద్ధ నిపుణుఁడనే (బలరాముని వలె, ఆహవశాలి అనుట); 3మొగజోదు = సేనలలో ముందు నిల్చువాఁడు, ముఖ్యుఁడు, కృతవర్మ, మూడవవాఁడు; నాల్గవవాఁడు; 4నిశిరుఁడు; ఉల్లలపు = సహింపరాని; బిరుదు = శూరుఁడు (శత్రువుల మనస్సులకు వ్యథ గలిగించువాఁడు); ఘన విక్రమ + ఆఢ్యుండు = దిట్టమైన పరాక్రమము కలవాఁడు; 5 కంహుఁడు + ఏనవవాఁడు = కంహుఁడు ఐదవవాఁడు; 6. వివిధుఁడు + ఆఱవ వాఁడు; విజయధనుఁడు = శత్రువులను జయించుటయే ధనముగాఁగలవాడు; వివిధ+ అస్త్రనిపుణుఁడు = మంత్ర మహిమగల పెక్కు తెఱఁగులగు శరములను (అస్త్రములను) ప్రయోగించు నేర్పరి, 7. ప్రఘనుఁడు; ఏడవవాఁడు; 8. సారంగుఁడు; ఉత్సాహశీలి = యుద్ధ ప్రయత్నమందు ఉత్సాహము కలవాఁడు: అష్టముఁడు = ఎనిమిదవ వాఁడు; సన్నాహమహితుఁడు = యుద్ధ సన్నాహ రచనలో గొప్పవాఁడు; 9. విదూరదుండు; నవముఁడు = తొమ్మిదవ వాఁడు; 10. ఉద్ధవుండు (మహామంత్రి); దశముఁడు = పదవవాఁడు; ఇంకన్ ఉన్నవారిన్ ఎన్నన్ = గణించుటకు; కొలదిగాదు = శక్యముకాదు, (అనేకులున్నారనుట); ఇట్లు+ ఔట = ఇట్లుండుట; ఎఱిఁగి = తెలిసియును; కృష్ణున్ = కృష్ణునితో కయ్యము చేయుటకు; పులిన్ కోలన్ వ్రేసినట్లు = పులిని కఱ్ఱతో కొట్టి, రేపినట్లు (పాఠాం - పరున్న పులిన్ = పరుండియున్న పులిని); వెదకితి = వెదకి ఎన్నుకొంటివి (ఆపద తెచ్చుకొంటివి).

తా: మొదటి వాడు బలరాముఁడు, రెండవవాఁడు సాత్యకి, మూడవ వాఁడు కృతవర్మ, నాల్గవ వాఁడు నిశిరుఁడు, ఐదవవాఁడు కంహుఁడు, ఆఱవవాఁడు వివిధుఁడు, ఏడవవాఁడు ప్రఘనుఁడు, ఎనిమిదవ వాఁడు సారంగుఁడు, తొమ్మిదవ వాఁడు విదూరదుఁడు, పదవవాఁడు మహా మంత్రి ఉద్ధవుఁడు. ఈ విధముగా అనేకులు వీరులు ఉన్నారని తెలిసియు, ఊరక యున్న పులిని కఱ్ఱతో కొట్టి రేపినట్లు, కృష్ణునితో కయ్యము చేయుటకు వెదకి ఎన్నుకొని ముప్పును తెచ్చుకొంటివి.

అలం: "ఉపమ, పులి కోలన్ వ్రేసినట్లు" పులి తన్నుకొట్టిన వానిని విజృంభించి విగత జీవుని చేయును. కృష్ణుని రెచ్చఁగొట్టితివి. కనుక నిన్ను హత మార్చును.

అలం: పరికరము - వీరులను వర్ణించిన విశేషణములన్నియు సాభిప్రాయములై వారి శౌర్యమును ప్రకటించుచున్నవి.

వ్యా. ఉల్లలపు బిరుదు, పుంప్వాదేశ సంధి. చూడు, వచ - 26.

---

1. పరున్నపులిఁ

కం. "హరి తనయు లిరువురును మీ
యిరువురకును ముందు గప్ప మెవ్వని కెవ్వం
డరువఁ గలవారు వెఱ్ఱి!
సురపతి పతిఁ బాసి రాజసూయము గలదే. 201

అర్థ : అరువన్ + కలవాఁడు = చెల్లింప వలెను?

తా: హరిసుతులైన ప్రద్యుమ్నుఁడు (తల్లి - రుక్మిణి), సాంబుఁడు (తల్లి-జాంబవతి), వీరిరువురిలో ఎవరు మీలో ఎవరికి ముందు కప్పము చెల్లింపవలెను? (ఇది సాధ్యము కాదని హేళన గర్భితము) ఓ వెఱ్ఱివాఁడా! ఇంద్రునికి పతి అగు కృష్ణుని వదలి పెట్టి రాజసూయమును చేయు వారు కలరా?

విష్ణువు యొక్క అవతారమే కృష్ణుఁడు. విష్ణువు యజ్ఞస్వరూపుఁడు "యజ్ఞోవై విష్ణుః" (శ్రుతి-తైత్తిరీయము). అతని యజ్ఞసంబంధము, విష్ణు సహస్రనామస్తోత్రములో పలువిధములుగా చెప్పఁబడినది. విష్ణువు యజ్ఞభర్త. కర్త ఫలప్రదాతయును. కనుక విష్ణువైన కృష్ణుని వెలివేసి రాజసూయము అసంభవము, నిష్ఫలమని సాత్యకి వచనము.

వ. "ఇంకం గార్యంబు పరువంబు దప్పె సంగరంబ పరిపక్వం
బైన యది వినుము. 202

తా: ఇంక సంధికార్యమునకు సమయము మించినది. యుద్ధమే సంభవించు స్థితి (దశ) సంసిద్ధమైనది. కనుక వినుము.

విశే. పరువము = యౌవనము (వాచ్యార్థము).
శబ్దరత్నాకరము, పరిపాకమను అర్థము నిచ్చి ఈ ప్రయోగమును ఉదాహరించినది.

కం. "దురమునకు న్మధురయుఁ బు
ష్కరముఁ బ్రయాగంబుఁ దగిన కలఁకులు మీ కే
[1]దుర వగు నది గొను మనె హరి
యిర వగు గోవర్ధనంబు నేన యొసగితిన్." 203

అర్థ: దురము = యుద్ధము; కలను = యుద్ధ రంగము; ఉరవు = ఉచితము (శ.ర) పాఠాం ఒఱపు; ఇరవు = తగినది; నేన + అ = నేనే.

---

1. దొరపగు

తా: రణమునకు మధుర,పుష్కరము,ప్రయాగ - ఇవి మూఁడును అనుకూలమైనవి. వీనిలో, మీరేదైనను ఎన్నుకొనుటకు హరి, అనుమతిచ్చెను. వీనిలో, ఏదియును మీకు సమ్మతము కానిచో గోవర్ధనము తగినదనుటచే నేనే ఎన్నుకొనుటకు సూచించుచున్నాను.

వ్యా. కలఁకులు, కలను, కలఁకు (ఏకవచనము) కలన్వాదుల 'ను' వర్ణంబు 'కు' జగు, బహువచనంబు పరంబగు నపుడు నిత్యముగానగు. ఆచ్ఛిక, బాల - 18 కలను, కెలను ఇత్యాదులు కలన్వాదులు.

అలం: వృత్త్యనుప్రాసము, లఘురేఫము.

వ. అనుటయుం గనుంగవం గినుక నిక్కు నక్కుమారయుగళంబు గిటగిటాయమాన దంతంబును జటులభ్రుకుటి వికట నిటలంబును నిబిడదీర్ఘ తరనిశ్వాసంబును నిష్పేషణ భీషణ కర తలంబును నిర్గళిత ఘర్మజలకణ కలుషిత కపోలంబును నగుచు నవుడు గఱచి యిట్లున్న భంగిన పగఱం బరిమార్తు నను చుండె నప్పుడు హంసుండు సాత్యకితో నిట్లనియె. 204

ప్రతి : అనుటయు = సాత్యకి అట్లు చెప్పగా; ఆ కుమార యుగళంబు = ఆ రాజకుమారుల జంట; కనుంగవన్ = కన్నులజంటయందు; కినుక నిక్కన్ = కోపము పై కొనఁగా; కిటకిటాయమాన దంతంబును = కిటకిటమని ధ్వనిచేయు చున్న పళ్లను; చటుల భ్రుకుటి వికట నిటలంబును = చలించుచున్న బొమముడిచే వక్రమైన నొసళ్లను; నిబిడ దీర్ఘతర నిశ్వాసంబులును = దట్టమైన నిడుపైన ఊర్పులును; నిష్పేషణ భీషణ కరతలంబును = పరస్పరము ఒరయుచున్న (రాచుకొనుచున్న) భయంకరములైన చేతులును, నిర్గళిత ఘర్మజల కలుషిత కపోల తలంబులునున్ = వెలికి వచ్చుచున్న చెమట నీటి బిందువులచే మలినములైన చెక్కిళ్లను; అగుచున్; అవుడు గఱచి = పెదవులను కఱచుచును; ఇట్లు+ఉన్న భంగిన = ఇప్పుడు ఉన్నట్లే (ప్రయత్నములేకయే, వెంటనే); పగఱన్ = శత్రువులను; పరిమార్తున్ = (ఎదుర్కొని) అంత మొందింపఁగలను; అనుచుండెన్ (కుమారద్వయము - కర్త); అప్పుడు; హంసుండు,సాత్యకితోన్ + ఇట్లు + అనియె.

తా: సాత్యకి పరుష వాక్కులను విన్నంతనే, హంసడిభకుల కన్నులలో కోపము ప్పొంగినది. పండ్లను పటపటమని కఱచిరి. ముడివడిననొసళ్ళతో ఎక్కువ నిడుపైన ఊర్పుల నిగిడించిరి. చేతులను భయంకరముగా రాచుకొనిరి. చెమట నీటి బిందువులు వారిచెక్కిళ్లపై. ప్రవహించినవి. పెదవులను కఱచిరి. ఆ ఇరువురును ఇప్పుడున్న విధముననే

చ్చి శత్రువులను కడతేర్చెదమనిరి. అపుడు హంసుఁడు మఱియు సాత్యకితో
లికెను.

విశే. అలం. 1 స్వభావోక్తి. పదప్రయోగము, హంసడిభకుల రౌద్రమః
షకమైయున్నది.

2. వృత్త్యనుప్రాసము, నకారము, టకారము, ణకారములు క్రమముగా
ుకను' 'కిటకిటను' 'భీషణమును' ప్రకటించుచున్నవి.

వ్యా. కన్నుఁగన (చూడు, పద్యము 59)

"ఓరి దురాత్మ! నీకుఁ దెగ నొల్లక యుండుట నీ పరాక్రమం
బారసి కాదురా వెఱవకాడుము దూతుఁ డవధ్యుఁడెందు నీ
వీరుల నిన్ను సమ్మెటనె వ్రేయుదు డాయుదుఁ బోర శౌరికిన్
సీరికి బాహుసార మెడ సేయుదుఁ జేయుదు రాజసూయమున్. 2

తా: ఓరి! దుష్టబుద్ధి! నిన్ను చంపుటకు ఇష్టము లేకుండుటకు కారణము,
ాక్రమమునకు జడిసి కాదురా! నిర్భయముగా మాట్లాడుము. దూత యెట్టి సమ
ుదైనను చంపఁదగఁడని దండనీతి. నీవు ప్రశంసించిన (ముందు చెప్పిన పదిమఁ
ులను (చమ్మెటతో) సమ్మెటతో తల పగులఁగొట్టెదను, నిన్ను సమీపించి, సీ
్యము చేయుదును. కృష్ణుని బలరాముని బాహుబలమును తొలఁగింతుః
సూయమును నిర్వహింతును.

విశే: అలం. 1. వృత్త్యనుప్రాసము - పోర, శౌరి, సీరి. (అక్షరావృత్తి)

2. ఛేకానుప్రాసము వ్రేయుదు, డాయుదు, ఎడసేయుదు, చేయుదు.

వ్యా. 1. నీకున్ తెగనొల్లక - ద్వితీయకు షష్ఠి

2. ఓరి. సూ: ఓ యామంత్రణంబు నందగు. తత్సమ, బాల - 14.

. శబ్దంబునకుం బురుష నీచ స్త్రీ పురు షామంత్రణంబులందు యిసిరి వర్ణంబుః
ష నంతాగమంబు లగు. తత్సమ బాల - 15.

. దూతుఁడు; దూతాదులకు, స్త్రీత్వంబు బహుళంబుగానగు. తత్సమ బాల - 6

ము వచ్చినపుడు 'దూత' ...

4. పోరన్, పోరు శబ్దమునకు సప్తమికి అత్వాదేశము. సూ. ఔపవిభక్తికముల తృతీయాసప్తములకు అత్వంబాదేశంబు బహుళంబుగానగు. ఆచ్చిక, బాల - 38.

మ. "వినురా సాత్యకి! మాట లేమిటికిరా వేదండ కోదండ కే
తన సంకేత నరేంద్ర నూతన బలోద గ్రంబుగా మోహరిం
ప నవశ్యంబును వత్తు బుష్కర సరః పార్శ్వంబునం దెల్లి గొ
ల్లెన లెత్తింతు విరోధు లంబు నిధి వెల్లిం డొల్లఁ జల్లింపఁగన్." 206

ప్రతి: వినురా సాత్యకి; మాటలు + ఏమిటికిరా? వేదండ = ఏనుఁగులు, కోదండ = విండ్లు; కేతన సంకేత = టెక్కెములు గుర్తుగా; నరేంద్ర = రాజవరుల; నూతన బల + ఉదగ్రంబుగాన్ = క్రొత్త వైన సేనలతో, భయమును కొల్పునట్లు; మోహరింపన్ = సైనిక వ్యూహములను, అమర్పఁగా; అవశ్యంబును = తప్పక; వత్తున్ = వచ్చెదను; పుష్కర సరః పార్శ్వంబునన్ = పుష్కర మనెడి సరస్సుయొక్క ప్రాంతములో; ఎల్లి = రేపు; విరోధులు = పగవారిని (ద్వితీయకు ప్రథమ), అంబునిధి వెల్లిన్ = సముద్ర జలప్రవాహములో; డొల్లన్ = దొర్లునట్లు; చల్లింపగన్ = చెదరఁగొట్టుటకు; గొల్లెనలు = గుడారములను; ఎత్తింతును = నిర్మింతును. (అర్థాంతరము) జల్లింపఁగన్ = జల్లెడపట్టినట్లు శోధించుటకు; గొల్లెనలెత్తింతును.

తా: ఓరి! సాత్యకి వినురా నామాటలు. మాటలెందుకురా? ఏనుఁగులు విండ్లు మొదలగువానితో, టెక్కెముల చిహ్నములతో, రాజశ్రేష్ఠుల యొక్క క్రొత్తవైన వ్యూహములను అమర్చుటకు తప్పక, సమర స్థలికి వచ్చెదను. పుష్కర సరస్తీరములో రేపు విడిది చేసి, శత్రువులనెల్ల సముద్రజలములో మునుగఁజేయుటకు, అచట శిబిరములను నిర్మింపఁజేయుదును.

అలం. 1. ఛేకానుప్రాసము వేదండ, కోదండ; కేతన సం కేత.

2. అలం: పర్యాయోక్తి 'వెల్లిం డొల్లం జల్లింపఁగన్'. వ్యంగ్యమైన ఉక్తిని, సుందరతరముగా చెప్పుట.

వ. అనుటయు డిభకుండు. 207

తా : సులభము

చం. "విడు మంచు నా మొనల వీరులు పోరులు గోరుచున్న వా
రెడపడ కుండ మి మ్మిచట నెన్నితి [1]కొందఱ సిగ్గు గాదఁటే

1. రెన్నగ

గొడగులు దప్పఁబట్టినను గోటగ నేనిక తెట్టు వెట్టినన్
బడుగులు మీరు చూడ హరి పాపటపై నడిదంబు వెట్టుదున్."

అర్థ : ఎడపడకుండన్ = తడవులేక, వెంబడి వెంబడి; (పాఠాం. రెన్నఁగ); గొడు
...లు, ఛత్రము; తప్పన్ = తప్పించుకొనుటకు; కోటగ = కోట గోడలవలె; ఏనిక తె
...గుల గుంపు; బడుగులు = దుర్బలులు, బలహీనులు.

తా: నా సైన్యమందు మొనగాండ్రు "మమ్ము వదలండి" అని ఉత్సాహవ
...్యమును కోరుచున్నారు. నీ వేమో వరుసగా ఒకరి తరువాత ఒకరిని మీ పే
...ు మా యెదుట వల్లించితివి. (ఎన్నుకొంటివి). నీకు సిగ్గులేదా! (పేర్లను
...ాజనమేమి? అని ఆ క్షేపము, హేళన) రక్షణకై నాఁగేళ్లను పట్టుకొన్నను, కోట
...గుల గుంపును, అమర్చుకొన్నను, బలములేని మీరు చూచుచుండఁగా (నిస్సహా
...ండఁగా), హరి నడితల మీఁద నా కత్తిని పెట్టెదను (హరి శిరస్సు రెండు సమభాగము
... పగులఁగొట్టెదను).

అలం. ఛేకానుప్రాసము - విడువిడు, వీరులు పోరులు.

రూపాం. తెట్టు, తెట్టె, తెట్టియ.

గొడగ = ఏఁడి కోలలేని నాఁగలి; (రూపాం) గొడగు.

అనుటయు సాత్యకి కోపించి.

తా : సులభము.

"కడగితి [1]దౌత్యము న్నె అపఁ గాన సహింపక పోదుఁ గాక నా
కడిదము చేత నుండగ ము రారి విరోధులఁ బట్టి పూవులుం
దొడిమయుఁ జూపకున్న నది ద్రోహము పందెము వేసి తుండవ
ల్దడబడకుండ మిమ్ము ఁబెడధారన వ్రేయుదు నేమి చేయుదున్."

అర్థ: దౌత్యమున్ = దూతకార్యమును; కడిగితిన్ = పూనుకొంటిని; అడిదము =
...శముల్ = ముఖములను; పెడధారన = కత్తి వెనుకభాగముతో; ఏమి చేయుదున్
...త అగుటచే) ఏమి చేయఁగలను; (మీరేమన్నను సహింప వలసివదే).

తా: ఓ హంసా! నేను దూతనై వచ్చితిని గదా! మీరేమన్నను ఓరిమి వహింపవల

---

1. ...స్య

అది నా వృత్తి ధర్మము. నేను దూతను. కానిచో, మీ మాటలకు నా చేతిలో కత్తి యుండఁగా, కృష్ణుని యొక్క శత్రువుల నెల్లను, పువ్వును తొడిమనుండి వేరు చేసినట్లు, వారి తలలను శరీరముల నుండి వేఱుచేసి చూపియుందును. అట్లు నేను కావింపనిచో అది రాజద్రోహమగును. పందెము వేసి, తొట్రుపాటు చెందక మీ ముఖాలను కత్తి వెనుక భాగముతో (పదును లేని ప్రక్కతో) కొట్టి యుందును. కాని ఇప్పుడు దూత నగుటచే అట్లు చేయలేకపోవుటకు చింతించుచున్నాను.

విశే. పదునైన భాగముతో కొట్టిన యెడల మరణము వెంటనే కలుఁగును. బాధ అత్యల్పకాలమే యుండును. పదునులేని పార్శ్వముతో కొట్టినచో, అపరిమితమైన బాధ కలుఁగును. ప్రాణము తొలఁగుట ఆలస్యమగును. అట్లు బాధతోచావు కలుఁగునట్లు కొట్టెదనని తన రౌద్రమును ప్రకటించెను.

నానా. తుండము = నోరు, మొగము, ఖండము, పక్షి ముక్కు.

అలం: కావ్యలింగము - 'ఏమి చేయుదున్' హంస డిభకులను కొట్టకుండుటను సాత్యకి సమర్థించుకొనెను. సమర్థింపఁదగినదానిని సమర్థించుట కావ్యలింగము. ఇది వాక్యార్థహేతుకము.

వ. అనుటయుఁ గోపంబులు రూపంబులు గైకొన్న తెఱంగున నా హంసడిభకులు సాత్యకితో నీవింక సంగరసన్నాహంబున సకల సైన్యంబుల సమకూర్చుకొని పుష్కర సరోవరంబునకు రమ్మి చావునకుం దప్పితివి పొమ్మనుటయుం గనలి కలకలనవ్వి కలనికి నడచి కదా మాటలు సకల లోకైక నాథుండు సమయింప నున్న మిమ్ముం జంపఁ దగదనుటయు వారు మీ యన్నంగయ్యంబున కుందోడ్కొని వచ్చిన నీ పంతం బెఱుంగ వచ్చుం బొమ్మనుడు నా శైనేయుండు నడిదంబు జళిపించుచు నీయకొని వెడలి హయారోహణంబు చేసి నిజపురంబునకు రయంబునం జనుదెంచి జనార్దను దర్శించి తన పోయి వచ్చిన తెఱం గెఱింగించిన నారాయణుండు మఱునాఁడు.

తా: అట్లు వచింపఁగనే, ఆ హంస డిభకులు, కోపములు రెండు రూపములు ధరించినవో అనువిధమున మండి సాత్యకితో "నీవు యుద్ధ ప్రయత్నమునకై, సకలసైన్యములతో పుష్కర సరోవర తీరమునకు రమ్ము. చావు నుండి తప్పించుకొంటివి. ఇక్కడ నుండి వెళ్లిపో" అనుటయు, అతఁడు కినుక చెంది, కలకల నవ్వి, "యుద్ధమునకు నడచి వచ్చి అచ్చట మాట్లాడుట తగును. సకల లోక నాయకుఁడు, హరి మిమ్ము హరింపనుండఁగా నేను ఆ పనిని చేయరాదు". అనినంతనే వారు "మీ అన్నను కయ్యమునకు కొని వచ్చినప్పుడు నీ పంతమును ఎంత మాత్రము నెఱవేర్చితివో తెలిసి కొనవచ్చును. పొమ్ము." అనిరి. సాత్యకి వారి పలుకులకు కత్తిని త్రిప్పుచు సమ్మతిని తెలుపుచు గుఱ్ఱమునెక్కి ద్వారకకు వేగముగా వెడలి హరిని చూచి, తన పయనమును గుఱించి వివరించెను.

అలం. అతిశయోక్తి, కోపంబులు రూపంబులు కైగొన్న తెఱంగున.

వ్యా. 1 చావునకుం దప్పి, "చావు నుండి తప్పి" ఇచట పంచమికి షష్ఠి వచ్చినది.

2. తన పోయి వచ్చిన తెఱంగు, 'తనయొక్క పోయి వచ్చిన తెఱఁగు" అనఁగా 'తాను పోయి వచ్చిన తెఱంగు', కర్తృపద ప్రథమకు షష్ఠి వచ్చినది.

సూ. ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితావ్యహిత కర్తృపద ప్రథమకుఁ బఱచుఁగ యొక్క షష్ఠి యగు. సూ. యొక్కకు లోపంబు బహుళంబు. (కారక, ప్రౌఢ 15, 16)

3. పొమ్ము. పో+ముఙ్ (మధ్యమ పురుష ముపర్ణకము)

'పొమ్ము' (క్రియ, బాల - 29, 65)

4. ఈయని, ఇచ్చు+ నిఙ్ (వ్యతిరేక త్వవర్ణకార్థకము, ధాతుజవిశేషణము) క్రియ, బాల - 47.

సూ. ఇచ్చునకు సర్వంబునకు 'ఈ' అగు. 'ఈయ' అను ఆదేశము ఒకానొకచో ంనంబడియెడిని. క్రియ, బాల - 92 (చూడు, పద్యము - 193).

## - : శ్రీకృష్ణుఁడు దండయాత్ర వెడలి పుష్కర సరస్తీరంబున విడియుట : -

౨. కడఁకం బన్నఁగ నానతిచ్చెఁ జతురంగంబుల్ రణక్రీడకు
నెడలన్ దిండిమ దుందుభుల్గ భులనన్ వ్రేయించి సైన్యంబు సం

దడిఁ బై పై నడియాలపుం బడగ లెత్తం బంచె నొక్కుమ్మడిం
బడవాళ్లం బిలిపించి చిత్తమున దర్పం బేర్పడం జేయుచున్. 212

అర్థ: సందడి = సమూహము; (శ.ర) ఒక్కుమ్మడి = ఏకకాలమున; (ఉమ్మడి పదము, ఒక్క శబ్ద పూర్వకముగానే పూర్వ కవి ప్రయోగంబులందు కన్పట్టు చున్నదని శ.ర); పడవాళ్ళు = సేనాధిపతులు.

తా: కృష్ణుడు నాలుగు విధములైన సైన్యమును, ప్రయత్నించి సిద్ధము చేయవలసినదిగా ఆనతిచ్చెను. సైన్య సమూహమును. డిండిమ దుందుభి 'గుభుల్' 'గుభుల్' అనుధ్వనులతో యుద్ధమునకు రమ్మని సూచన కావించెను. సేనా నాయకులందఱిని ఒకే సమయమున ఒక చోట కూడునట్లు చేసి వీరిలో ఉద్రేకము గర్వము ఉత్సాహము ఉత్పన్న మగునట్లు చేయుచు, వారి వారి గుఱుతులు గల పతాకములను వారి ముందు పై భాగములలో పెట్టునట్లు ఆజ్ఞాపించెను.

వ్యా. అడియాలంపుం బడగలు, అడియాలము+పడగలు, పుంప్వాదేశ నుగాగమ సంధి (చూడుము, వచనము - 26)

పడవాలు (ఏక) - పడవాళ్లు (బహువచనము)

నానా. పడవ = యుద్ధము; చిన్నదోనె; ప్రళయము; ఇది ఒక అర్థమున దేశ్యముగను, మఱొక అర్థమున వైకృతముగను ఉన్నది.

వ. తదనంత రంబ సంరంభ సంభావితి సన్నాహు లగు సారథులు రథుల కుతూహలంబునకు యోగ్యంబు లగు యుగ్యంబు లమర సమర సమయంబున కమయం దగు కణయ కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వథ కరవాల భిండివాల ప్రముఖ ప్రహరణంబులు నిండ నొండొండ నడుకొన నిడి సిడంబులు ముడివడ వెడలించి జడనిధిలో నడయాడు చుండిన యోడలతో వీడు జోడాడు రథంబులును గుథంబులలోఁ బెటికిన మెఱుఁగు టమ్ముల నిమ్ముల నిడి తెఱపుల నొఱపుగా నున్న జోదుల చేతి టంకార ముఖరంబు లగు చాపంబుల రూపంబులం

జాపట్టు పసిడి కట్ల చుట్టంబులై భుజంబులం బొలుచు కే
కేయూరంబులం గలసి కలసి బలసిన ప్రభలు ముంచికొని ఖచిం
పలుదొడవుల తోడఁ గూడం జూడ నలవడి వికహచ వివిధ కర్ణిక
పరికీర్ణ వర్ణంబులగు నంగంబులం దెగడు నాగంబులును, బేరువే
భైరవమతంబు భారంగి లంగిణి కలీయ విలాలనంబు మొదల
ఖలీనంబుల విలీనంబు లైన ఫేనంబులు దొరుగ నిరు గడలఁ గడ
కొను కర్ణ చామరంబు లినుమడింపఁ గరాళింపక లాఁత చేయ
పయివోవక కొక్కరింపక తొడుకక తొట్టింపక చెల్లక నడచి కింకిణీ గ
ఝణ ఝణ ఝుంకారాలంకార హేషారవ కోలాహలంబులు సెలఁ
బంగరువు పల్లనంబులపైఁ బెల్లు ఖచించిన నానావిధ నూత్న రఁ
ప్రభా పటలంబు తోడం జౌకళింపుచు నింద్రా యుధంబుల తోడ
దోడు చూపుచు గంగా తరంగంబుల తెఱంగు దాల్చు వారువంబులు
విశంకట కంకట వివిధ వర్ణంబు లుదీర్ణంబులుగా వీరరస సముచి
సంభాషణంబులు చెలంగఁ గలంగక తొలంగక తెరలక మరల
నడుతు మను పంతంబులు మున్నుగా సేసలుఁ గాసెలుం జిందె
నందెలుఁ బూఁతలుఁ జేఁతలుం జెలువుగ సురియ ముప్పిడి పిడియమ
గఠారము దరువలి కొంగవా లడిదమ్ము గండ గొడ్డలి కత్తి గొంతం
సబళం బీటె యినుప కోల సెలకట్టె పట్టెంబు సిరాణంబు చక్రం
మొదలగు కైదువులు మెఱుంగులు గుఱుంగ లించిన రవి మండలం
తెఱంగున వజ్ర వైడూర్య మణి మరీచి మధ్యంబునం బొలుచ
సింగంబుల సంగడి వారగు వీరభటులునుం కలిగి బహువి
తూర్యంబులు (చాతుర్యంబులు) శౌర్యంబులకుఁ జేవ యొసం
బిరుదులతోడి యాతపత్రంబులు చిత్ర పాత్రంబులుగా నడియాలపు
బడగలు మొగుళ్లతోడం దడబడం వెల్లి విరిసిన జలరాశి పొలుపున
దద్బలంబు నడిచె నప్పుడు.

**రథములు**

ప్రతి: తద్ + అనంతరంబు+ అ = సేనానులకు ఉత్తర్వులు ఇచ్చిన పిమ్మట; సంరంభ సంభావిత సన్నాహులు + అగు = వేగిరపాటుతో చక్కగా ఆలోచించి ప్రయత్నించిన వారగు; సారథులు = తేరు నడపువారు; రథుల కుతూహలంబునకు = రథముపై నుండి కయ్యము చేయు నాయకుల ఉత్సాహభరితములైన కోరికలకు; యోగ్యంబులు + అగు = తగియున్నట్టి; యుగ్యంబులు + అమరన్ = గుఱ్ఱములు కలుఁగగా; సమర సమయంబునకు + అమయన్ + తగు = యుద్ధము చేయు వేళలో ఉపయోగపడునట్టి; కణయ = ఈఁటెలు (కుంతవిశేషమని, శ.ర); కంపణ = బల్లెము (ఆయుధ విశేషమని, శ.ర.); ముసల = రోకళ్లు; ముద్గర = ఇనుపగుదియలు, పరిఘ = ఇది యొక రకమైనది ఇనుపకట్ల గుదియలు; పరశ్వథ = గండ్ర గొడ్డళ్లు; కరవాల = కత్తులు; భిండివాల = (భిండిపాల, భిందిపాల - రూ) విడిచి వాటు గుదియలు (కొనలో చక్రములు గలది యని కొందఱు); ప్రముఖ ప్రహరణంబులు = మొదలగు ముఖ్యములైన ఆయుధములు; నిండన్+ఒండొండన్ = సమృద్ధిగా, ఒకటి తరువాత మఱియొకటి (అన్ని రకములును); నడు కొనన్ = (చలించుచుండఁగా) ఇముడునట్లు; ఇడి = అమర్చి; సిడంబులు =టెక్కెములు; ముడివడన్ వెడలించి=గట్టి పడునట్లు విప్పారఁజేసి (తేరిపై భాగములందు అమర్చి, వెడల్పగునట్లు వెలికి నెట్టి); జడ నిధిలో = సముద్రమందు; నడయాడుచుండిన = పయనించుచున్న; ఓడలతోన్; వీ (ఈ) డుజోడాడు = సరిపోలిన; రథంబులును = పెద్ద తేరులును;

**గజములు**

కుథంబులలోన్ = (ఏనుఁగులపై) పఱచిన పెద్దకంబళములలో; పెటికిన = మోయించిన; (పాఠాం. నగంబుతోన్+చేరిన = కొండను సమీపించిన); మెఱుఁగు + అమ్ములన్ = తళతళలాడు బాణములను; ఇమ్ములన్ = తగినచోట్లలో; ఇడి = అమర్చి; తెఱపులన్ + ఒఱపుగాన్ = వీలున్నపుడు ఒయ్యారముగా ఉన్న; జోదుల చేతి టంకార ముఖరంబులు + అగు = వీరుల చేతులలో టంకార ధ్వనులు కలిఁగినట్టి; చాపంబుల రూపంబులన్ = విండ్ల ఆకృతులను; చూపట్టు = గోచరింపఁజేయు; పసిండికట్ల = బంగారు కట్టులతో; చుట్టంబులు = సాటియై; భుజంబులన్ + పొలుచు = బాహువులపై ఒప్పారియున్న; కటక = (క్రింది భాగములందు) కడియములను; కేయూరంబులన్ = (పై భాగములందు) ఆభరణ విశేషములను (భుజకీర్తులను); కలసి మెలసి = (వాని ప్రకాశముతో) మిళితములై; బలసిన ప్రభలు మెండైన, తేజస్సును ముంచికొని ఖచించిన = నింపుకొని (చేర్చుకొని) విలక్షణముగా రూపమును ధరించిన; పలు తొడవులతోడన్ = (వివిధములగు) పెక్కు నగలతో; కూడన్ = కలియఁగా; చూడన్ = (విండ్లపైఁగల పసిండి కట్లను, భుజములపై గల, కడియములను భుజకీర్తులను, వీరుల ధరించిన వివిధాలంకారములను) చూచుటకు; అలవడి = అలవాటుపడిన; వికచ వివిధ

కర్ణికార పరికీర్ణవర్ణంబులు + అగు = వికసించిన పెక్కు తెఱంగులగు కొండగోఁగు మొక్కలవలె, వ్యాపించిన పెక్కు రంగులు గల; అంగంబులన్ = (తమపై నుండు వీరుల) శరీరములను; తెగడు = తక్కువ చేయు (వానికంటె ఎక్కువ వ్యాప్తి గల); నాగంబులును = ఏనుఁగులును (వీరులు, ఏనుఁగుల వలె నున్నారనుట).

**తురగములు**

ప్రతి: పేరు+వేఱన్ = వేర్వేఱు పేర్లు కల, భైరవమతంబు భారంగి లంగిణి, కలీయ, విలాలనంబు; మొదలగు ఖలీనంబుల = (ఆ పేర్లు గల గుఱ్ఱముల) కళ్లెములలో; విలీనంబులైన ఫేనంబులు తొరుఁగన్ = నిండిన నురుగులు (నోటినుండి) స్రవించు చుండఁగా; ఇరు+కడలన్ = ఇరుప్రక్కలందు; కడలు కొను = వ్యాపించిన; కర్ణచామరంబులు = చెవులకు (అందముగా కట్టిన) చమరీ మృగములకు చెందిన కుచ్చులు; ఇనుమడింపన్ = రెట్టింపు చేయుచుండఁగా; కరాళింపక = సకిలింపక; లాఁత చేయక = ఉద్రేకమును పొందక; పయి+పోవక; కొక్కరింపక = (కాళ్లతో) నేలను త్రవ్వక; తొడుకక = వేగిర పడక; తొట్టింపక = ఇటునటు త్రొక్కక; చెల్లక = సాటిలేక; నడిచి; కింకిణీగణ = గజ్జెల మొత్తము యొక్క; ఝణఝణ ఝంకార = ఝణఝణ అనెడి ధ్వనులు గల; అలంకార = ఆభరణములు; హేషారవ కోలాహలంబులు = గుఱ్ఱపు సకిలింతలు కల కలకలము (సందడి); చెలంగన్ = నలువైపుల వ్యాపించు చుండఁగా; బంగరువు పల్లనంబులపై = బంగారు కాంతి గల మెత్తటి గంతలపై; (జీనీలపై); పల్లు ఖచించిన = ఎక్కువగా తాపిన (చెక్కిన); నానావిధ రత్న ప్రభా పటలంబులతోడన్ = కరకములైన రత్నముల యొక్క కాంతుల మొత్తముతో; చౌకళింపు చున్ = పైకి దుముకుచు; ఇంద్ర+ఆయుధంబులతోడన్ = ఇంద్రుని ధనుస్సులతో కూడ; తోడుచూపుచున్ = పోయపడుచు (సాటియగుచు); గంగా తరంగంబుల తెఱంగు + తాల్చు = గంగయందలి పెల్లుఉబుకు) అలల విధమును అనుకరించు (గంతులు వేయు); వారువంబులును = గుఱ్ఱములును,

**రభటులు**

విశంకట = దృఢమైన; కంకట = కవచముల యొక్క; వివిధ వర్ణంబులు = పెక్కువన్నెలు; దీర్ణంబులుగా = అతిశయించుచుండఁగా; వీర రస సముచిత సంభాషణంబులు చెలంగన్ యుద్ధమునకు ఉద్రేకమును కలుఁగఁజేయు మాటలు, మించఁగా; కలంగక = కలఁత ందక; తొలంగక = తొలఁగిపోక; తెరలక = చలింపక; మరలక = వెనుకాడక; నడతుము + ను = ముందునకు సాగిపోయెదము అనెడి; పంతంబులు మున్నుగా = పౌరుషవచనములు ుందే వెల్వడుచుండఁగా; సేసలున్ = అక్షతలు, (మంత్రముచే పవిత్రమైన బియ్యము);

కాసెలున్ = నడుమునకు దట్టీగా కట్టుకొన్న బట్టలు; చిందెలున్ = తల టోపీలు (చిందియ, చిందె, ఆకులతో తయారైనవి); అందెలును = కాలికడియములు; పూఁతలు = (శరీరములపై అలఁదుకొన్న సుగంధములు; చేఁతలున్ = వారు చేయు పనులు; వీరులకు తగిన శరీరవిన్యాసములు); చెలువుగన్ = ఒప్పిదముగానుండు; సురియ = చిన్నకత్తులు; ముప్పిడి = బాకులు; పిడి+అమ్మె = పిడిగల కత్తులు; కఠారము = పెద్ద కత్తులు; తరువలి = తఱుగుటకు తగిన కత్తులు; కొంగవాలు అడిదము = కొంగవలె కొంకి గల కత్తులు; గండ గొడ్డలి = పెద్ద గొడ్డళ్లు; కత్తి = కత్తులు; కొంతంబు = బల్లెములు; సబళంబులు = ఆ పేరుగల ఆయుధములు; ఈఁటె= ఈఁటెలు; ఇనుపకోల = ఇనుముతో చేయఁబడిన పొడవైన కడ్డీలు; సెలకట్టి = చిన్న ఈఁటెలు; పట్టెంబు = పెద్ద కత్తులు; సిరాణంబు = ఆ పేరుగల ఆయుధములు; చక్రము = చక్రాయుధములు; మొదలగు కైదువులు = మొదలైన యుద్ధమునకు వలయు వివిధాయుధములు; మెఱుంగులు + కుఱుంగలించిన = వెలుఁగులను విరజిమ్ముచు సమీపించిన; రవిమండలంబు తెఱంగునన్ = సూర్యమండలమో అనునట్లు; వజ్ర వైడూర్యమణి మరీచి మధ్యంబునన్ = వజ్రము, వైడూర్యము అనెడి రత్నకాంతుల మధ్య భాగమందు, పొలుచు = కన్పట్టు; సింగంబుల సంగడివారు +అగు = సింహములను పోలినట్టి వీరభటులునున్ + కలిగి, బహువిధ తూర్యంబులు = అనేకములైన యుద్ధ వాద్యధ్వనులు (పాఠాం. చాతుర్యంబులు = నేర్పులు); శౌర్యంబులకున్ = వారి వారి పరాక్రమములకు; చేవ+ఒసంగన్ = గట్టి తన మియ్యఁగా (ప్రోత్సాహమియ్యఁగా); బిరుదుల తోడి + ఆతపత్రంబులు = తమ తమ బిరుదులుగల గుఱుతులున్న గొడుగులు; చిత్ర పాత్రంబులుగాన్ = చిత్రములైన తెఱచాపలుగల తెప్పలవలె నొప్పఁగా; అడియాలము + పడగలు = వారి వారి చిహ్నములు గల పతాకములు; మొగుళ్ళ తోడన్ = (ఆకసమందలి) మబ్బులతో తడఁబడన్ = సాటి యగుచు (మబ్బులేమో అనుభ్రమను కలిగించినవి); వెల్లివిరిసిన జలరాశి పొలుపునన్ = పైకి నీటిజడిని విరజిమ్ముచు, పొంగుచున్న సముద్రము యొక్క సొబగుతో ఉప్పొంగుచున్న సమరావేశముతో; తద్ +బలంబు = ఆ నాలుగు అంగములు గల సేన; నడిచెన్ = యుద్ధమునకు పయనమయ్యెను.

తా: సేనానులకు ఉత్తర్వులిచ్చిన పిమ్మట, వేగిరపాటుతో చక్కగా ఆలోచించి, సంసిద్ధులై తేరునడపువారు తమ వీరులకు (తేరిపై నుండి యుద్ధముచేయు రథికులకు) వారి వారి అభీష్టములకు అనుగుణమైన అశ్వములను తేర్లకు అమర్చిరి. ముఖ్యములైన వివిధాయుధములను క్రమబద్ధముగా సమృద్ధిగా రథముల యందు పేర్చిరి. రథములపై పతాక వస్త్రములను విడివడఁజేసి ఎగుర వేసిరి. అప్పుడు ఆ అరదములు సముద్రములో పయనించు పెద్ద ఓడల వలె ఒప్పారినవి. మావటీంద్రుు, ఏనుఁగుల అంబారీలపై నుండు పెద్ద కంబళములపై ప్రకాశించుచున్న బాణముల మొత్తమును, అనువుగా అమర్చిరి.

ఏనుఁగుల పై నుండు యోధులు కొండగోఁగు మొక్కల వలె, పచ్చనైన శరీరములతో, కన్నట్టుచు తమ చేతులలో నున్న విండ్లకుఁ గల నారిని మ్రోయించి టంకార ధ్వనులను ఉత్పత్తిచేయుచుండిరి. వారు ధరించిన ధనువుల రూపములు బంగారు కట్లచే ప్రకటముగా గోచరమైనవి. యోధుల చేతి కడియములు, భుజములకు అమరియున్న నగలు, ధరించిన అలంకారములు కలసి వింతయైన ప్రభలను తేజస్సును వెల్వరించినవి. అట్టి వారి ఆకృతులను చూచుటకు అలవాటు పడిన మత్త గజములు తమ వీరుల అంగములను పరిహసించు చుండినవి.

గుఱ్ఱములు వేర్వేఱు పేర్లు కలవానికి కళ్లెములను బిగించియుండిరి. వానినోళ్లనుండి నురుగులు వెలువడుచుండగా వానితో సమానముగా చెవులకు అలంకరించిన తెల్లని కుచ్చులు (చమరీమృగమునకు చెందినవి) మెఱుఁగులను చిమ్మినవి. అవి గుఱ్ఱపు రౌతులు కోరినట్లు నడచుకొనుచు, వేగపడక, అచ్చెరువు కొల్పునట్లు నడచినవి. వానికి కట్టిన గజ్జెల ఝణ, ఝణ అనెడి ధ్వనులు గల ఆభరణములు, సకిలింతలు, ఎల్లెడల సందడిని, నింపినవి. వానిపై నున్న జీనీలు (గంతలు) తమ పై గల రత్నముల కాంతులను, మెఱయించినవి.ఉత్సాహముతో ఆ తురగములు ఇంద్రధనుస్సులవలె, వివిధ వర్ణములతోను, గంగా తరంగ మాలికల వలె పైకి ఎగురుచు దుముకుచు, ఉత్సాహముతో ప్రవర్తించినవి.

వీరభటులు దృఢమైన, పలువన్నెలు గల కవచములను ధరించియుండిరి. విశ్వాసముతో వీర (పౌరుష) వచనములను ఉద్రేకముతో ఉచ్చరించు చుండిరి. వారిపై చల్లఁబడిన అక్షతలు, నడుమునకు కట్టుకొన్న దట్టీలు మైపూఁతలు, వారి రూపములకు ఒప్పిదముగా, రూపుదాల్చినవి. వారు వహించిన వివిధాయుధములు, మెఱుఁగులు విరజిమ్ము చుండఁగా సూర్యమండల ప్రభయా అను విధమున వారు వివిధ రత్నకాంతుల మధ్య నుండు వీరసింహములై, భయంకరులై యుండిరి. వివిధములగు యుద్ధ వాద్యధ్వనులు మ్రోగినవి. అవి యోధుల కెల్ల ప్రోత్సాహమిచ్చినవి. ఆయా శూరులు, తమ గుఱుతులు గల గొడుగులతో వింతయైన తెరచాపలుగల తెప్పలేమో అనురీతిని తోఁపఁజేయుచుండిరి. వారి వారిపతాకములు ఆకసమందలి మబ్బులతో సాటియైనట్లు ఉప్పొంగిన సముద్రపు టలలవలె, సమరావేశముతో సంసిద్ధులై యుద్ధ యాత్రకు సాగిరి.

విశే. ఈ ఆశ్వాసమందు ఇది దీర్ఘమైన గద్య. చతురంగబలముల ప్రస్థాన వర్ణనము,

అలం. 1. వృత్త్యను ప్రాస, ఛేకానుప్రాసములు రెండు.

2. ఉపమ: 1. వజ్రవైడూర్యమణి మరీచి మధ్యంబునంబొలుచు సింగంబుల సంగడివారగు వీరభటులును,

2. 'ఆతపత్రంబులు చిత్రపాత్రంబులుగా'.

3. 'వెల్లివిరిసిన జలరాశి పొలుపునం దద్బలంబు'.

3. అతిశయోక్తి : "అడియాలంపుఁబడగలు మొగుళ్లతోడం దడఁబడన్".

సీ. శార్ఙ్గ నందక సుదర్శన పాంచజన్య కౌ
మోదకీ కౌస్తుభములు వెలుంగఁ
బీతాంబరము గట్టి పెండెంబు డా కాలఁ
బెట్టి సన్నద్ధు డై పేరురమునఁ
బద్మ మాలిక గ్రాల బద్ధ గో ధాంగుళీ
త్రాణుఁడై వంది బృంద స్తవములు
భూసు రాశీర్వాదములు మింట నంటంగ
బలభద్ర సాత్యకి ప్రభృతు లెల్లఁ

గీ. జేరి నడ తేర నరదంబు దారుకుండు
గడప యాదవ సైన్యసాగరము వొంగఁ
దొలుత నడ తెంచు నిండు చందురుఁడు వోలె
రుచిరమూర్తియై నీలవర్ణుండు వెడలె. 214

అర్థ: పెండెంబు = బిరుదు కాలికడియము (ఎడమకాలిపై ఓడింపఁబడిన శత్రురాజుల పేర్లను చెక్కిన కడియములన్నవిజేతలైన రాజులు ధరించుట యొక ఆచారము); డాకాలు = ఎడమకాలు; పేరు +ఉరము = పెద్దరొమ్ము; గోధా+ అంగుళీ త్రాణుఁడై = ఉడుము చర్మముతో చేయఁబడిన వ్రేళ్ల కవచము కలవాఁడై.

తా: శార్ఙ్గ మనెడి ధనుస్సు, నందక మనెడి కత్తి, సుదర్శన మనెడి చక్రాయుధము, పాంచజన్య మనెడి శంఖము. కౌమోదకి అనెడి గద, కౌస్తుభమణి వెలుఁగు చుండఁగా,

బిరుదు కడియమును ధరించి, పెద్దతొమ్మన తామర దండ మెఱయు చుండఁగా ఉడుముతో చేయఁబడిన కరకవచమును కలిఁగి స్తుతి పాఠకుల పొగడ్తలు, పుడమి వేల్పుల ఆశీస్సులు ఆకసము నంటుచుండఁగా, బలరాముఁడు సాత్యకి మొదలగు వారు వచ్చుచుండఁగా రథమును దారుకుఁడు నడపఁగా, యాదవసైన్యమనెడి సముద్రము ఉప్పొంగఁగా, అప్పుడే ఉదయించుచున్న పున్నమనాటి నిండు చందురుని వలె, అందచందములు రూపుగొన్న నల్లని మేని చాయగల వెన్నుఁడు యుద్ధమునకు వెడలెను.

అలం: 1. స్వభావోక్తి 2. రూపకము, సైన్య సాగరము 3. ఉపమ : తొలుత నడతెంచు నిండు చందురుఁడు వోలె.

వా. 'నడచు +తెంచు' సూ. క్రియ, బాల- 110, 112, 113. సూ. నుజి 4చే, నడతేరన్ అగును.

కం. ఈవిధమున సేనలతో
నావిశ్వంభరుఁడు వెడలు నప్పుడు దృఢ సం
రావంబు చేత సకల
స్థావరములుఁ గదలఁ బాంచజన్యం బొత్తెన్. 215

తా: ఈ విధముగా సేనలతో విశ్వమును భరించు వాఁడైన, కృష్ణుఁడు ప్రయాణమై చను నప్పుడు, గొప్ప ధ్వని చేత సమస్తమైన పర్వతములు, వృక్షములు మొదలగు కదలని వెల్లను (స్థావరములు) బాగుగా ఊఁగి పోవునట్లు తన పాంచజన్యమను శంఖమును పూరించెను.

వ్యు. విశ్వంభరుఁడు : సమస్తమును భరించువాఁడు, విష్ణువు.

వ్యు. పాంచజన్యము : పంచజనుఁడను రక్కసుని ఎముక వలన కలిగినది, విష్ణుని శంఖము.

సీ. వడఁకు పన్నగ రాజు పడగలమీద స
ర్వంసహాకాంత పేరణము సూప
నుఱ్ఱూఁత లూఁగెడు నుదయా స్త గిరులతో
నా కాశాలక్ష్మి కోలాట మాడఁ

దెర లెత్తి సప్త సాగరములుఁ బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
మొకముల చాయ వేఱొకచందముగ నిల్చి
కమల సంభవుఁడు ప్రేంఖణ మొనర్ప
గీ. మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ వడ దిక్కు లెనిమిదియును
బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్య రవము. 216

అర్థ: సర్వంసహాకాంత = భూదేవి; ఊఁగు + ఊఁగు = ఉఱ్ఱూతలూఁగు = బాగుగా కదలుచున్న; ఉదయ + అస్తగిరులతో = తూర్పుకొండతోను, పడమటి కొండతోను; కోలాట మాడన్ = రెండు కఱ్ఱలతో ఆట ఆడగా; తెరలు + ఎత్తి = అలలను పైకెత్తి; సప్తసాగరములున్ = ఏడు సముద్రములును; మొకములచాయ = ముఖములలో కలకాంతిని; మంగలము = వేపుడు పాత్ర; గుబ్బటిలన్ = తలక్రిందులగునట్లు.

తా: శౌరి (కృష్ణుఁడు) పాంచజన్యమును పూరింపగా, ఆదిశేషుఁడు గడగడ వణకసాగెను. ఆతని పడగలపై ఆనియున్న భూకాంత పేరణ మాడెను. బాగుగా ఇటునటు కదలుచున్న తూర్పు,పడమటి కొండలతో, ఆకాశ లక్ష్మి, కోలాటమాడెను. అలలు ఉవ్వెత్తున పైకి లేచుచు సముద్రజలములు పొర్లుచుండగా, వరుణ దేవుఁడు (జలాధి దేవత - పశ్చిమ దిక్కునకు అధిపతి) గొండిలి నృత్యము చేసెను. నాలుగు ముఖములలో కాంతి వెలవెల పోవుచుండఁగా, కమల సంభవుఁడు (బ్రహ్మ) ప్రెక్కణమాడెను. వేఁపుడు పాత్రలో చిట్లుచు పైకెగురుచున్న పేలాల వలె నక్షత్రములు అక్కడక్కడ చెదరి పడుచుచుండెను. ఎనిమిది దిక్కులును పగలునట్లు పాతాళము తలక్రిందులు అగునట్లు విశ్వమంతయు దద్దరిల్లి సంచలించినది.

విశే. పాంచజన్య మహాఘోషచే, ఆదిశేషుఁడు గడగడ వడఁకు చుండఁగా ఆతని వేయి పడగల మీఁద భూదేవి కూడ కంపించెను. ఆదిశేషుఁడు భూమిని మోయుననని పురాణగాథ. భూదేవి కంపము, పేరణ నృత్యమువలెనుండెను. ఘటము పై నిల్చి చేయు నాట్యమునకు పేరణమనిపేరు. (రూ. పేరణి)

తూర్పుకొండ, పడమటి కొండ రెండునుపాతునుండి. కదలి, ఎల్లప్పుడు దూరముగా నుండునవి, ఒండొంటిని తాఁకినట్లుండెను. అట్లగుచే ఆకాశలక్ష్మి తన చేత రెండు లావుపాటి కత్తులను పట్టుకొని ఒక దానిచే మరొక దానిని కొట్టుచు నాట్యము చేసినట్లుండెను.

గొండిలి: కుండలాకార నృత్యము (గుండ్రముగా తిరుగు ఆట)

ప్రేంఖణము: రూ. ప్రెక్కణము, అభినయముతో నృత్యము. అన్నింటికి పైనున్న సత్యలోకమందు బ్రహ్మ ప్రెక్కణ మాడెను. అన్నింటి కంటె దిగువనున్న పాతాళము క్రిందు మీఁదయ్యెను. పదునాలుగు లోకములను భయభ్రాంతములయ్యెను.

సీసపద్యమందు ప్రతి పాదములో పూర్వార్థమందు భయానకము, ఉత్తరార్థమందు శృంగారము పోషింపఁబడినది. ఈ సాంకర్యముచే శత్రువులకు భయము. మిత్రులకు సంతసము కలిగెననవచ్చును. విరాటపర్వములోని (2ఆ. 134 ప) "నేలయు నింగియు" అను పద్యము యొక్క ఛాయ కన్పట్టు చున్నది.

అలం: 1. సంబధాతిశయోక్తి - పేరణము మొదలగు వానితో సంబంధము లేకపోయినను ఉన్నట్లు చెప్పుట.

2. రూపకము, ఆకాశలక్ష్మి.

3. పర్యాయోక్తి - (విషయమును సుందరతరముగా చెప్పుట)

"మంగలములోని పేలాలమాడ్కి చుక్కలిక్కడక్కడ వడ".

వ్యా.1 ఊఁగు + ఊఁగు - ఉఱ్ఱూఁతలూఁగు ఆమ్రేడిత సంధి.

సూ. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. సంధి బాల - 42.

2. ఊఁగెడు+ఉదయ, ఊఁగెడుఁనుదయ, నుగాగమ సంధి (చూడుము వచన - 23)

సప్తసాగరములు : 1 లవణ 2. ఇక్షు 3. సురా 4. సర్పి 5. దధి 6. క్షీర 7. జల సముద్రములు, మొత్తము ఏడు.

మ. రథ వేదండతురంగ సైనికగణారావం బుదాత్త శ్రుతి
వ్యథ నిస్సాణ ధణంధణంధణధణ ధ్వానంబుతో దిగ్వియ
త్పృథివీ మండల మెల్ల నిండుటయు దద్దీరధ్వనిం బైకొనెం
బ్రథనారంభ విజృంభమాణ హరి శార్ఙ్గ క్వాణ [1]నిర్మాణముల్. 217

1. నిక్వాణముల్

ప్రతి: రథ వేదండ తురంగ సైనిక గణ + ఆరావంబు = రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు కాల్బంటులు లోనగు వారి సమూహముల యొక్క ధ్వనులు; ఉదాత్త శ్రుతి వ్యథ = అధికముగా చెవులకు బాధ కలిగించు; నిస్సాణ = ఈ పేరుగల చర్మవాద్యము యొక్క (నగారావంటిది); ధణం, ధణం, ధణ ధణ ధ్వానంబుతో = ధణ ధణమనెడి శబ్దములతో; దిక్ + వియత్ పృథివీ మండలము + ఎల్లన్ = దిక్కులు, ఆకాశము భూమండలము మొదలగు నవి అన్నియును; నిండుటయున్ ; తద్+వీరధ్వనిన్ = ఆ రథాదులయు, వాద్యములయు, గంభీరములగు ధ్వనులను; ప్రధన + ఆరంభ విజృంభమాణ = యుద్ధ ప్రారంభమందు, చెలంగుచు, వృద్ధియగుచున్న; హరి = కృష్ణుని యొక్క; శార్ఙ్గ క్వాణనిర్మాణముల్ = శార్ఙ్గమను పేరుగల వింటి యొక్క విశేషశబ్దములు; పైకొనెన్ = అతిశయించి ఆక్రమించి మించెను. (పాఠాం. నిక్వాణముల్).

తా: నాలుగురకములైన సేనలు కావించు ధ్వనులు, చెవులు సహింపరాని రణభేరుల ధణంధణ శబ్దములు కలసి, ఆకాశమును దిక్కులను వ్యాపించెను. వానినంతటిని మించినవై, కృష్ణుని వింటి నుండి వెలువడిన గంభీరములైన ధ్వనులు సర్వత్ర నిండెను.

అలం: 1. అతిశయోక్తి - శార్ఙ్గ చాపధ్వను లంతటను నిండెననుట.

2. వృత్త్యనుప్రాసము - 'ణ'కార 'న'కారములు, ఆవృత్తమైనవి.

రూ: నిక్వాణము నిక్వణము, క్వణము క్వాణము.

వ. ఇట్లు చతురంగసైన్యసమేతంబుగా సవరణతో సన్నాహంబు మెఱసి
హృషీ కేశుండు పుష్కర సర స్తీరంబున విడిసి తదీయ జలంబుల
నుపస్పర్శంబు చేసి మొన లేర్పఱిచి యున్న యవసరంబున. 218

అర్థ: సవరణతో = వాహనాదుల అలంకారములతో; ఉపస్పర్శము = ప్రక్షాళన మఱియు ఆచమనము; మొనలు = సేనల వ్యూహములు.

తా: ఈ విధముగా నాలుగు విధములైన సైన్యమును వివిధములైన వాహనాదుల అలంకారములతో యుద్ధమునకు సిద్ధముచేసి అవి అన్నియును మెఱయు చుండఁగా కృష్ణుఁడు, పుష్కర మనెడి కొలని గట్టున, ఆదండును నిలిపి, కొలనిలోని నీటితోముఖ ప్రక్షాళనము కావించుకొని ఆచమనమును ముగించుకొనెను. అపుడు సేనలన్నియు చక్కగా తీర్పఁబడి యుండఁగా (మీఁది పద్యముతో) .

వ్యు. హృషీకేశుడు:ఇంద్రియములకు ప్రభువు, విష్ణువు.

యుద్ధప్రారంభమందు, కృష్ణుఁడు సంధ్యావందనమును కావించినట్లు సోమన సూచించి నిత్య కర్మలయెడ తనకుఁగల అనురక్తిని ప్రదర్శించెను.

## - : హంస డిభకులు యుద్ధ సన్నద్ధులయి వచ్చుట : -

మ. భసితాలిప్త వపుస్త్రిపుండ్ర నిటల ప్రత్యగ్ర రుద్రాక్ష దా
మ సముజ్జృంభిత వేషు లై వర ధనుర్మాహేశ్వ రాద్యస్త్ర శ
స్త్ర సమృద్ధిన్ రథముల్ వెలుంగ మును భూతద్వంద్వ మే తేర రా
జ సహస్రంబులతోడ హంసడిభకుల్ సంగ్రామసన్నద్ధులై. 219

ప్రతి: హంసడిభకుల్; భసితాలిప్తవపుస్ = విభూతిచే పూయఁబడిన శరీరము; త్రిపుండ్రనిటల = మూఁడు గీతలుగా అడ్డముగా పూసికొన్న విభూతిగల నొసలు; ప్రత్యగ్ర రుద్రాక్షదామ = క్రొత్తవైన రుద్రాక్షమాలికలచే; సముజ్జృంభిత వేషులై = మిఱుమిట్లు గొల్పు చున్న అలంకృతమైన ఆకారము కలవారై; వరధనుస్ + మాహేశ్వర+ఆది+అస్త్ర శస్త్ర సమృద్ధిన్ = శ్రేష్ఠమైనట్టియు, మహేశ్వరునికి సంబంధించిన బాణముల యొక్కయు ఆయుధముల యొక్కయు నిండుతనముచే, రథముల్; వెలుంగన్; మును = వారి ఎదుట; భూతద్వంద్వము = ఇరువురు పిశాచములు (శివుని ప్రమథగణముల లోని వారు); ఏ తేరన్ = రాఁగా; రాజ సహస్రంబులతోడన్ = వేల కొలది రాజులతో; సంగ్రామ సన్నద్ధులై = యుద్ధమున పాల్గొనుటకు చక్కఁగా ప్రయత్నించిన వారై.

తా: హంసడిభకులు, శరీరమంతటను విభూతిని పూసికొన్నవారై, నొసటిపై మూఁడు రేఖలుగా విభూతిని తీర్చి, క్రొంగ్రొత్త రుద్రాక్ష మాలికలను, ఱొమ్మున అలంకరించుకొని, భయంకరములగు ఆకృతితో, విండ్లు, శివుని పరములగు అస్త్రములు, ఆయుధములు, అన్నింటిని నిండుగా గొని, రథములు ప్రకాశించుచుండఁగా తమ ఎదుట శివుని భటులైన ఇరువురు భూతములు రక్షగా నడచు చుండఁగా వేలకొలది రాజులతో యుద్ధమునకు సిద్ధమై (మీఁది పద్యముతో).

సీ. [2]ఉద్ధతి నిజదశాక్షౌహిణీబలముతోఁ
బడగలు గ్రాలంగ వెడలునప్పు
డవసరం బెఱిఁగి దానవు లనేక సహస్ర
సంఖ్య లేతేర విచక్రుఁ డనఁగ

1. సన్నద్ధ

దైత్యేంద్రుఁ డట మున్న తత్కుమార ద్వయ
సఖుఁడైన వాఁడు వాసవునితోడఁ
బో టొడ్డి గెలిపించెఁ బూర్వగీర్వాణుల
నారాయణునితోడఁ బోరి పోరి

గీ. ద్వారవతియందు నొంచె యాదవుల నెల్ల
నట్టి వీరుండు దోడు రా యాతుధాన
ముఖ్యుఁ డగు నాహిడింబుండు మొనకు నడిచె
దైత్యు లెల్లను జెదర యాదవులు సెలఁగ. 220

ప్రతి: ఉద్ధతిన్ = భయమును కొల్పునట్టి అతిశయముతో; నిజదశ + అకౌహిణీ బలముతో = తమదైన పది అకౌహిణీ సంఖ్యగల సేనతో; పడగలు + క్రాలంగన్ = టెక్కెములు, నర్తింపఁగా; వెడలునప్పుడు; అవసరంబు+ఎఱిఁగి; దానవులు +అనేక సంఖ్యలు+ఏతేరన్ = రాక్షసులు పెక్కువేలమంది రాఁగా; విచక్రుఁడు + అనఁగ; దైత్య+ఇంద్రుఁడు = రాక్షసుల ప్రభువు; అటమున్న; తద్+ కుమార సఖుఁడైన వాఁడు = ఆ కుమారుల మిత్రుఁడు; వాసవుని తోడన్ = ఇంద్రునితో; పోటు + ఒడ్డి = యుద్ధప్రయత్నముచేసి; పూర్వ గీర్వాణులన్ = అసురులను; ద్వారావతియందు; గెలిపించెన్ నారాయణుని తోడన్; పోరిపోరి = పలుమాఱు పోరాడి; యాదవులను + ఎల్లన్; నొంచెన్ = బాధించెను; అట్టి వీరుండు తోడు రాన్ = తోడు కాఁగా; యాతు ధానముఖ్యుండగు + ఆహిడింబుండు = రాక్షసులలో ప్రధానమైన వాఁడైన ఆ హిడింబుఁడను పేరుగల వాఁడు; దైత్యులు +ఎల్లన్; చెదరన్ = నలువైపుల మూఁగఁగా; యాదవులు; చెలఁగన్ = ఉత్సాహము చూపఁగా; మొనకు = సేనలకు ముందు; నడిచెన్.

తా: అరి భయంకరముగ్గా తమ పది అకౌహిణీ సేనతో టెక్కెములు రెపరెపలాడు చుండఁగా, వెంట పెక్కుదానవులు కూడి రాఁగా మిత్రుఁడైన విచక్రుఁడు అనెడి రాక్షసుఁడు ఇంద్రుని జయించిన వాఁడు, కృష్ణు నెదిర్చి ద్వారకయందు పలుమాఱు యాదవుల బాధించిన వాఁడు, సహాయుఁడు కాఁగా, రాక్షసులలో ముఖ్యుఁడు హిడింబుఁడ నెడి వాఁడు సేనకు ముందు నడువఁగా,అసురులెల్లరు నలువైపుల చుట్టి యుండ, యాదవులు ఉత్సాహముతో ఉప్పొంగఁగా హంసడిభకులు యుద్ధమునకు వచ్చిరి.

అక్షౌహిణీ సేన : రథములు - 21, 870, గజములు -21 870, తుర గములు - 65, 610, వీరభటులు - 10 9350 మొత్తము - 2,18,700, యుద్ధములో పది అక్షౌహిణుల

సేన తరలివచ్చినది. అనఁగా 21,87,000 - ఇరువది యొక్క లక్ష, ఎనుబది ఏడు వేల సంఖ్యగల సైన్యము.

వ్యా: అక్ష+ఊహినీ = ఇచ్చట 'ఉ'కారము పరమగుటచే గుణసంధి కావలెను. అట్లు కాక, 'వృద్ధి' సంధి అయినది. ఇది విశేషమైన రూపము.

వృద్ధిసంధి సూ. 'అఆ' లకు 'ఏఐ'లు పరమైన 'ఐ' కారము, 'ఓఔ' లు పరమైన 'ఔ' కారము 'ఋ౯' గాని పరమైన 'ఆర్,ఆల్' ఆదేశమగును. ఇచ్చట 'ఏఏ'లు గాని, 'ఓఔ' లు గాని లు పరముకాలేదు. అయినను "ఔ" వృద్ధి వచ్చినది 'అక్షౌహిణీ'. దీనిని ఈ క్రింది సూత్రము సమర్థించుచున్నది.

సూ. 'స్వ' శబ్దమునకు "ఈ ఈరిన్' శబ్దములును, అక్ష శబ్దమునకు, 'ఊహినీ' శబ్దమును పరమగుచో 'ఐఔ'లు ఏకాదేశమగును. 'హ'కారముపై 'న' కారము 'ణ' కారమగును. వ్యవహారములో వృద్ధి వచ్చుటచే సాధురూపముగా గ్రహింపఁబడినది.

వ. ఇవ్విధంబున. 221

తా: ఈరీతిగా

క. ఎనుఁబదియెనిమిది [1] లక్షల
దనుజులు రాక్షసులు నడవఁ దమసైన్యంబుల్
మొన లై పదియక్షౌహిణు
లనూనగతి నడవ నడచి రా నృపతనయుల్. 222

అర్థ: దనుజులు; కశ్యపునకు దనువనెడి సతియందు జన్మించినవారు. అనూనగతిన్ = చాల భయంకరముగా.

తా: ఎనుబది ఎనిమిదిలక్షల సంఖ్యగల, (ఎనుబది ఎనిమిది వేవురు-పాఠాంతరము) దానవులు, రాక్షసులు, నడచుచుండగా, తమసైన్యము పది అక్షౌహిణులును, వివిధ వ్యూహములుగా భయంకరముగా, వచ్చుచుండఁగా, హంసడిభకులు యుద్ధమునకు, వెడలిరి.

సీ. కరటిఘటాకోటి కటనిర్గళ న్మదా
సారంబు దొలుకారుఁ జేరఁ బిలువ

1. వేవురు

రథ నేమి నిర్భిన్న పృథివీపరాగంబు
నీహార సమయంబు నేర్పుఁ దెగడ
సుభట భుజోద్భట క్షురికాప్రభా భంగి
మండు వేసవితోడ మాట లాడఁ
దురగ ధట్టఖలీన ధుత ఫేన తారకా
వళి శరత్కాలంబు వరుసఁ జూపఁ

గీ. బవన చంచల ధ్వజపట పల్లవములు
నవవసంతంబుఁ దెలుప సన్నాహ తరళ
ఖడ్గలతికలు శిశిరంపుఁ గడఁక నెఱప
హంసడిభకుల సేన యేఁ డనఁగ నడిచె. 223

ప్రతి: కరటి ఘటాకోటి = ఏనుఁగుల సమూహము యొక్క లెక్కలేని; కటనిర్గళత్ = చెక్కిళ్లనుండి జాఱుచున్న; మద+ఆసారంబు = మదజలము యొక్క జడి (ప్రవాహము); తొలుకారున్= తొలుకుకారు వర్షఋతువును; చేరన్ పిలువన్= దగ్గఱకు రమ్మని పిలువఁగా; రథనేమి నిర్భిన్న = రథ చక్రములకు అమర్చియున్న ఇనుప పట్టీలచే బాగుగా నలిఁగి పోయి లేచిన; పృథివీ పరాగంబు = నేలయొక్క దుమ్ము; నీహార సమయంబు నేర్పున్ + తెగడన్ =హేమంతఋతువు యొక్క నైపుణిని నిందింపఁగా; సుభట భుజ = దిట్టలైన కాల్బంటుల (బాహువుల)చేతులలో నున్న; ఉద్భట క్షురికా = మేలైన చురకత్తుల యొక్క; ప్రభాభంగి = ప్రకాశముల తీరు (కిరణముల ప్రకాశము); మండు వేసవితోడన్ = గ్రీష్మ ఋతువుతోడ; మాటలాడన్ = సంభాషింపఁగా; తురగ ధట్టఖలీన = గుఱ్ఱముల గుంపు యొక్క కళ్లెములచే; ధుతఫేన = ఎగురఁగొట్టబడి నురుగులు అనెడి; తారకా+ఆవళి = నక్షత్రముల వరుసలు; శరత్కాలంబు వరుసన్ + చూపన్ = శరదృతు క్రమమును చూపఁగా; పవన చంచల ధ్వజ పట పల్లవములు = వాయువుచే కదలాడు పతాకములయొక్క వస్త్రములు అనెడి (ఎఱ్ఱరంగు) చిగుళ్ళు; నవ వసంతంబున్ +తెలుపన్ = క్రొత్తదైన వసంత ఋతువును సూచింపఁగా; సన్నాహ తరళ ఖడ్గ లతికలు = యుద్ధ ప్రయత్నమునకు కొనిపోవు, తళతళలాడు కత్తులు అనెడి తీఁగలు; శిశిరము + కడక = శిశిరఋతువు యొక్క ప్రయత్నమును; నెఱపన్ = నింపఁగా; హంసడిభకుల సేన; ఏఁడు + అనఁగన్ = సంవత్సర కాలమో అను విధమున నడిచెన్.

తా: పెక్కు ఏనుఁగుల చెక్కిళ్లనుండి స్రవించు మదజలధారల జడి వర్షఋతువును, రథ చక్రముల పట్టాల తాఁకుచే లేచిన దుమ్ము - హేమంత ఋతువును, (దుమ్మునకు

మంచునకు సామ్యము). కాల్బంటుల చేతులలోఁగల చురకత్తుల కాంతి కిరణములు - గ్రీష్మ ఋతువును, గుఱ్ఱముల నోళ్ళనుండి కళ్లెముల రాపిడి వలన వెలువడు నురుగులు అనెడి నక్షత్రములు - శరదృతువును ,గాలిచే రెపరెపలాడు టెక్కెంపు గుడ్డలు అనెడి ఎఱ్ఱనికాంతిగల చిగురాకులు - వసంత ఋతువును, యుద్ధమునకై కొనిపోవు, తళతళలాడు పెద్ద కత్తులు అనెడి తీఁగెలు - శిశిర ఋతువును,ఏకకాలమందు ఋతువులన్నియు ప్రవర్తించిన సంవత్సరమో అనునట్లు హంసడిభకులసేన నడచెను.

విశే : తిక్కన విరాటపర్వమందు ఉద్యానవనము ఆకాశమునకు కాపురమునకు పోవుచున్నదేమో అనునట్లు కౌరవసేన సంగరమునకు సాగెనని వర్ణించెను. తిక్కన పద్యపుచాయ ఈ పద్యమందు కలదు. (విరాట, 4 ఆ - 50వ పద్యము).

అలం: ఉత్ప్రేక్ష.

వ్యా. శిశిరంపుఁగడక : పుంప్వాదేశ నుగాగమ సంధి (చూడుము, వచనము 26).

వ. ఆ సమయంబున. 224

తా : సులభము

కం. బాంధవము చూడక జరా
సంధుఁడు దిగ విడిచె వారి సైరణ చెడి క్రో
ధాంధుఁడు దుర్వాసుం డను
సంధించుం దనకుఁ దగని శాపం బనుచున్. 225

తా: ఓర్పు నశించి, క్రోధముచే గ్రుడ్డివాఁడై (ఉచితానుచితములను చూడక) ఒడలు మఱచి, తగని శాపము ఇచ్చునని భయపడిన వాఁడై, జరాసంధుఁడు బంధుత్వమును కూడ చూడక (లక్ష్యము చేయక) హంస డిభకులకు తోడ్పడయ్యెను.

అలం: కావ్యలింగము. జరాసంధుడు హంసడిభకులను దిగ విడుచుటకు హేతువు సూచింపఁబడినది.

ఛం. దుష్కరప్రాసము, బిందు పూర్వక 'ధ' కారము.

కం. ఇటు నడచి రెండుబలములుఁ
బటుగతిఁ బుష్కరతటాక పార్శ్వంబునఁ జే

రుట పూర్వ *జన్మసుకృతము
ఘటియించుట గాక యిట్టి కలనుం గలదే. 226

తా: ఇట్లు యాదవులసేన, హంసడిభకుల సేన, రెండును పుష్కర సరస్తీరమున చేరుట, వారు పూర్వజన్మలలో చేసిన పుణ్యఫలమే కారణము.

అలం: 1. అతిశయోక్తి - ఇది సామాన్యమైన యుద్ధము కాదు. పుణ్యతీర్థమందు జరుగుట విశేషమనుట.

2. కావ్యలింగము : పుష్కర తీరమున జరుగుటకు కారణము చెప్పఁబడినది.

గీ. పొసగ బుండరీ కాక్షునిఁ బుష్కరంబుఁ
దలఁచి నంతన పాపంబు దొలఁ గుఁ జెంత
నుభయమును గూడె నచ్చోట నున్న వారుఁ
జన్న వారును గైవల్య సారధనులు. 227

అర్థ : కైవల్యసారధనులు = మోక్షము అనెడి బలమైన ధనము కలవారు; (కేవలము = ఒకటి, కేవలుఁడు = పరమాత్మ, కైవల్యము = మోక్షము)

తా: తెల్లదామరలవంటి కన్నులు గల కృష్ణుని, పుష్కరమును, ఉచితరీతిని, తలంచిన మాత్రముననే పాపములు తొలఁగి పోవును, ఈ యొక్కచోట (పుష్కరమందు) దైవము తీర్థము, రెండును కలసినవి. కనుక అచటనున్న వారు, అచట మరణించినవారు మోక్షమనెడి సంపదను సాధించినవారే!

అలం. రూపకము, కైవల్యసారధనులు

వ్యా. అచ్చోట త్రికసమాససంధి (చూడుము, పద్యము 7).

కం. ఆ కలన నుభయబలములుఁ
గైకొన కొం డొంటిఁ దాఁకి ఘటిత పటహ భే
రీ కాహళ కోలాహల
సాకార స్వైర విహరణా హంకృతు లై. 228

* జన్మకృతసం,ఘటన మహిమ గాక యిట్టి.

ప్రతి: ఆ కలనన్ = ఆయుద్ధ సమయమందు; ఉభయ బలములు = ఇరుపక్షముల సేనలు; కైకొనక = ఎదిరిని, లక్ష్యముచేయక; ఒండొంటిన్ = ఒక దానిని మఱొకటి; తాఁకి = పైకొని; ఘటితపటహ భేరీ కాహళ = తప్పెటలు, నగారాలు, కొమ్ములతో కూడిన; కోలాహల = కలకలముతో (సందడితో); సాకార = రూపు చెందిన; స్వైర విహార = ఇష్టానుసారము సంచరించునవియును; అహంకృతులు +ఐ = అహంకారములను కలవై.

తా: యుద్ధ సమయమందు పుష్కర తటాక తీరమున గుమిగూడిన ఇరుపక్షముల సేనలు, పరస్పరము లెక్కచేయ్యక మార్కొని రణవాద్యములైన తప్పెటలు నగారాలు కొమ్ములు చెలరేఁగుచుండఁగా, రూపులు గైకొనిన స్వేచ్ఛా సంచారము గల అహంకారములును గలవై తలపడెను (మీఁది వచనముతో) .

విశే. అలం. అతిశయోక్తి.

వ. ఇట్లు తలపడి సాయకనికరంబులఁ గరంబుల మనికట్లపట్లకుఁ దునిమిన మునుకొని కరవాలంబులు వదనంబులం గఱచి కొని కదనంబునకుం బఱచు వారలనుం గణఁగి గద వ్రేసినం గినిసినట్లు దునిసిన చరణంబులతో మరగాళ్ళం దిరుగు వెరవరు ల కైవడిం దిరిగి యడిదంబులం బొడిపొడిగా నడుచు నడజోదు భటులును, 2.దండతండంబు లగు వేదండంబుల తొండంబులు దండెలం దగిలినం గదలనేరని తురంగంబుల పై మలంగి దంతంబుల కొలందికిం దరువలికత్తులం దుత్తుమురుగా మెత్తి విడిపించు రవుతులు, దేరుల గముల చేరువల సారువలు గట్టు వారువంబుల పక్కెరల పై నెక్కడఁ జూచినం గ్రిక్కిఱియ నాటిన నెఱనారసంబులు వెఱికి పిఱుందు ముందఱగా నేసిన విలు కాఱచేతం జీకాకు పడిన రథికులును 3.గడుపులు గాఁడం బొడిచి యెత్తిన గడల కడలం బ్రేవులు చుట్టి పట్టి దిగంబడక వెఱ బొమ్మలం గట్టినట్లు వ్రేలియును వ్రేల్మిడి మొలకతారమ్ములు వెఱికి గడలు తెగ నఱకి దిగ నుఱికి పగఱం జిట్టు ముట్టాడు సహజ సాహసులును, డొంకెనలం బొడిచిన *గళ్యాలు గడచి తాళులు విఱిచి సంధులు గాఁడి ప్రక్కలు వ్రక్కలు చేసినం

---

* గేళాలు గఱచి తాళాలు విఱిచి

జలింపక బంకింపక జంకించి లవుడి నడిచిన బొమిడికంబుల తోడన యెమ్ములు నలిగిలి యైనఁ దలలు నుసిందేలం బొదివి కట్టి మెట్టికొని నిల్చిన యసిధారులును, గసిమసంగిన మారి పిసికి పిండలివండు చేసిన చందంబున గొండ లైన కండలలోఁ గలసి పేరిన రుధిరంబునఁ దిరంబు సవి మెట్టి యిట్టటు గదల నేరక యూరక యున్న గజంబులపై గజిబిజింపక భుజబలంబు సూపు జోదులును, నురవడించిన యరదంబుల కడనొగలు దాఁకి తలలు పగిలి హయంబులు గూలకమున్న లవణిగలిగి లంఘించి కరవాలంబులు విసరిన మ్రొగ్గతిలిన యుగ్యంబులును, దలలు దునిసిన సారథులునుం, గడిఖండంబులైన కోదండంబులునుం గలిగి రథులతోఁ బలుగాఁడిపై జిరాణంబుల బారి సమరి సరిం బడిన యాశ్వికులును, బలకలవారిపై బుయిలోడక పురికొల్పిన కరిఘటల కడ్డంబు చొచ్చి మచ్చరికంబునం బచ్చడికి నఱకినట్లు కొమ్ములు విఱిచియు నెమ్ములు త్రుమ్ములు చేసియు శుండాదండంబులు చిదిమియుం గుంభంబులు వగుల నేసియుం బ్రక్కలు సెక్కలు వాపియుం బెక్కు విధంబులం జిక్కువఱచు పంత గాఱును, మఱియును గిరిగొన రాలిన మణిభూషణంబులుం, జిద్రుప లైన మకుటంబులునుం, జిందఱవందఱ లైన జోళ్లునుం, జిక్కు వడిన చామరంబులును, నొఱగిన పడగలును, దఱగిన మస్తకంబులునుం, బొరలెడియట్టలును, దెరలెడి తిట్టలును, గట్టలు కొన్న కైదువులును, బొడి యైన రథాంగంబులును, నలిసిన యంగంబులునుం, దెలిసిన మొగంబులునుం, గ్రాలం గీలాల జల ప్రవాహంబులం దేలియాడు వెలిగొడుగులును, బుట్టల మీఁదం/గా లూఁది యున్న బేతాళబాలికలు పుండరీకంబుల మూఁగిన యళికులంబు విడంబింప నిశితభల్లంబులం బెల్లగిల్లి డొల్లిన సమౌక్తిక గజకుంభ పాలికలు గరంబులం బూనిన

డాకినులు సుర నారీ వీరస్వయంవర సమయంబున సకుంకుమా క్షత వ్రాత పాత్ర హస్తలై సువ్రతంబు చెప్ప వచ్చిన సతులం దలఁపింపఁ
౭,బ్రహారమూర్ఛాపరవశు లగు వీరుల బొండుగులు వ్రచ్చి పెఱికి తిగిచినం బ్రేగులు రాకున్న ముక్కుల నూఁది పట్టి వెనుకకు నిక్కి తెక్కలు విద్రుచు కంక గృధ్రంబుల చేతం జలిగాలి వొడమినం దెలిసి సచేతనంబు లగు కళేబరంబులునుం గలిగి మఱియు నొండొరుల మెచ్చక నీసున వ్రేసిన యసిధారలు మండ గండు మిలిగి మెదడునం బ్రుంగి మజ్జంబులు దలమునుకలుగ సందడిం దడఁబడకుండ ముందల పట్లు వట్టికొని పోట్లాడు వారును, మొనకయిదువుల పయిఁ దఱియ నుఱికి సరకు సేయక వీఁపునం జెంగలువరేకులు వెడలినయట్లు వెడలఁ గెడయువారును, వీరు వా రనక వీరావే శంబునం జేతుల కసి వోవం జెలరేఁగి సింహనాదంబులు సేయుచు మోఁదువారునుం, దిరుగుడు వడక తివియక బీరంబు సెడక బీఱువోక యొద్దగిల యొదుఁగక వేసఱక విఱుగక విబుధలోకంబునకు వెక్కసంబును వేడుకయునుం గదుర నసమ సమరంబు సేయ మధ్యాహ్న సమయం బయ్యె నయ్యవసరంబున. 229

ప్రతి: ఇట్లు; సాయక నికరంబులన్ = (బాణముల) ఖడ్గముల సమూహములచే; కరంబులన్ = చేతుల యొక్క; మణికట్ల పట్లకున్ = మనికట్టుల ప్రదేశము వఱకు (మణిబంధము); తునిమినన్ = ఖండింపఁగా; మునుకొని = ముందునకు వచ్చి; కర వాలంబులను = పెద్ద కత్తులను; వదనంబులన్ = నోళ్లయందు; కఱచికొని = (నోటి) పళ్లతో పట్టుకొని; కదనంబునకున్ = వధించుటకు; పఱచువారలనున్ = పరుగెత్తు వారలను; కణఁగి = ప్రయత్నించి; గదవ్రేసినన్ = గదతో కొట్టఁగా; కినిసినట్లు= కోపించిన విధమున; తునిసిన చరణంబులతో = తెగిన కాళ్లతో; మరగాళ్లన్ మరలతో అమర్చిన కాళ్లతో; తిరుగు వెరవరుల కైవడిన్ = తిరుగ నేర్పరుల వలె; తిరిగి = తిరిగిన వారై; అడిదంబులన్ = కత్తులచే; పొడిపొడిగా = పొడియగునట్లు (చూర్ణమగునట్లు); అడుఁచు = (పొడుచు) కొట్టు; నడజోదు భటులును = నడచు వీరులైన భటులును,

తా: ఈ విధముగా

కత్తులను కఱచుకొని పగవారిని వధించుటకు పరుగిడు చుండిరి. కొందఱు గట్టిగా గదలతో కొట్టఁగా కోపించినట్లు తెగిన కాళ్లతో, మరకాళ్లతో తిరుగు నేర్పరులవలె మరలఁగా, వారిని, పొడియగునట్లు కొట్టు చుండిరి. ఇట్లు వీరులైన కాల్బంటులు పగవాండ్రను అణఁచిరి.

229(2) ప్రతి: తండ తండంబులు + అగు = గుంపులై యున్న (తెగిన) (ఈపదమందు దకారముండవలెనని శ.ర); వేదండంబులతొండంబులన్ = ఏనుఁగుల తొండములందు; దండెలన్ తగిలినన్ = తమ బలిష్ఠములైన కాళ్ల పిక్కలు తగులుటచే; కదలనేరని = కాళ్లను పైకెత్తుటకు సాధ్యపడనివైన; తురంగంబులపై = గుఱ్ఱముల మీఁద నుండి (నడపువారు); మలంగి = బాగుగా వంగి; దంతంబుల కొలందికిన్ = (ఏనుఁగు) దంతములుండు వఱకును; తరువలి కత్తులన్ = సానబెట్టిన పెద్ద (వేఁట) కత్తులచే తుమురు+తుమురు = తుత్తుమురుగా = పిండి యగునట్లు; మెత్తి = నలఁగఁగొట్టి; విడిపించు = (తగులుకొన్న కాళ్లను) పైకెత్తుటకు వీలు కల్పించు; రవుతులును = గుఱ్ఱమును నడుపు వీరులును; తేరుల గముల యొక్క = తేరుల మొత్తము యొక్క; చేరువన్ = సమీపమందు; సారువలు కట్టు = (రథములను ఎక్కుటకు) చెక్కలను అమర్చుటకు తోడ్పడు; వారువంబుల పక్కెరలపై = గుఱ్ఱముల జీనీలపై (మెత్తని గంతలపై); ఎక్కడ చూచినన్; క్రిక్కు+ఇఱియు = (కిఱుకుయొక్క రూపాంతరము క్రిక్కు) ఎడము లేక, దగ్గఱ దగ్గఱగా; నాటిన నెఱ నారసంబులును = గ్రుచ్చుకొనునట్లు చేయఁగా నిండిన ఇనుప బాణములను (అట్లు చేయుటచే సారువలు కట్టుటకు అవి అడ్డు పడినవి); పెఱికి = లాఁగి; పిఱుందు = వెనుకనుండు భాగము; ముందు + అఱగాన్ = మొదట తెగునట్లు; ఏసిన; విలుకాఱుచేత = విలుకాండ్రచేత; చీకాకు పడిన = కలఁత చెందిన; రథికులును.

తా: ఏనుఁగు తొండములు, దంతములతో తెగి పడియుండుటచే గుఱ్ఱముల బలిష్ఠములైన కాళ్లపిక్కలు అందు కూరుకొని పోవుటచే అవి తమకాళ్లను పైకెత్త లేకపోయినవి. గుఱ్ఱములపై నుండు రౌతులు పెద్ద కత్తులచే దంతముల వఱకు తొండములను తఱిఁగి ముక్కలు చేసి మెత్తఁబడచేసి కాళ్లను లేవదీయుటకు అవకాశము కల్పించిరి. మఱియును పెద్ద పెద్ద తేరులపై ఎక్కుటకు పెద్ద చెక్కలను అమర్చుచున్న గుఱ్ఱాల జీనీలపై ఎడము లేక శత్రువులు బాణములను గ్రుచ్చుకొనఁజేయఁగా, వానిని రౌతులు వెన్వెంటనే లాఁగివేయుచుండిరి. అపుడు వెనుకనుండు రథభాగములను మొదట తెగఁగొట్టుటకు ప్రయోగించిన విలుకాండ్ర బాణములచే రథికులు కలఁత చెందుచుండిరి.

3. ప్రతి: కడుపులు; కాఁడన్ = చీలునట్లు; పొడిచి ఎత్తిన; కడలకడలన్ = ప్రక్కలందు (వెల్వడిన); ప్రేవులు = ప్రేగులను; చుట్టి పట్టి = చుట్టి వేసి పట్టుకొని; దిగన్ +నడక + దిగిపోక పోరాటమును విరమింపక; వెఱ బొమ్మలన్ = దిష్టి బొమ్మలను;కట్టినట్లు; వ్రేలియును = వ్రేలాడుచున్న వారైనను (ఇటునటు కదలుచు); వ్రేల్మిడిన్ = వెంటనే; మొలల కఠారమ్ములు = మొలలో నున్న పెద్ద కత్తులను; పెఱికి = తీసికొని; కడలు = (అడ్డముగా నుండు ప్రేవుల) చివఱి భాగములను తెగనఱికి = బాగుగా తెగఁగొట్టి; దిగన్ + ఉఱికి = చొచ్చునట్లు (పగవారిపై) దూఁకి; పగఱన్; చిల్లుముల్హాడు = చీల్చు (శర); సహజ సాహసులును = స్వభావముచే భయములేక, అతి వేగముగా శత్రువుల నెదుర్కొను వారును; డొంకెనలన్ = వంకర తిరిగిన మొనలు గల ఈఁటెలతో; పొడిచినన్; కళ్యాలు =కళ్లెములు; కడచి = వదలి; తాళులు విఱిచి = త్రాళ్ళను తీసివేసి; (కేశాలు-కలిచి తాళాలు విఱిచి) సంధులు కాఁడి = ఎముకల కూడలిని చీల్చి; ప్రక్కలు ప్రక్కలు చేసినన్ = తమ శరీరభాగములను, ఇరువైపుల, ముక్కలు చేసినను; చలింపక = బెదరిపోక; పంకింపక = కలఁత చెందక; జంకించి = బెదరించి; లవుడిన్ = దుడ్డు కఱ్ఱచే; అడిఁచినన్ = కొట్టఁగా; బొమిడికంబుల తోడన్ = (బొమిడీకము బొమికము, బొమ్మికము, బొమ్మిడీకము. మూసాల) తల టోపీలతోనే; ఎమ్ములు = ఎముకలు (తలయందు గలవి); నలిగులియైతన్ = పిక్కలి నలిఁగి ముక్కలు ముక్కలై పోఁగా; తలలు;నుసిన్ = ఆ ఎముకల పొడితో; తేలన్ = వాలి పోవుచుండఁగా; పొదివి కట్టి చేతితో కదలక (కట్టినట్లు) పట్టుకొని; మెట్టికొని = గట్టిగా నేలను త్రొక్కి; నిల్చిన; అసిధారులును = కత్తులు చేతులలో గలవారును.

తా: కడుపులు చీలిపోవునట్లు పొడువఁగా ప్రక్కలందు ప్రేగులు వెలుపలికి వచ్చినవి. వానిని చుట్టివేసి పట్టుకొని పోరాటమును మానక దిష్టి బొమ్మల వలె, కదలు చున్నను, వెంటనే కత్తులను తీసికొని, ప్రేవుల చివఱి భాగములను తెగఁగొట్టి ముందునకు దూఁకి శత్రువులను చీల్చు స్వభావము కలవారగుటచే నిర్భయముగా శౌర్యమును ప్రదర్శించు వీరులును, మొనలుగల ఈఁటెలతో పొడువఁగా, గుఱ్ఱములకు గల కళ్ళెములను చేతులనుండి వదలివేసి కట్టుకొన్న త్రాళ్లను తీసివేసి, తమ ప్రక్కలలో నున్న ఎముకల కూడలిని ముక్కలు చేసినను బెదరక, కలఁత చెందక శత్రువులను బెదరించుచుండఁగా, శత్రువుల దండములతో తలలపై కొట్టఁగా టోపీలతో కూడ తల ఎముకలు నలిఁగి ముక్కలైనవి. ఆ ఎముకల పొడితో తలలు వాలిపోవుచున్నను వానిని గట్టిగా కట్టుకొని పట్టుకొని నేలపై నిలిచిన ఖడ్గధారులును.

4. ప్రతి: కసిమసంగిన మారి = చెలరేఁగుచున్న మరణదేవత; పిసికి; పిండలి వండుచేసిన

చందంబున = ముద్దలుగా, అడుసుతో నుండునట్లు చేయఁగా; కొండలైన కండలలో = తిప్పలు, తిప్పలుగా ఏర్పడి యున్న మాంసపు ముక్కలతో కలసి పేరిన = కలసిపోయి గడ్డకట్టిన; రుధిరంబునన్ = రక్తముల ప్రవాహమందు; తిరంబు సవి మెట్టి = గట్టి చోటుపై కాళ్లను పెట్టి; ఇట్టు+అట్టు = ఇటుగాని, అటుగాని, ఏవైపును; కదలనేరక + ఊరకయున్న; గజంబులపై = ఏనుఁగులపై; గజిబిజింపక = సంకోచములేక (కలఁత చెందక);భుజబలంబు + చూపు = తమ చేతుల యొక్క శక్తిని ప్రదర్శించు; జోదులునున్ = వీరులును; ఉరవడించిన + అరదంబుల = వేగముగా పోవుచున్న తేరుల యొక్క; కడనొగలు = నిడుపాటి మధ్యగల మ్రానుయొక్క కడపటి భాగమును; తాఁకి = తగులుటచే; తలలు పగిలి = తలలను పగులకొట్టుకొని; హయంబులు = గుఱ్ఱములు; కూలకమున్న = నేలపై పడి పోవక ముందే; లవణి కలిగి = బిగువును పొంది; లంఘించి = దుమికి; కరవాలంబులు = కత్తులు; విసరినన్ = విసరి వేయఁగా;మ్రొగ్గతిలిన = ముందుకు వాలిపోయినట్టి; యుగ్యంబులును = గుఱ్ఱములును; తలలు; తునిసిన = తునిగిన; సారథులునున్ = తేరులను నడపువారును; కడిఖండంబులైన = ముక్కలైన; కోదండంబులునున్ +కలిఁగి = పెద్ద విండ్లు ఉండుటచే; రథులతోన్ = తేరిపై నున్న వీరులతో; పలుగాఁడిపై = మధ్యనున్న మ్రానిపై (ఎక్కి); చిరాణంబులన్ = (ఆయుధ విశేషము) ఉలివంటి వాఁడియైన సాధనములతో (చీరణము రూపాం); పారి = ప్రాఁకి; సమరి = పోరాడి; సరిన్+పడిన = మ్రాను యొక్క సందులలో పడిపోయిన(సరి, సరియ శ.ర); ఆశ్వికులును = గుఱ్ఱపు రౌతులును;

తా: మరణదేవత చెలరేఁగి సిద్ధము చేసినట్లు కొండలైన కండలుగానున్న మాంసపు ముద్దలతో బురద ఏర్పడి అందుగల రక్తము గడ్డ కట్టినది. ఏనుఁగులు ఆచోట్ల గట్టిచోటని తలంచి కాళ్లను పెట్టఁగా అవి ఆ అడుసులో దిగఁబడి ఏ వైపును వానిని అవి కదల్చలేకపోయినవి. అపుడు కలఁత చెందక, ఏనుఁగులు ముందుకు పోవంజేయుటకు తమ భుజబలమును చూపు ఏనుఁగుల పై నున్న వీరులును.

వేగముగా పోవుచున్న తేరుల యొక్క నిడుపాటి మ్రాని (నొగ) కడపటి భాగము తాఁకుటచే గుఱ్ఱపు తలలు పగిలినవి. అవి కూలిపోవక ముందే, బిగువుతో దుమికి కత్తులను విసరగా వాలిపోయిన గుఱ్ఱముల్కు తలలు తెగిన సారథులును, పెద్ద విండ్లు ముక్కలు కాఁగా తేరిపై నున్న వీరులతో తలపడుటకు చిరాణంబులతో (ఉలివంటి చేతి సాధనములు) తేరి మానిపై ఎక్కి ప్రాఁకి పోరాడి మ్రాని సందులలో నుండి క్రిందికి నేలపై పడిన గుఱ్ఱపు రౌతులును.

5. ప్రతి: పలకల వారిపైన్ = డాలు ధరించిన కాల్బంటులపై; పుయిలోడక = వెనుదీయక;

పురికొల్పిన = మార్కొనుటకు, పోవునట్లు చేసిన; కరిఘటలకు = ఏనుఁగుల దండునకు; అడ్డంబు + చొచ్చి; మచ్చరికంబునన్ = పట్టుదలతో; పచ్చడికి నఱకినట్లు; కొమ్ములు విఱిచియున్ = దంతములను విఱుఁగఁ గొట్టియు; ఎమ్ములు = ఎముకలను; త్రుమ్ములు చేసియు = పొడి చేసియును; శుండాదండంబులు = కొయ్యలవంటి ఏనుగుల తొండములను; చిదిమియున్ = తుంచియు; కుంభంబులన్ = చెక్కిళ్లను; పగులన్ + ఏసియు = పగులఁ గొట్టియు; ప్రక్కలు = శరీరపు ప్రక్కభాగములను; చెక్కలు + పాపియున్ = చెక్కలు చెక్కలుగా వేఱు చేసియు; పెక్కు విధంబులన్; చిక్కు + పఱచు = బాధించు; పంతగాఱును = పంతముతో పోరాడు వీరులును.

తా: డాలు ధరించిన యోధులు తమపై వచ్చిన ఏనుఁగుల గుంపులను, జంకక ఎదుర్కొని దంతములను, ఎముకలను తుక్కులుగా చేసిరి. తొండములను విఱుగఁగొట్టిరి. ప్రక్కలను చెక్కలుగా చీల్చిరి. ఇట్లు పంతగాండ్రు తీవ్రముగా పోరాడిరి.

6. ప్రతి : మఱియును; గిరికొనన్ = చుట్టుకొనుటచే (హారములు);రాలిన, మణి భూషణంబులున్ = వివిధ రత్నములు గల నగలును; విద్రుపలు + ఐన = తునుకలైన; మకుటంబులునున్ = కిరీటంబులును; చిందఱ వందఱలు+ఐన = ముక్కలైన; జోళ్లునున్ = కవచములును; చిక్కుపడిన = పెనఁగొనిన; చామరములునున్ = పెద్ద కుచ్చులు (చమరీ మృగవాలముతో తయారైనవి); ఒఱగిన= వాలిపోయిన; పడగలును = టెక్కెములును; తఱిఁగిన మస్తకంబులునున్ = తెగఁగొట్టఁబడిన తలలును; పొరలెడి అట్టలును = దొర్లుచున్న (తలలులేని) మొండెములును; తెరలెడి తిట్టలును = కొంచెము ప్రాణముతో కదలుచున్న గజాశ్వపదాతుల శరీరముల ప్రోవులును; కట్టలు కొన్న కైదువులును = మోపులుగా నున్న ఆయుధములును; తెలిసిన మొగంబులునున్ = (మూర్ఛనుండి) తేరి తెలివిని పొందిన మోములును; క్రాలన్ = ప్రకటముగా గోచరమగుచుండఁగా; కీలాల జలప్రవాహంబులన్ = రక్తమనెడి నీటి వెల్లువ యందు; తేలియాడు = తేలుచున్న; వెలి గొడుగులును = తెల్లని గొడుగులు; పుట్టల మీదన్ = ఆ తెల్ల గొడుగుల గోపురములపై; కాలు+ ఊదియున్న = కాళ్లను ఆన్చి (నిల్చియున్న; బేతాళ బాలికలు; పుండరీకంబుల మూఁగిన = తెల్లదామరలపై గుమిగూడిన; అళి కులంబు విడంబింపన్ = తుమ్మెదల మొత్తముతో తుల్యము కాఁగా; నిశిత భల్లంబులన్ = వాఁడియైన బల్లెములచే; పెల్లగిల్లి = కొట్టఁబడి (వేఱుపడి); డొల్లిన = దొర్లినట్టి; సమౌక్తిక = ముత్యములతో నిండిన గజకుంభ పాలికలు = ఏనుఁగు చెక్కిళ్లు అనెడి పాన పాత్రలు (మూకుళ్లు); కరంబులన్ = చేతులయందు; పూనిన = పట్టుకొన్న; డాకినులు = ఆ పేరుగల పిశాచ కాంతలు; సురనారీ వీరస్వయంవర సమయంబునన్ = దేవలోకపు వనితలు యుద్ధమందు మరణించి, స్వర్గమునకు ఏతెంచు వీరులను తామే వరించు శుభ సమయమందు;

సకుంకుమ+అక్షత వ్రాత పాత్ర హస్తులై = కుంకుమ అక్షతలు వాని మొత్తముతో కూడిన కలశములను చేత కలవారై;సువ్రతంబు = చేయఁబోవు చక్కని పవిత్రమైన నోమును గుఱించి చెప్పవచ్చిన; సతులన్ = ఉత్తమ వనితలను, తలపింపన్ = గుర్తు చేయఁగా;

తా: అపుడు యుద్ధ రంగమందు; వీరులు ధరించిన ఆభరణములనుండి రత్నములు పెక్కురాలినవి. వారి కిరీటములు, కవచములు ముక్కలై కాన్పించినవి. చామరములు, పతాకములు, తెగిన తలలు, పొరలుచున్న మొండెములు. కొంచెము ప్రాణముతో కొట్టుకొనుచున్న ఏనుఁగులు, గుఱ్ఱములు, వీరభటులు, అన్నియును పోగులైనవి. ఇవికాక, నేలపై ఆయుధములు, రథచక్రములు, నలిఁగిన అవయవములు, తెలివితోనున్న మోములు, కన్పట్టినవి. ఈ దృశ్యమిట్లుండఁగా, ఎఱ్ఱని రక్తమనెడి జలప్రవాహమందు, తెల్లని గొడుఁగుల యొక్క గోపురములపై విలాసముగా నిలబడిన బేతాళబాలికలు పెద్ద తెల్లదామర పూలయందు ముసురుకొన్న నల్లని తుమ్మెదమొత్తమును పోలిరి. మఱియును వాఁడియైన బల్లెములచే కొట్టబఁడి వేఱుపడి దొర్లినట్టి ముత్యములతో నలంకరించిన ఏనుఁగు చెక్కిళ్ళు అనెడి పానపాత్రలను చేతులయందు ధరించిన డాకినులు (పిశాచకాంతలు), దేవకాంతలు యుద్ధమందు మరణించి, స్వర్గమున కేతెంచుచున్న వీరులను స్వయముగా వరించు శుభలగ్నమందు, కుంకుమ అక్షతలు గలిఁగిన పాత్రలను చేతులయందు ధరించి చేయఁబోవు పవిత్ర మైన నోమును గుఱించి, చెప్పుటకు వచ్చిన పతివ్రతలను స్మరణకు తెచ్చుచుండిరి.

7.ప్రతి: ప్రహార మూర్ఛా పరవశులు+అగు = ఆయుధముల పోట్లచే ఒడలు మఱచిన వారైన; వీరుల; బొండుగలు = కంఠనాళములను; వ్రచ్చి = చీల్చి; పెఱికి తిగిచినన్ = లాఁగి వెలుపలికి పీకినను; ప్రేగులు రాకున్నన్ = ప్రేగులు బయట పడకపోవుటచే; ముక్కులన్ ఊఁది = ముక్కులచే అదిమి; పట్టి వెనుకకు నిక్కి = వాలి; ఱెక్కలు; విద్రుచు = విసరుచు (కదల్చుచున్న); కంక గృధ్రంబుల చేతన్ = బారువల (పెద్ద కొంగలు) గద్దల వలన; చలిగాలి పొడమినన్ = చల్లని గాలి సోకుటచేత; తెలిసి = (మూర్ఛనుండి) తెలివిని పొంది; సచేతనంబులు+అగు = ప్రాణములు మిగిలియున్న; కళేబరంబులునున్ = శరీరములను; కలిఁగి; మఱియున్ +ఒండొరుల మెచ్చక = ఒకరికంటె మఱియొకరు గొప్ప శూరుఁడను తలంపుతో ఎదిరి శౌర్యమును తెగడుచు; ఈసునన్ = పోటీ పడుచు కోపముతో; వ్రేసిన = ప్రయోగించిన; అసిధారలు = ఒకదానితో మఱొకటి తీవ్రముగా తాఁకుటచే లేఁచిన నిప్పురవలు గల అంచులు; మండన్ = ప్రకాశింపఁగా; గండు మిగిలి = శౌర్య మధికమై; మెదడునన్ = మాంసపుముద్ద యందు; బ్రుంగి = మునిఁగిపోయి; మజ్జంబులు = ఎముకలలోఁగల క్రొవ్వు

(వేడెక్కిన మాంసము వలన, క్రొవ్వు - ద్రవమైనది); తలమునుకలుగా = తలలపైకి వచ్చి, అంతటను నిండఁగా; సందడిన్ = ఆ కలఁతచే; తడఁబడకుండ = తొట్రుపాటు చెందక; ముందల పట్లు = తలయొక్క ముందున్న భాగములను; పట్టికొని పోరాడువారును; మొన కయిదువులపయిన్ = మొనదేఱిన కత్తులు ఈఁటెలు మొదలగువాని మీఁదికి; తఱియన్ + ఉఱికి = దగ్గఱ చేరుటకు పైకొని (దూఁకి); సరకు+ చేయక = లెక్కచేయక; వీపునన్; చెన్ను+కలువ రేకులు వెడలినయట్లు; వెడలన్ = ఆ ఆయుధముల మొనలు, వెలిపలికి రాఁగా; కెడయు వారును = చచ్చు వారును; వీరు వారు + అనక ఎట్టివారితో యుద్ధము చేయుచున్నామో అని ఆలోచన చేయక; వీర + ఆవేశంబునన్ = పౌరుషముతో కూడిన ఉద్రేకముతో; చేతుల, కసి + పోవన్ = చేతులలోఁగల, శక్తినంతటిని వినియోగించి; చెలరేఁగి = ఉత్సాహముతో పొంగి; సింహనాదములు +చేయుచున్ = వీరాలాపములు (గర్జనలు) చేయుచు; మోదు వారునున్ = శత్రువుల గట్టిగా కొట్టువారును; తిరుగుడు+ పడక = మరలక; తివియక = వెనుదీయక; బీరంబు+చెడక = పౌరుషము నశింపక బీఱుపోక = బలమును కోల్పోవక; ఒడ్డగిల ఒదుగక = ఒకప్రక్కకు వాలి పోక; వేసఱక = విసుగు చెందక; విఱుఁగక = మరలిపోక; విబుధలోకంబునకు = దేవతల సమూహమునకు; వెక్కసంబును = సహింప రాని తనమును (భయమును); వేడుకయునున్ = కుతూహలమును; కదురన్ = కలుఁగఁగా; అసమ = సాటిలేని (అపూర్వమైన); సమరంబు = యుద్ధము; చేయన్ = చేయు చుండఁగా; మధ్యాహ్న సమయంబు + అయ్యెన్; ఆ + అవసరంబునన్ = అప్పుడు.

తా: ఆయుధముల వ్రేటులచే మూర్ఛను పొందిన వీరుల కంఠములను, బారువలు గ్రద్దలు చీల్చినవి. వారి శరీరములనుండి ప్రేవులు వెలువడుటచే ముక్కులచే వారిని అదిమి పట్టుకొని పైకి క్రిందికి లేచుచు రెక్కలను విసరు చుండగా అప్పుడు ఆ రెక్కల వలన చల్లని గాలిసోకుటచే ఆ వీరులు మూర్ఛనుండి తేఱుకొని తెలివిని పొందిరి. శూరులగుటచే ఎదిరి శౌర్యమును నిందించుచు కోపముతో కత్తులను ప్రయోగింపఁగా వాని అంచులనుండి నిప్పురవలు మెండై, మెదడు లోని మాంసపు ముద్ద కరగిపోవుటచే, తల ఎముకలలో గలక్రొవ్వు ద్రవించి తలలనుండి వెలుపలికి వచ్చి అంతటను (తలలను) ముంచి వేయఁగా తొట్రుపాటు చెందక ఆ వీరులు తలల ముందు భాగములను గట్టిగా పట్టుకొనుచు పోరాడిరి. కొందఱు మొనదేరిన ఆయుధముల మీఁదికి దుమికి, అవి కొమ్మున గ్రుచ్చుకొని వీపునుండి ఎఱ్ఱ కలువల పూల వలె వెలికి వచ్చుటచే ప్రాణములను వదలిరి. కొందఱు చేతి దురద (తీఁట) పోవునట్లు సింహగర్జనలతో పగవారిని మోదుచుండిరి. ఆ వీరులు వెనుకంజ వేయక, పౌరుషమును బలమును వీడక వాలిపోక విసుగు చెందక మరలిపోక దేవలోకపువారు అచ్చెరువు పొందునట్లు కుతూహలమును రేకెత్తించుచు

ఇట్టి యుద్ధము పూర్వము జరుగలేదను భావమును కలిగించుచు పోరాడిరి. అప్పుడు మధ్యాహ్న మయ్యెను.

విశే. ఈ వచనము చాల పెద్దది ఇందు సందడి కయ్యము, చతురంగ బలముల యుద్ధము, అనుప్రాసాలంకారముతోను, అచ్చ తెనుఁగు పదములతోను అత్యంతము చిత్రముగా నున్నది.

వ్యా. 1 చెంగలువ, చెన్ను+కలువ. సూ. సమాసంబునం బ్రాతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబుల కెల్లలోపంబు బహుళంబుగానగు. లుప్త శేషంబునకు పరుషములు పరమగునపుడు నుగాగమంబగు. సంధి, బాల - 36, 37 ద్రుతకార్యములు సంధి, బాల - 16, 17.

2. తుత్తుమురు : తుమురు+తుమురు = తుత్తుమురు. ఆమ్రేడిత సంధి (చూడు, పద్యము - 9)

3. అయ్యవసరంబున ఆ + అవసరంబున (చూడు, పద్యము 7, 15)

గీ. దనుజవైరి విచక్రుతోఁ దలపడుటయు
హలధరుఁడు హంసుఁ దాఁ కె సాత్యకి యెదిర్చె
డిభకు మార్కొని రల్ల హిడింబు నుగ్ర
సేన వసు దేవ నృపతు లుత్సేక మెసఁగ. 230

తా: రాక్షసులకు పగవాఁడు, కృష్ణుఁడు విచక్రునితోను, (నాగేఁటిని ధరించిన) బలరాముఁడు హంసునితోను, సాత్యకి డిభకునితోను ఆ యాదవ సేనలో పెద్దవారైన ఉగ్రసేన వసుదేవులు, ఉత్సాహ మతిశయింపఁగా హిడింబునితోను కయ్యము చేసిరి.

(శ్రీకృష్ణ విచక్రులకు ధనుర్యుద్ధము, బలరామ హంసులకు గదాయుద్ధము, సాత్యకి డిభకులకు ధనుర్యుద్ధము, ఖడ్గయుద్ధము (రెండును) బలరామ హిడింబులకు ముష్టియుద్ధము జరిగినవి.)

మ. మఱియుం దక్కిన వారుఁ దక్కిన రిపుల్ మార్కొన్నచో శౌరి ద
గ్గఱి బాణంబులు మూడుడెబ్బదులు పైఁ గప్ప న్విచక్రుండు న
త్తఱి సేసెం దెగనిండ నారసమునన్ దైత్యారి వక్షంబునం
గఱి దోఁపన్ హరియున్ భుగుల్భుగులుగాఁ గ్రక్కె న్వెసన్ నెత్తురుల్. 231

అర్థ: రిపుల్ = పగవాఱు; డగ్గఱి = దగ్గఱకు చేరి; ఆ+తఱి = అప్పుడు; తెగనిండన్ = (ఎక్కు పెట్టిన అల్లెత్రాడు శ.ర) నారిని పూర్తిగా వెనుకకులాగి; నారసమును = ఉక్కుతో చేసిన బాణమును; గఱి = బాణము యొక్క, వెనుక భాగమందున్ని నల్లని రెక్క; వెసన్ = వెంటనే; నెత్తురుల్ = రక్తము.

తా: మఱియును ఇతరయాదవులు హంసుని సైన్యములోని వారిని ఎదుర్కొనిరి. కృష్ణుఁడు విచక్రుని సమీపించి అతనిపై డెబ్బదిమూడు బాణములను ప్రయోగించెను. దానికి మాఱుగా విచక్రుఁడు అల్లెత్రాటిని బాగుగా వెనుకకు లాఁగి ఒక ఉక్కు బాణమును వేయఁగా అది కృష్ణుని ఱొమ్మునందు, బాణము చివఱనుండు రెక్కల వఱకు లోపలికి చొచ్చినది. ఆ కారణముగా భుగుల్ భుగుల్ అను ధ్వనితో కృష్ణుఁడు వెంటనే రక్తమును వమనము చేసికొనెను.

(అర్థాంతరము) కఱి = చీఁకట్లు;తోఁపన్ = క్రమ్ముకొనట్లు.

కం. పదునాలుగు జగములుఁ దన
యుదరంబునఁ దాల్చి విష్ణుఁ*డుత్పాదకుఁ డై
తుది నుమియు నాఁ టి చందము
మదిఁ దలఁచె మహేంద్రుఁ డపుడు మాధవుని దెసన్. 232

అర్థ : ఉత్పాదకుఁడై = పుట్టించు వాఁడై. పాఠాం. ఉత్పాతకుఁడై = పైకి ఎగఁద్రోయువాఁడు. ఉమియు = క్రక్కు.

తా: 1. భూ 2. భువ 3 సువ 4. మహ 5. జన 6. తప 7. సత్యలోకము అను ఊర్ధ్వలోకములను, 8. అతల 9. వితల 10. సుతల 11. రసాతల 12. మహాతల 13. తలాతల 14. పాతాళము అను అధోలోకములను, తన గర్భమందు ధరించిన మహా విష్ణువు జగత్ సృష్టి చేయఁదలచి తన నోటి నుండి సర్వమును క్రక్కు విధమును ఆ మహేంద్రుఁడు,ఆకృష్ణుఁడు రక్తమును వమనము కావించు చుండఁగా,స్మరించెను.

విశే. అలం: ఉత్ప్రేక్ష జగత్తంతయు నశించినను సర్వము సూక్ష్మరూపమున నిలిచియుండును. పరమాత్మ సృష్టికి కారకుఁడు, పదునాలుగు జగములను ఏలువాఁడని ధ్వని. మహేంద్రుఁడు సృష్ట్యాదిని చూచు వాఁడనియు స్ఫురించుచున్నది.

చం. హరి నిశిత క్షురప్రమున నాతని టెక్కెము గూల్చి సారథిం
బొరిగొని మూ డుతూపుల నపూర్వగతిన్ హరుల న్వధించి భీ

---

* డుత్పాతకుఁడై

కరతర పాంచజన్యరవగర్వము చూపినఁ దేరు డిగ్గి వాఁ
డరిది గదం గదల్చె దనుజారి కిరీటము దల్లలాటమున్. 233

అర్థ: క్షురప్రము = అర్ధ చంద్రబాణము; అపూర్వగతిన్ = వింతగా; హరుల్ = గుఱ్ఱములను; రవగర్వము = ధ్వనియొక్క అతిశయమును; తత్+లలాటమున్ = ఆతని నొసటిని; అరిది = సహించుటకు వీలుకానిది.

తా: హరి, వాఁడియైన అర్ధ చంద్రబాణముచే విచక్రుని టెక్కెమును త్రుంచి సారథిని చంపి అద్భుతముగా మూ డింటిచే అశ్వములను మట్టుపెట్టి, అతి భయంకరమైన పాంచజన్య శంఖ ధ్వనియొక్క అతిశయమును చూపఁగా, విచక్రుఁడు రథమునుండి దిగి కృష్ణుని కిరీటమును నొసటిని దుస్సహముగా తన గదతో మోదెను.

వ్యా. తత్ + లలాటము, లత్వసంధి.

గీ. చేరి యటు వ్రేసి దనుజుండు సింహనాద
చటులవదనుఁ డై దొడ్డ పాషాణ మొకటి
శతగుణము ద్రిప్పి శౌరి వక్షంబు చూచి
వైచె నది పట్టుకొని వాని వైచె విభుఁడు. 234

తా: ఆ విధముగా గదతో హరి కిరీటమును మోది, అతనిని సమీపించి విచక్రుఁడు సింహనాద వికాసముతో గూడిన ముఖము (నోరు) కలవాఁడై, పెద్ద బండను తీసికొని నూఱు పర్యాయములు, దానిని గిరగిర త్రిప్పి, గుఱిచూచి అతని ఱొమ్ముపై వేసెను. కృష్ణుఁడు దానిని పట్టుకొని, దానినే (ఆ బండనే) అతనిపై విసరెను.

కం. వాటునన మూర్ఛ *వోయెం
బోటరిదైత్యుండు దెలిసి బొమముడి గినుకం
జాటఁ గరఘటిత పటు పరి
ఘాటోపము చూపి శౌరి కతఁ డిట్లనియెన్. 235

అర్థ: వాటునన = ఆ వ్రేటుచే; మూర్ఛ+పోయెన్; పోటరి = శూరుఁడు; కరఘటిత = చేతియందున్న; పరిఘ+ఆటోపము = బలిష్ఠమైన గుదియ యొక్క అతిశయము (విజృంభణము). (వోయిన్ వోయియున్ - అవ్యయము శబ్ద, ప్రౌఢ - 116)

* వోయిం

తా: ఆ పెద్ద బండయొక్క దెబ్బచే, విచక్రుఁడు మూర్ఛపోయెను. శూరుఁడైన ఆ అసురుఁడు, తెలివిని పొంది, కనుబొమల ముడులు, కోపమును ప్రకటించు చుండఁగా గొప్పదైన గుదియను చేతపట్టుకొని దాని గొప్ప తనమును చూపి, హరికి ఇట్లు పలికెను.

ఉ. "ఈపరిఘంబు తాఁకునకు నెంతటివాఁడవు నీవు పోరిలోఁ
బ్రా పయి వచ్చి దేవతల పాల మదీయ భుజాబలంబు నే
మీ పొడగానవే కొఁలుక మెత్తనొకో చెడిపోయె దేల నీ
పాపమ్మ,నాఁటినీవ కద బాహులచేవయు నాఁటిదే కదా." 236

ప్రతి: ఈ పరిఘంబు = ఈ గుదియ యొక్క; తాఁకునన్ = దెబ్బకు; ఎంతటి వాఁడవునీవు? = (ఓర్చుకొనుటకు) నీశక్తియెంత? పోరిలోన్; దేవతలపాల = దేవతల పక్షమున; ప్రాపు + అయి = రక్షకుఁడవై; వచ్చి; మదీయ భుజాబలమున్; పొడగానవే ఏమీ = (పూర్వము దేవాసురుల యుద్ధములో) చూడలేదా ఏమీ? (చూచియే ఉన్నావు); కొఁలుక మెత్తనొకొ = కొఁలుకుటకు మెత్తనిదా? (నా బాహు బలమును సహించుటకు సులభమా?); చెడిపోయెదు+ఏల? = ఎందులకు నాశమయ్యెదవు? నీ పాపము = నీవు చేసిన పాపమే, నీవు చెడుటకు కారణము. అయ్యో!; నాఁటి నీవే కద = ఆ నాఁటి వాఁడవేనీవు (నన్నెఱిఁగిన వాఁడ వనుట); బాహుల చేవయు = నీ భుజశక్తియు; నాఁటిదే కదా! = ఆ నాఁటిదే, పాఁతదే!.

తా: నా బలిష్ఠమైన గుదియ దెబ్బలను సహింపలేవు. యుద్ధమందు, దేవతలకు సాయమై వచ్చి నా భుజ సారమును కనియున్నావు. నన్నెదిరించుట సులభమా? ఎందులకు చెడెదవు? అయ్యో! నీవు నాశమగుటకు కారణము నీవు కావించినపాపమే! నీ భుజ బలమంతయు పాఁతదే!

(ఏల నాతో పోరు అని హెచ్చరిక).

అలం: కావ్యలింగము చెడిపోవుటకు కారణము చెప్పఁబడినది.

వ్యా. చెడిపోయెదు, చెడిపోయెదవు, భూతకాలిక క్రియలో వకారలోపము (చూ. పద్యము - 50).

కం. అనుచుం బరిఘము వైచిన
దనుజాంతకుఁ డొడిసి పట్టి తనఘన హేతిం
దునుకలుగ నఱికి నీపాం
గిన పుడిసెఁడుఁ బోయె ననుచు గేలి యొనర్చెన్. 237

అర్థ : ఒడిసిపట్టి = పైకి ఎగిరి పట్టుకొని; ఘన హేతిన్ = దృఢమైన కత్తితో; నీ పొంగిన పుడిసెఁడు = నీ యొక్క అతిశయించిన చేరెడు (సగము శౌర్యము); పోయెన్ = నశించెను.

తా: అట్లు వచించుచు విచక్రుఁడు గుదియను శక్తి కొలది వేయఁగా రాక్షస సంహారి హరి, దానిని పైకెగిరి పట్టుకొని తన గట్టి కత్తితో ముక్కలు ముక్కలుగా చీల్చి 'నీ యొక్క అతిశయించిన శౌర్యము పిడికెడు (సగము) నశించినది కదా!' అని ఆతని హేళన చేసెను.

విశే. గర్వాంధుఁడై విచక్రుఁడు, "నీ శక్తి పాఁతదే గదా" అని ఆక్షేపణ చేయఁగా, హరి దానికి ప్రతిగా ఆతని గుదియను ముక్కలు చేసి హేళన చేయు విధమును బట్టి త్వరలో అతఁడు హత మగునని సూచన.

వ. ఆ దనుజుండు వెండియు. 238

తా : సులభము

మ. ఘనశాఖం బగు వృక్షముం బెఱికి యాకంసారిపై వైచినన్
వనజాక్షుండు గరాసిధార నది ద్రెవ్వన్ వైచి చేపట్టి త
క్కిన శస్త్రంబుల నొంచి కొంతవడి కాగ్నే యాస్త్రముం బూన్చి త
ద్దనుజుం గాల్చి మరల్చె నంతఁ గదిసెం దద్బాణముం దూణమున్. 239

తా: (విచక్రుఁడు) పెద్ద కొమ్మలు గల చెట్టును ఒక దానిని పెళ్లగించి, ఆ కంసువి విరోధియగు కృష్ణునిపై విసరి వేయఁగా, ఆ కమలమువంటి కన్నులు గలవాఁడు, చేతిలో నున్న కత్తి యొక్క వాఁడియైన వాదరచే (అంచు) ఆ చెట్టును తెగఁగొట్టి ఆ కత్తినే చేతపూని, విచక్రుని ఆయుధముల నన్నింటిని పాడు చేసి కొంతసేపటికి, అగ్ని దేవతకు చెందిన బాణమును అభిమంత్రించి (ఆగ్నేయాస్త్రమును) అతనిపై ప్రయోగించి ఆరక్కసుని దహింపఁజేసి దానిని తన కడకు వచ్చునట్లు మరల్చెను. తర్వాత, అది తన పాదిని (తూణమున్) చేరెను.

గీ. ఉన్న దైతేయు లందఱుఁ గన్నవారు
గన్న దిక్కులఁ బోయి సాగరములోన
నడఁగి రటు నీళ్ళలోని ముల్లైరి గాని
నేఁడు దుదిగా ధరిత్రికి నెగయ లేరు. 240

తా: విచక్రుఁడు ఆగ్నేయాస్త్రముచే దహింపఁబడఁగా అచట ఉన్న రాక్షసులు అందఱు అతని చావును చూచినవారు, ఎత్తు పల్లములను చూడక, ఇష్టము వచ్చినట్లు తమ ప్రాణములను కాపాడుకొనుటకు ఆవేఁడిమిని సహింపలేక, సముద్రములో దూఁకి అడఁగిపోయిరి. ఆ విధముగా నీటిలో నుండి బాధించు ముండ్లైరి కాని నేఁటి వఱకు నీటి నుండి పుడమిపైకి ఎగసి రాలేకపోయిరి.

వ. అంత నిక్కడ. 241

తా : తర్వాత ఇంకొక చోట.

చం. హలధరుఁ డేసె హంసుఁ బదియమ్ములు నైదిట నేసె హంసుఁ డా
హలధరు నాతఁ డాశరము లైదిట నైదిట నాఁగి రేఁగి మొ
క్కలమున నారసం బొకటి గాఁడఁగ వాని లలాట మేయుడున్
సొలసి యతండు తేరిపయి సొమ్మలు వోయె నచేతనస్థితిన్. 242

అర్థ:హలధరుఁడు = బలరాముఁడు; సొమ్మలు + పోయె = మూర్ఛచెందెను; అచేతన స్థితిన్ = తెలివి తప్పిన వాఁడై.

తా: బలరాముఁడు హంసునిపై పది అమ్ములను వేసెను. హంసుఁడు ఆతనిపై ఐదింటిని ప్రయోగించెను. ఆ అయిదింటిని అయిదు బాణములతో ఆఁపి హలధరుఁడు, ఉప్పొంగి ఉత్సాహముతో ఉక్కు బాణమును హంసుని నొసటిలో నాటుకొనునట్లు వేయఁగా అతఁడు తేరు మీఁద తెలివి తప్పి మూర్ఛపోయెను.

వ్యా. ఐదిటన్ = ఐదిటితో, తృతీయావిభక్తి ప్రత్యయమునకు అత్వాదేశము.

చం. తడవుగ నుండి తేఱి బలితంపు శరం బరిఁ బోసి యేసి బె
ట్టడరెడు సింహనాదమున హంసుఁడు గ్రాలఁగ నేఁటుగంటి *ను
గ్గడు వగు నెత్తుటన్ సుడిసి క్రక్కొఁడు నెత్తుటఁ గుంకుమ చ్ఛవిం
బడిసి హలాయుధుండు కనుపట్టెడు కింక నహంకరించుచున్. 243

ప్రతి: హంసుఁడు; తడవుగన్+ఉండి = చాల సేపు మూర్ఛలో నున్నవాఁడై; తేఱి = తేఱుకొని, తెప్పరిల్లి (తెలివిని పొంది); బలితము+శరంబు+అరిన్+పోసి = దృఢమైన బాణమును అల్లెత్రాటిలో సంధించి; ఏసి; బెట్టు+అడరెడు = మిగుల అతిశయించు; సింహనాదమునన్ =

* యుం, గడువఁగ

సింహగర్జనలతో; క్రాలఁగా = ప్రవర్తింపఁగా ఏటు గంటిన్ = దెబ్బతగిలిన గాయము నుండి; ఉగ్గడువు+అగు = అధికమైన (శర); నెత్తుటన్= రక్తముచే; సుడిసి = చుట్టఁబడి (మునిఁగినవాఁడై); క్రక్కెడు నెత్తుటన్= వమనము చేసికొనుచున్న రక్తముచే; కుంకుమ +ఛవిన్= కుంకుమ పువ్వు వంటి కాంతిని (ఎఱ్ఱఁదనమును); పడిసి = పొందిన వాఁడై; హలాయుధుఁడు బలరాముఁడు;కనుపట్టెడు కింకన్ = బాగుగా కన్పట్టు కోపముతో; అహంకరించుచున్ = పొగరుతో;

తా: హంసుఁడు చాల సేపటికి మూర్ఛనుండి తెలివిని పొందెను. పిమ్మట బలమైన పెద్ద బాణమును నారిలో సంధించి బలరాముని పై వేసి సింహనాదము చేసెను. ఆ బాణము వలన కలిఁగిన గాయము నుండి రక్తము స్రవించి శరీరమంతటిని ముంచెను. మఱియు నోటినుండి రక్తమును క్రక్కుచు బలరాముఁడు కుంకుమ పువ్వు వంటి వర్ణమును పొంది కోపమును చూపుచు పొగరెక్కినవాఁడై (తరువాతి పద్యముతో).

వ్యా. 1. బలితంపు శరంబు : పుంప్వాదేశసంధి. చూ. వచనము - 26.

2. నెత్తుటన్ 'నెత్తురు'+చే, "నెత్తుటన్" అగును. "నెత్తురు" శబ్దమున గల ఉత్వమునకు ఇత్వము రాదు. సూ. ఆచ్ఛిక బాల - 38. ఆచ్ఛిక బాల - 36 సూత్ర వివరణ. కనుక నెత్తుటన్ సాధురూపము. "రెండు, ఐదు" మొదలగు వానిలో 'రెండిటన్', 'ఐదిటన్' అని ఇత్వము గల రూపములు ఏర్పడును.

3. కుంకుమచ్ఛవి : కుంకు+ఛవి. తుగాగమ శ్చుత్వసంధులు చూ. పద్యము - 224.

పాఠాం. యుం. గడువఁగ

ఉ. పూచిన కింశుకం బనఁగఁ బుత్తడి లత్తుకబొమ్మ వోలె నా
రాచము లేడు వేలొక పరంపరగాఁ బరఁగించి పైపయిం
ద్రోచినఁ దేరుఁ గార్ముకముఁ దూణముఁ గేతనమున్ మునింగి దుః
ఖాచిత దేహుఁడై కడఁగి హంసుఁడు గన్నుల నిప్పు లొల్కఁగన్. 244

ప్రతి: పూచిన కింశుకంబు + అవఁగన్ = పూవులు పూచిన మోదుగు చెట్టా అనువట్లు;పుత్తడి లత్తుక బొమ్మ+పోలెన్ = ఎఱ్ఱనైన లత్తుక చాయగల అపరంజి ప్రతిమ వలె; నారాచములు = ఉక్కుబాణములు; ఏడువేలు; ఒక పరంపరగా = ఒకే వరుసగా; పరఁగించి = ప్రయోగించి; పైపయిన్=హంసుని మీఁదికి; త్రోచినన్=వేయఁగా; తేరున్; కార్ముకమున్= వింటిని;తూణమున్ = అమ్ములపొదిని; కేతనమున్ = టెక్కెమును; మునింగి = (ఆబాణముల జడిలో)

మునిఁగిపోవుటచే; దుఃఖ+ఆచితదేహుఁడై = బాధ చెందిన శరీరము కలవాఁడై;కడఁగి = ప్రయత్నించి; హంసుఁడు; కన్నులన్ = కన్నులలో; నిప్పులు + ఒల్కఁగన్ = నిప్పు రవ్వలు, వెల్వడు చుండఁగా (కన్నులు ఎఱ్ఱనివికాఁగా).

తా: పూవులు పూచిన మోదుగు చెట్టేమో అనునట్లు లక్కకెంపు చాయ గల అపరంజి బొమ్మ వలె కన్పట్టుచు, బలరాముఁడు హంసుని పై ఏడువేల ఉక్కు బాణములను ఒకే వరుసగా ప్రవహింపఁజేసెను. అవి అన్నియు ఆతని రథమును, వింటిని అమ్ములపొదిని టెక్కెమును కప్పి వేసినవి. అప్పుడు హంసుఁడు బాధ చెందిన శరీరము కల వాఁడయ్యెను, ప్రయత్నించి కన్నులలో నిప్పురవ్వలు వెల్వడు చుండఁగా (మీఁది పద్యముతో).

అలం: 1. ఉత్ప్రేక్ష:'పూచిన కింశుకం బనఁగ'.

2. ఉపమ: 'పుత్తడి లత్తుక బొమ్మ వోలె'.

జాతీయము : 'కన్నుల నిప్పు లొల్కఁగన్'.

గీ. ఒకశరంబున బలభద్రు నుచ్చి పోవ
నొకటఁ బడగ ద్రెళ్ళంగ వే ఱొకట సూతు
నాస దిగఁగా రయంబున నేసి యేసె
నోలి నాలుగు గుఱ్ఱాలు నేలఁ గూల. 245

అర్థ : ఉచ్చిపోవన్ = దూఱివెలుపలికి వచ్చునట్లు;త్రెళ్ళంగన్ = పడునట్లు; ఆస దిగఁగాన్ = ఆశ తొలఁగునట్లు.

తా: హంసుఁడు (అతిశయించిన కోపముతో) ఒక బాణమును బలరాముని శరీరములో దూఱునట్లు, మఱొకటి టెక్కెము పడునట్లు,ఇంకొకటి సూతుఁడు తన ప్రాణముపై ఆశవదలు కొనునట్లు ప్రయోగించి పిమ్మట వరుసగా నాలుగు గుఱ్ఱాలను వేగముతో నేల కూలఁజేసెను.

కం. ఒదవిన కినుకం గొదగొని
గద గొని హలధరుఁడు రథము కండ్లను నొగలుం
జదిపి పతాకయు సారథి
విదారణము చేసి మిన్ను వ్రీలఁగ నార్చెన్. 246

అర్థ: ఒదవిన = కలిఁగిన; గొదగొని = త్వరపడి; రథము కండ్లను = రథము యొక్కచక్రములను కల్లు (ఏక) - కండ్లు (బహు); నొగలున్ = రథమధ్యభాగమున అమర్చిన నిడుపాటి పెద్ద కొయ్య (రూపాం. నొగ) చదిపి = విఱుఁగఁగొట్టి; విదారణము చేసి = నాశము చేసి; వ్రీలఁగన్ = పగులునట్లు; ఆర్చెను = సింహనాదము చేసెను.

తా: కోపము కలుఁగఁగా చెలరేఁగి గదను చేతికి తీసికొని - బలరాముఁడు రథచక్రములను నొగను, విఱుఁగఁగొట్టెను. తర్వాత టెక్కెములను సారథిని కూల్చి, ఆకసము పగులునట్లు సింహనాదము చేసెను.

ఉ. అంతటఁ బోక సూతు నదరంటఁగ వ్రేయ రథంబు డిగ్గి వాఁ
డంతక దండ సన్నిభ గదాతి భయంకర బాహుఁడై పరి
భ్రాంతి యొనర్చె నిద్దఱు నపార పరాక్రమకేళిఁ దేలి రం
తంతకు నంతరంగము లహంకరణంబునఁ గొంత వింతగన్. 247

ప్రతి: (బలరాముఁడు) అంతటన్ = అంతటితో; పోక = ఊరుకొనక (గద వ్రేటుతో చాలింపక); సూతున్ = సూతుని; ఆదరు +అంటఁగన్ = ఆయువు పట్టు తగులునట్లు (పాఠా.సూటి = సూటిగా, గుఱిచూచి; నడుము+అంటఁగన్ = నడుమును తాఁకునట్లు); వ్రేయన్ = (గదను) వేయఁగా; రథంబు; డిగ్గి = దిగి;వాఁడు = అతఁడు (హంసుఁడు); అంతక దండ = యముని కాల దండముతో; సన్నిభ = సాటియైన; గదా + అతిభయంకర బాహుఁడై = గదచే మిక్కిలి భయముమ కలిగించు బాహువుల విన్యాసము కలవాఁడై; పరిభ్రాంతి+ఒనర్చెన్ =(గదను) బాగుగా గిరగిర త్రిప్పెను; ఇద్దఱున్ = బలరామహంసులు; అపార పరాక్రమ కేళిన్ = అంతులేని శౌర్య విలాసములను ప్రకటించు క్రీడయందు; అంతకు+అంతకున్ = క్రమక్రమముగా; అంతరంగములు = వారి మనస్సులు; అహంకరణంబునన్ = పొగరుఁబోతుతనముతో (గర్వాతిశయముతో) (నిండగా) కొంత వింతగగన్ = కొంచెము చిత్రముగా; తేలిరి (గదాయుద్ధమందు) = ఒడలు తెలియక ప్రవర్తించిరి.

తా: బలరాముఁడు అంతటితో ఊరుకొనక, సూతుని ఆయువు పట్టు తాఁకునట్లు గదతో కొట్టెను. ఆ కారణముచే హంసుఁడు రథమునుండి దిగి యముని కాలదండము వలెనున్న గదకొని మిక్కిలి భయమును కలిఁగించు విధమున పలుసార్లు గిర గిర త్రిప్పెను. తదుపరి ఇర్వురును, అంతులేని తమ శౌర్య విలాసములను కన్పట్టఁజేయుచు గదాయుద్ధక్రీడయందు, మనస్సులు పొగరుఁ బోతు తనముతో పరవశింపగా చిత్రముగా ఒడలు తెలియక ప్రవర్తించిరి.

విశే. బలరామ హంసులు ఆవేశముచే తమ కౌశలమును ప్రదర్శించిన విధము మీఁది వచనములో విపులముగా వర్ణింపఁబడినది.

వ. ఇట్లు గదావిహారంబున హంసహలధరులు రుధిర ధారాసారంబునం దడిసి సెడక వారింపక యోసరిలక యోలంబు గొనక పంకింపక పాదుకొనక సడలక శంకింపక సందీక సరకుగొనక వెనుకమెట్టక వేగిరపడక చఱచిపోక చాలింపక చలింపక చాయ దఱుగక గదలు సారించియు సైరించియుం జుట్టియుం బట్టియు దట్టియుఁ గదల్చియు నదల్చియుఁ దాఁకించియు సోఁకించియుం బూఁచియుం జూఁచియు మోపియుం బాపియు జడిసియు నొడిసియు నెత్తియు నొత్తియుఁ దాచియుం ద్రోచియు వివిధ విచిత్రవిహారంబులం దిరుగ హలాయుధుండు దక్షిణమండల ప్రచారంబునం బరఁగిన హంసుండు సవ్యభ్రమణంబునం గదిసె నప్పుడయ్యిరువుర దట్టనయు ధాకయు లవణియు లావునుం దెగువయుఁ దెలివియు మత్సరంబును మదంబును వెరవును వేగంబును సైరణయు సాహసంబునుం గనుంగొని సురముని గణంబులు వెక్కసంబున నిత్తెఱంగు సమరం బింతకు మున్నెన్నండునుం గాన మనిరి తద్గదాధర యుగంబు వృత్ర వాసవుల విడంబించె నట్టియెడ హంసుండు వలపలి దెసఁ జుట్టికొని వచ్చుటయు నాబలభద్రుండు డాపలివంకం దిరిగి కదియుటయుం బిడుగుం బిడు గడిచిన చందం బయ్యె నయ్యవసరంబున. 248

ప్రతి: ఇట్లు గదావిహారంబునన్ = ఈ విధముగా గదలను త్రిప్పుచుండుటచే; హంస హలధరులు; రుధిరధారా+ ఆసారంబులన్ = నెత్తుటి ధారల జడిచేత; తడిసి = తడిసిన వారై; వడిచెడక = వేగము నశింపక; వారింపక = నిలుపదలచేయక; ఓ సరిలక = తొలఁగక; ఓలంబు కొనక = మఱుగునకు పోక, పంకింపక = తడఁబడక ఆలసింపక; పాదు కొనక = నిలిచి యుండక; సడలక = బలహీనులు గాక; శంకింపక = (ఓటమిని) సందేహింపక; సందు + ఈక = అవకాశమును ఇయ్యక; సరకు కొనక = లక్ష్యము చేయక; వెనుక మెట్టక = వెనుక అడుగు పెట్టక; వేగిరపడక = త్వరపడక; చఱచిపోక = అఱచేతకొట్టి తిరిగిపోక; చాలింపక = (పోరు)

నిలుపక; చాయ తఱుఁగక = కాంతి (వన్నె) తగ్గి పోక; (ఇంతవఱకు, వ్యతిరేక క్త్వార్థక క్రియలు ఇఁక మీఁద, సముచ్చయార్థక క్త్వార్థక క్రియలు) గదలు; సారించియు = విసరియు; సైరించియున్ = (దెబ్బలను) సహించియు; చుట్టియున్ = చుట్టి వచ్చియు; పట్టియు = పట్టుకొనియు; తట్టియు = (గదతో) కొట్టియు; కదల్చియున్ = కదలించియు; అదల్చియున్ = బెదరించియు; తాఁకించియు = గదలను తాకఁజేసియు; సోఁకించియున్ = వ్రేటు తగులునట్లు చేసియు; పూఁచియున్ = పూనుకొనియు; చాఁచియు = గదపై గద నుంచి జరిపియు; మోపియున్ = గదలను నేలపై తాఁకించి నిల్పియు; పాపియు = తొలఁగించియు; జడిసియున్ = వెనుకకు మరలియు (భయముచే); ఒడిసియున్ = పైకెగిరి పట్టుకొనియు; ఎత్తియున్ = (గదలను) పైకెత్తియు; ఒత్తియున్ = అదిమియు; తాఁచియున్ = తన్నియు; త్రోచియు = ముందునకు తోసియు; వివిధ విచిత్ర విహారంబులన్ =రకరకములైన వింతలైన గదల విన్యాసములతో (త్రిప్పటలచే); తిరుగన్ = అటునిటు, తిరుగఁగా; హలాయుధుండు = బలరాముఁడు దక్షిణమండల ప్రచారంబునన్ = కుడిప్రక్క వలయాకారమగు గమనముతో; పరఁగినన్ = వర్తింపఁగా; హంసుండు; సవ్య భ్రమణంబునన్ = ఎడమ ప్రక్క తిరుగుచు; కదిసెన్ = సమీపించెను.

అప్పుడు ఆ + ఇరువుర = ఆ ఇరువురి యొక్క; దట్టనయు = అదల్పును; ఢాకయు = ఆటోపమును; లవణియు = బిగితనమును; లావునున్ = బలమును; తెగువయున్ = చొఱవయును; తెలివియు = ముఖవికాసము; మత్సరంబును = కోపమును; మదంబును = పొగరును; వెరవును = ఉపాయమును; వేగంబును = ఉరవడియు; సైరణయు = ఓర్పును; సాహసమును = భయము లేమియును; కనుంగొని = చూచినవారై; సురమునిగణంబులు = దేవతలు మునుల మొత్తములు; వెక్కసంబునన్ = సహింపలేని స్థితిలో ఆశ్చర్యము భయము కలవారై; ఈ తెఱంగు సమరము = ఇట్టి భయంకర మైన విన్యాసాత్మకమైన గదాయుద్ధమును; ఇంతకు మున్ను; ఎన్నండునున్ = ఎప్పుడును; కానము = చూడలేదు; అనిరి; తద్+గదాధర యుగంబు = ఆ గదలను ధరించిన జంట; వృత్ర వాసవుల విడంబించెన్ = వృత్రాసురుని, ఇంద్రుని పోలెను; అట్టి ఎడన్ =ఆ సమయ మందు; హంసుండు; వలపలి దెసన్ = కుడి ప్రక్క; చుట్టికొని వచ్చుటయున్; ఆ బలభద్రుండు; డాపలి వంక = ఎడమ ప్రక్క; తిరిగి; కదియుటయున్ = సమీపింపఁగా; పిడుగున్ + పిడుగు = పిడుగును, పిడుగు లేదా వజ్రాయుధమును వజ్రాయుధము; అడిచిన = కొట్టిన; చందంబు + అయ్యెను = విధమయ్యెను; ఆ+అవసరంబున = ఆ సమయమందు.

పురాణగాథ.వృత్రాసురుఁడు : ఇతఁడు బ్రహ్మను ప్రార్థించి రాత్రిగాని, పగలుగాని, జీవముండిన వానిచేగాని, జీవము లేని వానిచే గాని, స్థలమునగాని, జలమున గావి

మరణమును పొందకుండు నట్లు వరమును పొందెను. ఇంద్రుఁ డితనితో ఓడిపోయి, విష్ణుమూర్తిని శరణుజొచ్చెను. సమయము వచ్చినపుడు ఉపాయముతో అతనిని కొట్టవలయునని అంతవఱకు అతనితో చెలిమి చేయుమనియు చెప్పెను. అట్లే ఇంద్రుఁడు వృత్రునితో స్నేహముతో నుండి, ఒక నాటి సాయం కాలమున సముద్రపుటొడ్డున పోవుచుండఁగా వృత్రుని నురుగుతో కొట్టి చంపెను. ఈతని చంపినందున బ్రహ్మహత్యాపాతకము ఇంద్రునకు కలిఁగినది.

సూచన : గదాయుద్ధము అనుప్రాసాలంకారముతో అత్యంతము రమణీయమై ఒప్పారుచున్నది. అర్థములు మాత్రమే ఇయ్యఁబడినవి.

కం. డిభకుఁడు సాత్యకియుఁ బర
ప్రభావ పరిభవ విహార పారీణులు సా
ర భుజాబల విభవులు లో
క భయంకర మూర్తు లగుచుఁ గలనఁ గదిసినన్. 249

అర్థ: పరప్రభావ = తమ్మెదిరించువారి శౌర్యమును; పరిభవ విహార పారీణులు = అవమాన పఱచునట్టి క్రీడలో దిట్టలు; సారభుజంబుల విభవులు = శక్తిమంతమైన బాహువుల బలముయొక్క ఆధిక్యము (సంపద) కలవారు;

తా: డిభకుఁడును సాత్యకియును పరుల శౌర్యమును అడఁగించు యుద్ధక్రీడలో అతి సమర్థులు శక్తిమంతమైన బాహుబలయొక్క ఆధిక్యము గలవారు. చూపఱులకు భయమును కొల్పు ఆకారముతో, యుద్ధమునకు ఒకరినొకరు సమీపింపఁగా (మీఁది పద్యముతో).

సీ. సాత్యకి డిభకుపై సాయక దశకంబు
నిగిడింప నవి వాని మొగమునందుఁ
*జను మొనమీఁద వక్షంబుపై నాటిన
నతఁడు సాత్యకి నేసె నయిదువేలు
నారసంబుల వాని నడుమన తునుమాడి
శైనేయుఁ డార్చినఁ జాల నలిగి

* జనుమఱి

విశిఖసప్తక మేసి వెండియు లక్ష బా
ణంబులు వఱపిన నఱికి వైచె
గీ. వృష్ణివీరుఁడు డిభకుని విల్లు దునిమె
నర్ధచంద్రబాణంబున నతఁడు వేఱ
వింట నిశితక్షురప్రంబు వెలయఁ దొడిగి
శినివరునినోర నెత్తురు చిందఁ జేసె. 250

తా: సాత్యకి డిభకునిపై పదిబాణములు వేయఁగా అవి వాని మొగమున చను మొనలందు, ఱొమ్మున నాటుకొన్నవి.డిభకుఁడు సాత్యకిపై ఐదు వేల ఉక్కు బాణములను ప్రయోగింపఁగా సాత్యకి వానిని నడుమనే అడ్డగించి పెద్దగా అఱచెను. అపుడు డిభకుఁడు కోపముతో మొదట ఏడు బాణములను,పిదప లక్షబాణములను వేయఁగా సాత్యకి వానిని ఖండించి అర్ధచంద్రబాణముచే డిభకుని వింటిని తునియెను. ఆతఁడు వేఱొక వింటిని కొనఁగా వాఁడియైన అర్ధచంద్ర బాణమును సంధించి శైనేయుని నోటి యందు రక్తమును వెలువడఁజేసెను.

వ్యా. నోరన్ : "నోరు" శబ్దమునకు సప్తమ్యర్థమున అత్వమాదేశము. (చూడు. పద్యము 205)

పర్యాయ పదములు : సాయకము, నారసము, విశిఖము, బాణము, అమ్ము, అలుఁగు, మార్గణము, కోల శరము మొదలగునవి.

కం. ఆమని ములు *మ్రోఁదుగుతో
సోమించి మురాంతక కానుజుఁడు నెత్తురు వ
ట్టై మఱియు నఱకె డిభకుని
చేముందఱ మెఱయు విల్లు శితభల్లమునన్. 251

అర్థ: ఆమని = వసంత ఋతువు; ములు మోఁదుగు = ముళ్లుగల మోఁదుగు చెట్టు; సోమించి = సాటి అయి; వట్టై = వెల్లువయై; చే ముందఱ = చేతి ముందఱ.

తా: వసంత కాలమందు పుష్పించిన ములు మోఁదుగు చెట్టుతో సరియగుచు, ఆ కృష్ణుని తమ్ముఁడు సాత్యకి, ఒడలంతయు నెత్తురునిండి ఎఱ్ఱని వెల్లువ రూపమును పొందెను. వెంటనే వాఁడియైన బల్లెముచే, డిభకుని చేతి యందున్న వింటిని ఖండించెను.

* మోఁదుగుతో

విశే: ములుమోఁదుగు - అడవులలో పెరుగును. 'సదాప్రసూన' అనియు దీనికి పేరు కలదు. దీని ఎఱ్ఱని పువ్వులు దానిమ్మ పువ్వుల వలె నుండును. దీనికి రోహితకము కుశాల్మలి అనియు పేర్లు కలవు. ఇదిగాక, మఱొకటి మోదుగు చెటు కలదు. దానికి పలాశము అను ప్రసిద్ధనామమున్నది. ఇదియు ఎఱ్ఱని పూలను కలది. దీని కఱ్ఱలో నగ్ని కలదు. దీనిని మథించిన నిప్పు పుట్టును. యజ్ఞమునకు ప్రధానేంధనము కనుక, యాజ్ఞికమనియు దీనికి పేరున్నది.

వ్యా. విల్లు, ద్వితీయకు, ప్రథమ వచ్చినది. సూ. జడంబు ద్వితీయకు ప్రథమ బహుళంబుగా నగు కారక, బాల - 24.

అలం: ఉపమ, ఆమని ములు మోఁదుగుతో పోమించి.

చం. డిభకుఁడు వేఱ వింటఁ బ్రకటించిన బాణపరంపరన్ ధరా
విభులు గనుంగొనంగ యదువీరుఁడు గాసిలి వానిచాపమున్
రభస మెలర్పఁగాఁ బటుశరంబునఁ ద్రుంచిఁ గ్రమంబుతోడఁ ద
త్ప్రభ చెడఁ ద్రుంచెఁ జాపములు పంచశతంబు శతంబు నేకమున్. 252

అర్థ: ప్రకటించిన = ప్రయోగించిన; గాసిలి = శ్రమచెంది; ఎలర్పఁగా = అతి శయింపఁగా; తద్+ ప్రభ = అతని ప్రతాపము; పంచశతంబు, శతంబున్ +ఏకమున్ = మొత్తము ఆఱునూర్లయొకటి.

తా: తన వింటిని కోల్పోయిన డిభకుఁడు మఱొకదానిని తీసికొని, సాత్యకిపై, పెక్కుబాణముల వరుసలను ప్రయోగించెను. రాజులందఱు చూచు చుడఁగా సాత్యకి మిక్కిలి ఆయాసమును పొందిన వాఁడై, డిభకుని వింటిని అతివేగముతో బటువైన బాణముతో త్రుంచివేసి, వరుసగా ధనువులను, ఐదునూర్లను నూటిని మఱియు నొకదానిని ఆతని ప్రతాపము చిందునట్లు ధ్వంసము చేసెను.

కం. ఎత్తెడు వేగము విండులు
దత్తఱమున విఱుగ నేయు తమకము నైనన్
జిత్తములు గృపాణ రణా
యత్తములుగ నిలకు నుఱికి రా వీరవరుల్. 253

అర్థ:తత్తఱము = వేగిరపాటుతో; తమకము = ఉద్రేకము; కృపాణ రణ+ఆయత్తములుగన్ = కత్తియుద్ధమును చేయుటకు మొగ్గు చూపినవై; ఇలకు = రథమునుండి నేల మీఁదికి.

తా: డిభకుఁడు వేగముతో విండ్లను చేపట్టుచున్నను సాత్యకి వేగిరపాటుతో విఱుఁగఁగొట్టుచుండెను. ఆ ఉద్రేకము అంతటితోవారిలో ఉపశమించుటచే వారి మనస్సులు, ధనుస్సులను వీడి, కత్తియుద్ధమునకై మొగ్గు చూపుటచే ఆ వీరులు నేల మీఁదికి దూఁకిన వారైరి.

విశే. వ్యా. విల్లు+లు (బహువచన ప్రత్యయము) సూ. ఔపవిభక్తికంబుల లివర్ణ సల లు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్వబిందుపూర్వక 'డు' వర్ణంబు బహుళంబుగానగు. విండులు, ఆచ్చిక, బాల - 16.

అలం: వృత్త్యను ప్రాసము, 'త' కారద్విత్వము, ప్రాసాక్షరమై ఆ వీరుల తత్తఱమును, తమకమును చక్కగా స్ఫురింపఁజేయుచున్నది.

వ. ఇట్లు ఖడ్గహస్తు లై కదిసినప్పుడు. 254

తా: ఈ విధముగా చేతులలో కత్తులు పట్టుకొని యుద్ధమునకు ఒకరినొకరు సమీపించినప్పుడు.

ఆ.వె. సౌమదత్తి నకుల సౌభద్ర దౌశ్శాస
ని ప్రసిద్ధ ఖడ్గ నిపుణ విద్య
డిభక సాత్యకుల కడింది శౌర్యము నందుఁ
గాన వచ్చె నట్లు గదిసి వారు. 255

తా: సోమదత్తుని సుతుడైన భూరిశ్రవుని యొక్కయు, పాండవులలో నాలవ వాఁడగు నలుని యొక్కయు, సుభద్ర సుతుఁడైన అభిమన్యుని యొక్కయు, మఱియు దుశ్శాసనుని పుత్రుని యొక్కయు ఖడ్గ విద్యానైపుణ్యము డిభకసాత్యకుల కత్తిపోరులో కానవచ్చెను. ఆ విధముగా వారు ఒండొరు లెదురుగా సమీపించి (మీఁది వచనముతో)

వ. భ్రాంతంబు *విభ్రాంతంబు విద్ధం బావిద్ధంబు విప్లుతంబు విసృతం బాకరంబు వికరంబు భిన్నంబు నిర్మర్యాదం బమానుషంబు సంకుచితంబు వికుచితంబు సవ్యజానువు వామ జానువు చిత్రకం

* ఉద్భ్రాంతంబు

బాహిత(కం)జంబు క్షిప్తంబు గుడుంబంబు లంబనంబు ధృతంబు సవ్యబాహువు వినిర్బాహువు సవ్యేతరంబు వృత్తంబు త్రిబాహువు తుంగబాహువు సవ్యోన్నతంబు దాసిపృష్ఠతః ప్రసారణంబు యోధికంబు పృథితంబు నన ముప్పది రెండు ప్రచారంబులం బరిభ్రమించి నవ సేవకులునుం బోలెఁ జొరువ వేచికొని, ప్రతిగ్రహీతలుం బోలె ధార యేమఱక, జూదరులునుంబోలె దండ మఱవక, జ్యోతిషికులుం బోలె ముష్టి వదలక, గొండ్లి పరిఢవించు నట్టువులునుం బోలెఁ [2]జాళెలు చూపి, [3]యెగ్గు లాడెడు వారునుంబోలె నానపా[4]టున నిక్కి, తూర్పెత్తువారునుం బోలె విసరి, త్రాసునం దూఁచువారునుం బోలెఁ దట్టి, దారకులునుం బోలె నట్టించి, పనిఁ దిరుగు వెరవరులునుంబోలె మసల కల వడి, వసంత మాడెడువారునుం బోలెఁ జిమ్మి, శకటవ్యవహారులుం బోలె మెట్టుకొని, విరక్త విటులునుం బోలెఁ జేయీక, తనిసిన [5]గవరలునుం బోలె సరకు గొనక, నటమటపుఁ గోమటులునుంబోలె లెక్క సేయక, పాదరస మర్దకులునుం బోలెఁ జంపం దలంచి, యడిదంబులు జళిపించిన ఝణఝణ ఝుంకారంబులుం దదీయ పరస్పరఘర్షణ క్రేంకారంబులుం దమహుంకారంబులును ముప్పిరిగొనం గొప్పరించియుం గొసరియు విచ్చియుం జొచ్చియు నదలించియుం గదలించియుం బోరు నవసరంబున సురవిద్యాధర గంధర్వ దివ్యమునులు దివమ్మున నిలిచి యవ్వీరద్వయంబుం గనుం గొని వెక్కసంబున. 256

విశే : వారి ఖడ్గ విద్యావిన్యాసమును ముప్పది రెండు విధములుగా ప్రదర్శించిరి. వారి పోరు ఈక్రింది విధముగా పదునాఱు ఉపమానములతో శ్లేషాలంకారయుతముగా వర్ణింపఁబడినది.

ప్రతి 1. నవసేవకులునున్ + పోలెన్ = క్రొత్తగాచేరిన బంటులవలె; చొరువ = ప్రవేశమునకు; (రెండింటికి సమానము), వేచికొని = కాచికొని, తెలిసికొని; (పాఠాం. ఏచికొని = పెంపొందింపఁ జేసికొని (దగ్గఱకు చేరి).

2. జాళ్యాలు 3. సోగు 4. టుందక్కి 5. దఱువరులునుం

వివరణ : ఖడ్గధారి ఎదిరించువాని కత్తియొక్క కదలికను గమనించి తెలిసికొనును. సేవకుఁడు యజమాని మెప్పును పొందుటకై సరియైన సమయమును చూచి, సందర్భవశమున సముచితముగా మాటాలాడును.

2. ప్రతిగ్రహీతలున్ +పోలెన్ = దాతనుండి పారితోషికమును (దానమును) గ్రహించు జనులవలె;

ధార : కత్తిపదును,. నీటి ధార; ఏమఱక : శ్రద్ధతో గమనించి దృష్టిని మరల్చక;

వివరణ : ఖడ్గధారి, కత్తిపదును తనకు తగులకుండునట్లు దృష్టిని సారించును. దానముమ గ్రహించు వాఁడు, నీటి ధారను గమనించును. దానము ధారాపూర్వకముగా చేయు ఆచారమున్నది.

3. జూదరులునున్ + పోలెన్ = జూదమాడు వారివలె;

దండ : ఖడ్గవిన్యాసము,శిక్ష; మఱవక : మఱచిపోక,

వివరణ : ఖడ్గ ధారి 'దండ' (హారమనియు పేరు) అనెడి విన్యాసమును ప్రదర్శించును. జూదరి పట్టు వడినచో తాను అనుభవించు శిక్షానుభవమెట్టిదో, మఱచి పోఁడు.

4. జ్యోతిష్కులున్ + పోలెన్ = జోస్యులవలె; (జననకాలమును పరిశీలించి జన్మఫలమును చెప్పువారి వలె);

ముష్టి = పిడికిలి (సమానము),వదలక = వదలనివారై.

వివరణ : కత్తిని పట్టుకొనువాఁడు పిడికిలిని గట్టిగా పట్టుకొనును. జోస్యుఁడు వ్రేళ్లను మడిచి, లెక్కించునపుడు పిడికిలిని చక్కగా అమర్చుకొనును.

5. గొండ్లి పరిఢవించు నట్టువలునున్ + పోలెన్ = కుండలాకార నృత్యమును చేయు నటీ నటులవలె;

చాళెలు = ఖడ్గ విన్యాసవిశేషము, నృత్య భంగిమ; చూపి (సమానము).

6. ఎగ్గులు + ఆడెడు వారునున్ + పోలెన్ = నిందలు వేయు వారివలె;

ఆసపాటునన్ = ఆశ తొలఁగుటచే (సమానము); నిక్కి = పట్టుదలతో పరిశ్రమించి (అతిశయించి)

వివరణ : విన్యాస ప్రదర్శనలో ఆశాభంగమైన యెడల పట్టుదలతో మరల ఖడ్గధారిప్రయత్నించును. ఇతరులను నిందించు కార్యములో ఫలమల్పమైనచో, ఎగ్గులాడువాఁడు మరల అతిశయముతో పరిశ్రమించును.

7. తూర్పు+ఎత్తు వారునున్ +పోలెన్ = (గడ్డితో కలసిన ధాన్యాదులను వేఱు చేయుటకు చేటలతో వానిని పైకెత్తి తూర్పుగాలికి అనుకూలముగా నేలపై విడిచెదరు. అప్పుడు గడ్డి విడివడును). తూర్పుగాలికి గడ్డిని ధాన్యాదులను పైకెత్తి విడుచువారి వలె.

<u>విసరి</u> = ఖడ్గ ధారి కత్తిని ఇటునటు బాగుగా త్రిప్పును. తూర్పెత్తువారు చేటలను ఇటునటు బాగుగా త్రిప్పుదురు.

8.త్రాసునన్ + తూఁచు వారునున్ + పోలెన్ (సులభము) .

<u>తట్టి</u> = ఎదిరి కత్తిని నొక్కి, త్రాసు పళ్లెమును నొక్కి;

వివరణ : వస్తువులను తూకము వేయునపుడు త్రాసునకు గల పళ్లెమును నొక్కినచో బరువు నికరముగా నుండును.

9. దారకులునున్ + పోలెన్ = వడ్రంగి పనివారు వలె;

<u>నట్టించి</u> = మెలఁగి (జాగరూకతతో పోట్లు తప్పించుకొని). వడ్రంగి, సాధనములను ఉపయోగించునపుడు శ్రద్ధతో ప్రవర్తింపవలెను. కానిచో కాటునకు లోనగును.

10. పనిన్ తిరుగు వెరవరులు నున్ + పోలెన్ = పనులను చేయుటకై తిరుగు నేర్పరులవలె;

<u>మసలక</u> = ఆలస్యముచేయక (సమానము). అలవడి = వాడుకపడి;

11. (వడిన్) వసంత మాడెడు వారునున్ + పోలెన్ = వేగముతో పసుపు సున్నము కలిపిన ఎఱ్ఱని వర్ణము గలనీటిని ఒకరిపై నొకరు చల్లువారివలె;

<u>చిమ్మి</u> = ఖడ్గమును వేగముతో ప్రయోగించి, రంగునీటిని వర్షించి;

12. శకటవ్యవహారులున్ + పోలెన్ = బండి నడపు వారివలె;

<u>మెట్టుకొని</u> = నేలపై గట్టిగా నిల్చి, గట్టి చోటును ఎన్నుకొని;

13. విరక్త విటులునున్ + పోలెన్ = అనురాగములేని మిండగీండ్లవలె;

<u>చేయీక</u> = చేతిపట్టును వదలక, సాయపడక;

**14.** తనిసిన గవరులునున్ + పోలెన్ = తృప్తి చెందిన వర్తకుల వలె; (పొతాం. తఱువరి = తఱు(గుబేరకాడు)

సరకు గొనక = లక్ష్యము చేయక, సరకును కొనక;

వివరణ : తృప్తి చెందిన వర్తకులు లాభాపేక్షలేనివారై, సరకులను కొనరు. ఖడ్గధారి నిపుణు(డైనచో ఎదిరిని గణింప(డు.

**15.** అటమటము + కోమటులునున్ పోలెన్ = వంచించు వైశ్యులవలె,

లెక్క+చేయక = లక్ష్యము చేయక, సరియైన లెక్క చేయక;

**16.** పాదరస మర్దకులునున్ +పోలెన్ = పాదరసమును మందునకై మర్దించు వారివలె (బాగుగా పొడి చేయువారివలె) .

చంపన్+తలంచి = ఎదిరిని చంపుటకు నిర్ణయించుకొని (సమానము) .

వివరణము : బాగుగా ఖడ్గమునకు సానపెట్టుకొని, పాదరసమును సరియైన విధమున సిద్ధము చేసికొని.

అడిదంబులు + కత్తులు; ఝుళిపించినన్ = చక్కగా చలింప(జేయ(గా; ఝణఝణ ఝుంకారంబులును; తదీయ పరస్పర ఘర్షణ క్రేంకారంబులున్ = వారి కత్తుల ఒరపిడిచే కలి(గిన ధ్వనులును; తమ హుంకారంబులును = తాము చేయు హుమ్మనెడి వీరనాదములును; ముప్పిరి కొనన్ = పెన(గొన(గా; కొప్పరించియున్ = ఉప్పొంగియు; కొసరియున్ = మించియు; విచ్చియున్ = దూరముగా తొల(గియు; చొచ్చియున్ = దగ్గఱ చేరియు; అదలించియున్ = బెదరించియు; కదలించియున్ = చలింప(జేసియు; పోరు + అవసరంబున్ = పోరాడు సమయమందు; సుర విద్యాధర గంధర్వ (మొదలగు ఆకాశ గమనులు); దివ్యమునులు = దేవఋషులు; దివమ్మున నిలిచి = ఆకసమందు నిలిచిన వారై; ఆ వీరద్వయంబునున్ = ఆ ఇరువురు వీరులను; కనుంగొని; వెక్కసంబున = సహింపరాని ఆవేశంబుతో.

తా: డిభక సాత్యకులు ముప్పది రెండు ఖడ్గ విన్యాసములను ప్రదర్శించుచు, తమ నైపుణ్యమును చూపఱులు మెచ్చుకొనునట్లు పోరాడిరి. వారు ఝుళిపించిన కత్తుల కదలికల వలన కలి(గిన ఝణఝణ ధ్వనులు, మఱియు కత్తుల రాపిడివలన చెలరే(గిన క్రేకాంర స్వనములు, వారి వీరనాదములు, మూ(డును మిళితమై, మిక్కుటముగా వ్యాపించినవి. అపుడు ఆకాశగమనులు, మునులు, పై నిలిచి సహింపరాని ఆవేశముతో (మీ(ది పద్యముతో) .

అలం: శ్లేషానుప్రాణితమైన ఉపమ.

వ్యా. 1. కొనకన్ : కొనకయున్, ఇది సముచ్చయమైన "యు" వర్ణపూర్వక 'న' కారము కలదయ్యును, యువర్ణ రహితముగను కన్పట్టును. శబ్ద, ప్రౌఢ - 116. కనుక "కొనకన్" సిద్ధించును.

ఇది భారత ఆది. 2 ఆ -142 పద్యమందు కల, "లేకను" వంటిది. చూ. పద్యము 18.

2. ముప్పిరి : మూ డు +పిరులు సూ. సమానాధికరణంబగు ఉత్తర పదంబు పరంబగునపుడు 'మూ డు' శబ్దము 'డు'వర్ణలోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబునగు. సూ. ద్విగునకు ఏకవచనంబు ప్రాయికముగానగు. సమాస, బాల - 17, 18.

సూ. ముయ్యేడిత్యాదులందు, హ్రస్వద్విత్వంబులు నిత్యంబులు. సమాస, ప్రౌఢ - 10.

3. అటమటపు ఁగోమటులు : చూ. వచనము - 26.

చం. "ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె సాటి వచ్చు ను
ద్ధతిఁ జనువెంట వింట నడిదంబున నింతటివారు లే రుమా
పతి కొకరుండు శిష్యుఁ డురు బాహుఁడు ద్రోణున కొక్కరుండు ధీ
రతముఁడు శిష్యుఁ డి ట్లిరువురన్ రణధీరతఁ జెప్ప నేటికిన్. 257

అర్థ: ఉద్ధతి చనువెంటన్ = ఉరవడితో పోవువిషయమున; ఉమాపతి = పార్వతి భర్త; రణధీరతన్ = యుద్ధమందు ధైర్యగుణమును; చెప్పన్ + ఏల = ఏల వచింపవలెను? (అది గొప్పదనుట).

తా: ఈ డిభకునకు సమానుఁడు ఎవ్వరును లేరు. ఇతనికి ఇతఁడే సాటి. సాత్యకికి సములుఎవ్వరును లేరు. అతనికి అతఁడే సాటి. ఉద్రేకముతో శత్రువును వెంబడించు విషయమందును, వింటి నేర్పు విషయమునను, కత్తి కుశలతలోను ఇంతటి వారులేరు. శివుని శిష్యుఁడు గొప్ప భుజముల కల వాఁడు, డిభకుఁడు ఒక్కఁడును, ద్రోణుని శిష్యుఁడుసాత్యకి ధైర్యశాలి, మరొక్కఁడును మాత్రమే. వారి ధీరగుణమును ప్రత్యేకముగా ప్రశంసింపఁబనిలేదు.

విశే. అలం: 1. అనన్వయము - ఒక వస్తువునక్కు దానినే ఉపమానముగా చెప్పుట.

2. కావ్యలింగము - ఉమాపతి శిష్యుఁడని, ద్రోణుని శిష్యుఁడని, హేతువును వచించుట.

గీ. "అర్జునుండు మురారి సాత్యకియు వీరు
ముగ్గురు జయకాంక్షు లని మొన మోసపోరు
శక్తిధర చైద్య డిభకులు సములు వీరు
ముగ్గురు మహారథులు శౌర్యమూలధనులు." 258

తా: జగమందు, అర్జునుఁడు హరి, సాత్యకి వీరు ముప్వురు గెలుపును కోరువారై, యుద్ధరంగమున పగఅచే, వంచింపఁ బడరు. (తప్పక జయమును సాధింతురు). శక్తిధరుఁడు (కుమారస్వామి) చైద్యుఁడు (శిశుపాలుఁడు), డిభకుఁడు, వీరు ముగ్గురు సమానులు. మహారథులు. స్థిరమైన పరాక్రమము కలవారు. వారి పరాక్రమమే వారి మూలధనము. భంగపాటులేని విక్రమము కలవారు.

విశే: అలం. 1. అన్యోన్యము - ఒకరికొకరు సాటియనుట. అర్జునకు హరి, హరికి అర్జునుఁడు సాటి. అట్లే అర్జునునకు సాత్యకి, సాత్యకికి అర్జునుఁడనుట. ఇట్లు పరస్పరము సమానులనుట సిద్ధించుచున్నది. కనుక అన్యోన్యాలంకారము.

2. రూపకము - శౌర్యమూలధనులు.

వ. అనుచుం గొనియాడుచుండి రా సమయంబున. 259

తా : సులభము

మ. వసు దేవుం డఁటె యుగ్రసేనుఁ డఁటె నన్వారించు వారంచుఁ గ్రో
ధ సముల్లాసముతో హిడింబుఁడు మహాదంష్ట్రాగ్ర సంఛన్న సై
న్యసమూహుం డయి తాఁకె నానృపులు బాహాసారముం జూపినన్
వెస మ్రింగెం గడుపార వీరవరులన్ విస్ఫార జిహ్వాగ్రుఁడై. 260

అర్థ: అటె = (ఆశ్చర్యార్థకము) అహో!; నన్ వారించువారు = నన్ను అడ్డగించువారు; క్రోధ సముల్లాసముతో = కోపము యొక్క ఆవేశముతో; మహాదంష్ట్ర +అగ్ర సంఛన్న సైన్య సమూహుండు + అయి = గొప్ప కోర పండ్ల కొనల కాంతులచే వ్యాపించిన (కప్పఁబడిన) సేనల సమూహము కలవాఁడగుచు; బాహాసారమున్ = భుజము బలమును; విస్ఫార జిహ్వా+అగ్రుఁడై = వెలికి చాఁచి కదలుచున్న నాలుక కొన కలవాఁడై; వెసన్ = శీఘ్రముగా; కడుపారన్ = కడుపు నిండునట్లు.

తా: "అహో! ఈ ముదుసళ్లు వసుదేవుఁడు, ఉగ్రసేనుఁడు! నన్ను అడ్డగించువారా' అనుచు కోపావేశముతో హిడింబుఁడు, బలిష్ఠములైన కోరల కాంతులచే కప్పఁబడిన సైన్య సమూహము కలవాఁడై ఆ ఇరువురు రాజులు తమ భుజముబలమును ప్రదర్శించు చుండగా ముందు నడచి వచ్చుచున్న వీరులను, వెలుపలికి వచ్చినట్టియు బాగుగా కదలు చున్నట్టియు తన నాలుకచే కడుపునిండునట్లు శీఘ్రముగా మ్రింగెను.

వ. ఇట్లు ముందటం దలపడిన యదువృష్ణిబలంబులకు భయంకరుం డై దౌడలు గొఱుకుచుఁ దల విదుర్చుచు మిడిగ్రుడ్లు ద్రిప్పుచు మీఁదులు చూచుచు బారలు సాఁచుచు బారి సమరుచుం గడు పక్కళించుచుఁ గాలం జరుముచు మేను వెంచుచు మెడ నిక్కించుచు నరదంబుల నరదంబులతో నంటసిల నడుచుచుఁ దురగంబులఁ, దురగంబులతో దుత్తుమురుగా దూఁటుచు, దంతావళంబుల దంతావళంబులతోఁ దలలు వగులం దాఁటించుచు, వీరుల వీరులతో విటతాటంబుగా విఱుగ వ్రేయుచుం, బ్రళయకాలరుద్రుండు ప్రజలపైఁ బరఁగుచందంబునఁ జటులగతిం జాలు మగలఁ జట్టలు వాపి చవిగొను రుధిర పయఃపానంబునను మేదఃఖాదనంబునను మజ్జామజ్జనం బుననుం జేవ మిగిలి చేరిన వీరు లాహారంబుగాఁ గుంభకర్ణుండు వానరబలంబుల మ్రింగు భంగి దోఁప యదువృష్ణిసైన్యంబు నిరవశేషంబు చేయుచుం గదిసిన నావృద్ధనృపతు లిద్దఱు సాహసంబునం గంఠీరవంబు తోడం దలపడిన తగళ్ళ కైవడి నారాక్షసు తోడం దలపడి. 261

ప్రతి: ఇట్లు; ముందటన్ = ముందు భాగమందు; తలపడిన = ఎదుర్కొన్న యదువృష్ణిబలంబులకు = యదువు, వృష్ణి అనెడి రాజుల సేనలకు; భయంకరుఁడై = భయమును కలిగించువాఁడై; దౌడలు కొఱుకుచున్; తల విదుర్చుచు = తలను విదలించుచు; మిడిగ్రుడ్లు త్రిప్పుచు = ఉబికి, వెలుపలికి కానవచ్చు కంటి గ్రుడ్లను గిరగిర త్రిప్పుచు; మీఁదులు = పై భాగములను; చూచుచు = (వీరు లెవరైనను వచ్చు చున్నారా గమనించుచు); బారలు + చాఁచుచు = చేతులను అడ్డముగా, పూర్తిగా ముందువకు వ్యాపింపఁజేయుచు; బారి =

బలాత్కరించి; సమరుచున్ = (ఎదుటనున్న వారిని)కొట్టి చంపుచు; కడుపు +అక్కళించుచున్ = కడుపును లోనికి క్రుంగిపోవునట్లు చేయుచు;కాలన్ +చరుముచున్ = కాలిని ఇటునటు రాయుచు మేనున్ = శరీరమును; పెంచుచున్ = పెద్దదగునట్లు చేయుచు; మెడన్ = మెడను; నిక్కించుచున్ =పైకి నిలువుగా సాగునట్లు చేయుచు; అరదంబులన్ అరదంబులతోన్;అంటసిలన్ = చేరునట్లు (శ.ర); అడుచుచున్ = కొట్టుచు; తురంగంబులన్ తురంగంబులతోన్ = గుఱ్ఱములను = గుఱ్ఱములతో; తుత్తుమురుగాన్ = పొడిపొడి యగునట్లు (నలిఁగిపోవునట్లు); తూఁటుచు = క్రుమ్మచు (దూఁటుచు= పొడుచుచు); దంతావళంబులన్ దంతావళంబులతోన్ = ఏనుఁగులను, ఏనుఁగులతో; తలలు + పగులన్ = వాని తలలు పగిలిపోవునట్లు; తాటించుచున్ = కొట్టుచు వీరులన్ వీరులతో; విటతాటంబుగా = చెల్లాచెదరునట్లు (తాఱుమాఱుగా); విఱుఁగ వ్రేయుచున్ = విఱిచి వేయుచు; ప్రళయకాల రుద్రుండు = విశ్వమును లయముచేయు సమయమందు, (రౌద్రమూర్తియైన) శివుఁడు; ప్రజలపైన్; పరఁగు చందంబునన్ = ప్రవర్తించు విధమున; చటుల గతిన్ = తీవ్ర గమనముతో; చాలు మగలన్ = బలీయులైన వీరులను; చట్టలు + పాపి = వారి కవచములను తొలఁగించి; చవిగొను రుధిర పయఃపానంబునను = రుచి చూచునట్టి (వారి) నెత్తురు అనెడి పాలను త్రాగుటచేతను; మేదస్ + ఖాదనంబునను = మెదడును చప్పరించుటచేతను (తినుటచేతను); మజ్జామజ్జనంబుననున్ = (వారి) క్రొవ్వును ఆస్వాదించి, అది శరీరమంతటను అంటుకొనఁగా అందు మునిఁగిన వాఁడగుటచేతను; చేవ మిగిలి = బలము ఇంకను మిగిలియుండఁగా (బలమతిశయించి); చేరిన వీరులు = దగ్గఱకు వచ్చిన వీరులను; ఆహారంబుగాన్ = తిండిగా; కుంభకర్ణుండు; వానర బలంబులన్ = కోతి మూఁకలను; మ్రింగు భంగి = మ్రింగు విధము; తోఁపన్ = కన్పట్టగా; యదు వృష్ణి సైన్యంబున్ = ఆయా రాజుల సేనను; నిరవశేషంబు చేయుచున్ = మిగులు లేకుండునట్లు కావించుచు; కదిసినన్ = సమీపింపఁగా; ఆవృద్ధ నృపతులు + ఇద్దఱు; సాహసంబునన్ = భయములేని వారై, ధైర్యముతో, వీరత్వమును చూపుటకై; కంఠీరవముతోడన్ = సింహముతో; తలపడిన ఎదుర్కొన్న; తగళ్లకైవడిన్ = పొట్టేళ్లవలె; ఆరాక్షసుతోడన్; తలపడి.

తా: హిడింబుఁడు, తన్నెదుర్కొన్న యదు వృష్ణిరాజుల సైన్యములను ఎదిరించుచు, భయంకరుఁడై దౌడలు కొఱుకుచు, తలను విదలించుచు, మిడిగ్రుడ్లను గిరగిర త్రిప్పుచు పైన చూపులను నిగిడించుచు చేతులను బాగుగా, ముందుకు చాఁచుచు, బలాత్కారముతో వీరులను కొట్టి చంపుచు కడుపును కుదించుచు, కాలిని నేల రాయుచు, శరీరమును పెద్దది చేయుచు మెడను పై కెత్తుచుచు అరదములను అశ్వములను గజములను, వీరభటులను, ఆయా సైన్యములను, వానితోనే మర్దించుచు, లయకాల రుద్రుని వలె విజృంభించి, ప్రవర్తించుచు, ఉరవడితో బలీయులైన వీరుల

కవచములను తొలఁగించి వారి రక్తమును రుచి చూచి త్రాగుచు వారి మెదడును మెక్కుచు, వారి కొవ్వును క్రోలుచు దానిని ఒడలెల్ల పర్వఁజేసికొనుచు, బలము మిగిలినవారు తన్ను చేరఁగా వారి నెల్ల తిండిగా కుంభకర్ణుఁడు వానర సేనను మ్రింగినట్లు ఆహారముగా గ్రహించి యదువృష్ణి సేనల నన్నింటిని పూర్తిగా నాశము కావించెయుద్ధము చేయుటకు సాహసించిన ఉగ్రసేన వసుదేవులు ఇరువురు, సింహమును ఎదుర్కొన్న పొట్టేళ్ల వలె ఆహిడింబునితో తలపడి॥(మీఁది పద్యముతోఅన్వయము).

విశే: హిడింబుని వికృత స్వరూపము, పైశాచిక ప్రవృత్తి నరమాంసభక్షణాసక్తి, ఇందు వర్ణింపఁబడినది. ఇందు రచనారీతిలో చమత్కృతియు కాననగును. ద్వితీయకు ప్రథమ, శత్రర్థక చువర్ణము, తృతీయార్థమందు సముచ్చయ సహిత నవర్ణప్రయోగము పేర్కొనఁదగినవి.

అలం: 1 ఉపమ - "ప్రళయ కాలరుద్రుండు పరఁగు చందంబున," 2. "కుంభకర్ణుండు వానరబలంబుల మ్రింగు భంగి దోఁప".

2. రూపకము - "రుధిర పయఃపానంబునను".

వ్యు. కంఠీరవము - కంఠమున ధ్వనికలది, సింహము.

మం. ఖర నారాచ పరంపరం బఱపి వీఁకం దాఁకి పాతాళ గ
హ్వరముం బోని నిజాస్యముం దెఱచి రక్షోధీశుఁ డన్నింటి ని
ష్ఠురుఁ డై మ్రింగి తదీయ చాపములు రెండుం బట్టి ఖండించినం
దెరలం బాఱక యున్న వారిఁ గని యా దేవద్విషుం డిట్లనున్. 262

ప్రతి: (ఆవసుదేవ ఉగ్రసేనులు) ఖర నారాచ పరంపరన్ = వాఁడియైన బాణముల వరుసను; పఱపి = ప్రయోగించి; వీఁకన్ = ఉత్సాహముతో; తాఁకి; పాతాళ గహ్వరమున్ = పాతాళము అనెడి బిలముతో; పోని = సాటియగు; నిజ + ఆస్యమున్ = తన నోటిని; తెఱచి రక్షస్ + అధీశుఁడు = రాక్షసులకు ప్రభువు; అన్నింటిన్ = అన్నివిధములగు సేనలను ఏనుఁగుల, గుఱ్ఱములు వీరులు - అందఱను); నిష్ఠురుఁడై = కఠోరుఁడై క్రూరుఁడై ఏమాత్రము సంకోచములేక ; మ్రింగి; తదీయ చాపములు = వారి విండ్లు; రెండున్ +పట్టి; ఖండించినన్ = ముక్కలను చేయఁగా; తెరలన్ +పాఱక ఉన్నవారిన్ = (అచటినుండి) తొలఁగి పాఱిపోక ఉన్న వారిని; కని; ఆ దేవ ద్విషుండు = ఆ దేవతులను ద్వేషించు వాఁడు (రాక్షసుఁడు); ఇట్లు + అనున్ = ఈ క్రింది విధముగా వచించెను.

తా: ఆ ఉగ్రసేన వసుదేవుల్నుహిడింబునిపై బాణముల మొత్తమును ప్రయోగించుచు అతనిని ఉత్సాహముతో ఎదుర్కొనిరి. అపుడు అతఁడు (హిడింబుఁడు) పాతాళ గుహవలె నున్న తన నోటిని తెఱచి తనకు కన్పట్టిన గజాశ్వభటుల నెల్లను నిర్దయతో కబళించెను. తర్వాత ఆ వృద్ధులధనువులను రెంటిని పట్టుకొని విఱిచెను. అయినను వారు యుద్ధమునుండి తొలఁగక పోవుటచే వారితో అతఁడు ఇట్లనెను.

వ్యు. దేవద్విషుండు (సురద్విషుఁడు), దేవతలను ద్వేషించువాడు, రాక్షసుఁడు.

వ్యా. రక్షోఽ ధీశుఁడు.రక్షస్ + అధీశుఁడు విసర్గ (పూర్వరూప) సంధి

## - : ఉగ్రసేన వసుదేవులు హిడింబున కోడి పాఱుట : -

చం. "ముదుకల మాంసము న్మెదడు మోదముతోఁ గడుపార మ్రింగ నేఁ
డొదవె మదీయ భాగ్యమున నూరక నోరు సొరుండు రండు మీ
రదవద గాక" నావుడుఁ దదానన దర్శన ముక్తశస్త్రు లై
మద మఱి పాఱి రాన్నృపులు మానిసిదిండికిఁ గాక భీతితోన్. 263

అర్థ: అదవదగాక = కలఁత చెందక; తద్+ఆనన దర్శన ముక్త శస్త్రులై = అతనినోటిని చూచుటచే ఆయుధములను వీడిన వారై; మానిసి+తిండికి కాక = రాక్షసునికి ఆహారముగా చిక్కపోక.

తా: "నేఁడు" ఈ ముసలి వారి మాంసమును మెదడును ముదముతో కడుపునకు తృప్తిగా మ్రింగుటకు నాకు అదృష్టము పండినది. మీరు మాఱుపలుకక నా నోటిలోనికి ప్రవేశింపుఁడు. కలఁత చెందక ఆలస్యము చేయక రండు" అని హిడింబుఁడు పలుకఁగా ఆతని నోటిని చూచి ఆయుధములను వదలి మదము తొలఁగి, రాక్షసుని తిండిగాక, భయముతో ఆరాజులిర్వురు పరుగిడిపోయిరి.

వ్యు. మానిసితిండి,మనుష్యులను తినువాఁడు, రాక్షసుఁడు.

వ. అట్టియెడ హాలధరుండు. 264

తా : సులభము

మ. కని కంసాంతకు తోడ హంసునికి సంగ్రామంబు హత్తించి త
ద్దనుజుం బేర్కొని యిక్క డిక్కడ భవద్దర్పంబు గ్రక్కింతు న

మ్మనుజాధీశులఁ దోల నేలనుచు బల్మాఱున్ భుజాస్ఫాలనం
బనిరుద్ధక్రియఁ దెల్పి వీత శరచాపాక్షేపుఁ డై తాఁకినన్. 265

అర్థ: హత్తించి = కలిగించి; పేర్కొని = పేరుపెట్టి పిలిచి; భవత్+దర్పంబు = నీ యొక్క గర్వమును; క్రక్కింతున్ = వెడలించెదను; ఆ మనుజ + అధీశులన్ = ఆ (ముదుసలి) రాజులను; తోలన్ + ఏల? = తఱుముట ఎందులకు? పలుమాఱున్ = పెక్కు సారులు; భుజ + ఆస్ఫాలనంబు = భుజములను తట్టుట; అనిరుద్ధక్రియన్ = అడ్డుపెట్టుటకు శక్యము కాని; వీత శరచాప + ఆక్షేపుఁడై = వీడినట్టి బాణమును వింట సంధించి లాగుటను కలవాఁడై (బాణముగల అల్లెత్రాటిని వెనుకకు లాగక); తాఁకినన్ = ఎదుర్కొనఁగా.

తా: (ఆ సమయమందు బలరాముఁడు) హిడింబుఁడు వృద్ధ నృపతులను మ్రింగుటకు చేయు యత్నమును వారు తప్పించు కొని పరుగెడి పోవుటను కాంచి, హంసునికి హరితో యుద్ధమును కల్గించెను. తర్వాత హిడింబుని పేరు పెట్టి పిలిచి "ఇచ్చటనే నీ నీగర్వ మడఁచెదను. ఆ ముదుసలి రాజులను తఱుముట ఏల?"అనుచు, పెక్కుసారులు భుజములను అప్పళించుట, అతని నిరోధించుటకు వీలుకాని యుద్ధోత్సాహమును ప్రకటించు చుండఁగా వింటిలో సంధించిన బాణమును ప్రయోగింపక హిడింబుని ఎదుర్కొనెను. (మీఁది పద్యముతో అన్వయము).

చం. కనుఁగొని వీనిమేను బలుగండల నాఁకలి పుత్తుఁ గాక నేఁ
డని దనుజాధముండు వికృతాననుఁ డై బలభద్రుఁ దాఁకి నె
ట్టన నెఱలావునం బిడికిటం బొడిచెన్, హలపాణి యొక్క ము
ష్టిన తనముష్టిఘాతము హిడింబునకుం జవి చూపి వెండియున్. 266

అర్థ: బలుకండలన్ = బలిసిన మాంసపు ముద్దలతో; దనుజ + అధముండు = దనువు పుత్రులలో నీచుఁడు (నీచుఁడైన రాక్షసుఁడు); వికృత+ఆననుఁడై = రోఁత యైన నోటిని కలవాఁడై (నోటిని బాగుగా తెఱచుకొని); నెట్టన = తప్పించుకొనుటకు వీలు లేనియట్లు; నెఱ లావునన్=మెండైన బలముతో, హలపాణి = నాగేటిని చేతియందు కలవాఁడు (బలరాముఁడు); ఒక్క ముష్టిన = ఒక పిడికిఁటి పోటుతో; ఘాతము = దెబ్బ; చవి = రుచి.

తా: నీచుఁడైన రాక్షసుఁడు హిడింబుఁడు, బలరాముని చూచి, 'ఈదినము వీని బలిసిన మాంసపు కండలను మెక్కి నా ఆఁకలిని తీర్చుకొందును' అని బలరాముని మార్కొని అడ్డులేనియట్లు, గట్టిదైన పిడికిఁటి గుద్దు నిచ్చెను. ఆ బలుఁడు ఒక్క పిడికిటి పోటుతో, తన పిడికిటి దెబ్బ రుచిని, హిడింబునకు చూపెను. మఱియు.

వ్యా. ముష్టిన = ముష్టితో, ఇచ్చట 'న' వర్ణకము తృతీయా విభక్త్యర్థమున నున్నది. సామాన్యముగా సప్తమ్యర్థకమైన 'న' వర్ణకము, తృతీయార్థమున ఉదంత జడపదములకే వచ్చును. సూ. కారక, బాల - 23. జడములు కాని ఉదంతములకును, తృతీయార్థమున 'న' వర్ణకము వచ్చుననియు చెప్పఁబడినది. కారక, ప్రౌఢ - 17.

ఈ "ముష్టి" శబ్దము ఉదంతముకాదు. అయినను 'న' వర్ణకముతో సోమన ప్రయోగించుటచే ఇది ప్రౌఢప్రయోగము. దీనిని ఒకానొక విభక్తికి మఱియొక విభక్తి వచ్చునను సూత్రముచే సమర్థింపవచ్చును. కారక, బాల - 21.

కం. వారింప రాని మదమున
వా రిరువురుఁ జట చటారవంబులు నెగయం
బోరాడిరి వీరులు చే
యారఁగఁ బిడిగ్రుద్దులాట నా సమయమునన్. 267

తా: అడ్డులేని మదముతో ఒడలు మఱచి వారు చట చట అనెడి ధ్వనులు నలుగడల వ్యాపించు చుండఁగా తమ చేతులకు తృప్తిగా పిడికిళ్లతో గ్రుద్దుకొనిరి. (ముష్టియుద్ధము కావించిరి)

కం. పిడికిటఁ బొడిచె హిడింబుఁడు
వడితో హలధరుని యురము, వాని యురంబుం
బిడికిటఁ బొడిచెను రాముఁడు
విడువక యఱచేత నోరు వ్రేసెం బెలుచన్. 268

తా: బలరాముని ఱొమ్మును హిడింబుఁడు వేగముతో పిడికిటితో గ్రుద్దెను. బలుఁడు అట్లే హిడింబుని ఱొమ్మును పొడిచెను. అంతటితో ఆఁగక వెంటనే ఆ రాక్షసుని నోటిని అరచేతితో అతిశయముగా కుమ్మెను.

వ్యా. పిడికిటన్ తృతీయార్థమున అత్వాదేశము చూడుము, పద్యము 205.

ఉ. పోటున వ్రేటునం దిరిగి బోరగిలం బడియున్న దానవుం
గాటుకకొండ నెత్తు వెలిగౌరు తెఱంగున నెత్తి త్రిప్పి చె
ల్లాటము చూపి వీఁడు *మొదలా మన కంచు బలుండు సంగ రా
ఘాటము దాఁట వైచిన డిగంబడెఁ గ్రోశ యుగంబు చక్కటిన్. 269

---

* ముదలా

ప్రతి: పోటున వ్రేటునన్ = పిడికిటి పోటు యొక్క దెబ్బచే; తిరిగి పోరగిలన్ +పడియున్న దానవున్ = బొమ్మ నేలను అనునట్లు వీపు పై నుండునట్లు తిరిగి పడియున్న రక్కసుని; కాటుక కొండన్ + ఎత్తు = నల్లని కొండనుఎత్తు; వెలిగౌరు = తెల్లని ఏనుఁగు; తెఱంగునన్ = రీతిని; ఎత్తి త్రిప్పి; చెర్లాటము = వినోదక్రీడను; చూపి; వీఁడు; మొదలా! = మొదటి వాఁడా (ముదలా! = లక్ష్యమా?) మనకు+అంచు; బలుండు; సంగర+ఆఘాటము దాఁటన్ = యుద్ధభూమి సరిహద్దును మించి పోవునట్లు; పైచినన్ = విసరి వేయఁగా; క్రోశయుగంబు చక్కటిన్ = రెండు కోసుల దూరముననుండు చోటున; డిగంబడెన్ = క్రింద పడెను (కోసు = రెండు మైళ్లు).

తా: పిడికిటి పోట్లచే బోర్లపడియున్న రక్కసుని, నల్లని కొండను పైకెత్తు తెల్లని ఏనుఁగు వలె, బలరాముఁడు పైకెత్తి వినోద క్రీడ వలె గిరగిర త్రిప్పి రెండు కోసుల దూరమున యుద్ధభూమి సరిహద్దునకు ఆవల విసరివేసెను.

అలం: 1. ఉపమ, కాటుక కొండ నెత్తు వెలిగౌరు తెఱంగున.2. అనుప్రాసము 'ట' వర్ణము,"పోటు వ్రేటు"పదములలో ఆవృత్తమై పోటుల పటుత్వమును ప్రకటించుచున్నది.

కం. వికలగతి నున్న రాక్షసు
లొక వొకని మొగంబు గాన కూరక చని రం
తకు నరుణకిరణు కిరణము
లకుఁ బడమటి కొండ పంచలం బడ వలసెన్. 270

తా: అట్లు నేలపై రక్కసుఁడు పడి యుండఁగా, రాక్షసులు అవమానముతో చెదరిన మనసులు కలవారై, ఒకరి మొగమును మఱి యొకరు చూడఁజాలక మిన్నక మరలిపోయిరి. అప్పటికి సూర్యుని (ఎఱ్ఱని కిరణములు కలవాఁడు) కాంతులు పడమటి కొండ యొక్క చరియలలో తప్పక పడవలసినసమయమైనది. (సూర్యుఁడస్తమించెను).

అలం:1. పరికరము : విశేషణము అర్థమునకు పోషకముగ నున్నది. "అరుణకిరణు కిరణములకు" - ఇచ్చట ప్రథమకు షష్ఠి 2. కావ్యలింగము : జయకాంక్షులైన రాక్షసులు సూర్యుఁడస్తమించుటచేతను, ఆశలు అడుగంటుటచేతను, తమ నెలవులకు తప్పక పోవలసి వచ్చెనని సమర్థింపఁదగిన విషయము సమర్థింపఁబడినది.

సీ. కడపంగ రాకున్న కాలఖడ్గముచేతఁ
బగలింటితల నేలఁ బడినయట్లు

సాయంతనం బనుజాలరి జలధిలోఁ
బచరింప వల డిగఁ బాఱినట్లు
పొడ వైన యాకాశభూరుహంబున సంధ్య
గోయంగ గొల *ద్రెవ్వి కూలినట్లు
చరమ దిగ్బేతాళకరమున వరుణుఁడు
గడివెట్టఁ బొల పొట్ట నడఁగినట్లు
గీ. క్రుంకు గుబ్బలి పొరకి కొప్పరించి
పట్టఁజాలక వైచిన బ్రద్దపరికిఁ
బాటి యగుచు ముగురపొత్తు పళ్లెరంబు
భానుమండల మంతఁ జూపట్ట దయ్యె. 271

ప్రతి: కడపంగన్ రాకున్న = అతిక్రమించుటకు దాఁటుటకు వీలులేని, దాఁట ఁజాలని; కాల ఖడ్గముచే = కాలము అనెడి కత్తిచే; పగలింటి = పగలు అనెడి పేరుగల దేవత యొక్క; తల; నేలన్ = నేలమీఁద; పడినయట్లు = తెగి, పడిన విధమున; సాయంతనంబు +అనుజాలరి = సాయంకాలము అనెడి బెస్తవాఁడు; వల = వలను; జలధిలోన్ = సముద్రమునందు; పచరింపన్ = (చేపలు పట్టుటకై) వెడల్పుగా, పఱఁచగా; డిగన్+పాఱినట్లు = లోపలికి దిగుచు మునిగిపోయినట్లు; ఎడపైన = దూరమందున్న; ఆకాశభూరుహంబునన్ = ఆకాశము అనెడి చెట్టునందు; సంధ్య = సంధ్యాదేవి అనెడి దేవత;కోయంగన్ = కోయఁగా; గొల = పండ్ల గుత్తి (సముదాయము); త్రెవ్వి = తెగి; కూలినట్లు = పైనుండి నేలపై రాలినట్లు (పాఠాం - నేలఁగూలి) చరమదిక్ + బేతాళ కరమున = పడమటి దిక్కు అనెడి పిశాచములరాజైన బేతాళుని చేతియందు; వరుణుఁడు = జలాధిదేవత పడమిటి దిక్కునకు ప్రభువు; కడి + పెట్టన్ = (మాంసాహారపు) పెద్ద ముద్దను ఉంచఁగా; పొల = (ఆ)మాంసము; పొట్టన్ = తన పెద్ద పొట్టలో; అడఁ గినట్లు = నోటినుండి లోపలికి పోయినట్లు; క్రుంకు గుబ్బలి పొరకి = పడమిటి కొండ అనెడి యోధుఁడు; కొప్పరించి = ఉప్పొంగి; పట్టన్ + చాలక = చేత పట్టుకొనుటకుక శక్తి లేక; వైచిన బ్రద్దపరికిన్ = చేతినుండి జాఱ విడిచిన పేముతో అల్లిన డాలునకు (కేడెమునకు); పాటి అగుచున్ = సరియగుచు; ముగుర పొత్తు పళ్లెరంబు = త్రిమూర్తులకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు); ఉమ్మడి భోజన పాత్ర అనెడి; భానుమండలము = సూర్యుని బింబము; అంతన్ = అంతలోనే, ఆ సమయమందు; చూపట్టదయ్యె = కనఁబడక పోయెను. (సూర్యుఁడస్తమించెను).

---

* నేలఁగూలి

పాతాం నేలఁగూలి.

తా: (విధిచే) కాలమనెడి కత్తిచే ఖండితమైన పగలు అనెడి దేవత యొక్క తల నేలపై పడినట్లు (విధిబలీయము, దానిని తప్పింప నెవరికిని తరముకాదు. మరణ సమయము సంప్రాప్తమగుటచే హిడింబుఁడు, సమసె ననుట). సాయంకాలము అనెడి బెస్తవాఁడు జల జంతువులను పట్టుకొనుటకు సముద్రమందు వలను నీటిలో జాఱ విడిచినట్లు, నిడుపైన ఆకాశము అనెడి వృక్షమందు, సంధ్య అనెడి దేవత కోయఁగా ఆ చెట్టునుండి పండ్ల గుత్తి దభాలునక్రింద పడినట్లు, పశ్చిమ దిక్కు అనెడి పిశాచరాజగు బేతాళుని చేతులలో పశ్చిమ దిక్పతి వరుణుఁడు, కబళమును ఉంచగా ఆ మాంసపు ముద్ద, అతని నోటినుండి ఆతని పెద్ద కడుపులో పడి అణఁగినట్లు, పడమటి కొండ అనెడి యోధుఁడు, ఉప్పొంగి,పట్టలేక చేఁజార్చిన డాలునకు (కేడెమునకు) సరియగుచు త్రిమూర్తులకు ఉమ్మడి భోజన పాత్రయైన (కెంపువర్ణముగల) సూర్య మండలము కనుమఱుఁగయ్యెను.

అలం : 1. రూపకము 1. కాలఖడ్గము 2. సాయతనంబను జాలరి. 3. ఆకాశ భూరుహంబు 4. చరమ దిగ్బేతాళకరము. 5. క్రుంకు గుబ్బలి పారకి 6. ముగురపొత్తు పళ్లెరంబు (అనెడి) భానుమండలము.

2. ఉపమ - పారకి కొప్పరించి పట్టఁజాలక వైఁచిన బ్రద్ద పరికిఁబాటి యగుచు.

3. ఉత్ప్రేక్ష - హిడింబుని పతనమును పగలింటిదేవత యొక్క పాతమును జోడించి కథాంశమునకు, ప్రకృతి చర్యకును సన్నిహిత సంబంధమును సమకూర్చుట రమణీయమైన కల్పనము.

వ్యా. పగలింటి తల, పగలు + టివర్ణకము (ఔపభవిభక్తకము). ఆచ్చిక, బాల - 36 సూత్రముచే, 'ఉ' త్వమునకు ఇత్వము, మఱియు 'టి' వర్ణంబునకు ముందు పూర్ణబిందువు (ఆచ్చిక, బాల - 32) వచ్చినది. "పట్టపగలింటి సూర్యుని పగిది" - కవితిక్కన ప్రయోగము.

పారికావు = పరిచరుఁడు. పారిక (రూపాంతరము). ఇచట వీర భటుఁడని అర్థము. 'పారిక' కు బావిస, దాసురాలు అనియు అర్థములు కలవు.

కం. ముఱు ముఱు చీఁకటితో నం
దఱు రాజులు సమర ముడిగి తగ నెల్లిటికిం

గొఱ గల కలనగు నడువుఁడు
నెఱ (వ) పగు గోవర్ధనాద్రి నేలకు ననుచున్. 272

అర్థ: కొఱ = మిగిలినది; కలను = యుద్ధము.

తా : సంజచీఁకటి అలము కొన్న వెంటనే రాజులందఱు యుద్ధమును విరమించి 'మిగిలిన యుద్ధము రేపు జరుగును. మీరెల్లరు, విశాలమైన గోవర్ధనగిరి ప్రాంతమునకు నడువుఁడు' అనుచు (మీఁది పద్యముతో).

కం. రెండు బలంబుల వారలు
నొండొరులకుఁ జెప్ప నప్పు డుద్ధత మతు లై
రం డనఁగ హంసడిభకుల
దం డా గోవర్ధనాద్రి తటమున విడిసెన్. 273

తా: ఇరుపక్షముల సేనానాయకులు ఒకరికొకరు చెప్పఁగా అప్పుడు ఉద్రేకపూరితమైన మనస్సు కలవారై "రండు" అనఁగా, హంసడిభకుల సేన గోవర్ధన పర్వత ప్రాంతమునకు వచ్చి చేరెను.

మ. హరి యారాత్రి బలంబుఁ బుష్కర తటాకారణ్య మధ్యంబునన్
వెర వారన్ విడియించి రేపకడఁ బృధ్వీనాథు లెల్లం దనున్
గురు సన్నా హబలంబుతోఁ గొలువఁ దద్గోవర్ధ నో*ద గ్రిగం
తరభూమిన్ యమునా తటంబున సమాధానంబుగాఁ బన్నినన్. 274

అర్థ: పుష్కర తటాక+ అరణ్య మధ్యంబునన్ = పుష్కరమను పేరుగల సరస్సుయొక్క తీరముండు అడవి నడుమ; వెరవు +ఆరన్ = ఉపాయముతో; రేపకడ = సూర్యోదయమునకు ముందే; పృథ్వీనాథులు = రాజులు; గురు సన్నాహ బలంబుతో = గొప్ప ప్రయత్నము గల సేనతో; తద్+గోవర్దన + ఉద్యత్ నగ + అంతర = ఆ గోవర్ధన పర్వతము యొక్క ఉన్నతమైన భూమి మధ్య భాగమందు; తటంబునన్ = గట్టున; సమాధానముగాన్ = చక్కగా అమరునట్లు; పన్నినన్ = వ్యూహమును ఏర్పాటు చేయఁగా;

తా: శ్రీకృష్ణుఁడు ఆ రేయి తన సేనను పుష్కర సరస్సు సమీపముననున్న అడవి నడుమ ఉపాయముతో విడియఁజేసి, మఱునాడు సూర్యోదయమునకు ముందే,

* ద్యన్నగాం

రాజులందఱు తన్ను గొప్పయుద్ధప్రయత్నము గల సేనతో సేవించు చుండఁగా, గోవర్ధన గిరి యొక్క ఎత్తైనడుమ నున్న ప్రదేశమందు యమునా నది గట్టున సేనలను చక్కఁగా అమర్పఁగా (మీఁది పద్యముతో).

హంసడిభకులు, తమ సేనలకు విశ్రాంతి ఒసఁగక యుద్ధానంతరము వెంటనే గోవర్ధన గిరిప్రాంతమునకు, వారిని పొమ్మనిరి. కృష్ణుఁడు, అట్లు చేయక, మఱునాడు రేపకడ, సైన్యములను తరలించెను.

(పాఠాం. ఉదక్+దిక్+ అంతర భూమిన్=ఉత్తరదిక్కున గల, భూమి మధ్యభాగమందు).

గీ. హంసడిభకుల బల మెల్ల నాయితముగ
మోహరము చేసి నడిచిన మొనలు రెండుఁ
దలపడి భయంకరంబుగ దారుణాస్త్ర
శస్త్ర పాతంబుచేత నుత్సాహ మెసఁగ. 275

అర్థ: ఆయితముగ= (యుద్ధమునకు) సిద్ధమై; మోహరము చేసి= వ్యూహముగ నేర్పడి; మొనలు=సేనలు; దారుణ+అస్త్ర శస్త్ర పాతంబు చేతన్= భయంకరమైనట్టియు, వాఁడి అయినట్టియు, దివ్యమైన బాణములు, వివిధములైన ఖడ్గాద్యాయుధములు ప్రయోగించుటచే.

తా. హంసడిభకుల సేనయంతయు, సర్వ సంసిద్ధమై, వ్యూహముగ నేర్పడి నడువఁగా ఇరుపక్షముల సేనలు, భయంకరముగ నెదుర్కొనిరి. అప్పుడు ఉగ్రములైన వాఁడియైన దివ్యమైన బాణములను ఖడ్గాది ఆయుధములను ప్రయోగించుటచే ఆ సేనలు, తమ శౌర్య ప్రదర్శనమునకు కుతూహలము అతిశయింపఁగా (మీది పద్యముతో).

గీ. చెలఁగు బలములతో నుగ్రసేనుఁ దాఁకి
బాణముల హంసుఁ డిన్నూటపదిట నేసె
డిభకుఁడును వసుదేవు నేడింట నేసె
నిరువురఁ బొదివి యాదవు లేసి రంత. 276

తా. ఉత్సాహముతో ప్రవర్తించు సేనలతో హంసుఁడు ఉగ్రసేనునిపై రెండు నూర్ల పది బాణములను, డిభకుఁడు వసుదేవునిపై ఏడు బాణములను వేసెను. యాదవులు అందఱు కలసి ఒక్కసారిగా హంసడిభకులను చుట్టుముట్టి బాణములను వేసిరి.

కం. అప్పుడు పదిపదియమ్ములఁ
దప్పక యాదవుల బ్రహ్మదత్త కుమారుల్
నొప్పింప రుధిర ధారలు
చిప్పిల్లనివారు లేరు సేనలలోనన్. 277

తా. ఆ సమయమందు బ్రహ్మదత్తుని సుతులు హంసడిభకులు గొల్లలపై పది పది బాణములను తప్పకుండ, ప్రయోగించి, వారిని నొప్పించిరి. అప్పుడు ఆ సేనలో వారి శరీరములనుండి నెత్తుటి ధారలు స్రవించినవి.

చం. తమబల మింక వీఁగు నని తత్సమయంబునఁ గృష్ణ రేవతీ
రమణులు దాఁకి రయ్యిరువురన్ సురసిద్ధ మునీంద్రబృందముల్
సమరముఁ జూచి మెచ్చ హర శాసన తత్పర భూత యుగ్మముం
గ్రమమునఁ దోఁచెఁ దోడుపడ రాజకుమారుల రెండుదిక్కులన్. 278

అర్థ: క్రమమునన్= బలిమితో.

తా. కృష్ణుఁడు, రేవతి భర్త,బలరాముఁడు, తమ సైన్యమింక వెనుకకు మరలునని తలఁచి, ఆ ఇరువురిని ఎదుర్కొనిరి. వారి యుద్ధమును దేవతలు, సిద్ధులు, మునివరులసమూహము ప్రశంసించుచుండఁగా శివుని ఆజ్ఞను పాటించు భూతములు రెండు, రాజకుమారులకు ఇరువైపుల రక్షకై బలిమితో కన్పట్టెను.

మ. హరితో హంసుఁడు సీరితో డిభకుఁడున్ హంకార హుంకార భీ
కర శంఖధ్వని విక్రమం బమర వీఁకం దాఁకినం బాంచజ
న్య రవాడంబరమున్ సహింప కడరెన్ మాహేశభూత ద్వయం
బరవా యించుక లేక హస్తధృత శూలాకార ఘోరంబుగన్. 279

అర్థ: సీరితో= బలరామునితో; విక్రమంబు=శౌర్యము; వీఁక=ఉత్సాహము; రవ+ ఆడంబరము= శబ్దము యొక్క వేగిరపాటు; అరవాయి= సంకోచము, అధైర్యము; హస్తధృతశూలాకార ఘోరంబుగన్= చేతులయందు ధరించిన శూలములతో, తమ రూపు భయమును కలిగించు చుండఁగా

తా. హరితో హంసుండు, బలునితో డిభకుఁడు, ఉత్సాహముతో తమ శౌర్యమునకు

తగినట్లు హమ్మను హోమ్మను భయంకర స్వనములతో, తమ శంఖనాదములు వ్యాపించు చుండఁగా, ఒండొరులు ఎదుర్కొనిరి. అప్పుడు, పాంచజన్యరవము యొక్క తీవ్రతకు ఏ మాత్రము చలింపక, ఆ శివుని భటులు ఇరువురు చేతులలో ధరించిన శూలములతో భయంకర మూర్తులై కవిసిరి.

గీ. అడరి హరిమేన శూలంబు నదుముటయును
జిఱు నగవుతోడ దివిజు లచ్చెరువు నొంద
వారి తేరిపై కుఱికి చేయారఁ బట్టి
విసరి యుత్తర *దిక్కున వీచి వైచె. 280

తా. అతిశయించి, ఆ భూతములు, హరి శరీరమును శూలములతో అదుమఁగా, వారి రథము పైకి దుమికి, చిఱునవ్వుతో, సురలు అచ్చెరు వొందఁగా, వారిని చేతులతో గట్టిగా చక్కగా బంధించి, త్రిప్పుచు ఉత్తరదిక్కునకు విసిరివేసెను.

పాఠాం. దిక్కుకై.

## కృష్ణుఁడు భూతద్వయమును గైలాసాద్రి పైఁ బడవేయుట.

కం. వైచిన నిరువురుఁ గైలా
సాచల శిఖరమునఁ బడి మహోద్భుత మతు లై
రాచంద మెల్ల హంసుఁడు
చూచి హరిం గ్రోధపరవశుం డై పలికెన్. 281

తా. ఈ విధముగా ఆ భూతములు రెండును కైలాస పర్వత శిఖరము పై పడిరి. ఆ వింతను హంసుఁడు చూచి, క్రోధ మావేశింపఁగా హరితో ఇట్లు పలికెను.

కృష్ణుఁడు, రక్షకులైన బలీయు లైన భూతముల రెంటిని, ఒకే సమయములో, కైలాసాద్రి శిఖరము పై పడునట్లు వేయుట, హంసునకు ఆశ్చర్యమును కలిగించినది. పరమ శివునికంటె హరి అధికుఁడను భావము, హంసునిలో కలిఁగె ననవచ్చును. మఱియు తన ఆరాధ్య దైవమునకు అవమానము కలుఁగుటచే, ఉద్రేకముతో హంసుఁడు క్రింది విధముగా పలికెను.

---

* దిక్కుకై

ఉ. "విఘ్నము చేసె దేల పృథివీపతి లోకము గప్ప మిచ్చె శ
త్రుఘ్నత రాజసూయ మఖదోహలి మాజనకుండు సత్కృపా
నిఘ్నుఁ [1]డు నెంత తోడ్పడిన నిన్ను ముదంబునఁ జూచు నీశిరో
దఘ్నము లింకఁ దెమ్ము కరదానముగాఁ గనకంపుఁ గాలువల్. 282

అర్థ: చేసెదు+ఏల. పృథివీపతి లోకము= రాజుల సమూహము; శత్రుఘ్నత= శత్రువులను కూల్చు; రాజసూయ మఖ దోహలి= రాజసూయము అనెడి యాగమును చేయుట యందు శ్రద్ధ కలవాఁడు; సత్కృపా నిఘ్నుఁడు= ఉదాత్తమైన దయకు వశుఁడు; నీ శిరోదఘ్నము= నీ తల పై భాగము వఱకు, నిలువెత్తు, కరదానము=కప్పమిచ్చుట; కనకము+కాలువల్ = బంగారు నాణెముల మొత్తములు (చిన్న ప్రవాహములు).

పాఠా. డొకింత.

తా. ఏల మా ప్రయత్నమునకు అడ్డుపడుచున్నావు? రాజు లెల్ల కప్పమిచ్చినారు. రాజసూయ సందర్భమున, మా తండ్రి శత్రురాజులను కూల్చుట యందు శ్రద్ధ కలవాఁడై యున్నాఁడు. కనుక, నీవెంత తోడ్పడిన, ఉదాత్తమైన దయగల మాతండ్రి, నిన్ను సంతసముతో అంతగా ఆదరించి అభిమానించును. నీ ఎత్తు బంగారు నాణెముల మొత్తమును, విరివిగా మాకు కప్పముగా అర్పించుటకు తెమ్ము.

వ్యా1. చేసెదవు+ ఏల? భూతకాలి క్రియలో 'వ' కార లోపము. చూడు, పద్యం 50.

2. కనకంపుఁగాలువల్: కనకము+ కాలువల్. పుంప్వాదేశనుగా గసంధి, చూ, వచన - 26, ఛందస్సు- "ఘ్న" దుష్కరప్రాసము.

ఉ. "రాజుల కేను రాజ మఱి రాజశిరోమణి రాజు దేవతా
రాజికి నెల్ల నీవసమె రాసెదు నాసరివాఁడుగా [2]విసీ
తేజము మాలి," తంచు నతితీక్ష్ణశరం బరిఁ బోసి యేసినన్
భ్రాజిత మయ్యె నప్డు హరిఫాలమునం దిలకంబుపోలికన్. 283

ప్రతి: రాజులకు+ఏను= రాజుకెల్లను నేను; రాజన్=రాజను; మఱి దేవతా రాజికిన్+ఎల్లన్=అట్లే దేవతల మొత్తమునకు; రాజశిరోమణి= చంద్రుని తలయందు మణి గాఁగల ఆభరణముగా (గలవాఁడు)శివుడు; రాజు= ప్రభువు; నీ వసమె రాసెదు నాసరివాఁడుగాన్+ఇసీ= నాతో సమానుఁడగుటకు పోటీ చేయుచున్నావు.

---

1. డొకింత 2. నిసీ

అర్థాంతరము: నీ వసమె రాసెదు= మమ్ము ఎదిరించుటకు నీకు శక్యమా (సాధ్యమగునా?) నాసరి వాఁడు గావు+ఇసీ; ఇసీ=ఛీ, (నిందార్థకము) ఇది తగదు; తేజము మాలితి+అంచున్=నీ పరాక్రమమును కోలు పోయితివి, అనుచున్; అతి తీక్ష్ణ శరంబు= మిక్కిలి వాఁడియైన బాణమును; అరి+పోసి= వింటినారిలో సంధించి; ఏసినన్=వేయఁగా; హరిఫాలమునన్= కృష్ణుని నొసటి యందు; తిలకంబు పోలికన్= బొట్టువలె; అప్డు; భ్రాజితమయ్యెన్= (అది) ప్రకాశించెను.

తా. రాజులకు నేనే రాజును. దేవతలకు ఎల్ల శివుడు రాజు, నీవు నా సరివాఁడగుటకు సాధ్యముకాదు. 'ఛీ' ఇది తగదు. ('రాజు' అనెడి గౌరవమును పొందలేవనుట)."నీ పరాక్రమము, ఇంతటితో నశించినది" అని, ఒక వాఁడియైన బాణము వేయఁగా అది హరి నొసటి యందు బొట్టువలె గ్రుచ్చుకొనెను.

అలం:1. ఉపమ, 'హరిఫాలమునం దిలకంబు పోలికన్',

2. అసంబంధాతిశయోక్తి: కృష్ణుఁడు రాజైనను, రాజవుకాదని తిరస్కారభావము చూపుట.

వ్యా1. రాసెదు: రాసెదవు, భూతకాలిక క్రియలో వకారలోపము. చూడుము, పద్యము - 50

2. రాజ(న్) (రాజును): ఈ శబ్దములో 'ను' వర్ణము, ప్రథమా విభక్తిలో, విశేషణము. అంతమున ఆగమముగా వచ్చును. ద్రుతమగుటచే ఒల్లని యెడ లోపించును. కనుక రాజ' సిద్ధించినది."రాజు" సూరిమతములో సంస్కృత సమము. బహుజనపల్లివారు దీనిని వైకృతమనిరి. సూ. కారక, బాల-33, ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబులకు, ఏకత్వంబున 'వును' లును బహుత్వంబున 'రుము'లును అంతాగమంబులు ప్రాయికంబుగ నగు. ఉత్వముకు అత్వము, సూ, కారక, బాల-34.

వ. ఇట్లేటు వడి విచారించి. 284

తా. ఈ విధముగా గాయపడి, ఆలోచన చేసి.

మ. ప్రకట స్యందన కేళికిం దగిన సారథ్యంబు చేయంగ సా
త్యకిఁ జాలించి తదాత్త చిత్రగతి రథ్యాడంబరం బొప్ప దా
రుకుఁ దేగం గడకాఁడిపై హుతవహ క్రూరాస్త్ర సంధాన కా
ర్ముకహస్తుండు మురాంతకుండు పలుకుం గ్రోధాంధుఁడై హంసుతోన్. 285

ప్రతి: ప్రకట స్యందన కేళికిన్= ప్రసిద్ధమైన తేరు నడపు క్రీడకు; తగిన సారథ్యంబు చేయంగ; సాత్యకిన్; చాలించి= నియమించి (తగిన వాఁడని) తద్+ఆత్త చిత్రగతిన్= ఆతనిచే పొందఁబడిన, వివిధములైన విన్యాసములతో రథ్య+ఆడంబరంబు+ఒప్పన్= గుఱ్ఱముల ఆటోపము తగియుండఁగా; దారుకుఁడు; కడ కాఁడిపై=కాఁడి చివఱకు; ఏ గన్, తొలఁగఁగా; మురాంతకుండు = హరి; హుతవహ క్రూర+అస్త్ర సంధాన కార్ముక హస్తుండు= అగ్ని సంబంధమైన తీవ్రమైన బాణములను సంధించి వింటిని చేత ధరించిన వాఁడై మురుని నాశము చేసినవాఁడు, కృష్ణుఁడు; క్రోధ+ అంధుడై= మిక్కిలి కినుకచే అత్యధికమైన ఆవేశము కలవాఁడై హంసుతోన్, పలుకున్.

తా. కృష్ణుఁడు తన రథమును నడపుటకు, సాత్యకి సమర్థుఁడని అతనిని నియమించెను. అతడు చిత్రగమనములతో రథాశ్వములను, వేగముతో నడపెను. దారుకుఁడు, సారథి, కాడి చివటికేగి కూర్చుండగా, మురసంహారి, అతిశయమైన కోపావేశముతో ఆగ్నేయాస్త్రము కల వింటిని ధరించి హంసునితో ఇట్లనెను.

వ్యు. హుతవహుఁడు – హుతమును (హోమద్రవ్యమును) మోసికొనిపోవు వాఁడు, అగ్ని.

ఉ. ఏమిర హంస కంస నరకేంధన బంధుర మచ్ఛరానలం
బామిషముం గొనం గలదురా విడిపింపఁగ నిన్ను నేఁడు సం
గ్రామము చేసి నన్నడుగు కప్పము దర్పము నీకు నేల నా
నా ముని బాధలం గమరినాఁడవు కాలిన *తాటిచంద మై. 286

అర్థ: కంస నరక+ ఇంధన బంధుర మత్+శర+ అనలంబు= కంసుండు, నరకుఁడు; అనెడి కట్టియలతో కూడియున్న (ఒప్పుచున్న) -వారిని దహించి జ్వలించుచున్న- నా బాణమునుండి వెలువడు అగ్ని; ఆమిషమున్=మాంసాహారముగా; కొనంగలదురా= గ్రహించుమురా!; నిన్ను; విడిపింపఁగన్= చంపక అది విడిచి పెట్టినచో; నేఁడు; సంగ్రామము చేసి= యుద్ధము చేసి; కప్పము; నన్ను+ అడుగు(ము); నీకున్+ఏలదర్పము?=(ఇంతలో) గర్వమునీకు ఎందులకు?; నానా ముని బాధలన్= మునులను పెక్కు బాధలు పెట్టుటచే; కాలిన తాటి చందమై= మాఁడిపోయిన తాటి చెట్టువలె (త్రాటి తాడువలె); కమరి నాఁడవు=కాలి యున్నావు.

తా. ఏమను చున్నావురా హంసా! కంసుఁడు, నరకుఁడు అనెడి కట్టియల కాల్చి వెలుఁగు నా బాణాగ్ని నిన్ను మాంసాహారముగా గ్రహింపగలదురా! అది నిన్ను నేఁడు చంపక వదలి పెట్టినచో, నాతో కయ్యము కావించి కప్పములను కోరుము. ఇంతలో

---

* త్రాటి

గర్వమేల? మునులను పెక్కు విధముల బాధలు పెట్టితివి. వానిచే, కాలి మాఁడిన తాటి చెట్టువలె, నల్లఁబడి యున్నావు.

అలం : 1. కావ్యలింగము. హంసవధకు వాక్యార్థమందు హేతువు గమ్యమైనది.

2. రూపకము. 'కంసనరకేంధన బంధుర!

3. ఉపమ. 'నానాముని బాధలం గమరినాఁడవు, కాలిన తాటి చందమై'. (ఇచట, త్రాటి చందమై అను పాఠాంతరముకంటె తాటి చందమై అనునదియే మేలైనది).

వివరణము : తాటి చెట్టు ఎత్తైనది. అట్లే హంసుఁడు పాలకుఁడై ఉన్నతుఁడు. తాటి చెట్టునకు 'మదాఢ్యం' అని పేరు కలదు. అందు మద్యమున్నది. హంసునిలో మదమున్నది. సామ్యము చక్కగా అమరినది. మునులను పలు బాధలు పెట్టినాఁడు. వారి బాధాగ్ని సెగలు అతని శీలమును కళంకితమొనర్చినవి. అగ్ని ఎట్లు తాటిని కాల్చి, నల్లవడఁజేయునో అట్లే మునుల బాధల వలన కలిగిన వారి తాపము, అతనిని మాఁడ్చి, కృష్ణుని అస్త్రముచే సులభముగా కబళింపఁదగినదిగాఁ జేసినది. దుశ్శీలుఁడగుటచే వధార్హుఁడని అలంకార ప్రయోజనము.

వ్యా. 1. అడుగు. అడుగుము. మధ్యమ పురుష'ము' వర్ణము లోపము. చూడుము, పద్యము - 93.

2. మచ్చరానలంబు మత్+శరానలంబు.ఛత్వాదేశ శ్చుత్వ సంధి. చూ. పద్యము - 24.

కం. "నినుఁ బొరిగొనియెద నిదె పో
జనులు మునులు విని ప్రమోద సంపదఁ దేలన్
మనుజాధమ!" యని తొడిగిన
యనలాస్త్రం బేసె నదరు లంటఁగ వాఁడున్. 287

అర్థ : అదరులు = నిప్పురవలు; అనల + అస్త్రంబు = అగ్ని దేవతకు చెందిన బాణము.

తా: 'ఓరీ! మనుజులలో నీచుఁడా! ఇప్పుడే జనులు మునులు విని అపరిమిత సంతోషము అనెడి సంపదలో తేలియాడు నట్లు తప్పక నిన్ను వధించెదను గాక!' అనుచు హరి, నిప్పురవలు మండుచు, అతనిని తాఁకునట్లు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను.

అలం: రూపకము, 'ప్రమోద సంపద'.

కం. వారుణ బాణంబున నది
వారించె మురారి యేసె వాయవ్యాస్త్రం
బా రాజకుమారుం డది
బోరన మాహేంద్ర బాణమున నడఁగించెన్. 288

తా: ఆ హంసుఁడు,దానిని వరుణ దేవత యొక్క బాణముచే తొలఁగించెను. హరి, వాయు దేవతకు చెందిన అస్త్రమేయఁగా,దానిని శీఘ్రముగా మహేంద్రునికి సంబంధించిన బాణముచే అణఁచివేసెను.

వ్యా. 'అది' వారించె 'అది' అడఁగించెన్. ఇందు "అది" అను పదములు ప్రథమా విభక్తిలో నున్నవి. సూ. జడంబు ద్వితీయకు ప్రథమ బహుళంబుగానగు. కారక, బాల - 24. "బాణము" జడమగుటచే ఈ సూత్రము వర్తించును.

గీ. హరి ప్రయోగించె మాహేశ్వరాస్త్ర మప్పు
డతఁడు రౌద్రాస్త్రమునఁ దోన యడ్డకట్టె
నిట్లు ప్రతి బాణముల హంసుఁ డెచ్చుఁ గుందు
లేక పోరాడె శౌరి కుద్రేక మెసఁగ. 289

తా: ఆ సమయమందు హరి, శివాస్త్రమును వేసెను. వెంటనే, హంసుఁడు రౌద్రాస్త్రముచే (రుద్రునికి చెందినది) దానిని నిరోధించెను. తనపై వచ్చు బాణములను ఎదుర్కొనుటలో హంసుఁడు సరివాఁడుగా నుండెను. అట్లగుటచే కృష్ణుఁడు క్రోధము పొంగి, పోరాడెను.

మ. సరి గాంధర్వము రాక్షసంబు మఱిపైశాచంబు బ్రాహ్మంబనన్
హరియేసెన్ వరుసన్మహాస్త్రముల నాహంసుండుఁ గౌబేర మా
సురమున్ యామ్యము వారుణంబుననఁ దేజోరూపశస్త్రంబుల
న్మరలించె న్మొదలింటి నాల్గిటి రణోన్మా దోద్భ టాకారుఁడై. 290

తా: హంసునితో సాటిగా హరి గాంధర్వము, రాక్షసము, పైశాచము, బ్రాహ్మము అనెడి మహాస్త్రములను నాల్గింటిని, వరుసగా ప్రయోగించెను. అమితోద్రేకముతో యుద్ధము చేయు తలంపు కలవాఁడై, హంసుఁడు రేఁగి, తొలి నాల్గింటిని, కుబేరునకు, నైరృతునికి, యమునికి, వరుణునకును చెందిన నాల్గింటితో, వెనుతిరుగునట్లు చేసెను.

వ్యా. 1. మొదలింటి : మొదలు+టి (ఔప విభక్తికము),

(చూడు, పద్యము - 271, పగలింటి).

సూ. ఆచ్ఛిక బాల - 36 చే 'టి' వర్ణమునకు ముందున్న ఉత్వము, ఇత్వమైనది. 'మొదలిటి'.

సూ. ఆచ్ఛిక, బాల - 32 చే 'మొదలింటి' అగును. (పూర్ణబిందువు వచ్చును).

2. నాల్గిటి : నాలుగు + టి (ఔపవిభక్తికము)

సూ. పద మధ్యంబుల 'నలదర'ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ప్రకీర్ణ, బాల - 17 నాల్గు+టి

సూ. ఆచ్ఛిక, బాల - 36 చే, ఉత్వమునకు ఇత్వము నాల్గిటి అగును.

గీ. అచ్యుతుఁడు బ్రహ్మశిర మనునస్త్ర మేయ
హంసుఁ డాయస్త్రమున నది యడఁగఁ జేసె
నచ్చెరువు నొంది మురవైరి యమునలోన
వార్చి వచ్చి మహోగ్ర భావంబు దాల్చి. 291

తా: హరి, బ్రహ్మశిరము అనెడి అస్త్రమును వేయఁగా హంసుఁడు ఆ యస్త్రమునే ప్రయోగించి, దానిని అడంచెను. కృష్ణుఁడు, అచ్చెరువును పొంది, యమునలో దిగి, అందలి జలమును గొని, ఆచమనము చేసి (సంధ్యా వందనకార్యమును ముగించుకొని) మరలి మిక్కిలి దారుణమైన (మనోభావము) సంకల్పము కలవాఁడై (మీఁది పద్యముతో)

విశే. హంసుని వధించుటకు ఆచమన పూర్వకముగ, దారుణమైన సంకల్పమును హరి కావించుకొనెను. శివభక్తుని చంపుట కష్టసాధ్యమైనది. శివ భక్తుఁడైనను క్రూరుఁడు కనుక అట్టి వానిని తొలఁగించుటకు ముందు తానును సామాన్యుని వలె సంధ్యావందన మాచరించి దుష్ట శిక్షణ కుపక్రమించెను.

వ్యు. అచ్యుతుఁడు - చ్యుతి లేనివాఁడు, హరి.

వ్యా. అది = దానిని, ద్వితీయార్థమున ప్రథమ వచ్చినది.

చ. తొడిగిన వైష్ణవాస్త్రమునఁ ద్రుంగితి పొమ్మని హంసు నేసినం
బిడుగుల పిండు వోలె నతిభీకరతం జను దేర మాఱుగాఁ

దొడుగు శరంబు లే కతఁడుఁ దోరపు బెగ్గిల మెత్తి వ్రేయఁగాఁ
గడువడిఁ దేరు డిగ్గి పడెఁ గాళియ నాగ మహా హ్రదంబునన్. 292

అర్థ: త్రుంగితివి+పొమ్మ = నశించితివి ఇది నిశ్చయము; పిండు = మొత్తము; తోరము(వి) స్థూలము (ప్ర); తోరము + బెగ్గలము = ఎక్కువైన బెదరు; ఎత్తి వ్రేయఁగాన్ = కూలునట్లు పడవేయగా; కడువడిన్ = మిక్కిలి వేగముతో; హ్రదము = మడువు.

తా: కృష్ణుఁడు వైష్ణవాస్త్రమును, వింటిలో సంధించి, 'దీనితో నీవు నాశమైతివిపో! (నీవు ఇప్పుడు మరణమునుండి తప్పించుకొనఁజాలవు?) అని హంసుని పై ప్రయోగింపఁగా, అది పిడుగుల పిండువలె భయమును ఎక్కువగా కలిగించుచు పైకి కవియుటచే, అతఁడు దానిని అడ్డగించుటకు తనకడ అస్త్రము లేకపోవుటచే బెదరు అదరు, కూలఁద్రోయగా కడువడి తేరునుండి దిగి కాళియ సర్పము యొక్క మడువులో దూఁకెను.

కాళియుఁడు, పాములకు రాజు. కద్రువ కుమారుఁడు. గరుత్మంతునకు భయపడి యమునా నదికి చెందిన యొక మడువులో దాఁగెను. అందలి జలము, విషపూరితమగుటచేత, దానిని పానము చేసిన వారికి హాని కలుగుచుండెను. కృష్ణుఁడు జనుల ప్రార్థన మేరకు, కాళియుని పడగలపై నెక్కి అతని పొగరు అడఁచెను.

అలం. వృత్త్యను ప్రాసము 'డ' కార మావృత్తమైనది.

నానా. నాగము = పాము, కొండ, ఏనుఁగు, పొన్న చెట్టు, నాగవాసము, శ్రేష్ఠము, లోహము మొదలగునవి.

వ్యా. చను + తెంచు, సూ. తెంచుధాతువు అగ్వాదులకు అను ప్రయుక్తంబగు. అగుచో ఉత్వంబుపైని దాని 'త'కారంబు 'ద'కారంబగు. అద్దానికి ముత్తు పరంబగునపుడు 'తే' తేరులగు, క్రియబాల-110, 113, సంజ్ఞా 40వ, సూ.

## - : కృష్ణుఁడు హంసుని యమునలో నడుగంటఁ ద్రొక్కుట : -

మ. కడు వేగంబున హంసుపై నుఱికి యాకంసారి కాళిందిలో
వడిఁ గాలం దలదన్నె లోకు లెఱుఁగ న్వాఁ డంతలోఁ జచ్చెనో
చెడెనో యెక్కడ వోయెనో యొకరును జెప్పంగ లే రప్పుడే
పడెఁ బాతాళ భుజంగవక్త్రముల నప్పాపాత్ముఁ డం డ్రెప్పుడున్. 293

అర్థ: కాళింది = యమునానది, సూర్యతనయ; ఆ పాపాత్ముండు + అం(డు + ఎప్పుడున్; పాతాళ భుజంగ వక్త్రములన్ = పాతాళ లోకమందున్న పాముల నోళ్లలో.

తా: కంసవైరి, కృష్ణుఁడు, కడువడిగా పరుగిడి లోకులెల్లరు తెలిసికొనునట్లు కాళింది మడువున దూఁకినట్టి హంసునిపై పడి కాలితో అతని తలను తన్నెను. ఆ పాదతాడనముతో వాఁడు అప్పుడే చచ్చెనో, చేటు పొందెనో (కృశించి నశించెనో) అచటి నుండి బ్రతికి ఎక్కడికైనను పోయెనో ఎవ్వరును చెప్పఁజాలరు. వెన్వెంటనే, దుష్టహృదయుఁడు హంసుఁడు, పాతాళమందున్న పెద్ద పాముల నోళ్లలో పడెనని జనులు ఎల్లప్పుడు చెప్పుకొందురు.

ఉ. ఈ తెఱఁ గాచరించి రథ మెక్కె మురారి ధరాధినాథ! నీ
తాత పితామహుం డయిన ధర్మతనూజుఁడు రాజసూయ వి
ఖ్యాతి వహించు నయ్యెడల హంసుఁడు ప్రాణముతోడ నున్న నే
లా తుదచేరు నధ్వరము లావున వాఁడొరు నేల కై కొనున్. 294

ప్రతి: ఈ మాటలను వైశంపాయనముని జనమేజయునితో వచించెను. ఈ తెఱఁగు+ఆచరించి = ఇట్లు చేసి; ధరాధినాథ! = పుడమితేఁడా!; మురారి = కృష్ణుఁడు; రథమెక్కెన్ = రథము నెక్కి వెడలిపోయెను; నీ తాత పితా మహుండు = నీ తండ్రియొక్క (పెద్ద) తాత; అయిన; ధర్మతనూజుఁడు = యముని తనయుఁడు, పాండవులలో పెద్ద, ధర్మరాజు; రాజసూయ విఖ్యాతి వహించు + అయ్యెడలన్ = రాజసూయ మనెడి క్రతువుచేసి కీర్తిని పొందు సమయమందు; హంసుఁడు ప్రాణముతోడ నున్నన్; అధ్వరము = ఆయాగము; ఏలా తుద చేరున్ = అదెట్లు పూర్తి అయియుండును? (పూర్తి అయి యుండదనుట); లావునన్ = శారీరక బలముచే; వాఁడు; ఒరున్ = ఇతరుని; ఏల కైకొనున్? = లక్ష్యము చేయును? అర్థాంతరము; ఒరు నేలన్ = ఇతరుని నేలను; కైకొనున్ = యుద్ధముచేసి వశము కావించు కొనును.

తా: ఓ జనమేజయా! కృష్ణుఁడు హంసుని యమునలో త్రొక్కి పిమ్మట ద్వారకకు ఏగెను. నీ పెద్ద ముత్తాత, ధర్మరాజు, రాజసూయము చేయు సమయమందు హంసుఁడు, జీవించి యున్నచో అది సమాప్తమై యుండదు. తన శారీరక బలముచే అతఁడు ఇతరులను లక్ష్యము చేయఁడు. అర్థాంతరము: వాఁడు రాజ్యమును వశము చేసికొని యుండును.

విశే. జనమేజయుని తండ్రి పరీక్షిత్తు. పితామహుఁడు అభిమన్యుఁడు, ప్రపితామహుఁడు

(ముత్తాత) అర్జునుఁడు. ఈ పద్యమందు ధర్మతనయుఁడనుటచే జనమేజయుని (పెద్ద) ముత్తాత అనుట స్పష్టము.

నానా. తాత = తండ్రికి తండ్రి, బ్రహ్మ, తండ్రి.

అలం: కావ్యలింగము : బ్రతికి యుండిన ముప్పు కలిగియుండునని హేతువు చెప్పఁబడినది.

కం. వరములు శరములు హరుచేఁ
దిరముగ హంసుండు వడయు దినమునఁ గాదే
ధర నవతరించె లక్ష్మీ
శ్వరుఁడు జగన్నాథుఁ డపుడు వార్ష్ణేయుం డై. 295

తా: హంసుఁడు తపస్సుచేసి శివుని మెచ్చించి, అతని నుండి స్థిరముగా వరములను, ఆయుధములను, పొందిన నాఁడే, భూమి యందు, లక్ష్మీపతి, జగములకు ప్రభువు వృష్ణివంశీయుఁడుగా, దుష్టశిక్షణకు శిష్టరక్షణకు అవతారమెత్తెను గదా!

తిరము(వి), స్థిరము (ప్ర)

వ. అద్దేవుండు గలుగుటం జేసి కౌంతేయు రాజసూయంబు నిర్వహించె నట్లు యమున మడువునం బడిన హంసుండు పొడవడంగుట సకలగంధర్వులు హరి నామకీర్తనంబున గీతంబు లొనర్చిరి తత్సమయంబున. 296

అర్థ: పొడవు + అడంగుటచే = చచ్చుటచే; గీతంబులు + ఒనర్చిరి = పాటలు పాడిరి.

తా: ఆ దేవుఁడు హరి, భూమిపై అవతరించుచే కుంతీ పుత్రుఁడు ధర్మరాజు రాజసూయమును జయప్రదముగ నిర్వహించెను. ఆ విధముగా హంసుఁడు యమున మడువున పడి మడియుటచే సకల దేవగాయకులు గంధర్వులు గానంబు కావించిరి. ఆ సమయమందు.

కం. హల ధరునితోడ డిభకుఁడు
దలపడి పెనఁగునెడ సూర్య తనయా సలిలం

బుల మునిఁగి హంసు డిలిగెం
దలఁకున ననుపలుకు వినియెఁ దత్రత్యులచేన్. 297

అర్థ: సూర్యతనయా సలిలంబులన్ = సూర్యుని పుత్రి, యమున యొక్క జలములలో; తలఁకున = భయముచే ఇలిగెన్ = చచ్చెను; తత్రత్యులచేన్ = అచ్చట నున్నవారి నుండి.

తా: బలరామునితో డిభకుఁడు పోరాడు నప్పుడు 'హంసుఁడు యమునలో మునిఁగి చచ్చెను' అను మాటలను అచట నున్న వారి నుండి వినెను.

వ్యా. నీలుగు ఈలుగు, ఇలుగు

సూ. హాదులయును 'ఈలుగు'లోనగు వాని తొలిహల్లునకు లోపంబు బహుళంబుగానగు. ప్రకీర్ణ, బాల - 10.

సూ. ఓయారాదుల తొలి దీర్ఘమునకు హ్రస్వంబు విభాషనగు. ప్రకీర్ణ, బాల - 12.

మ. విని వేగంబునఁ బాఱుతెంచి యమునా వేగంబునం బాక శా
సన శస్త్ర ప్రహతిం బయోధిఁ బడు నా శైలంబు చందంబునన్
మునిఁగెన్ వెంట హలాయుధుండు దఱమన్ మోహాంధ కారంబులో
మునిఁగెం దజ్జల మెల్లఁ దల్లడపడ న్మూపెట్టు వెట్టెన్ వడిన్. 298

ప్రతి: విని; వేగంబునన్; పాఱుతెంచి = పరుగిడి; యమునా వేగంబునన్ = యమున నీటి వెల్లువ వడిలో; పాకశాసన = ఇంద్రుని; శస్త్ర ప్రహతిన్ = వజ్రాయుధము యొక్క వ్రేటుచే; పయోధిన్ = సముద్రమందు; పడు = పడునట్టి; ఆ శైలంబు చందంబునన్ = మైనాకపర్వతము వలె; మునిఁగెన్; వెంట = వెంటపడి; హలాయుధుండు; తఱ మన్ = తఱుముకొనిరాఁగా; మోహ+అంధకారంబులో అవివేక మనెడి చీఁకఁటిలో; మునిఁగెన్ = అడఁగెను; తద్+జలమెల్లన్ = ఆ నీటినంతయు; వడిన్ = శీఘ్రముగా; తల్లడపడన్ = చెదరునట్లు; మూ డు + పెట్టు +పెట్టెన్ = మూడు సార్లు చేతులతో చఱచెను.

తా: అన్న, హంసుఁడు యమునలో పడెనను వార్తను విన్న డిభకుఁడు పరుగిడుచుపోయి, బలరాముఁడు వెంటపడి తఱుముకొని రాఁగా ఇంద్రుని వజ్రాయుధము వ్రేటుచే సముద్రమందు పడిన మైనాకునివలె (హిమవంతుని సుతుఁడు), యమున నీటి వెల్లువవడిలో దూఁకి మునిఁగి పోయెను. అతఁడు అవివేకమనెడి చీకఁటిచే కప్పఁబడిన విధమున అడఁగి పోయెను. అతివేగముగా నీటిని మూడు సార్లు తల్లడ పడునట్లు చేతులతో చఱచెను.

వ్యు. పాకశాసనుఁడు, పాకుఁడను పేరుగల రక్కసుని నాశము చేసినవాఁడు, ఇంద్రుఁడు.

అల: 1. ఉపమ : 'పాక శాసన శస్త్ర ప్రహతిం బడు నా శైలంబు చందంబునన్'.

2. రూపకము,మోహాంధకారము.

వ్యా. ముప్పెట్టు : మూ డు పెట్టు, చూడుము, పద్యము - 256.

వ. ఇట్లు డిభకుండు యమునాజలంబుల మునింగిన హంసుం గానక
యి ట్లని విలాపించు. 299

తా: సులభము.

సీ. "నాయెల్లినీడన నరలోక మేలుదు
నములావు వఱదపా లయ్యె నన్న
దేవేంద్రునకు నైనఁ దేఱి చూడఁగ రాని
గౌరవోన్నతి నీటఁ గలసె నన్న
పార్వతీపతి చేతఁ బడసిన దివ్యాస్త్ర
భూరిసంపద వెల్లిఁ బోయె నన్న
వలరాజునకు నైన వర్ణింపఁగాఁ దగు
తను విలాసం బేఱు గొనియె నన్న
గీ. యన్న నీయట్టియన్న న[1]న్నుదినంబు
గారవింపఁగ నుండ నేఁకరుదు నన్న
నింకఁ జాల నెవ్వగలచే నిచట నిలువ
నాకు నేల నీ[2]తోడిదే లోక మన్న." 300

అర్థ: ఎల్లి = తెల్లగొడుగు; లావు = బలము; వఱితిపాలు = ప్రవాహవశము; తేఱి చూడఁగ రాని = చక్కగా, (ధైర్యముతో) చూడఁజాలని; గౌరవ+ ఉన్నతి = గొప్పతనము యొక్క ఆధిక్యము (రణకృత్యముచే); భూరి సంపద = (గొప్ప) విలువైన ఐశ్వర్యము; వెల్లి = ప్రవాహము; ఏఱు = నది; ఏఁకరుదున్ = కొఱతను పొందుదును; ఇంకన్ = ఇఁకమీదట; ఇంకన్ = కృశించుచు; నెఱ+వగలచేన్ = నిండు దుఃఖముచే; ఇచట = ఈ నేలపై; నిలువన్ + చాలన్ = జీవించి యుండలేను; నాకు; నీతోడిదే = నీవుండు; లోకమే = చోటే; నాకు నేల = నాకు

1. నింక 2. లోకమగుదునన్న

ఇష్టమైన (ఆధారమైన ) భూమి. (అర్థాంతరము). చాల = ఎక్కువైన నెవ్వగలచే = నిండు శోకముచే; ఇచట = ఈ నేలపై; నిలువన్ = నిలుచుటకు; నాకున్, ఏల? = నీవులేక నేనేల జీవింపవలయును?; నీతోడిదే లోకము + అన్న = నీవున్నచోటే నాకును నివాసమన్న; పాఠాంతరము : నీలోకము + అగుదునన్న = నీవు చేరిన చోటునే చేరుదునన్న.

తా: 'నేను గొడుగు పట్టుకొని యుండగా ఆ నీడ యందుండి మనుష్యలోకమును పాలించెదను, అను విధమున నున్న నీ బలమంతయు జలప్రవాహమును చేరెను గదా! దేవేంద్రుఁడును నిలుకడగా చూడఁజాలని నీ గొప్పదైన గౌరవము నీటిని కలసెను గదా! శివుని వలన పొందిన దివ్యములైన అస్త్రములు గొప్ప సిరి, నదిలో పోయెను గదా! మన్మథుఁడు మెచ్చి వర్ణింపఁదగిన నీ శరీర సౌందర్యమంతయు ఏఱు హరించెను గదా! ఓ అన్నా! నీవంటి అనురాగ మూర్తి అయిన అన్న ప్రతిదినము నన్ను ఆదరించుటను కోల్పోయితిని గదా! ఇంక మీఁద, నీవు లేకపోవుటచే నిండు దుఃఖముతో కృశింపఁజాలను. నీవుండు చోటే నాకు ప్రియమైనది. (నీ వెచట నున్నావో అచటనే నేను కూడ ఉందును).

అలం: వృత్త్యను ప్రాసము: డిభకుని విలాపము ఆర్ద్రమై యున్నది. "అన్న" శబ్దము, మాటిమాటికి ప్రయోగింపఁబడుటచే, దుఃఖతీవ్రత దీప్తమైనది. మఱియు సమానార్థకములు, 'వఱితిపాలయ్యె' 'నీటఁగలసె' వెల్లిఁబోయె, 'ఏఱుగొనియె. అనునవి డిభకుని భ్రాతృప్రేమాతిశయమును, దైన్యమును, ప్రకటించుటకు సహకరించుచున్నవి.

వ్యా. 1. నెవ్వగ : నెఱ+వగ, ప్రాతాది సమాస సంధి.

2. నీడన : 'న' వర్ణకము. సప్తమ్యర్థకము. ఉకారాంతజడమునకు 'న' వర్ణకము విధింపఁబడినది.కారక బాల - 18. ఉదంతముకాని "నీడ" శబ్దమునకు "న" వర్ణకము వచ్చుట అపవాదము. నవర్ణకమును, తృతీయార్థకమున సోమన ప్రయోగించెను. చూ. పద్యము - 266.

3. వఱితి : వఱ్ఱు+తి = వఱితి సూ. అఱ్ఱు మొదలగు శబ్దములకు అంతాగమంబు 'తి' వర్ణంబును, రేఫంబున కొక్కటి లోపంబునగు. ఆచ్చిక - బాల 34. సూ. 'టితి' వర్ణంబులు పరంబులగునపుడు ఉత్వంబునకు ఇత్వంబగు. ఆచ్చిక, బాల - 36.

చం. అనుచు విలాప నాలసత నాయమునానది తీరభూమికిం
జని హరిఁ గాంచి 'యోరి పురశాసన శిష్యుని హంసుఁ గానవే'

యనుటయు 'వాఁడెపో యమున యందు మునింగె' ననంగ వెండియున్
మునుఁగుచుఁ దేలుచున్ డిభకమూఢుఁడు హంసునిఁ గానఁ డెయ్యెడన్. 301

అర్థ: విలాపన + అలసతన్ = దుఃఖముచే నైన; మందత్వముచే; మూఢుఁడు = తెలివిలేనివాఁడు!; ఏ + ఎడన్ = ఎచ్చటను (నీటియందు); కానఁడు = చూడఁజాలక పోయెను.

తా: అట్లు వచించుచు, దుఃఖ తీవ్రతచే కలిఁగిన అలసతతో యమున గట్టును చేరి, అచట హరిని చూచి, "ఓరీ! ఆ శివుని శిష్యుఁడైన హంసుని చూచితివా?" అని ప్రశ్నింపఁగా, కృష్ణుఁడు, తనంతకు తానే వాఁడు, యమునలో పడి మునిఁగి పోయెను.' అని చెప్పగా, ఆ వివేక విహీనుఁడు డిభకుఁడు యమునలో దుమికి అందలి జలములలో మునుఁగుచు తేలుచు, అన్నను వెదకెను. కాని ఎచ్చటను అన్న నీటిలో కానరాఁడయ్యెను.

వ్యా. డిభక మూఢుఁడు, విశేషణోత్తర పదకర్మధారయ సమాసము - మూఢుడైన డిభకుఁడు

2.ఏ+ఎడన్ = త్రిక సమాస సంధి. చూడు పద్యము 7, 15.

వ్యు. పురశాసనుఁడు, త్రిపురములను శాసించిన వాఁడు, శివుఁడు.

కం. వ్రేలెడు వెంద్రుక లిరుగడఁ
దూలఁగ దలయూఁచుఁ దొప్పుతొప్పున నోరుం
గేల నడిచికొను సెలవుల
లాలలు దొరుఁగంగ నన్నలా యని యొఱలున్. 302

ప్రతి: ఇరుగడన్ = (తలకు) రెండు ప్రక్కలు; వ్రేలెడి వెంద్రుకలు = సిగ వీడి క్రిందికి వ్రేలాడుచున్న తల వెంద్రుకలు; తూలఁగన్ = అటునిటు కదలు చుండఁగా; తల ఊఁచున్; తొప్పు తొప్పునన్ = "తొప్పు" అను ధ్వని కలుఁగునట్లు; నోరున్ = నోటిని; కేలన్ = చేతితో; అడిఁచికొనున్ = కొట్టుకొనుచు; సెలవులన్ = పెదవుల మూలలలో; లాలలు = (లాలాజలము), ఎంగిలినీరు; తొరుఁగంగన్ = కాఱుచుండఁగా; అన్నలా = "ఓ అన్నా!" అనుచు; ఒఱలున్ = ఏడ్చును.

తా: తల ముడి వీడి వెంద్రుకలు జాఱి తలకు రెండు ప్రక్కలందు వ్రేలు చుండఁగా, తలను ఇటునటు త్రిప్పుచు తొప్పు తొప్పు (దొప్పు-దొప్పని రూపాంతరము) అని ధ్వని చేయుచు నోటిని చేతితో చఱచుకొనుచు, పెదవుల అంచులలో ఉమ్మి నీరు కాఱుచుండఁగా, "ఓ అన్నా" అని అఱచుచు రోదించెను.

వ్యా. అన్నలు+అల - సూ. దేశ్యంబులం గొన్ని యెడల స్త్రీవాచక స్త్రీ సమంబులగు సంబోధ్య వాచక శబ్దంబుల మీఁదిఏకవచనంబునఁగాన శబ్దంబొండును "అల", యను అవ్యయం బొండును గానంబడియెడి, అల దీర్ఘాంతంబునగు. శబ్ద, ప్రౌఢ - 15 (సంధి నిత్యము).

కం. ఆలం దల యడిచికొనున్
నేలం బడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలిఁ బడి రిపులు చూడఁగ
నాలుక వెడలికికొనుఁ జావునకుఁ దన్ని కొనున్. 303

తా: శిలలతో తలను కొట్టుకొనును. నేలపై పడిపొర్లును. పైకిలేచును. రక్తమును నోటినుండి క్రక్కును. శత్రువులు చూచు చుండఁగా, వారి నవ్వులకు (హేళనకు) లోనై నాలుకను వెలుపలికి లాగును. చావునకై కాళ్లను తన్నుకొనును.

విశే. అవివేకియైన డిభకుఁడు వెఱ్ఱి వానివలె ప్రవర్తించి, వికృతమైన చావును పొందెను. ఇది ఆత్మహత్యా సదృశము. వీరులకు తగనిది. కరుణరసమునకు హాస్యము అంగము. (301, 302, 303పద్యములు).

వ. ఇట్లు దుర్మరణంబున హంసడిభకులు వొలిసిరి తదనంతరంబ గోవిందుండు గోవర్ధనాచలంబున బలభద్రసాత్యకి ప్రభృతి యాదవలోకంబుతోఁ గొంతవడి వినోదించు నవసరంబున. 304

అర్థ: పొలిసిరి = చచ్చిరి.

తా: ఈ విధముగా హంసడిభకులు (వీరోచిత మరణంబును పొందక) చెడ్డ చావునకు వశమై ప్రాణములను వీడిరి. పిమ్మట గోవిందుఁడు గోవర్ధన గిరి యందు బలరామసాత్యకి మొదలగు యాదవుల మొత్తముతో, కొంత కాలము ఆటలతో ప్రొద్దు పుచ్చు సమయమందు.

నానా. వడి=వేగము, కాలము.

**- : యశోదయు నందుఁడును గృష్ణుని జూడ వచ్చుట : -**

శా. గోపాలాగ్రణి రేవతీరమణుతో గోవర్ధనాధిత్యకా
వ్యాపారుం డయినాఁ డనంగ విని భావం బేతదాలోకచిం

తాపూర్ణంబుగ నందగోపుఁడు యశోదా దేవియు న్వచ్చి భృ
త్యోపానీతము లైన కానుకలు దారొప్పించి రేర్పాటుతోన్. 305

ప్రతి: గోపాల+అగ్రణి = గొల్లవారికి మేటి అయిన కృష్ణుఁడు; రేవతీరమణుతోన్ = రేవతి పతియైన బలరామునితో; గోవర్ధన +అధిత్యకా వ్యాపారుండు + అయినాఁడు = గోవర్ధనమను పేరు గల కొండయొక్క మైదానములందు సంచరించువాఁడయి నాఁడు; అనంగన్ విని = విన్నవారై; భావంబు = తలంపున; ఏతద్+ఆలోక.చింతాపూర్ణంబుగన్ = వారిని చూడవలయునను కోరిక నిండఁగా; నంద గోపుఁడు యశోదాదేవియున్ వచ్చి; భృత్య + ఉపానీతములైన = సేవకులచే తేఁబడిన; కానుకలు; ఏర్పాటుతోన్ = క్రమమైన విధమున; తారు = తాము; ఒప్పించిరి = (రామకృష్ణులకు) అర్పించిరి.

తా: వ్రేపల్లెలో బాల్యమందు వసించిన తన పెంపుడు పుత్రుఁడు గొల్లపిల్లల కెల్ల మేటి ముద్దుల గోపాలకృష్ణుఁడు, బలరామునితో గోవర్ధన పర్వత ప్రాంతములలో విహరించుచున్నాడని, విన్నవారై నందుఁడును, యశోదయు, ఇరువురును వారిని చూడవలెనను వాంఛ మనస్సులో నిండఁగా, అచటికి ఏ తెంచి తమతో సేవకులు తెచ్చిన కానుకలను క్రమముతో, వారిరువురికి అర్పించిరి.

విశే : నందుఁడు - ఇతని భార్యయశోద. వీరికి యోగమాయ తనయగ జనించెను. ఈ పసికందును వసుదేవుఁడు కొనిపోయి నందునియింట శిశువైన కృష్ణుని స్థానములో పెట్టెను. తన సుతుఁడనుకొని, యశోదా నందులు ఆ బాలుని పెంచి పెద్ద జేసిరి.

నానా. భావము = తలంపు, సారము, హృదయము, అభిప్రాయము, స్వభావము, పుట్టుక, రత్యాది భావము, జాతక భావము మొదలగునవి.

క. ఇతరేతర సందర్శన
కృతాభివాదనుల రామకృష్ణులఁ బ్రీతిన్
సతియును బతియుం జూచిరి
సుతులుం బితృభక్తి నెఱయఁ జూచిరి వారిన్. 306

ప్రతి: ఇతర+ఇతర = ఒకరినొకరు; సందర్శన = చూచుటచేత; కృత+అభివాదనులన్ = చేయఁబడిన సాగిలి మ్రొక్కుటను గల; రామకృష్ణులన్; ప్రీతిన్; సతియు = భార్య యశోదయు; పతియున్ = భర్త నందుఁడును; చూచిరి; వారిన్; సుతులున్ = కుమారులు బలరామకృష్ణులును; పితృభక్తి నెఱయన్ = తలిదండ్రుల యెడ ప్రేమ గౌరవాభిమానములు నిండారఁగా భక్తితో; చూచిరి.

తా: ఒకరిని మఱొకరు ఇట్లు అందఱును ఒకరినొకరు దర్శించిన తర్వాత బలరామకృష్ణులు తలిదండ్రులకు ప్రణామ మాచరించిరి. వారిని సంతోషముతో యశోదానందులు కనిరి. ఆ సుతులును, మాతాపితల యెడ గల భక్తితో వారిని ఆదరించిరి.

వ. అప్పు డామురాంతకుండు నందగోపునితో నిట్లనియె. 307

తా: పిమ్మట కృష్ణుఁడు నందునితో ఇట్లు వచించెను.

సీ. "పసి గ్రేపుఁ బెనుచునే? పాఁడిమొల్లం బెట్లు?
మెకము దాఁటదు గదా? మేపు గలదే?
తొడఁ గాలితఱుపుల విడుతురా తొడి తొడి?
జన్నెలఁ దరివట్టు జాడ గలదె?
వెలికల్ల వైతురా వేల్పులఁ గుడుపుచోఁ?
గదుపులో నే[1]పోతు గడవఁ బాఱు?
[2]సలగ [3]పెన్నులఁ గొన్ని జట్టి చూపరు గదా?
బెదరిన నిలుగూఁతఁ బెట్టఁ గలదె?

గీ. వల్లె వైచువా రెవ్వరు మల్ల రాల?
లంపు గలతొఱ్ఱులను గూయ లావు గలదె?
యేర్పు దాఁటులలోఁ దొఱఁ గెఱుఁగ ఁబడునె?
[4]పరికరము కోడె లమ్మెడుపాటి గలదె.?" 308

ప్రతి: పసి= పాడియావు; క్రేపున్ = దూడను; పెనుచునే = పాలిచ్చి పెంచు చున్నదా? (దూడను పాలు త్రాగనిచ్చునా? అనుట); పాడి మొల్లంబు+ఎట్లు? = పాలు, పెరుగు, వెన్న నేయి మొదలగు వాని సమృద్ధి యెట్లున్నది?; మెకము దాఁటదు గదా! = దుష్ట మృగములు పశువులపై పడవుగదా!; మేపు గలదె! = పచ్చిక బాగుగా పెరిగి పశువులకు, అవసరమైనంత తిండి ఉన్నదా!; తొడకాలి తఱుపులన్ = తొడకు వాత వేసిన పెయ్యదూడలను; తొడితొడి = మేపుటకు, విడివిడిగా, వడివడిగా విడుచుచున్నారా? (తఱుపు = ఏడాది వయసు మించిన ఆఁడు దూడ, వాతమువలన జబ్బులు రాకుండుటకై వెనుక కాళ్లపై వాఁతలు వేయుదురు. అప్పుడు అవి నడవఁజాలవు కనుక మేఁతకు వేఱుగా, మెల్లగా నడి పింపవలెను. మందలో తోలి వానికి శ్రమ యియ్యరు కదా?); జన్నెలన్ = శివపార్వతులకు, ఇతరదేవతలకు ఉద్దేశించిన

1. తొఱ్ఱు 2. సలిగ; సలిగె. 3. పన్నులు 4. పదుదరము

వేఱుగా నుంచిన మీఁగడగల పెరుగును; తరిపట్టు = కవ్వముతో చిలికి, మజ్జిగచేసి వెన్న తీయుట లేదుగదా! (పూజార్థమైన పెరుగును త్రచ్చుట దోషము. వానిని విడిగా పెట్టుదురు గదా!); అర్థాంతరము, దేవతల ప్రీతికై యథేచ్ఛగా సంచరించుటకు అచ్చువేసి వదలిన ఆఁబోతులను నిర్బంధించుచున్నారా? సేద్యపు పనులకు ఉపయోగించుచున్నారా! (అట్లు చేయుట దోషము); వేల్పుల కుడుపుచోన్ = దేవతలకు నైవేద్యమిచ్చునపుడు; వెలికల్ల వైతురా = (ఆ నైవేద్య ముంచిన స్థలమందు) వెలుపల చుట్టును పిల్లులు కుక్కలు తినకుండుటకై వెలుగును (కంచెను) నిర్మించుచున్నారా; కదుపులోన్ + ఏపోతు = ఆవుల మందలో ఏ ఎద్దు? (పాఠాం. తొఱ్ఱు); కడవన్ పాఱు = మందనుండి తప్పించుకొని పోవుచున్నది?; సలగ పన్నులన్ = పండినధాన్యమును కొలుచువారికి పండిన ధాన్యము యొక్క పరిమాణమును బట్టి ఇచ్చు పన్నులకై, మఱియు యజమానులకు ఏటా పాలమునకై; ఇచ్చెడి పన్నుకై కొన్ని జట్టి చూపరుగదా = కొన్ని గోవులను అమ్ముటకు ప్రయత్నింపరు గదా!; బెణకినన్ + ఇలుకు + ఊఁతన్+పెట్టన్+కలదె! = కాలి నరములు బెణకినపుడు అనఁగా నరములు చెదరి కాలికి నొప్పి కలిఁగినపుడు ఆవుల కాలికి ఇరువైపుల కొయ్య బద్దలు ఆధారముగా కట్టుచున్నారా?; అర్థాంతరము, బెదరినన్ = క్రూర మృగాదులు వెంటవబడి తఱుమఁగా భయపడినప్పుడు; ఇలు కూఁత పెట్టన్ + కలదె! = దారితప్పిన ఆవులు మరల ఇంటి పట్టునకు చేరుటకై దీనముగా కూఁతలు పెట్టుచు ఇంటికి మరలు చున్నవా?; మల్లర+ఆలన్ = మదించిన ఆవులను; వల్లెవైచు వారు +ఎవ్వరు? = గాఁడి యొద్ద త్రాళ్లతో (పలుపులతో ఎవరు కట్టుచున్నారు?) వల్లె = పశుబంధన రజ్జువు (శ.ర); లంపుగల తొఱ్ఱులను + కూయన్ లావు గలదె = దొంగమేఁతకు అలవాటు పడ్డ ఆవులను వానిని కేకవేసి ఇంటికి తెచ్చుటకై సేవకులకు తగిన శక్తి యున్నదా?; ఏర్పుదాటులలో తొఱఁగు = మంటలకు వశమై విడిపోయిన గోవులను (తొఱఁగు); ఎఱుక పడునె = గుర్తించుచున్నారా? (ఇంటిలో మందను గమనించి ఏవి తప్పిపోయినవో తెలిసికొను చున్నారా?); పరికరము కోడెలు = కాఁడికి మరపఁదగిన లేఁత మగ దూడలను; అమ్మెడు పాటి గలదె = విక్రయించు పద్ధతి యున్నదా?; పాఠాం. పదుదరము.

తా: ఆవులన్నియు దూడలకు పాలిచ్చి పెంచుచున్నవా? పాడి పెంపు ఎట్లున్నది? క్రూర మృగబాధలేదు గదా? పశువులకు మేఁత తగినంత యున్నదా? కాలి వాఁతలు గల లేఁగ దూడలను విడిగా మందలో తోలక మెల్లగా విడుచు చున్నారు గదా! పూజార్థమైన పెరుగును త్రచ్చరు కదా? (ఆఁబోతులను వ్యవసాయ కార్యములకు వాడరు గదా?) దేవతల కొఱకు సమర్పించిన బలి ద్రవ్యముల రక్షణకై వెలుపల కంప వెలుగును ఏర్పాటు చేయు చున్నారా? మందనుండి ఏ గోవు తప్పించుకొని పోవునో ఎఱుఁగుదురా?కొలఁతకు గాను, పన్నులకును గోవులను అమ్మరు గదా? చెదరిన గోవులనొప్పిని పోగొట్టుటకు కాలికి ఇరుప్రక్కలందు కొయ్య దబ్బలు కట్టుచున్నారా?

(అర్థాంతరము) క్రూరమృగాదులకు భయపడిన గోవులు కూఁతలు పెట్టుచు ఇంటికి వచ్చుచున్నవా? మదించిన గోవులను గాఁడిలో పలుపులతో ఎవరెవరు కట్టుచున్నారు? దొంగ మేఁతకు అలవడిన ఆవులను ఆఱిచి వానిని పట్టి తెచ్చుటకు (సేవకులకు) తగిన బలమున్నదా? అడవి మంటలలో చిక్కుకొని తప్పిన వానిని తెలిసి కొనుచున్నారా? కాఁడికి మరపుటకు తగిన మగదూడలను అమ్మెడి పద్ధతి యున్నదా?

అలం : స్వభావోక్తి

అలనాఁటి వాడుకలో గల తీపారెడు అచ్చ తెనుగుశబ్దములు, గోశిక్షణ విషయమును, భావగాంభీర్యముతో పరమాహ్లాద కరముగ వ్యక్తీకరించుచున్నవి. సకల భాషాభూషణ సాహిత్య రసపోషణ బిరుదములు సమర్థములని నిరూపించుటకు ఈ పద్యమొక మచ్చు తునుక.

జన్నెము (వి) యజ్ఞము (ప్ర)

రూపాం. సలిగ, సలిగె, సలుగ.

వ్యా. ఆలు ఆవులు, సూ. బహువచనంబు పరంబగునపుడు ఆవు ప్రభృతుల తుది అక్షరంబునకు లోపంబు విభాషనగు. ఆచ్చిక, బాల - 22.

వ. అనుటయు నతండు. 309

తా : సులభము.

క. "నినుఁ గన్ను లార నెప్పుడుఁ
గనుఁ గొనఁగా లేనివగపు గల దొక్కటియున్
వనజోదర! నీయాదర
మునఁ దక్కినపనుల మాకు మోదము గొఱఁతే." 310

తా: ఓ పద్మనాభా! నిన్ను మాకన్నులకు తృప్తిగా ఎల్లప్పుడును చూడలేకపోయితిమి గదా! అనెడిచింత (వగపు) ఒక్కటియే మమ్ము బాధించును. నీ దయ వలన మాకు తక్కిన పనులలో సంతోషమునకు, తక్కువ యుండునా? (సంతోషముతో జీవించుచున్నా మనుట).

వ. అనుటయు నచ్యుతుండు యశోదం జూచి యి ట్లనియె. 311

తా : సులభము

శా. "తల్లీ నిన్నుఁ గనుంగొనంగఁ బడయన్ ధన్యుండ నైతిన్ జగం
బెల్లన్నిన్ను నుతించి మ్రొక్కిన ధనాధీశోన్నతిన్ నిత్యమై
చెల్లున్నాకుఁ బ్రియంబు చేయునదియై చెన్నొందు నావారు ని
న్నుల్లం బారఁ దలంచు వారు పరమాయుః ప్రాపి తారోగ్యులున్. 312

అర్థ: ధన+అధీశ+ ఉన్నతిన్ = కుబేరుని యొక్క గొప్పతనమును; చెల్లున్ = లభించును; చెన్ను+ఒందున్ = ఒప్పును; నావారు = నా భక్తులు (బంధువులు); పరమ +ఆయుః ప్రాపిత+ఆరోగ్యులున్ = పూర్ణాయువుతో ఆరోగ్యవంతుఁలగుదురు.

తా: ఓ తల్లీ! నిన్ను చూచుటచే నేను ధన్యుఁడనైతిని. లోకములో జనులందఱు నిన్ను స్తుతించుచు మ్రొక్కినచో కుబేరుని గొప్పతనమును (సంపదను) నిత్యము పొందఁగలరు. అది నాకు ప్రియమగును. నిన్ను మనసార తలంచువారే నా బంధువులు (భక్తులు). వారందఱు నిండు జీవితమును ఆరోగ్యమును పొందఁగలరు.

విశే. "తల్లీ! నిన్నుఁ దలంచి" అనుపోతన పద్యమందు సోమన పద్యచ్ఛాయ కన్పట్టును.

వ. అనుచు నయ్యిరువురకు యథోచితోపచారంబు లాచరించి నిజ నివాసంబులకు వీడ్కొల్పి యనంతరంబు మురాంతకుం గాంచి వారిచే నర్ఘ్యపాద్యంబులు మొదలగు నుపచారం బులం బరితోషంబు నొందిన పిదప వా రిట్లనిరి. 313

అర్థ : యథా+ ఉచిత+ఉపచారంబులు = తగిన సేవలు; అర్ఘ్యపాద్యంబులు = నీటిచే చేతులను పాదములను కడుగుట, చందనము పూయుట; ఉపచారంబులన్ = పూజలతో; పరితోషంబున్ ఎక్కువ సంతోషమును; ఒందిన పిదప = పొందిన పిమ్మట.

తా: అని వచించుచు మురారి ఆ యశోదానందులకు ఏయే సేవలు తగునో వానిని నిర్వర్తించి వారిని వారి ఇండ్లకు వీడ్కొల్పి తర్వాత పుష్కర సరస్తీరమునకు వచ్చి మునివరులను కాంచి వారిపూజలచే అతిశయమైన సంతోషమును పొందెను. పిమ్మట వారు, కృష్ణునితో ఇట్లు పలికిరి.

కం. "ఓహో! విచక్రుఁ జంపుట
సాహస మొరు లైన వానిఁ జంపం గలరే?

యా హంసడిభకు లెవ్వరి
చే హతు లయ్యెదరు నీవు చెఱుపక యున్నన్. 314

తా: ఓహో! (ఆశ్చర్యార్థకము) విచక్రుని చంపుట సాహసముతో కూడిన ప్రయత్నము. ఆతనిని ఇతరులు చంపఁగలరా? నీవు, ఆ హంసడిభకులకు దుర్మరణమును కలిగింపకున్నచో ఎవ్వరిచే వారు హతులయ్యెదరు? (ఇతరులెవ్వరును అతనిని చెఱుపఁజాలరు. దానికి నీ వొక్కఁడవే చాలిన వాఁడవు).

వ. అని కొనియాడి యద్దేవునితో వెండియు. 315

తా : సులభము

సీ. చక్రంబు మేదినీచక్రంబు నేదేవు
దక్షిణ బాహుసౌందర్య మొసఁగు
జలజంబు నొక పాణి జలజంబు నేదేవు
సవ్యభుజంబుతో సరస మాడు
రత్నంబుఁ గామినీరత్నంబు నేదేవు
వక్షస్థలంబున వన్నె మిగులు
నోఘంబు దానవార్యోఘంబు నేదేవు
చరణ పల్లవ సమా శ్రయము నొందు
గీ. భాను మండలమును సుధా భాను మండ
లంబు నేదేవుకన్నుల లావు వడయు
దేవదేవు నద్దేవునిఁ దెలియువారు
దేవ దేవుని రూపంబుఁ దెలియువారు. 316

ప్రతి: చక్రంబున్ = సుదర్శనమనెడి చక్రాయుధమును; మేదినీ చక్రంబున్ = భూమండలమును; ఏదేవు = ఏదేవుని యొక్క; దక్షిణ బాహు = కుడిచేతికి; సౌందర్యము + ఒసగున్ = అలంకారములై అందము నిచ్చునో (యోగనిద్రనుండి లేచిన విష్ణువును భూదేవి కామింపఁగా ఆమెను హరి కుడిచేతితో గ్రహించెను. ఆమె సుతుఁడే నరకుఁడు); జలజంబున్ = శంఖమును; ఒక పాణిన్ = ఒక చేతిలో; జలజంబున్ = పద్మమును; ఏ దేవు; సవ్య భుజంబుతో = ఎడమ చేతితో; సరసమాడు; (పైనున్న ఎడమ చేతిలో శంఖము, క్రిందనున్న

ఎడమ చేతిలో పద్మము ఉన్నవి); రత్నంబున్ = కౌస్తుభమణియును; కామినీరత్నంబున్ = వనితలలో ఉత్తమురాలైన లక్ష్మీదేవియును; ఏదేవు; వక్షస్+స్థలంబునన్ = ఱొమ్మమీఁద; వన్నె మిగులున్ = చక్కని కాంతితో అతిశయించునో; ఓఘంబున్ = గంగానదియును; దానవ+అరి ఓఘంబున్ = రక్కసులకు శత్రువులైన దేవతల మొత్తమును; ఏదేవు చరణపల్లవ = ఏ దేవుని యొక్క చిగురు వంటి ఎఱ్ఱనైన పాదములను; సమాశ్రయమున్ + ఒందున్ = గొప్ప రక్షణ ప్రదేశముగా చేరునో; భానుమండలము = సూర్యమండలమును; సుధా భానుమండలంబున్ = చంద్రుని; ఏదేవు కన్నుల లావు+పడయు = ఏదేవుని కన్నుల వలన బలము పొందునో ఎవని కన్నులపై వర్ధిల్లునో; (అట్టి) దేవదేవున్ + ఆదేవునిన్ +తెలియు వారు = ఆ దేవతలకు దేవుఁడైన వానిని విష్ణువుగా తెలిసికొనిన వారగుదురు.

తా: సుదర్శన చక్రము, భూమండలము కుడిచేతికి అందమును ఇచ్చుచున్నవి. ఎడమ చేతులలో శంఖము పద్మములు ఉన్నవి. ఱొమ్ము మీఁద కౌస్తుభమణి వెలుఁగు చున్నది. అచ్చటనే లక్ష్మీరమణియు లావణ్యముతో నున్నది. దేవతల మొత్తము ఆతని ఎఱ్ఱని పాదములను ఆశ్రయించుచున్నది. సూర్యుఁడును, చంద్రుఁడును ఆతని, కన్నులపై వృద్ధినిపొందుచున్నారు. అట్టి దేవతలకు ప్రభువైన ఆతని ఎఱుఁగు వారెల్లరు మహావిష్ణువైన పరబ్రహ్మ స్వరూపమును తెలిసినవారే. కృష్ణుఁడు సాక్షాద్విష్ణువని భావము.

అలం: 1. అంత్యానుప్రాసము "ఏదేవు" అను పదము నాలుగు పాదములలో అంతమందు ఆవృత్తమైనది.

2. ఛేకానుప్రాసము రెండు సార్లు 'దేవదేవు', 'తెలియువారు' ఆవృత్తమైనవి.

3. యమకము, అర్థభేదముతో 'చక్రంబు', 'జలజంబు' 'రత్నంబు', 'ఓఘంబు' 'సుధాభానుమండలము' రెండు సార్లు ప్రయోగింపఁబడినవి.

గమనిక : కుడిచేతిలో సుదర్శన చక్రమున్నది. ఎడమ చేతులలో, జలజము = శంఖము పద్మము ఉన్నట్లుచెప్పఁబడినది.

షష్ఠాశ్వాసమందు, బాణునితో యుద్ధము చేయుటకు శౌరి ధరించిన ఆయుధక్రమము చెప్పఁబడినది. (25వ, పద్యము).

భావము : ఎడమవైపు విల్లు శంఖము, పలక పాశము, - కుడివైపు అమ్ము చక్రము కత్తి గద, ఎనిమిది చేతులలో ధరించెను. ఈ 25వ, పద్యములో పద్మమున్నట్లు చెప్పఁబడలేదు. దానికి మాఱుగా ఎడమవైపు పాశము ఉన్నది. పాశాయుధుఁడు వరుణుఁడు పాశము నీటిలో పుట్టినదని తలంచిన జలజమునకు పాశమను అర్థము కుదురును.

కంచిలో గల "అష్టభుజపెరుమాళ్" ప్రాచీనాలయమందు విష్ణువు యొక్క కుడి చేతులలో చక్రము, కత్తి పద్మము అమ్ము, ఎడమ చేతులలో శంఖము ధనువు, పలక, గద ఉన్నవి. యుద్ధమునకై పద్మమునకు మాఱుగా పాశాయుధమును ధరించెననవచ్చును.

(పుట - 45. కంచి - 1992. ఆంగ్లగ్రంథము. సంపాదకుఁడు నందిత కృష్ణ - మద్రాసు).

మ. అని తన్నుంగొనియాడు సంయముల నత్యానంద దృష్టిం గ
నుంగొని తీపారెడు మాటలం జవులుపెక్కుల్ చూపి వా రాదరం
బున వీడ్కొన్న యనంతరంబ మిగులం బొంగారు సైన్యంబుతో
జనియెన్ ద్వారవతీపురంబునకుఁ గంస ధ్వంసి నిశ్చింతుఁడై. 317

అర్థ: తీపు + ఆరెడు = తియ్యనైన; చవుల్ = రుచులు; సత్య శమ దమములు, వాని స్వరూపములను.

తా: అని తన్ను స్తుతించు మునులను, అధికమైన సంతోషముతో కూడిన చూపులతో చూచి, మధురములైన వాక్కులతో సత్యము, శమము దమము మొదలగు గుణములను గుఱించి పెక్కు విషయములను తేటపఱచి, వారందఱు తృప్తితో తన్ను వీడ్కొని వెడలిన పిమ్మట, చింతను వదలి ఉత్సాహముతో నిండి యున్న సేనతో ద్వారవతికి పోయెను.

వ్యు. సంయమి, ఇంద్రియములను వశము చేసికొన్నవాఁడు, ముని.

వ. ఇట్లు విచక్రవిదారణంబు చేసి హంసడిభకవధం బాపాదించి
మునియతీంద్ర నివహంబునకు మోదం బొనరించి నిజ నగరంబున
నీలవర్ణుండు నిత్యోత్సవ పరిపూర్ణుండై యుండె నద్దేవునిగుణంబులు
గొనియాడుటకు సహస్రచతురాననులకుం గొలంది గాదని వైశం
పాయనుండు జనమేజయునితో నింక నేమి విన వలతు వనుటయు. 318

తా: ఈ విధముగా విచక్రుని, హంసడిభకులను వధించి మునుల మొత్తమునకు సంతసమొనగూర్చి ద్వారకలో కృష్ణుఁడు నిత్యము జరుగు ఉత్సవములలో సర్వశక్తి సంపన్నుఁడై ప్రకాశించెను. ఆదేవుని గుణములను నుతించుటకు, వేయి బ్రహ్మలకును

తరముగాదు, అని వైశంపాయన ముని, జనమేజయునితో వచించి దీని తర్వాత ఏకథను వినఁదలఁచితివి అని కోరుటయు,

ఉ. సారస నీలతామరస సమ్మద కారణనేత్ర నిర్మలో
దార విహారమానస విధాయిత తాపసముఖ్య సంతత
స్ఫారత రార్చనా కరణపాత్ర రమాగిరిజా నితంబినీ
చారు మనస్సరోజ చరషట్పద రాజమరాళనాయకా. 319

ప్రతి: సారస = కమలములకును; నీలతామరస = నల్లకలువలకును; సమ్మద కారణనేత్ర = సంతోష వికాసమునకు కారణమైన సూర్యచంద్రులను కన్నులుఁగా ఁగలవాఁడా! నిర్మల = స్వచ్ఛమును; ఉదార = తిన్నఁదనమును (కలిగి); విహార మానస = వర్తించు మనస్సులచే; విధాయిత = ధ్యానింపఁబడు; తాపసముఖ్య = మునివరుల యొక్క; సంతత స్ఫార తర = ఎల్లప్పుడును అతిశయమైన తేజస్సుచే; అర్చనా కరణపాత్ర = పూజలకు సాధన మైన యోగ పురుషుఁడా!; రమా గిరి నితంబినీ = లక్ష్మీ పార్వతులు అనెడి వనితల యొక్క; చారు = (హరించు) ఆకర్షించు అందమైన; మనస్+సరోజ = మనస్సులనెడి కమలములందు; చర = తిరుగునట్టి; షట్పదరాజ = తుమ్మెదల రాజా! మరాళనాయకా! = హంసలకు నాయకుఁడా!

తా: కనుల హితుఁడు సూర్యుఁడు, నల్లకలువల చెలికాఁడు చంద్రుఁడు, నేత్రములైన వాఁడా! స్వచ్ఛమై తిన్నయై వర్తించు మనస్సులచే ధ్యానింపఁబడు ముని ముఖ్యులచే నిత్యము వారి అత్యధికమైన పూజలకు యోగ్యమైన తేజో విశేషము కల యోగ పురుషుఁడా! లక్ష్మీ పార్వతీసతుల యొక్క ఆకర్షించు వారి మనస్సులు అనెడి శతపత్రములందు తిరుగు తుమ్మెదలరాజా! హంసల నాయకుఁడా!

కం. చక్రపరశ్వథ యుత దో
ర్విక్రమ జిత దానవేంద్ర వివిధ వినోదా
పక్రాంత హృదయభవ్యా
శక్ర ప్రముఖామరౌఘ సతత నిషేవ్యా. 320

ప్రతి: చక్ర= సుదర్శన చక్రాయుధముతో; పరశ్వథ = గండ్ర గొడ్డలితో; దోః+విక్రమ = బాహువిక్రమముచే; జితదానవ + ఇంద్ర = జయింపఁబడిన దానవ శ్రేష్ఠులు కలవాఁడా!; వివిధ వినోద + అపక్రాంత = పెక్కు ఇంద్రియ సుఖక్రీడల నుండి తొలఁగిన; హృదయ భవ్యా = మనస్సులు కలవారికి (నిస్సంగులగు) శుభముల నిచ్చువాఁడా! పాఠాంతరము : భవ్యా =

(వారిచే) భావింపఁదగినవాఁడా, ధ్యానింపఁదగిన వాఁడా!; శక్ర ప్రముఖ అమర+ఓఘ = ఇంద్రుఁడు మొదలైన దేవతల సమూహముచే; సతత నిషేవ్యా = ఎల్లప్పుడు చక్కగా సేవింపఁదగిన వాఁడా!

తా: చక్రము పరశువు అను ఆయుధములు ధరించిన వాఁడవై బాహుబలముచే దానవ ప్రముఖులను జయించిన వాఁడా! వివిధములైన ఇంద్రియ భోగములనుండి తొలఁగిన చిత్తములు కలవారికి క్షేమమును కూర్చు వాఁడా! (పాఠాంతరము, వారిచే ధ్యానింపఁదగిన వాఁడా!) ఇంద్రుడు మొదలైన దేవతలచే ఎల్లప్పుడు బాగుగా, సేవింపఁదగిన వాఁడా!

మా. జలధిగిరినివాసా చంచదుద్య ద్వికాసా
విలసితదరహాసా వృత్త సచ్చి ద్విలాసా
ప్రళయ బహుళ రూపా పండితాంతః ప్రదీపా
దళిత విబుధతాపా దైత్య సంహారికోపా. 321

ప్రతి: జలధిగిరి నివాసా = క్షీరసముద్రము, కైలాసము నివాసముగ గలవాఁడా! చంచత్+ఉద్యత్+వికాసా = మఱిమఱి పెంపొందు తేజస్సు గలవాఁడా! విలసిత దరహాసా = వికసించు చిఱునగవు గలవాఁడా!; ఆవృత్త+సత్ +చిత్ +విలాసా = మాటిమాటికి వెలయు సత్యమైన (శాశ్వతమై) జ్ఞాన ప్రకాశము యొక్క శోభకలవాఁడా!; ప్రళయ బహుళరూపా = జగత్సంహార క్రియయైన ప్రళయ కాలమందు, నిగూఢమైన (తన యందు ఇముడ్చుకొన్న) పెక్కు సూక్ష్మ రూపములను కలవాఁడా! (సర్వము లయమైనప్పుడు సృష్టిలోని వివిధములైన వస్తువులు తమ తమ సూక్ష్మరూపములతో కారణ శరీరమైన పరమాత్మలో అంతర్భూతమగును): పండిత+అంతఃప్రదీపా = మహాజ్ఞానుల హృదయములలో గొప్ప జ్యోతియై వెలుఁగు వాఁడా! దళిత విబుధ తాపా! = తొలఁగింపఁబడిన, దేవతల తాపము (దుఃఖము) కలవాఁడా! దైత్య సంహారికోపా = రాక్షసులను సంహరించు కోపము కలవాఁడా!

తా: పాలసముద్రము, వెండికొండ (కైలాసము) నివాసమైన వాఁడా! మఱిమఱి పెంపొందు తేజస్సు కలవాఁడా! మొలకెత్తుచున్న చిఱునవ్వుతో మరల మరల కన్పట్టు సత్యమైన జ్ఞాన ప్రకాశముతో శోభిల్లు వాఁడా! ప్రళయకాలమందు పెక్కు సూక్ష్మరూపములను గుప్తముగాగలవాఁడా! మహాజ్ఞానుల హృదయములలో పరంజ్యోతియై తేజరిల్లు వాఁడా! దేవతల దుఃఖమును తొలఁగించిన వాఁడా! రాక్షసులను పరిమార్చు కోపము కలవాఁడా! హరి హరస్వరూపుఁడైన భగవానుఁడా!

**గద్యము:** ఇది శ్రీ మదుభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీమహాభారత కథానంతరంబున శ్రీమత్సకల భాషాభూషణ, సాహిత్య రస పోషణ సంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణ సనాథ నాచన సోమనాథ ప్రణీతంబైన ఉత్తర హరివంశంబునందు చతుర్థాశ్వాసము.

# సంస్కృత సంధులు

(చతుర్థాశ్వాసము)

## 1. విసర్గ సంధి :

సూ : విసర్గమునకు (అస్) 'క ఖ, పఫ'లు పరమగుచో విసర్గము, నిలుచును.

దుర్వాసః పరివ్రాట్ (పద్యము 82) శిరఃకమలము (ప, 124), తేజఃప్రసరము (ప, 140), అంతః ప్రవేశము (ప, 172), సరః పార్శ్వము (ప. 206), అంతః ప్రదీపా (ప, 321).

ఈ క్రింది వానిలో సకారము నిలుచును.

భాః + కరుఁడు > భాస్కరుఁడు, నమః+కారము > నమస్కారము,

తేజః + కరము > తేజస్కరము.-(పద్యము - 51)

నమః + కృతి > నమస్కృతి (2 ఆ - పద్య, 111)

## 2. 'శషస' ల ఆదేశ సంధి :

సూ : విసర్గమునకు (అస్) 'చ ఛ, ట ఠ, త థ'లు పరమైన క్రమముగా 'శ ష స' లు అదేశమగును.

తపః+చరణము > తపశ్చరణము (2ఆ, పద్య - 71)

సరః + తీరము > సరస్తీరము (ప, 41, 218)

వపుః + త్రిపుంఁడ్ర > వపుస్త్రిపుంఁడ్ర (ప, 219)

(ధనుః+ టంకారము > ధనుష్టంకారము.)

## 3. 'శషస'ల వికల్పాదేశ సంధి :

సూ. విసర్గమునకు (అస్) 'శషస'లు పరమైనచో అవియే క్రమముగా వికల్పముగా ఆదేశమగును.

ఉచ్చైః+శ్రవము > ఉచ్చైశ్శ్రవము (1ఆ, పద్య - 33)

ధనుః + శర > ధనుశ్శర (ప, 35)

దోః+సారము > దోస్సారము (ప, 125)

వక్షః+స్థలము > వక్షస్స్థలము (ప, 316)

మనః + సరోజము > మనస్సరోజము (ప, 319)

(చతుః+షష్టి > చతుష్షష్టి)

### 4. ఓత్వాదేశ సంధి :

సూ. విసర్గమునకు (అస్) 'అత్తు' గాని, "హశ్శు"లు గాని, పరమైనచో ఓత్వమాదేశమగును.

1. రక్షస్+అధీశుఁడు > రక్షో + అధీశుఁడు. (ప, 262) ఇచ్చట అత్తు పరమైనది.
2. ఈ క్రింది వానిలో 'హశ్శు'లు పరమైనవి. ఓత్వమాదేశమైనది. (అస్, ఓ, అగును).

హశ్శులు : (కఖ, చఛ, టఠ, తథ, పఫ' శ, ష, స (13) కంటె భిన్నములైన హల్లులు. గ, ఘ ఙ, జ, ఝ, ఞ, డ ఢ ణ, ద ధ న, బ భ మ, య ర ల వ, హ ళ (21). చేతో రా జీవము (ప, 14), శిరో గర్వము (ప, 39) దుర్వాసోమునీంద్రుఁడు (ప, 41). మనోవ్యథ (ప, 55), అహోరాత్రము (ప, 76), అంభోజ (ప, 97). అంబోధర (ప, 125) సరోవరము (ప, 137), అప్సరోగణము (ప, 141) పాథోనిధి (ప, 179), తేజోమయంబు (ప, 181), శిరోదఘ్నము (ప, 281)

### 5. పూర్వ రూప సంధి :

రక్షో+అధీశుఁడు > రక్షో ఽధీశుఁడు. ఓత్వములో 'అ' చేరును. 'ఽ' ఈ గుర్తునకు అవగ్రహమని పేరు.

### 6. పర రూప సంధి :

స్వాకార +ఓంకార > స్వాకారోంకార (6 ఆ, 1 పద్య).

### 7. రేఫాదేశ సంధి :

సూ. ఇకారాద్యచ్చులు పూర్వమున (ఉపధగా) కల విసర్గమునకు, 'అత్తు' గాని, హశ్శు లుగాని, పరమైనచో, "రేఫ" మాదేశమగును.

ధనుః+అస్త్రము > ధనురస్త్ర (ప, 18) (అత్తు).

చతుః+అంగ > చతురంగ (ప, 212) (అత్తు).

చతుః+ముఖుఁడు > చతుర్ముఖుఁడు (ప, 92) (హశ్శు).

చతుః+విధ > చతుర్విధ (ప, 115) (హశ్శు)

(బహిః+అంగము > బహిరంగము)

(దోః + బలము > దోర్బలము)

**8. జశ్త్వ సంధి**

సూ. 'కచటతప'లకు, 'అచ్చు'లు గాని, "హశ్శు"లుగాని పరమైనచో "గజడదబ' లు క్రమముగా ఆదేశమగును.

దిక్+ అంతర > దిగంతర (ప, 274)

(అచ్ + అంతము > అజంతము)

దిక్+విజయము దిగ్విజయము (హశ్శు) (ప, 118)

ఉదక్ + దిక్-ఉదగ్దిక్ (హశ్శు) (ప, 274)

**9. వర్గ ప్రథమాక్షరాదేశ సంధి :**

సూ. వర్గాక్షరములకు వర్గప్రథమ ద్వితీయములును 'శషస'లును పరమగుచో ప్రథమాక్షరమే నిలుచును.

తద్+కపట > తత్కపట,

తద్ + పాప > తత్పాప, (ప, 102)

తద్ + సతుల > తత్సతుల (ప, 109)

**10. శ్చుత్వ సంధి :**

సూ. 'త' వర్గమునకు 'చ' వర్గము పరమగుచో 'చ' వర్గమాదేశమగును.

జగత్ + జనకున్ జగజ్జనకున్ (ప, 17)

తద్ + జలము తజ్జలము (ప, 86, 298)

**11. ఛత్వాదేశ సంధి :**

సూ. 'కచటతప' లకు పరమైన 'శ' వర్ణమునకు "ఛ" వర్ణము వికల్పముగా వచ్చును.

మత్ + శర-మత్శర (వికల్పము)

మత్ + శర-మచ్ + శర (శ్చుత్వ సంధి - చూడు సూ. ) మచ్ + ఛర (ఛత్వాదేశము) >మచ్ఛర (ప,286).

**12. అనునాసిక సంధి :**

సూ. కచటతప'లకు అనునాసికములు పరమగుచో, అనునాసికము వికల్పముగా వచ్చును. ప్రత్యయమైన అనునాసికమునకు ఆదేశము నిత్యము.

హిమవత్+నగ హిమవన్నగ (ప, 13). ఇట్లే మన్నిశిత (ప, 109), పరిషన్మధ్యస్థ (ప, 140) జగన్నాథుఁడు (పద్య, 138, 182), నిర్గళన్మదాసార (ప, 223).

వికల్ప సంధి అగుటచే, హిమవద్నగము (సూ 8, జశ్త్వసంధి)

**13. లత్వ సంధి :**

సూ. 'త' వర్గమునకు, 'ల' కారము పరమగుచో 'ల' కారమాదేశమగును.

తద్ + లయము తల్లయము (ప, 233)

**14. తుగాగమ సంధి :**

సూ. హ్రస్వాచ్చులకును. ఆఙ్నకును. 'ఛ' కారము పరమగుచో, నిత్యముగా 'తు గాగ మగును. ఇతర దీర్ఘాచ్చులకు తుగాగమము వైకల్పికము. 'తు' గాగమమునకు శ్చుత్వ సంధిచే 'చ' కారమాదేశమగును.

1. విద్రాణ +ఛద విద్రాణ +త్ + ఛద > విద్రాణచ్ఛద (ప, 24)
2. ఆ + ఛన్న > ఆత్ + ఛన్న > ఆచ్ + ఛన్న > ఆచ్ఛన్న (ప. 24)
3. అకాండ+ఛవి > అకాండచ్ఛవి (ప, 131)
4. కుంకుమ + ఛవి > కుంకుమ చ్ఛవి (ప, 243).

(లక్ష్మీ+ఛాయ > లక్ష్మీచ్ఛాయ, లక్ష్మీఛాయ వైకల్పికము).

**15. గుణ సంధి :**

సూ. అకారమునకు ఇఉఋ కారములు పరమగునపుడు "ఏ, ఓ, అర్," అనునవి క్రమముగా ఏకాదేశమగును.

ముఖ్య+ఋత్విక్ > ముఖ్య్ + అ+ ఋ, త్విక్ > ముఖ్య్+అర్+త్విక్ > ముఖ్యర్త్విక్ (2 ఆ, ప, 108).

2. సామ +ఋక్ > సామ్+అ+ఋ+క్ > సామ్ + అర్ క్ > సామర్క్ (2 ఆ, ప, 214).

సామర్క్ + యజు సామర్గ్యజు (జశ్త్వసంధిచే కకారము, 'గ' కారమగును.)

**అపవాదము**

అక్ష +ఊహినీ ఇచ్చట గుణమునకు మాఱుగా వృద్ధి వచ్చినది.

సూ. స్వశబ్దమునకు, 'ఈర, ఈరిన్' శబ్దములకు, 'అక్ష' శబ్దమునకు, ఊహినీ శబ్దము పరమైనచో 'ఐ, ఔ' లు ఏకాదేశమగును. అక్ష+ఊహినీ అక్షౌహిణీ (నత్వమునకు 'ణా' దేశము)(ప, 220).

ఈ సంధి సూత్రాలను పరిశీలించి సవరణలు సూచించిన సహృదయులు ఆచార్య శ్రీ రవ్వా శ్రీహరిగారు. వారికి ధన్యవాదాలు.